పురాణపండవారి

**శ్రీ లలితారాధన**

First Edition :

2011



సంపాదకవర్గము :

పురాణపండ శ్రీ చిత్ర

శ్రీ ఆదిపూడి వేంకట శివసాయిరామ్

B.Sc.,L.L.B, M.A.(jyothisham)

శ్రీ గురుశ్రీ గోపావఝుల గోపాలకృష్ణమూర్తి

శ్రీ నోరి భోగీశ్వర శర్మ

త్వరలో...

శ్రీ

దేవీఆరాధన

ప్రకాశకులు

మోహన్ పబ్లికేషన్స్

కోట గుమ్మం - రాజమండ్రి - 533 101

ఫోన్ : (0883) 2462565

ఈ పుస్తకం కోసం ఎన్నో జాగ్రత్తలు తీసుకోవడం జరిగినది. అయినా పొరపాట్లు జరగటానికి అవకాశం ఉండవచ్చును. మాకు తెలిపిన మలిముద్రణలో సవరించగలవారము.

శుభకార్యములందు ఈ గ్రంథము పంచటానికి ఎక్కువ కాపీలు కావలసినవారు ప్రకాశకులను సంప్రదించగలరు.

# బహూకరణ



శ్రీమతి / శ్రీ ..............................................గారికి

................................సందర్భముగా శ్రీ లలితారాధన

అను ఈ పుస్తక రత్నమును బహూకరించడమైనది.

తేది : ............          సంతకం



## ఈ గ్రంథ రచనకు పరిశీలించిన గ్రంథములు

1. శ్రీ లలితా నిత్యపూజ - ఆదిపూడి
2. శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రం -పురాణపండశ్రీచిత్ర
3. మణిద్వీపవర్ణన -పురాణపండ రాధాకృష్ణమూర్తి
4. శ్రీదేవీ లీలామృతము -ఆదిపూడి
5. సౌందర్యలహరి-కీ.శే.పండిత జయన్తి సుబ్రహ్మణ్యశాస్త్రి
6. శ్రీలలితా అష్టోత్తర రహస్యార్థము-శ్రీ యల్లంరాజు శ్రీనివాసరావు
7. శ్రీమహాకాల చక్రవర్తి రహస్యనామస్తోత్రము -శ్రీ గురుదేవులు శ్రీపండిత శ్రీరామశర్మ ఆచార్యగారు
8. శ్రీ లలితా నామార్థమంజూష - "శ్రీ శుకానందనాథులు" శ్రీ వద్లమూడి వెంకటేశ్వరరావుగారు, గుంటూరు
9. శ్రీ లలితావైభవము -శ్రీమల్లంపల్లి దుర్గామల్లిఖార్జునప్రసాద్‌శాస్త్రిగారు
10. శ్రీ లలితా త్రిపురసుందరీమందిరము-అంబడిపూడి సుబ్రహ్మణ్యశాస్త్రి (ఋషిపీఠం)
11. శ్రీ లలితాంబికా జ్ఞాన యజ్ఞతపోవనం
12. లలితాదేవి పూజ
13. శ్రీలలితా సహస్రనామ స్తోత్రపారాయణ
14. మనలోని శక్తి ఆ పరాశక్తే -పగడాల కమల (భక్తి)
15. ప్రతినామం మంత్రం - వద్లమూడి వెంకటేశ్వరరావు (ఋషిపీఠం)
16. లలితాసహస్రంలో జ్యోతిషశాస్త్రరహస్యాలు-పప్పు నరసింహమూర్తి (ఋషిపీఠం)

వీరందరికి నా పేరు పేరునా మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు తెలియచేస్తున్నాము.

**- ఆదిపూడి**

## విషయసూచిక





# శ్రీ లలితాదేవీపూజ

**ప్రార్థన**

**శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।**
**ప్రసన్న వదనం ధ్యాయే త్సర్వ విఘ్నోపశాంతయే ॥**

**ఆచమనం**

**(మూడుసార్లు నీటితో ఆచమనము చేసి యిట్లు చదువు కొనవలెను)**

ఓం కేశవాయ స్వాహా, ఓంనారాయణాయస్వాహా, ఓంమాధవాయస్వాహా, గోవిందాయనమః విష్ణవేనమః, మధుసూదనాయనమః, తివిక్రమాయనమః, వామనాయనమః, శ్రీధరాయనమః, హృషీకేశాయనమః,పద్మనాభాయనమః, దామోద రాయనమః, సంకర్షణాయనమః, వాసుదేవాయనమః,ప్రద్యుమ్నాయనమః, అనిరుద్ధాయనమః, పురుషోత్త మాయనమః, అధోక్షజాయనమః, నారసింహాయ నమః,అచ్యుతాయనమ, జనార్ధనాయనమః, ఉపేంద్రాయనమః, హరయేనమః, శ్రీకృష్ణాయనమః.

**భూశుద్ధి**

**(చుట్టూ ఉదకమును జల్లుచూ)**

శ్లో॥ **ఉత్తిష్ఠంతు భూత పిశాచాః ఏతే భూమి భారకాః ।**
**ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥**



**ప్రాణాయామము**

ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓగ్ం సత్యం ఓం తత్స వితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్. ఓంమాపో జ్యోతీరసోఽ మృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్.

**సంకల్పము**

మమ ఉపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వరీ ముద్దిశ్య శ్రీ పరమేశ్వరీ ప్రీత్యర్థం శుభే శోభన ముహూర్తే శ్రీ మహా విష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయ పరార్థేశ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూ ద్వీపే, భరతవర్షే భరతఖండే, మేరోః, దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్య దిగ్భాగే, గంగా గోదావరీ మధ్యప్రదేశే, శోభన గృహే, సమస్త దేవతా బ్రాహ్మణ హరిహరి సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన.... నామ సంవత్సరే..... ఆయనే........ ఋతే........... మాసే......... పక్షే.......... తిధౌ..... వాసరే, శుభ నక్షత్రే శుభకరణే ఏవం గుణ విశేషణ విశిష్ఠాయాం, శుభతిథౌ, మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వరీ ముద్దిశ్య శ్రీ పరమేశ్వరీ ప్రీత్యర్థం, శ్రీమాన్.... గోత్రః నామధేయః......... శ్రీమతః......... గోత్రస్య.......... నామధేయస్య సర్వ గోత్రద్భ వానాం జీవానాం, ఆయురారోగ్య ఐశ్వర్యాభి వృద్ధ్యర్థం వేద సంప్రదాయాభి వృద్ధ్యర్థం లోక కళ్యాణా ర్థం శ్రీ లలితా పరమేశ్వరీ ముద్దిశ్య శ్రీ



లలిత పరమేశ్వరీ ప్రీత్యర్థం సంభవిద్భిః ద్రవ్యైః సంభవిద్భిరుపచారైః సంభవితా నియమేవ, సంభవితా ప్రకారేణ, యావచ్ఛక్తి ధ్యానావాహనాదిషోడశోపచార పూజాంకరిష్యే!

(గణపతి పూజను చేయవలెను)

అదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం గణపతి పూజాంకరిష్యే, తదంగ కలశారా ధనం కరిష్యే, కలశే గంధ పుష్పాక్షతై రభ్యర్చ్య.

శ్లో॥ **కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్రః సమాశ్రితః**
**మూలే తత్రస్థితో బ్రహ్మామధ్యే మాతృగణాః స్మృతాః**
**కుక్షౌతు సాగరాః సర్వే సప్తద్వీపా వసుంధరా**
**ఋగ్వేదోఽథ యజుర్వేదః సామవేదోహ్యథర్వణః ॥**

అంగైశ్చ సహితా స్సర్వే కలశాంబు సమాశ్రితాః,

(కలశము పైన చేతి నుంచి) ఓం అపోవా ఇదగ్ం సర్వం విశ్వాభూతాన్యాపః ప్రాణావ్యాపః పశవ అపోన్న మాపో మాతృమాపః సమ్రాడాపో, విరాడాప,స్స్వరాడాప. శ్చందాగ్స్యాపో, జ్యోతిగ్ష్యాపోయ జూగ్ష్యాప, స్సత్యమాప సర్వదేవతా అపో,భూర్భువస్సువరాప ఓమ్.గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి నర్మదా సింధుకావేరి జలేస్మిన్ సన్నిధిం కురు! కావేరీతుంగభద్రా చ కృష్ణ వేణ్యాచ గౌతమీ భాగీరధీతి విఖ్యాతాః పంచగంగాః ప్రకీర్తితాః ఆయాన్తు మమ దురితక్షయకారకాః పూజార్థం కలశోదకేన పూజా ద్రవ్యాణి సంప్రోక్ష్య, దేవీంఆత్మానం చ సంప్రోక్ష్య. (అని కలశోదకాన్ని పూజాసామగ్రిపై, తనపై చల్లు కొనవలెను.)

**ధ్యానమ్**

శ్లో॥ **అరుణాం కరుణా తరంగితాక్షీం ధృత పాశాంకుశ పుష్పబాణ చాపాం**
**అణిమాదిభిరావృతాం మయూఖైఃఅహమిత్యేవ విభావయే భవానీం**

ధ్యాయేత్పద్మాసనస్థాం వికసిత వదనాం పద్మ ప్రతాయ తాక్షీం హేమాభాం పీతవస్త్రాం కరకలిత లసద్దేమ పద్మాం వరాం గీం, సర్వాలంకార యుక్తాం సతత మభయదాం భక్తనమ్రాం భవానీం శ్రీ విద్యాం శాస్త్రమూర్తిం సకల సురనుతాం సర్వ సంపత్ప్రదాత్రీం. శ్రీ లలితాదేవ్యై నమః, ధ్యాయామి.
(పుష్పములుగాని, అక్షతలుగానితీసుకొని లలితాదేవీ వద్ద నుంచి నమస్కరింపవలెను.)

**ఆవాహనము**

శ్లో॥ **హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణ రజిత స్రజాం**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదోమమావహ.**

సహస్రదళ పద్మాస్యాం స్వస్థాంచ సుమనోహరాం
శాంతాంచ శ్రీహరేః కాంతాం తాం భజే జగతాం ప్రసూం.
శ్రీలలితా దేవ్యై నమః ఆవాహయామి.

### ఆసనము

శ్లో॥ తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్
యస్యాం హిరణ్యం విన్దేయంగామశ్వమ్ పురుషానహమ్

శ్లో॥ అమూల్య రత్నసారం చ నిర్మితం విశ్వకర్మణా
ఆసనం చ మహాదేవి దాస్యామి శివ వల్లభే.
శ్రీ లలితా దేవ్యై నమః ఆసనం సమర్పయామి

### పాద్యం

అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాధ ప్రబోధినీమ్
శ్రియం దేవీం ముపహ్వయే శ్రీర్మా దేవీర్జుషతామ్

శ్లో॥ సురసుర మహామౌళి మాలా మాణిక్య కాంతిభిః
విరాజిత పదద్వంద్వే పాద్యం దేవీ దదామ్యహమ్.
శ్రీ లలితా దేవ్యైనమః పాదయోః పాద్యం సమర్పయామి.

### అర్ఘ్యం

కాంసోస్మితాం హిరణ్య ప్రాకారా మార్ద్రాం జ్వలంతీమ్ తృప్తాం తర్పయంతీమ్
పద్మేస్థితాం పద్మవర్ణాం తామిహోపహ్వయే శ్రియమ్

శ్లో॥ అనర్ఘ సత్య సంపూర్ణే ప్రసన్నే నర్ఘవాంచితే
అర్ఘ్యం దాస్యామి దేవేశి మమానర్ఘ వరప్రదే.
శ్రీ లలితా దేవ్యై నమః హస్తయోః అర్ఘ్యం సమర్పయామి.
(ఉదకము చల్లవలెను)

### ఆచమనీయం

చన్ద్రాం ప్రభాసాం యశసాజ్వలంతీం శ్రియం లోకే దేవజుష్టా ముదారాం
తాం పద్మినీమీం శరణ మహం ప్రపద్యే అలక్ష్మీ ర్మేనశ్య తాం త్వాం వృణే

శ్లో॥ రక్తబీజసముత్పన్న రత్నాసన సమాశ్రయే
దదామ్యాచమనం తుభ్యం భక్తానాం భద్రదాయినీ.
శ్రీ లలితా దేవ్యై నమః ముఖే ఆచమనీయం సమర్పయామి
(పుష్పములతో నీటిని చల్లవలెను)

### స్నానము

శ్లో॥ ఆదిత్యవర్ణే తపసో ధిజాతో వనస్పతిస్తవ వృక్షో థభిల్వః
తస్యఫలాని తపసా నుదన్తు మాయాన్త రాయశ్చ బాహ్యా అలక్ష్మీః
పంచామృత స్నానం సమర్పయామి

### పాలతో

అప్యాయస్వ సమేతుతే విశ్వతస్సోమ వృష్ణియం
భవావాజస్య సంగధే ఇతి క్షీరేణు స్నపయామి.



### పెరుగుతో

దధిక్రావ్ణ్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః
సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్.
ఇతి దధినా స్నపయామి.

### నేతితో

శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవో వస్సవితోత్పునా!
త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో స్సూర్యస్య రశ్మిభిః
ఇతి ఆజ్యేన స్నపయామి

### తేనెతో

మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః మాధ్వీర్న సంత్వోషధీః మధునక్తముతోషసిమధు మత్పార్థివగ్ం రజః మధుద్యౌరస్తునః పితాః మధు మాన్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః మాధ్వీర్గావో భవంతునః, ఇతి మధునా స్నపయామి.



### శర్కరతో

స్వాదుః పవస్వదివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ
సుహనేతునామ్నే స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే
బహృస్పతయేమధుమాగ్ం అదాభ్యః ఇతిశర్కరేణ స్నపయామి.

### శుద్ధోదక స్నానము

అపోహిష్ఠా మయో భువస్తాన ఉర్జే దధాతన, మహేర ణాయ చక్షసే యోవశ్శివ తమోరసస్తస్య భాజయతేహనః ఉశతీరివ మాతరః తాస్మా అరంగ మామవోయస్య క్షయాయ జిన్వథ! అపోజనయ ధాచనః

శ్రీ లలితా దేవ్యై నమః శుద్ధోదక స్నానం సమర్పయామి. స్నానానంతరం శుద్ధాదమనీయం సమర్పయామి.

శ్లో॥ సుగంధి విష్ణు తైలంచ సుగంధా మలకీ జలం
దేహ సౌందర్య బీజంచ గృహ్యతాం శ్రీహరప్రియే.
(పుష్పములతో ఉదకము చల్లవలెను.)

### వస్త్రము

ఉపైతుమాన్దేవసఖః కీర్తిశ్చ మణినాసహ !
ప్రాదుర్భోతోస్మి రాష్ట్రే స్మిన్కీర్తి మృద్ధిందదాతుమే.

శ్లో॥ పీతాంబరధరే దేవీం పీతాంబర సహోదరి
పీతాంబరం ప్రయుచ్ఛామి విద్యుద్ధంగ జటాధరే
శ్రీ లలితాదేవ్యై నమః వస్త్రయుగ్మం సమర్పయామి

### భూశుద్ధి

క్షుత్పిపాసామలాం జ్యేష్ఠాం అలక్ష్మీర్నాశయామ్యహమ్
అభూతి మసమృద్ధించ సర్వాన్నిర్ణుదమే గృహాత్

శ్లో॥ తక్షకానంత కర్కోట నాగయజ్ఞోపవీతినే
సౌవర్ణం యజ్ఞసూత్రంతే దదామి హరి వాహినీ
శ్రీ లలితాదేవ్యై నమః యజ్ఞోపవీతం సమర్పయామి

### గంధం

గంధద్వారాం దురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీం
ఈశ్వరీగ్ం సర్వభూతానాం తామిహుపహ్వయే శ్రియం

శ్లో॥ కర్పూరగంధ సంమిశ్రం కస్తూరీ కుంకుమాన్వితం
శ్రీ గంధంతే ప్రదాస్యామి కీర్తిమృద్ధిం కురుష్వమే
శ్రీలలితా దేవ్యై నమః శ్రీ గంధం ధారయామి.

### ఆభరణము

మనసః కామ మాకూతిం వాచస్సత్య మశీమహి
పశూనాగ్ం రూప మన్నస్య మయిశ్రీశ్శ్రయతాం యశః

శ్లో॥ రత్న స్వర్ణ వికారంచ దేహాలంకార వర్ధనం ।
శోభాకరం శ్రీ కరంచ భూషణం ప్రతిగృహ్యతామ్.
శ్రీ లలితా దేవ్యై నమః సర్వాభరణాని సమర్పయామి.

### పుష్పం

కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ
శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీం.

శ్లో॥ నానా కుసుమ నిర్మాణం బ్రహ్మశోభాప్రదం పరం
సర్వభూతప్రియం శుద్ధం మాల్యం దేవి సమర్పయే

(ఇక్కడ శ్రీ లలితా సహస్ర నామములు కాని అష్టోత్తర శతనామావళిః కాని చదువుచూ కుంకుమతో గాని పుష్పములతో గాని పూజ చేయవలెను.) తరువాత....

### దుర్గా మంత్రం

ఓం జాతవేదసే సునవామసోమ మరాతీయతో నిదహాతివేదః
సనః పర్షదతి దుర్గాణి విశ్వానావేవ సింధుం దురితాత్యగ్నిః
ఓం తామగ్ని వర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం
కర్మఫలేషు జుషామ్ దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే
సుతరసితరసే నమః (దుర్గ నర్చించవలెను)

### సరస్వతీ - లక్ష్మీ మంత్రములు

ఓం ప్రణోదేవీ సరస్వతీ వాజేభిర్వాజినీవతీ ధీనామవిత్ర్యవతు

శ్లో॥ మహాదేవ్యైచ విద్మహే విష్ణు పత్న్యైచ ధీమహి తనో లక్ష్మీః ప్రచోదయాత్.



### అథాంగపూజ

దుర్గాయై నమః పాదౌ పూజయామి
గూఢగుల్ఫాయై నమః గుల్ఫౌపూజయామి
మంగళాయై నమః జానునీ పూజయామి
మహాకాళ్యై నమః ఊరూం పూజయామి
వ్రతప్రియాయై నమః కటింపూజయామి
మృడాన్యై నమః జంఘౌ పూజయామి
గంభీరనాభియే నమః నాభిం పూజయామి
శివప్రియాయై నమః ఉదరం పూజయామి
సువాసిన్యర్చన ప్రీతాయై నమః హృదయం పూజయామి
మదన మాత్రే నమః స్తనౌ పూజయామి
మాలాద్యాయుధసంపన్నాయై నమః భుజద్వయంపూజయామి
కామితార్థ ప్రదాయిన్యై నమః దక్షిణహస్తం పూజయామి
శ్రీవిద్యాయై నమః వామహస్తం పూజయామి
కంబు కంఠై నమః కంఠం పూజయామి
విశాలాక్ష్యై నమః నేత్రౌ పూజయామి
చంద్రనిభాననాయై నమః ముఖం పూజయామి
దివ్యవిగ్రహాయై నమః లలాటం పూజయామి
శిరస్థితాయై నమః శిరః పూజయామి
శ్రీ లలితా దేవ్యై నమః సర్వాణ్యంగాని పూజయామి.

### ధూపం

సప్పజంతు స్నిగ్ధానిచిక్లీత వసమే గృహే
నిచదేవీం మాతరగ్ం శ్రియం వాసయ మే కులే.

శ్లో॥ వృక్ష నిర్యాశ రూపంచ గంధ ద్రవ్యాది సంయుతం
శ్రీ కృష్ణకాంతే ధూపంచ పవిత్రం ప్రతిగృహ్యతాం
శ్రీ లలితా దేవ్యై నమః ధూపమాఘ్రాపయామి .(అగరవత్తులను వెలగించవలెను.)

### దీపం

ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం పింగళాం పద్మమాలినీం
చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ.

శ్లో॥ జగచ్చక్షు స్వరూపంచ ప్రాణరక్షణ కారణం
ప్రదీపం శుద్ధ రూపంచ గృహ్యంతాం పరమేశ్వరి.
శ్రీ లలితాదేవ్యై నమః సాక్షాత్ దీపం దర్శయామి.
ధూపదీపానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి.
(ఉదకమును చేతిలో వేసుకొని విడిచిపెట్టవలెను.)

**నైవేద్యం**

ఆర్ద్రాం యః కరణీం యష్టిం సువర్ణాం హేమమాలినీమ్
సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ
శ్లో॥ శర్కరా మధు సంయుక్త మాజ్యాదైరథ పూరితం
గృహాణ దుర్గే నైవేద్యం మహిషాసుర మర్దనీ.

ఓం భూర్భువస్సువః ఓం తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్. సత్యన్త్వర్తేన పరిషించామి అమృతమస్తు అమృతోపస్తరణమసి.

సూర్యాస్తమయము తరువాత "ఋతంత్వాసత్యేన పరిషిం చామి" అని చెప్పవలెను.)

ఓం ప్రాణాయ స్వాహా ఓం అపానాయ స్వాహా ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయస్వాహా సమానాయ స్వాహా మధ్యే మధ్యే పానీయం సమర్పయామి అమృతాభి ధానమసి ఉత్తరా పోశనం సమర్పయామి హస్తౌ ప్రక్షాళయామి పాదౌ ప్రక్షాళయామి శుద్ధాచమనీయం సమర్పయామి శ్రీలలితా దేవ్యై నమః నైవేద్యం సమర్పయామి.



**తాంబూలము**

తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీ మనపగామినీమ్
యస్యాంహిరణ్యం ప్రభూతంగావోదాస్యోశ్వాన్విందేయం పురుషా నహమ్
శ్లో॥ తాంబూలం చ వరం రమ్యం కర్పూరాది సువాసితమ్
జిహ్వా మద్యచ్ఛేద కరం తాంబూలం దేవీ గృహ్యతామ్
శ్రీ లలితా దేవ్యై నమః తాంబూలం సమర్పయామి

**నీరాజనము**

యశ్శుచిః ప్రియతో భూత్వాజుహుయదాద్యమన్వహమ్
శ్రియ పంచ దశర్చం చ శ్రికామస్సతతం జపేత్
శ్లో॥ సంమ్రాజం చ విరాజంచఅభి శ్రీర్యా చనోగృహహే
లక్ష్మీ రాష్ట్రస్యయా ముఖే తయా మసగ్ం సృజామసి
శ్రీ లలితా దేవ్యై నమః కర్పూర మంగళ నీరాజనం సమర్పయామి.

**పంచహారతులు**

(ఈక్రింద శ్లోకములతో పంచహారతులు వెలగించవలెను)

**1. ఏక హారతి** (ఒక వత్తి)

ఉద్దీప్యస్వ జాతవేదో పఘ్నం నిర్‌ఋతిం మమ
పశూగ్‌శ్చ మహ్యామావహ జీవనంచ దిశోదశ.

**2. నేత్ర హారతి** (రెండు వత్తులు)

ఋధ్యాస్మహవ్యై ర్నమసోపసద్య! మిత్రం దేవం మిత్రదేయన్నో అస్తు అనురాధాన్హవిషావర్ధయన్తః శతంజీవేమ శరదస్సవీరాః



**3. బిల్వహారతి** (మూడు వత్తులు)

త్రీణి త్రీణివై దేవానామృద్ధాని త్రీణి ఛందాగ్ంసి త్రిణి సవనాని
త్రయ ఇమే లోకాః ఋధ్యామేవ తద్వీర్య ఏషులోకేషు ప్రతి తిష్ఠితి

**4. నాగ హారతి** (నాలుగు వత్తులు)

తనమో అస్తు సర్వేభ్యో ఏకేచ పృథివీ మను
ఏ అన్తరిక్షే ఏదివితేభ్య స్సర్వేభ్యో నమః

**5. పంచహారతి** (అయిదు వత్తులు)

ఆత్మనాత్మ నిత్యామంత్రయత తస్మై పంచమగ్ం హూతః ప్రత్యశృణోత్ సపంచహూతో భవేత్! పంచహూతో హవైనామైషఃతం వాఏతం పంచహూత గ్ం సన్తం పంచహూతేత్యాచక్షతే పరోక్షేణ పరోక్షప్రియా ఇవహిదేవాః ॥

## మంత్రపుష్పము

ఆనందః కర్దమశ్చైవ చిక్లీత ఇతి విశ్రుతాః
ఋషయస్తేత్రయః పుత్రా స్వయం శ్రీదేవి దేవతా 1
పద్మాసనే పద్మఊరు పద్మాక్షి పద్మసంభవే
త్వమ్మాం భజస్వ పద్మాక్షి యేన సౌఖ్య లభామ్యహమ్ 2
అశ్వదాయిచ గోదాయి ధనదాయి మహాధనే
ధనంమే జుషతాం దేవీ సర్వకామర్థ సిద్ధయే 3
పుత్ర పౌత్ర ధనం ధాన్యం హస్త్యశ్వా జావిగోరథం
ప్రజానాం భవసి మాతా ఆయుష్మంతం కరోతుమామే 4
చంద్రాభాం లక్ష్మీ మీశానాం సూర్యాభాం శ్రియమీశ్వరీమ్
చంద్రసూర్యాగ్ని సర్వాభాం శ్రీ మహాలక్ష్మీముపాస్మహే 5
ధనమగ్నిర్ధనం వాయుర్ధనం సూర్యోధనం వసుః
ధనమింద్రో బృహస్పతి ర్వరుణం ధనమశ్నుతే 6
వైనతేయ సోమం పిబసోమం పిబుతు వృత్రహా
సోమం ధనస్య సోమినో మహ్యం దధాతు సోమిని 7
నక్రోధోనచమాత్సర్యం నలోభోనా శుభామతిః
భవంతి కృత పుణ్యానాం భక్తానాం శ్రీ సూక్తం జపేత్సదా 8
వర్షంతు తేవిభావిరి దివో అభ్రస్య విద్యుతః
రోహంతు సర్వబీజాన్యప బ్రహ్మ ద్విషో జహి ॥ 9
పద్మప్రియే పద్మిని పద్మహస్తే పద్మాలయే పద్మదళాయతాక్షి
విశ్వప్రియే విష్ణుమనోనుకూలేత్వత్పాద పద్మంమయి సన్నిధత్స్వ 10
యాసా పద్మాసనస్థా విపులకటితటీ పద్మాపత్రాయతాక్షీ
గంభీరావర్త నాభిస్త నభరణ మితా శుభ్ర వస్త్రోత్తరీయా 11
లక్ష్మీర్దివ్యైర్గజేంద్రైర్మణిగణ ఖచితై స్స్నాపితా హేమకుంభై

ర్నితర్యం సాపద్మహస్తా మమవసతు గృహే సర్వమాంగళ్య యుక్తా
లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీ రంగ ధామేశ్వరీమ్
దాసీభూత సమస్త దేవవనితాం లోకైక దీపాంకురాం 12
శ్రీ మన్మంద కటాక్షలబ్ద విభవద్భ్రహ్మేంద్ర గంగాధరామ్
త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాంవందే ముకుందప్రియామ్ 13
సిద్ధ లక్ష్మీ ర్మోక్ష లక్ష్మీ ర్జయలక్ష్మీ స్సరస్వతీ
శ్రీర్లక్ష్మీ ర్వరలక్ష్మీశ్చ ప్రసన్నా మమ సర్వదా 14
పరాంకుశౌ పాశమభీతి ముద్రాం కరైర్వహంతీం కమలాసనస్థామ్
బాలార్కకోటి ప్రతిభాం త్రినేత్రామ్ భజేహ మంబాం జగదీశ్వరీంతామ్ 15
సర్వ మంగళ మాంగళ్యే శివే సర్వార్ధసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తుతే 16
మహాదేవ్యై చ విద్మహే విష్ణుపత్న్యైచ ధీమహీ
తన్నో లక్ష్మీ ప్రచోదయాత్. 17
కాత్యాయనాయ విద్మహే కన్యాకుమారి ధీమహి తన్నో దుర్గిః ప్రచోదయాత్
శ్రీ లలితా దేవ్యే నమః సువర్ణ దివ్య మంత్రపుష్పాన్ సమర్పయామి

**సర్వోపచారములు**

యద్య ద్రవ్య మపూర్వంచ పృధివ్యామతి దుర్లభమ్
దేవ భూపార్వ భోగ్యంచ తద్రవ్యం దేవి గృహ్యతామ్
శ్రీ లలితా దేవ్యైనమః సర్వోపచారాన్ సమర్పయామి

**క్షమా ప్రార్థన**

త్రాహిమాం కృపయా దేవీ శరణాగత వత్సల అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ తస్మాత్కారుణ్య భావేవ రక్ష రక్ష రక్ష మహేశ్వరీ శ్రీ లలితా దేవ్యేనమః ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి. ఛత్ర చామర గీత నృత్య ఆందోళీకా అశ్వారోహణ గజరోహణ సమస్త రాజోపచార దేవోపచారాన్ మనసా సమర్పయామి మంత్రహీనం క్రియాహీనం భక్తహీనం మహేశ్వరియత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే (అక్షతలు,ఉదకముతీసుకొని) అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవతీ సర్వాత్మికా శ్రీ లలితా దేవతా సుప్రీతో వరదో భవతు

(అక్షతలు ఉదకము విడువవలెను.)

శ్రీ లలితా దేవతా ప్రసాదం శిరసా గృహ్ణామి శ్రీ లలితా దేవతా ప్రసాద సిద్ధిరస్తు.





# శ్రీ లలితాదేవి చరిత్ర

–రచన : శ్రీ గురుశ్రీ గోపావఝుల గోపాలకృష్ణమూర్తి
ఆచంట

చతుర్భుజే ! చంద్రకళావతంసే ! కుచోన్నతే కుంకుమరాగశోణే!
పుండ్రేక్షు పాశాంకుశపుష్పబాణ హస్తే! నమస్తే! జగదేకమాతః
అస్తునఃశ్రేయసనిత్యం వస్తు వామాంగసుందరమ్ ।
యతస్తృతీయోవిదుషాం । తృతీయస్తు పరమంమహః॥

నాలుగు భుజాలు, చంద్రకళ అనే అలంకారము, ఎత్తైన స్తనాలు, కుంకుమవలె ఎర్రనిరంగు కలిగి, శ్రేష్ఠమైన చెరుకుగడ, పాశము, అంకు శము, పుష్పబాణము, హస్తములందుగల లోకైకజననీ! లలితాపరమేశ్వరీ నీకు నమస్కారము.

శివుని ఎడమశరీరమున సుందరమైన వస్తువునీవు. అదిమూడవది. పరమ తేజం, అదే విద్వాంసులందున్న విద్యాతేజం. అని ముచ్చటగా మూడిం టిని ప్రార్థించి అసలుకథ ఆరంభిస్తున్నా.

అగస్త్యుడు అనే దేవఋషి యున్నాడు. ఆయన వేదవేదాంగములను పూర్తిగా తెలిసినవాడు. సర్వసిద్ధాంత సారములు తెలివిగాగలవాడు. బ్రహ్మా నంద రసము ఆయన శరీరమంతట నిండియున్నది. ఆ మహాత్ముడు పవిత్ర తీర్థ క్షేత్రములను దర్శించినాడు. ఆయా ప్రదేశాలలో మానవులు 'తినుట, బిడ్డలనుకనుట' అనే దినచర్యలో మునిగియున్నారు. వారిని జూచి జాలిపడ్డాడు ఋషి. అలా అలావెడుతూ మహాపుణ్యక్షేత్రమైన కాంచీపురం చేరు కున్నాడాయన. అక్కడ ఏనుగువంటి పర్వతశ్రేష్ఠంవున్నది. దానిపేరు వారణ శైలేంద్రం. అక్కడ ఒక మామిడిచెట్టున్నది. దానిని ఏకామ్రవృక్షం అంటారు. దాని కింద శివుడున్నాడు. ఆయనపేరు ఏకామ్రేశ్వ రుడు. అక్కడున్న అమ్మ వారు కామాక్షీదేవి. కామ అనగా శివుడు. ఆమె కన్నులన్నీ శివునిపైనే. ఆతల్లి కళ్లలో శివుడు మెదులుతూవుంటాడు. అందువల్ల ఆమెకు కామాక్షి అనేపేరు సార్థకం అయింది. కామాక్షీ ఏకామ్రేశ్వరులను అగస్త్యమహర్షి పూజించాడు. అక్కడ ఆయన తపస్సు చేసాడు. ఆతపస్సుకుమెచ్చి విష్ణువు ఆనందించాడు మహా తేజస్వంతమైన 'హయగ్రీవ'ఆకారముతో విష్ణువు అగస్త్యునకు ప్రత్యక్షమయ్యాడు. ఆయనకాంతి లోకాలనిండా మిరుమిట్లు గొలుపుతున్నది. శంఖము, చక్రము, జపమాల, పుస్తకము ధరించిన నాలుగు చేతులతో ఆయన దర్శనం ఇచ్చాడు.

ఆ స్వామినిచూచి ఆనందంతో తన్మయుడై మైమరచిపోయాడు అగ స్త్యుడు. అనేక నమస్కారములు చేసాడు. వినయంతో వంగి స్తోత్రంచేసాడు. నీ తపస్సుకు మెచ్చాను. వరం కోరుకో నీకు క్షేమం కలుగుతుంది అన్నా డాయన. భగవాన్ నీవు సంతోషించావు. నేను ఆనందించాను మనమిద్దరం కాదు. మానవులందరు సంతోషించాలి స్వామీ! పామరజనం ఏ ఉపాయంతో మోక్షం పొందుతారో సెలవిమ్ము మహాత్మా! అన్నాడు అగస్త్యుడు. అదివిని అన్నాడు హయగ్రీవస్వామి.

అగస్త్యా ! ఇదే ప్రశ్న పూర్వం శివుడు అడిగాడు. తరువాత బ్రహ్మకూడా అడిగాడు. ఆ తరువాత దుర్వాసుడడిగాడు, నువ్వు నాల్గవవాడవు, మీరందరు సర్వప్రాణులకు గురుస్వరూపులు. నా ఉపదేశం మీ ద్వారా లోకంలో ప్రసిద్ధిపొందుగాక! ఇది నేను మీకిచ్చేవరం. నావి రెండు రూపాలు. ప్రధానము, పురుషుడు అనేవి ఆరూపాలపేర్లు. కనిపించేదంతా ప్రధానం. దీనిని నడిపించేదంతా పురుషరూపం. ఈ రెండిటిని శక్తివంతం చేసేది పరాశక్తి. పాపిష్టులు ధ్యానం చేస్తే వారిని పుణ్యాత్ములను చేసేదే ఆ పరాశక్తి. యథావిధిగాగాని, అదితెలియకగాని ఎవరైనను సరే ఆ పరాశక్తిని పూజిస్తే సంసారంలో మునిగితేలేవారు కూడ ముక్తిని పొందుతారు. శివుడు ధ్యానయోగంలో ఆ పరాశక్తిని పూజించి సర్వసిద్ధులకు ప్రభువై అర్ధనారీశ్వరుడయ్యాడు. ఈ పరాశక్తి ధ్యానవైభవంచేత బ్రహ్మ మొ॥ దేవతలు సిద్ధులయ్యారు. పరాశక్తియే త్రిపురాశక్తి అనబడుతూ ఏఅన్నిప్రాణులశరీరాల్లోను వుంటున్నది. త్రిపురాశక్తి ఆరాధన చెయ్యకపోతే భోగమోక్షాలు రెండూలేవు. కావున నీ మనస్సు, ప్రాణాలు పరాశక్తికి అర్పించు. ఆ తల్లిని అర్చించు. నీ కోరికలన్నీ ఆమెకు సమర్పించు కర్మలన్నీ ఆమెపరంచెయ్యి,అప్పుడు నువ్వు ముక్తిపొందుతావు. నీ తపస్సుకు సంతోషించి అందరి క్షేమంకోరి నేను ఈ రహస్యం నీకు తెలిపాను. దేవతలు మునులు సిద్ధులు, మనుష్యులు ఇతరులు నీ ద్వారా ఈ పరాశక్తి 1రహస్యాన్ని తెలుసుకొని ఆచరించి సిద్ధిపొందగలరు. అనగా విని అగస్త్యుడు హయగ్రీవ భగవానునకు నమస్కరించి అన్నాడిలా. ఓపరమాత్మా! ఆ పరాశక్తి రూపము, విహారము, ప్రభావము నాకువివరించవయ్యా! అని అగస్త్యుడనగా విని హయగ్రీవుడు దానికంగీకరించాడు. వారిద్దరు అగస్త్యుని ఆశ్రమానికి వెళ్లారు. అక్కడ ఆశ్చర్యకరమైన ఆసనంపై కూర్చుండజేసాడు అగస్త్యుడు. ఉపక్రమించాడు హయగ్రీవుడు.

ఆ మహాదేవి ఆదీ అంతము లేనిది. అన్నిరూపములు ఆమెవే. ధ్యానము చేసినవారికే ఆమె కనిపిస్తుంది. ధ్యానము ఆమె స్వరూపం. హృదయమే ఆమెస్థానం. చాలాకాలం దేవీ మంత్రజప అనుష్ఠానాలుచేసిన గౌరవంవల్లే ఆమెతో ఆత్మఐక్యమేర్పడిన వ్యక్తి ఆతల్లిని చేరగలడు. మొదట బ్రహ్మధ్యాన యోగంవల్ల శక్తిపుట్టింది. ఆశక్తిని ప్రకృతి అన్నారు. ఆమె దేవతల కోరికలు తీర్చేది. క్షీరసాగరమథనంలో అమృతంపుట్టినపుడు ఆమె రెండవ రూపం ఏర్పడింది, ఆ రూపం సర్వసమ్మోహనం. మాటలచేత మనస్సుచేత ఆరూపాన్ని వర్ణించలేం. ఆమెను దర్శించడంవల్ల ఈశ్వరుడు కూడ సంమోహితుడయ్యాడు. పార్వతినికూడవిడిచి శివుడు ఆమెను కలిసాడు.



వారికి 'ధర్మశాస్త' (అయ్యప్ప)పుట్టి మహిషి అనే రాక్షసిని చంపాడు. అంటూ చెప్పుకొంటూ పోతున్న హయగ్రీవుని ప్రవచనానికి అడ్డు తగిలాడు అగస్త్యుడు.

ఏమాశ్చర్యం! సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు, మొదటియోగి, మన్మథాంత కుడు అయిన మహేశ్వరునకుమోహమా? స్త్రీసంయోగమా? పుత్రో దయమా? విచిత్రంగా లేదా మహాత్మా! అన్నాడాయన. నిజమే ఒక పూర్వ కథచెబుతా విను. త్రిభువనాధీశ్వరుడు, త్రిదశేశ్వరుడు అయిన ఇంద్రుడు ధనమదాంధకార గర్వంతో కన్నుమిన్ను కానక కళ్లుమూసుకుపోయి మదించి సంచరిస్తున్నాడు. శివునకీ విషయం తెలిసింది. వాడి మదం దించెయ్యాలను కున్నాడాయన. దుర్వాసుని స్మరించాడు. ఆయన క్షణంలో అంబికాపతిని దర్శించాడు. విషయం వివరించాడు విశ్వేశ్వరుడు. ధూళి ధూసరశరీరం, చినిగిన చర్మం ధరించి, కర్రచేత పుచ్చుకొని పిచ్చివాడుగా మారిపోయాడుముని. ఆకాశమార్గాన వెడుతున్నాడాయన. ఒకసుందరి విద్యాధరస్త్రీ ఆయనకు ఎదురువచ్చింది. ఆమె పరాంబికను గూర్చి చాలాకాలం తపస్సు చేసింది. ఆ తల్లి సంతోషించి ఒకపూలమాలను ఆమెకిచ్చింది. లేడిపిల్ల కన్నులవంటి కన్నులుగల ఆ బాలనుచూచి ఆనందించాడుముని. దానితో మాటకలిపాడు. బాలా ! ఎక్కడకు పోతున్నావు, ఈ పూలమాల ఎక్కడిది, అన్నాడు.

మునికి నమస్కరించింది ముద్దుగుమ్మ. వినయంతో అంది. అయ్యా! అంబ అనుగ్రహించిదీమాల అన్నది. దానిని నాకివ్వగలవా? అన్నాడాయన. తక్షణమే అది మునికి నమస్కరించి మాలా సమర్పణచేసింది. ముని ఆ ముగ్ధను ఆశీర్వదించి మాలను కనులకద్దుకొని నీ భక్తిస్థిరమగుగాక! అని ఆ మోహనాంగిచేతియందలి వీణను తీసుకొని దాన్ని మోగిస్తూ, పాడుతూ,ఆడుతూ అలాపోతుపోతూ దివ్యమాలలు, మైపూతలు, ఆభరణాలు ధరిస్తూ విహరిస్తుండగా మార్గమధ్యంలో ఇంద్రుడగుపించాడు. ఇంద్రునకు తనచేతనున్న పూలమాలనిచ్చాడు ముని. వట్టిచేతులతో ప్రభువును దర్శించకూడదుకదా! అన్నాడు. ఇంద్రుడందుకొన్నాడు అది. ఐరావతగజం మూపుపై వుంచాడు. ఆ ఏనుగుదానిని తొండంతో తీసి దూరంగా విసిరి వేసింది. కోపించాడు ముని. భక్తితో భవానీ అనుగ్రహంతో పొందిన ఈ మాల నాశిరోధార్యం అయింది. నువ్వు దీన్ని నిరాదరం చేసావు. ఎంత అహంకారం, నీధనమదం ఇప్పుడే అణుస్తా నీ త్రిలోకాధిపత్యం గంగపాలవు తుంది. నువ్వు పదవీభ్రష్టుడవౌతావు. అంటూ అదే పోకగా పోయాడాయన. ఇంద్రుడు క్షమించమని ఎంత ప్రాధేయపడినా ప్రాకులాడినా కిమన్నాస్తి పెదవి విప్పలేదాయన.

ఇంద్రుడు బిక్కమొగంతో స్వర్గంచేరాడు. సంపదల చలనం కళ్లారా చూచాడు. చంచల లక్ష్మితో సంచితం ప్రారబ్ధం అయింది. ఆగామి సర్వ శూన్యం. అశుభశకునాలు, బలిదైత్యుని సైన్యాలు అమరావతిని నాలుగు పక్కల కిక్కిరిసిముట్టడించినై. పారిపోయారు దేవతలు, ఇంద్రసింహాసనంపై బలి ఆసీనుడయ్యాడు. అతడే ఇప్పుడింద్రుడు. ఎలాగ? రహస్యంగా బృహ స్పతితో ఆలోచించాడు దేవరాజు. పర్వతగుహలో ఇద్దరు దాగివున్నారు. దేవతలు బ్రహ్మవద్దకు వెళ్లారు. తమకష్టం

చెప్పుకున్నారు. ఎవరు చేసిన పాపం వారు అనుభవించవలసిందే అన్నాడు. విశ్వరూప ప్రజాపతిని నిష్కారణంగా చంపేడు. పుత్రశోకం పొందిన కాశ్యపుడు ఇంద్రుని సంపద సర్వనాశనం కావాలని శపించాడు. కైలాసపర్వతాన్ని పీడించాడు. ఇలా చాలా పాపాలు చేసాడు పదవీ వ్యామోహంతో. అది అనుభవించక తప్పదు. అంటున్న బ్రహ్మవాక్యాలు దివ్యదృష్టితో విన్న బృహస్పతి యింద్రుని బ్రహ్మ వద్దకు పంపాడు. ఇంద్రుడు బ్రహ్మను శరణు కోరాడు. ఆయన విష్ణువు వద్దకు వారందరిని తీసుకువెళ్ళి పరిస్థితి వివరించాడు. పాలసముద్రాన్ని మథించమని శ్రీహరి వారిచెవిన వేసాడు. శుభస్యశీఘ్రం అని వారాపని కావిస్తున్నారు. మొదటకామధేనువు, వరుసగా వారుణి (కల్లు) కల్పవృక్షం, అప్సరసలు, చంద్రుడు, విషాలు, కౌస్తుభరత్నం, విజయ అనే స్త్రీ రత్నం, ధన్వంతరి, మహాలక్ష్మి, తులసి ఇలా చాలా మహామహిమాన్విత ప్రాణులు పాలసముద్రం నుండి ఆవిర్భవించినై. వీటిలో వారుణిని (సుర=కల్లు) దేవతలు బ్రహ్మ ఆజ్ఞతో స్వీకరించారు. చంద్రుని శివుడు స్వీకరించాడు. విషాలను సర్పాలు గ్రహించినవి. కౌస్తుభరత్నాన్ని, లక్ష్మిని, తులసిని శ్రీమహావిష్ణువు సొంతం చేసు కున్నాడు. విజయను భైరవుడు పెళ్లాడాడు. ధన్వంతరి చేతిలోని అమృతకలశాన్ని దేవతలెత్తుకుపొయ్యారు. అపుడు దేవాసుర యుద్ధం మహాఘోరంగా జరిగింది. విష్ణువు లలితాపరమేశ్వరిని మహాభక్తితో ఆరాధించాడు. ఆయనకు ఆతల్లిరూపం (మోహన)పూర్తిగా వచ్చేసింది. రాక్షసులను మోహింపజేసిందారూపం. అమృతకలశం వారినుండి స్వహస్తగతం చేసుకుంది. వారిని బారులుతీర్చి కూర్చుండజేసింది. అమృతం పంచుతున్నది. దేవతలవరుసలో చేరిన రాహువును గమనించిన సూర్య చంద్రులు ఆ విషయాన్ని మోహినికిసైగ చేసారు. తనకుడిచేతనున్న గరిటతో మోహిని రాహువు శిరస్సును ఖండించింది. అప్పటికే అమృతపానం చేసిన రాహువు శిరస్సు ఆకాశానికిచేరి సజీవంగా వుంది. ఈ భయంకర దృశ్యం చూచిన రాక్షసులు స్తబ్దులై తటస్థంగా వుండిపోయారు. అమృతం అంతా దేవతలే పీల్చేసారు. మరల యుద్ధం ప్రవర్తిల్లింది. అమృతపానంతో మహాబలవంతులైన దేవతలు రాక్షసులను పాతాళానికి తరిమివేసారు. ఇంద్రునకు స్వర్గ సింహాసనం ప్రాప్తించింది.

ఇదంతా తిలకించిన నారదుడు కైలాసానికి కంగారుగా వెళ్లి మోహినీ వర్ణనబాగా వినిపించాడు. నారదుని నిష్క్రమణానంతరం పరమశివుడు ఎవరికీ తెలియకుండా మోహినీ సందర్శనానికి పరుగెత్తాడు. పార్వతీ సహితుడై మోహినీ రూపం చూపమని విష్ణువును కోరాడు. తథాస్తన్నా డాయనసర్వసమ్మోహనరూపంతో సర్వజ్ఞుడైన పరమ శివుని పరవశింప జేసాడు శీఘ్రం శరీరాలు కలిసిపోయినై, 'ధర్మశాస్త' జన్మించాడు వారికి.అతడే అయ్యప్ప.మహిషిని సంహరించిన 'మహాశాస్త' శివుని వీర్యబిందు స్పర్శవల్ల అక్కడిభూమి వెండి బంగారాదులతో నిండిపోయింది. మోహిని అంతర్ధాన మయింది శివుడు ఉమతోకైలాసానికి చేరుకున్నాడు.

అగస్త్యా! ఒక రహస్యగాథవిను. నాలో గూఢంగావున్నది. పూర్వం భండాసురు డనే రాక్షసశిఖామణి ఒకడున్నాడు. వాడుసర్వసమర్థుడు. దేవత లందరిని శాసించాడు.



వాడికుడిభుజం నుండి విశుక్రుడనే రాక్షసులు జన్మించాడు. వాడు శుక్రాచార్యునితో సమానుడు భండాసురుని ఎడమభుజంనుండి విషంగుడుపుట్టాడు. వీడు పరమ దుష్టుడు. వీళ్ళ సోదరిపేరుధూమిని.ఈమెను కూడ భండుడే సృష్టించాడు. వీరందరు శౌర్య, ధైర్య, వీర్యపరాక్రమాలతో సర్వశత్రుసంహారం చేసి బ్రహ్మాండాన్ని బద్దలగొట్టేస్తు న్నారు. బ్రహ్మవిష్ణు రుద్రులు పలాయనంచిత్తగించి ఇంట్లోదూరి బయటకు రావడంలేదు. భండుని బాహు బలమర్దితులై దేవతలు మూర్ఛపోయి ఊపిరిపీల్చు కోలేక పోతున్నారు. భయంతో పారిపోయి, పాతాళంలోను, సముద్రగర్భంలోను, దిగంతాలు, పర్వతగుహల్లో దాక్కున్నారు. తల్లి, పిల్లతెలియకుండా తల్లడిల్లు తున్నారు. భ్రష్టులై భార్యాబిడ్డలను వదలి, మారువేషాల్లో తిరుగుతున్నారు. యుద్ధదుర్మదులైన యక్ష, మహోరగ, సిద్ధ, సాధ్య బ్రహ్మవిష్ణురుద్రులను భండుడు గడ్డిపోచలాల్ల చూస్తున్నాడు. వాడువుఫ్ అంటే వీళ్లు ఆకాశానికెగిరి పోతారు. వాడు అన్నిలోకాల్ని శాసిస్తున్నాడు. వీడ్ని చంపడానికి మూడవ రూపం మహాయాగాగ్నినుండి పుట్టింది. ఆమె త్రిలోకరక్షకి. పాశాంకుశ ధనుర్బాణాలు ధరించిన నాలుగు భుజాలుగలది. పరాశక్తి, పరబ్రహ్మ స్వరూపిణి, యుద్ధవిశారద అనబడే ఈ లలితాదేవి భండాసురుని యుద్ధంలో చంపింది. అనగా విని అగస్త్య మహాముని హయగ్రీవునితో అన్నారు. స్వామీ! భండాసురుడెలాపుట్టాడు? త్రిపురాంబిక యెట్లు జన్మించింది? ఆ తల్లి భండాసురుని ఏవిధంగా చంపింది? సవిస్తరంగా వివరించండి. అనగా హయగ్రీవ స్వామి యిలా అన్నారప్పుడు.

పూర్వం దక్షయజ్ఞం జరిగింది. ఆ యజ్ఞంలో సతీదేవి దేహత్యాగం చేసింది. యజ్ఞంనాశనం అయింది. ఈశ్వరుడు ఆత్మారాముడై, జ్ఞానానంద స్వరూపుడైవున్నాడు. ఆ స్వామిని మునులు ఉపాసిస్తున్నారు. కొన్నాళ్ళకా స్వామి హిమవత్పర్వతప్రాంతమున గంగాతీరంలో ప్రవేశించాడు. దేహా వసాన సమయంలో శంకరుని స్మరిస్తూ జన్మచాలించిన సతీదేవి హిమవంతు నకు పుత్రికగాజన్మించింది. ఈ విషయం తెలిసిన నారదుడు ఒకనాడు హిమవంతునితో అన్నాడు. హిమవంతుడు తన కుమార్తెను శంకరుని సేవించుటకై ఆయనవద్ద వుంచాడు. ఇదిలా వుండగా తారకాసురునిచే బాధించబడే దేవతలు బ్రహ్మకు మొరపెట్టుకున్నారు. శివపుత్రుడే తారకాసు రుని చంపగలడని బ్రహ్మగారన్నారు. సరేనని దేవతలు శివపార్వతులను కలపాలని అనుకుంటున్నారు. బ్రహ్మఒకనాడు శ్రీమహావిష్ణువును ప్రార్థిం చాడు. సృష్టికార్యం సులువుగా అయ్యేలా అనుగ్రహం చూపమని స్వామిని కోరాడు. వెంటనే శ్రీహరి లక్ష్మీదేవిని చూచాడు. వెంటనే జగన్మోహన రూపంతో మన్మథుడు జన్మిం చాడు. బ్రహ్మకు సృష్టిభారం తగ్గింది.

స్వార్థపరులైన దేవతలు మన్మథుని అందాన్ని సామర్థ్యాన్ని మెచ్చు కున్నారు. శివపార్వతులను కలిపేసామర్థ్యం నీకేవున్నదని ఆయున్న పొగిడారు. ఆయన చెరకువిల్లు, పుష్పబాణాలు గైకొని శివతపోభూమికి పయనమయ్యాడు. సరిగా అదేసమయానికి ఉమాదేవి పూలహారంతో పుర హరుని అర్చించడానికి

బయలుదేరింది. వేరేవేరే మార్గాలలో ఇద్దరు అక్కడికి చేరుకున్నారు. ఇదేసుముహూర్తం
శుభముహూర్తం అనుకున్నాడు సుమ బాణుడు. పొదవెనుకనక్కి చెరకువిల్లును
ఎక్కుపెట్టాడు. అమ్మవారు అయ్య వారిమెడలో పూలహారంవేస్తున్నది. పుష్పబాణం
సూటిగా వదిలేడు సుమబాణేక్షు కోదండుడైన మన్మథుడు. మన్మథవికారం మొదలైంది
మహేశ్వరునకు (అంటే మన్మథుని సుందరాకారం వికారం అవుతుంది. ఆ రూపం
చూడలేము.) ఆలోచించాడు. అమ్మవారు అతి సుందరశిల్పంలా గోచరించింది
అయ్యవారికి, పరిసరాలు పరికించాడు. పూలపొదవెనుక నక్కిన పుష్పబాణుడు
అగుపించాడు. ఆగ్రహము కట్టలుత్రెంచుకుని ప్రవహించింది. హరుని మూడవకన్ను
అప్రయత్నంగా రేకులు విచ్చుకుంది. ఈ అగ్ని పుష్పం భ్రూమధ్యంలోవుండే ద్విదళ
పుష్పం మధ్యలో దూరంకొంచెమే. ఫెళఫెలార్భటులతో ఫాలనేత్రాగ్ని పరువెత్తింది.
పరువెత్తలేక ప్రతిమలామారాడు మన్మథుడు. యజ్ఞాగ్నిలో మిడతలామాడిమసి
అయ్యాడు. అమ్మ వారు అయోమయస్థితిలో అమ్మ అనుజ్ఞతో తపోభూమికి
మరలివెళ్ళింది. గణపతి విచ్చేసాడు. మదనభస్మంతిలకించాడు. తలపరికించాడు.
చిత్రాకారంగల పురుషవిగ్రహం సిద్ధంచేసాడు. ఈవిచిత్రపురుషుని రుద్రుడు చూచాడు.
తక్షణమే ఆ పురుషుడు మన్మథరూపంతో సజీవుడయ్యాడు. అతడు మహా తేజస్వి.
మహాబలుడు, సూర్యసమప్రతాపకాంతులతో వెలిగిపోతున్న ఆ మహాపురుషుని చూచిన
గణపతి విస్తుపోయి అతనిని కౌగిలించుకున్నాడు. అతనితో మహాదేవుని స్తుతించు.
ఆయన నీకు సర్వార్థసిద్ధులను అనుగ్రహి స్తారు అంటూ 'శతరుద్రీయం'(నమకం)
ఉపదేశించాడు. ఆ పురుషబాలకుడు శతరుద్రీయం సంపూర్ణంగా జపిస్తూ
వందలసార్లు రుద్రునకు నమస్క రించాడు. మహాదేవుడు ప్రసన్నుడయ్యాడు బాలకా!
వరంకోరుకో అన్నాడు. స్వామి! నాబలసహాయంలేకుండా శత్రువులకార్యం నెరవేర
రాదు. శత్రువులయొక్క సగబలం నాలోచేరి శత్రువులకు ఉపయోగపడరాదు. శత్రు
వులు నాపై ప్రయోగించిన అస్త్రశస్త్రాలు వ్యర్థంకావాలి" అన్నాడు బాలుడు. 'తథాస్తు'
అన్న శివుడు 'నీవు అరవైవేల సంవత్సరాలు రాజ్యంచేస్తా'వన్నాడు. ఇదంతా చూచిన
బ్రహ్మ 'భండ-భండ' అన్నాడు. ఈ నామంతోనే 'భండుడు'అని ఆ బాలకుడు
ప్రసిద్ధిపొందాడు. శివుడు, బ్రహ్మ మొ॥వారు అంతర్థాన మయ్యారు. భండ అనగా
ఆకతాయి, దుష్టచేష్టలు గలవాడు అనిఅర్థం.

రుద్రుని కోపాగ్నినుండి పుట్టినందువల్ల భండుడు మహాబలవంతుడై, కోపస్వభావ
ముగలవాడై, రాక్షసుడయ్యాడు. తరువాత మహాతేజస్వంతుడైన రాక్షసపురోహితుడు
శుక్రాచార్యులవారక్కడకు వచ్చారు. మహాబలశాలురైన వందలాది రాక్షసులువచ్చారు.
శుక్రుని ఆజ్ఞచే భండుడు ఆదిశిల్పిఅయిన మయుని పిలిచాడు. ఓమయశిల్పీ! పూర్వం
రాక్షసరాజులు నివసించి మూడులోకాలను శాసించిన శోణితపురాన్ని స్వర్ణంలామార్చు
అన్నాడు. మయుడు తక్షణం శోణితపురానికి వెళ్లాడు. తనచూపుతో, మానసిక
శక్తితో శోణితపురాన్ని అమరపురంగా మార్చాడు. శుక్రునిచేత భండుడు రాజ్యాభి
షేకంపొంది, రాక్షసులచేత సేవించబడుతున్నాడు. ఉత్తమలక్ష్మిని పొంది తేజస్వంతుడై



వెలిగిపోతున్నాడు. పూర్వం బ్రహ్మచే హిరణ్యకశ్యపునకు ఇవ్వబడినది.అనేకమంది
రాక్షసరాజులచే ధరించబడినది. సజీవమైనది. నాశనములేనిది, బాలసూర్యకాంతితో
భాసిల్లేది నవరత్నఖచిత స్వర్ణకిరీటం శుక్రాచార్యుడివ్వగా భండాసురుడు ధరించాడు.
బ్రహ్మనిర్మిత చామరము లను, చంద్రప్రకాశములను గూడ ఆతడు అలంకరించిన
సింహాసనమున అలంకరించుకొన్నాడు. వీటివాయువులు రోగదుఃఖహరములు.
బ్రహ్మనిర్మిత మైనగొడుగుకూడ శుక్రుడాతనికిచ్చాడు. దాని నీడయందున్నవాడు
కోటి అస్త్రాలపీడను కూడ తొలగించుకుంటాడు. విజయమనే ధనస్సు, శత్రుసంహారి
యగు శంఖము, మహార్హభూషణ వస్త్రపరంపర ఇచ్చాడు శుక్రుడు. సూర్యనమ
అక్షయసింహాసనం కూడ శుక్రుడు భండునకిచ్చాడు. సర్వాభరణభూషితుడైన భండుడు
ఆ సింహాసనం అధిష్ఠించాడు. రత్నం తన తేజస్సును పైకి వెదజల్లిన విధంగా
వున్నదా అపూర్వదృశ్యం. భండునకు ఎనిమిదిమంది పుత్రులు. ఇంద్రశత్రువు, అమిత్ర
ఘ్నుడు,విద్యున్మాలి, విభీషణుడు, ఉగ్రకర్ముడు, ఉగ్రధన్వుడు, విజయుడు, శ్రుతిపార
గుడు అనే నామాలతో వీరు ప్రసిద్ధులు. వీరందరు పితృభక్తిపరాయణులు. సుమోహిని,
కుముదిని, చిత్రాంగి, సుందరి, అనే నలుగురు సుందరీమణులు భండునకు భార్యలు.
కాలజ్ఞులైన సర్వదేవతలు, ఇంద్రుడు భండా సురుని సేవిస్తున్నారు. చతురంగబలాలు
చాతుర్యంతో నడుచుకొంటున్నారు. సమస్త దానవవీరులు శుక్రశాసనాన్ని తుచ.
తప్పకుండా నిర్వర్తిస్తున్నారు. అందరు కలసి మెలసి విజయలక్ష్మితో వెలిగిపోతున్నారు.
శివార్చనలో శివశాసనంలోనిమగ్నులైయున్నారు. దానవు లంతా పుత్రపౌత్ర ధనధాన్య
సమృద్ధిగలవారయ్యారు. ప్రతిగృహంలోను యజ్ఞాలు, వేదత్రయం, మీమాంస
న్యాయాధిశాస్త్రాలు ప్రవర్తిల్లుతున్నె బ్రాహ్మణయజ్ఞాల్లో భోక్తలవలె, రాక్షసయజ్ఞభోక్తలు
హవిర్భోజులయ్యారు. మదమత్తుడైన భండాసురునకు అరవైవేల సంవత్సరాలు
నిశ్చింతగా, నిర్విచారంగా అరక్షణంలా గడిచిపోయినవి. తపోబలంవల్ల భండుని
బలం వర్ధిల్లుతున్నది. ఇంద్రుని బలం క్షీణిస్తున్నది. విష్ణువుచూచాడది, లోక మోహిని
యైన మాయను సృజించేదాయన ఆమెతో అన్నాడు.

ఓ మోహినీ! నీ తేజస్సుతో సకల ప్రాణులను మోహింపజేస్తూ స్వేచ్ఛగా తిరుగు,
ఎవరూ నిన్ను గుర్తించరు. తొందరగా భండునివద్దకు వెళ్లు, శీఘ్రం వానిని మోహింప
జెయ్యి విషయసుఖాలనుభవించు అన్నాడు. మోహిని విష్ణునాజ్ఞను వరంగా గ్రహించి
స్వామికి నమస్కరించి, తనకు ముఖ్య అప్సరసలు కొందరిని చెలులుగా నిమ్మని
ప్రార్థించింది. విశ్వాచి,మొ అప్స రసలను మాయకు సహాయకలుగాస్వామి ఆమె
వెంటపంపాడు. మాయ వారిని వెంటబెట్టుకుని, మహావృక్షసంపదగల మానస
సరోవరతీరం చేరింది. భండాసురుడు తన సుందరీమణులతో అక్కడ విహరిస్తున్నాడు.
పిల్లలేడి కన్నులవంటి కన్నులుగల ఆ చిన్నది సంపెంగవృక్షం మొదట మధురగానం
చేస్తూ రమ్యనివాసయైవున్నది. భండాసురుడు తన మంత్రులతో అచటికి వచ్చాడు.
వీణాగానం విన్నాడు, నెరజాణను చూచాడు. సర్వాంగ సుందరి మెరపుతీగ మన్మథ
నిర్మిత మహామాయాగర్తంలో జారిపడ్డాడు. మంత్రులు లోలోపల మదనపీడితు

లయ్యారు. భండునిచే బహువిధాల ప్రార్థించబడిన మాయాదేవి యెట్టకేలకు 'సరే'అన్నది. అది చూచిన అప్సరసలు ఆలస్యం చెయ్యకుండా మంత్రుల విన్నపం సన్నగా 'కానిండు' అన్నారు. అశ్వమేధం మొ॥ మహాయజ్ఞాలు చేసినా ఇట్టి ఫలం లభించడం వట్టిమాట. ఎంత అదృష్టంమనది, అనుకున్నారు వారు. వేదాలు లేవన్నారు, మహాదేవుని మరచిపోయారు. ఇతర శుభప్రదయజ్ఞాలు విడిచిపెట్టేసారు. పురోహితుడైన శుక్రాచార్యునిమాట పెడచెవినిపెట్టి ఆచార్యుని అవమానించారు. పదివేలసంవత్సరాలు క్షణకాలంలా స్త్రీలబాహుపంజరాల్లో కాలక్షేపం చేసారు. దేవత లకు రాక్షసపీడ విరగడయింది. ఇంద్రసహితులైన వాళ్లందరు పరమానంద భరితులయ్యారు.

ఒకరోజున ఇంద్రుడు సింహాసనంపై ఆసీనుడయ్యాడు. ఆసమయంలో అక్కడకు నారదమహామునివిచ్చేసారు. మండుచున్న అగ్నివలె ప్రకాశిస్తున్న నారదునితో యింద్రుడన్నాడు. భగవాన్ ! నీవు సర్వధర్మములు తెలిసిన వాడవు. ఇతరులను ధన్యునిచేయదలచి వారివారి యిళ్లకు వెళుతుంటావు. నీరాక మాకు శుభప్రదం. నీవచనామృతం విన్న మేము తరించాము. అనగా నారదుడన్నాడు. ఇంద్రా ! భండాసురుడు విష్ణుమాయా విమోహితుడై యున్నాడు. లేకుంటే ఈపాటికి లోకాలను దహించేవాడే భండాసురుని బలం క్షీణించాలంటే మీబలం సరిపోదు. అమయాకు లారా! అమ్మవారిని అర్చించండి. ఆ తల్లి మీకు అనుకూలవతికాగలదు. అనగా విని ఆనందించి ఇంద్రుడు నారదుని పూజించాడు. నారదునికి అదృశ్యం తరువాత ఇంద్రుడు దేవతలతోకలిసి హిమవత్పర్వత తీరమున నున్న గంగానదిని చేరుకున్నాడు. అక్కడ ఆదిశక్తిని ఆరాధించారు వారందరు. జపతపాదులతో పదివేల సంవత్సరాలు గడిచినాయి.

విష్ణుమాయావిమోహితుడైన భండాసురుని విషయం తెలుసుకున్న శుక్రాచార్యుల వారు చాలా బాధపడి ఒకరోజును వాని వద్దకువచ్చారు. పూజలందు కున్నారు. అన్నారిలావానితో ఓరిఅమాయకుడా! విష్ణుమాయా మోహితుడా! భండాసురా! అనేకమంది పండితులలో పరివేష్టుడైయుండే నీకీ విపరీతబుద్ధి ఎలాపుట్టిందిరా! ఇది తెలిసిన యింద్రుడు నిన్ను జయించ దానికి తపస్సుచేస్తున్నాడు. నువ్వు వెంటనే మంత్రులతోకలసి హిమవత్పర్వత ప్రాంత గంగాతీరానిక వెళ్లు. ఇంద్రాదుల తపస్సుకు విఘ్నం కలిగించు. అనగా నేయింద్రుడు మాయాశయ్యను విడిచాడు. వృద్ధమంత్రులను పిలి చాడు. పరిస్థితి వివరించాడు, అదివిని శ్రుతవర్మ అనేమంత్రి అన్నాడు భండు నితో. రాజా!ఈశ్వరానుగ్రహంతో నువ్వు మహాసామ్రాజ్యం పొందావు. ఇరవై వేల సంవత్సరాలు అవలీలగా గడిచిపోయినాయి. ఈశ్వరాజ్ఞకు వ్యతిరేకంగా ఏదీజరగదు. అదివిన్న భీమకర్ముడనే మంత్రి అన్నాడు. ప్రభూ! మనగురుదేవుల వాక్యం మనకు శీఘ్రాచరణీయం. శత్రుతపఃక్రియాదులకు విఘ్నం కలిగిస్తే నీకు విజయంతథ్యం. యుద్ధంలో శత్రుబలంహరించే విద్య నీకు శంకరుడనుగ్రహించాడు. అనగా విని శీఘ్రం మంత్రులతో సేనలతో హిమగిరులను చేరాడు భండుడు ఇంద్రతపోవిఘ్నం



చేయసిద్ధ మయ్యాడు. అదిచూచింది జగదంబిక. ఒకపెద్ద ప్రాకారం సృష్టించింది. దానిని వాయువ్యాస్త్రంతో భండుడు భగ్నంచేసాడు. అనేక ప్రాకారాలు అమ్మవారు సృష్టించడం, భండుడు భగ్నం చెయ్యడం ఇలా విసుగెత్తేలా జరిగింది. భండుడు తరవాత చూద్దాంలే అంటూ స్వపురంచేరాడు. ఈదృశ్యం చూచిన దేవతలు హడలెత్తిపోయారు, అయోమయంలో పడ్డారు. ఎనిమిదిమైళ్ల విస్తీర్ణం గల అగ్నికుండం నిర్మించారు వారందరు. ఆ కుండంలో తమ శరీరమాంసఖండాలను 'స్వాహా' కారాలతో జగదంబకు అర్పించారు. అవయవాలను అంబకు సమర్పించారు. చివరగా మిగిలిన శరీరాలను అగ్నిలోవిడుస్తున్న సమయంలో ఆ అగ్నికుండంలో ఒకతేజస్సు ఆవిర్భవించింది. ఆ తేజోమధ్యంలో జగదంబ సాక్షాత్కరించింది. ఆమె ఉదయ సూర్యకాంతి వంటిది. జగజ్జీవనదాత్రి. త్రిమూర్తి ఆత్మిక. సౌందర్య లహరి, జపాకుసుమవర్ణ (కుంకుమపువ్వురంగుగలది) దానిమ్మ పువ్వురంగు గల చీరనుధరించి నది. సర్వాభరణ భూషిత. శృంగార రససంపూర్ణ పాశము, అంకుశము, చెరకువిల్లు, పంచపుష్పబాణాలు ధరించిన నాలుగుచేతులు గలది. ఆ తల్లిని దర్శించిన దేవతలు, ఇంద్రుడు మహదానందభరితులై ఆ తల్లికి నమస్కరించారు. ఆ తల్లి క్రీగంటె కృపాదృష్టి వారిపై ప్రసరించింది. దేవతల భయజ్వరం దిగిపోయింది. దృఢతేజశ్శరీరులయ్యారు. వజ్రశరీరులై మహాబలులైనవారు అమ్మనుస్తుతించారు.

ఓ జగన్మాతా! నీకు జయము! అన్నిటికంటె గొప్పదానవు...శుభ స్థానవు. కాకకళవు, జయప్రదవు, సుందరనేత్రవు, సుందరరూపవు, సకల దేవతారాధార్హవు, కామేశ్వరీ! మానదా! నీకు జయము. బ్రహ్మమయీ! నారాయణపరా! హరిప్రియా! లోకాలను ఆనందింపజేసిన నీకు జయమగు గాక! శివప్రియా! నీకుజయము, శ్రీలతా ధనస్వరూపిణీ, శుభమూర్తీ,అంబికా, నీకు జయము, శ్రీవిజయా సమృద్ధిప్రదా, నీకు జయము, మాన వులు చేయు ఇష్టాపూర్వక కర్మలకు కారణవు. ముజ్జగమ్ముల మూలకారిణి శక్తివైనపరాత్పరా, నీకుజయము, నమస్కారము. అనంత నేత్ర ముఖస్వరూపిణీ! కాలస్వరూపిణీ, నీకు నమస్కారము. అనంతహస్తాబ్జపాద పంకజ ముఖశోభితా, అణువు కంటె చిన్నదానవు. మహత్తుకంటె పెద్దదానవు, పరాత్పరవు, అఖిలతేజోదికవు.

అతల లోకము నీపాదములు, వితల లోకము నీ పిక్కలు, రసా తలము, పాతాళము నీ నడుము. భూమి నీకడుపు. భువర్లోకము నీ హృద యము. స్వర్గము నీ ముఖము. సూర్యచంద్రాగ్నులు నీ నేత్రములు. దిక్కులు నీ చేతులు. వాయువులు నీవుచ్ఛ్వాస నిశ్శ్వాసలు నీవాక్కులు వేదములు. లోకసృష్టి నీ క్రీడలు నీచెలికాడు చిన్మయుడైన శివుడు. నీ ఆహారము సదానందము. నీ నివాసము సత్పురుషుల హృదయము. లోకములు నీ స్వరూపములు. నీతల వెండ్రుకలు మేఘములు. నక్షత్రములు నీశిగలోని పుష్పములు. ధర్మము, మొ॥ నీబాహువులు. అధర్మము మొ॥ ఆయుధములు. ఇంద్రియ నిగ్రహము, ఉపవాసాది వ్రతములు నీగోళ్లు. నీ స్తనములు స్వాహా, స్వధాకారములు ప్రాణులను బ్రతికించునవి. హోమ మంత్రము

లకు చివర పలుకబడునవి.) ప్రాణాయామములు నీముక్కు. సరస్వతి నీ నాలుక. విషయ సుఖములయందలి విరక్తినీ యింద్రియములు ధ్యానమే నీ సత్‌బుద్ధి. ధారణా శక్తియే మనస్సు. సమాధి స్థితి నీ హృదయము. వృక్ష ములు, లతలు, మొ॥ నీశరీర మందలి వెంట్రుకలు. ప్రభాతకాలము నీవస్త్రము.భూత, భవిష్యత్, వర్తమానములు నీ నిత్యవిగ్రహము. యజ్ఞస్వరూపిణివి. విశ్వస్వరూపిణివి. పవిత్రవు, దయతో లోకములను సృష్టించి తివి.లోకుల హృదయములందు వుందువు. అయినను కనిపిం చవు. మోహ మునముంచుదువు. నీ సృష్టికి నామరూపవి భాగములను చేయుదువు. అది నీలీల. నీకు నామరూపాలులేవు. కాని లోకులను ధనములనిచ్చి వారి సుఖములు తీర్చుపరమదయా స్వరూపవు. సర్వశక్తి స్వరూపిణీ మహాదేవీ! నమస్కారము. నీఆజ్ఞతో అగ్ని, సూర్యుడు, వాయువు, పంచభూతములు లోకంలో ప్రవర్తిల్లుచున్నవి. మహాదేవీ! నీకు నమస్కారము.

సృష్టికారకుడైన బ్రహ్మను నీవే సృష్టించితివి ఆ సృష్టిని నీవేరక్షించు చుంటివి. నీకు నమస్కారము. సూర్యుడుదయించు అనంత ఆకాశమును ధరించితివి. నీయందే లోకములోపుట్టి, పెరిగి, నశించుచున్నవి. అట్టి నీకు నమస్కారము. సత్త్వరజస్తమో రూపములతో సృష్టిస్థితిలయములు చేయుచున్న నీకు నమస్కారము. నిర్గుణ స్వరూపిణీ శివరూపా! నీకు నమ స్కారము. లోకాలకుతల్లివి, తండ్రివినీవే! అట్టి నీకు నమస్కా రము అఖిలతంత్ర, యంత్రరూపిణివైన నీకు నమస్కారము లోకగురు ప్రధానా! నీకు నమస్కారము. సకలవాక్కులనే ఐశ్వర్య స్వరూపిణివైన నీకు నమస్కారము. లక్ష్మివి, జగదానందస్వరూపిణివి. శంభుపత్నీ! సర్వశక్తిస్వరూపిణీ! నీకు నమస్కారము. తల్లీ! నీప్రభావము ఆదిమధ్యాంతములు లేనిది. పంచభూతములచేత సృష్టించబడనిది. వాక్కునకు, మనస్సునకు అందనిది. ఊహించ లేని వైభవముగలది. రూపములేనిది, ఏకస్వరూపము, దృష్టికి కనబడనిది నేను నిన్ను వర్ణించగలనా? ఓవిశ్వేశ్వరీ! విశ్వ వంద్యా! విద్యేశ్వరీ! వేదస్వరూ పిణీ! మహామాయా! మంత్రరూపిణీ! సర్వేశ్వర స్వరూ పిణీ! మాయందు ప్రసన్నురాలవగుము. అని యింద్రుడు, దేవతలు ఆ మహాదేవిని స్తుతించిరి. మరల మరల నమస్కరించిరి. వెంటనే దేవిని శరణుజొచ్చిరి.

అమ్మప్రసన్నురాలయింది. ఇంద్రునితో అన్నది. ఏంకావాలినాయనా! అనగానే యింద్రుడన్నాడు. ఓతల్లీ! భండాసురునిచే మేము పీడించబడు తున్నాము.మాకు బ్రతుకుభరిచరానిదయింది. పూర్వజీవితంమాకు ప్రసాదించు. సుఖాన్ని అనుగ్రహించు మమ్మల్నిరక్షించు అనగానే తల్లి అన్నదిలా. తొందరలో నేను భండాసుర సంహారం చేస్తా. నీకు త్రిలోకసామ్రాజ్యం అను గ్రహిస్తా నన్ను స్తుతించిన మీరందరు సంతో షంగా, సుఖంగా నిర్భయంగా వుందురుగాక! ఈ స్తుతితో నన్ను స్తుతించిన మానవులు కూడ నిర్భయంగా, సంతోషంగా వుంటారు. రోగాలుండవు. దీర్ఘాయుష్మంతులవు తారు. నా అనుగ్రహంవల్ల పుత్ర, మిత్ర, కళత్రసౌఖ్యం అనుభవిస్తారు. ఈ విధంగా పొందిన యింద్రుడు, దేవతలు మహాబలశాలురై మహాదేవిని మరి మరిచూచి పరమా నందం అనుభవించారు.



హయగ్రీవుడు అగస్త్యునితో అన్నాడు. ఈ సమయంలో బ్రహ్మమహర్ష లతో బయలుదేరాడు. విష్ణువు, శివుడు, నారదుడు, దేవఋషులువీరంతా అమ్మవారిని చూడాలనే కుతూహలంతో అక్కడకువచ్చారు. అప్సరసలు, విశ్వావసు గంధర్వులు, యక్షులు, మొ॥వారంతా విచ్చేసారు. బ్రహ్మ, విశ్వకర్మకు ఆదేశించాడు వెంటనే విశ్వకర్మ స్వర్గంవంటి నగరం నిర్మించాడు. తరువాత సకల మంత్రాలకు అధిదేవతయై నీదుర్గ. విద్యాధిదేవతయైన శ్యామ అంబికవద్దకువచ్చారు. బ్రాహ్మీమొ॥ మాతృకలు, సర్వభూతగణాలతో అక్కడకు చేరుకున్నారు. సిద్ధులు ఎనిమిదికోట్లకొలది యోగినులు వచ్చారు. భైరవులు, క్షేత్రపాలకులు, మహాశాస్త, గణేశ్వరుడు, కుమారుడు, బటుకుడు, వీరభద్రుడు వీరంతా వచ్చి అమ్మను స్తుతించారు.

విశ్వకర్మ నిర్మితనగరం రమ్యంగావుంది. బురుజులు, కోటగోడలు తోరణాలతో ప్రకాశిస్తున్నది. గజరథాశ్వశాలు గలిగిరాజవీధులతో విరాజిల్లి నది సామంతరాజుల, మంత్రుల, సైనికుల,బ్రాహ్మణ క్షత్రియ,వైశ్యుల, భేతాళుల, దాసదాసీ జనుల సుందరభవనాలతో విలసిల్లుతున్నది. మధ్యలో ద్వార గోపుర సంశోభితములైన రాజమందిరమందె ఇంకా బహుభవన ములు, శాలలు అక్కడ గలవు. నవరత్న ఖచితసభాసింహాసనసభ, దాని మధ్యచింతామణి నిర్మిత దివ్యసింహాసనం స్వయం ప్రకాశమానమైయున్నది. దానిని మించినది ఎక్కడను మరొకటిలేదు ఉదయ సూర్యకాంతితో అది ఒప్పుచున్నది. దానిని చూచిన బ్రహ్మమనసులో అనుకున్నాడు.

ఆహా! ఎంతఆశ్చర్యం! అమాయకుడైన బాలుడు తెలియక ఈ సింహాస నం ఎక్కి కూర్చుంటే ఈ నగర ప్రభావంచేత అన్నిలోకాలను అధిపతి అవుతాడుగదా! పెళ్లికాని స్త్రీ, లేక పురుషుడు రాజ్యార్హులుకారు. శుభాచారుడై మహాపురుషలక్షణాలు గలవాడు, అనుకూలవతితోనున్న వానిని రాజ్యానికి రాజ్యాభిషిక్తునిచేయమని వేదం చెబుతున్నది. ఈమహాదేవి ఉత్తమస్త్రీ ఆకారం ధరించిన శృంగారదేవత. శంకరుడు తప్ప ఈ మెకు తగిన వీరుడు ఏలోకంలోను లభించదు. కాని శంకరుని ఆకారంచూస్తే జటాధారి, కపాలమాలి. ముక్కంటి భస్మోద్ధూళిత సర్వాంగి. చిత్రవర్ణశరీరి. ఇట్టి అమంగళుని ఈ సుమంగళి వరిస్తుందా? అని ఆ బ్రహ్మ ఆలోచిస్తుండగా బ్రహ్మ ఎట్టి ఎదుట మహేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. కోటిమన్మథ సౌందర్య దివ్యశరీర ధారి. దివ్యగంధమాల్యాంబరధారి కిరీట హారకేయూర కర్ణకుండలాలంకృత జగన్మోహన రూపంతో ఆయనవిలసిల్లుచుండె. అతడు కుమారుడు. బ్రహ్మ ఆ కుమారుని కౌగిలించుకున్నాడు. ఇతడు కామేశ్వరుడు అన్నాడాయన పరాశక్తికి తగినవరుడీతడను కొన్నాడు. దేవతలతో, కుమారశివునితో కూడిన బ్రహ్మదేవి వద్దకు వెళ్లాడు.

త్రిమూర్తులు ఆ పరాశక్తిని స్తుతించారు. లేడిపిల్లకన్నులుగల ఆ కుమా రినిచూచిన కుమారశివుడు అన్నిపనులు మరచిపోయాడు. ఆమెయందే ఆయన మనసునిలిచిపోయింది. సన్నని సుందరశరీరముగల ఆ మహాదేవి మన్మథాకారుడైన ఆకుమారీ శివునిచూచి చేష్టలులేనిదై అతనిని తన ప్రతి రూపంగా భావించింది. పరస్పరం బాగా చూడాలనుకొన్నవారు కామపీడితు లయ్యారు. మనస్సులు వశంచేసు

కున్నారు. పరమాత్మ స్వరూపులయ్యారు. మనస్సుచేత, వాక్కులచేత వారినివర్ణించ లేము. బ్రహ్మ అమ్మవారితోఅన్నాడు. తల్లీ! దేవతలు, మునులు, గంధర్వులు, అప్సర సలు మొ॥ నీప్రియునితోకూడిన నిన్ను ఘోరయుద్ధంలో చూడాలనుకొంటున్నారు. నీకు మిక్కిలి యిష్టమైన అట్టి పురుష రత్నాన్ని సూచించు లోకరక్షణకై నీవు ఆ పురుష పుంగవుని చెట్టబట్టు ఈ మహానగరానికి రాణివై ఈ సింహాసనం అధిష్ఠించు పుణ్యులు, మహాభాగ్యవంతులు అయిన దేవఋషులచేత అభిషేకించబడి,2 సామ్రాజ్య చిహ్నాలతో సర్వాలంకారభూషితవై నీ ప్రియునితో నీవీ సింహాసన మధిష్ఠించవలె. మేమందరం ఆపరమసుందర దృశ్యాన్ని కనులారచూడవలె మానేత్రములు పవిత్ర ములువలె.

ఈ బ్రహ్మావాక్యాలు విని మహాదేవి చిరునవ్వు నవ్వి బ్రహ్మావిష్ణ్వాది దేవతలతో అన్నది దేవతలారా! నేనుస్వతంత్రను. స్వేచ్ఛగా సంచరిస్తాను. నావలెనే సంచరించే వాడు నా ప్రియుడు. అనగానే బ్రహ్మ నిజంతల్లీ! అంటూ ధర్మార్థ సహితంగా అన్నాడు. వివాహాలు నాలుగు విధాలు 1. తాత్కాలికంగా కొనబడినది 2. డబ్బుతో కొనబడినది 3. స్వయంగా వచ్చినది 4. తండ్రిచేత ఇవ్వబడ్డది. ఒకటవది వేశ్య. రెండవది దాసి, మూడవది యుక్త (గాంధర్వ వివాహం) నాల్గవది భార్య. ఇవి యిట్లుండగా మొదట పరబ్రహ్మ ఒక్కటే వున్నది. అందుండి చిదానంద ప్రకృతి పుట్టింది. ఈ రెండును నీవే మొదలు తుదలేనిదానవు. సర్వస్వరూపి, సర్వేశి, సర్వశక్తి స్వరూపిణి, వ్యక్తావ్యక్త, అట్టి నిన్ను సనకాది యోగీంద్రులు వెదకుచూ వుంటారు. సృష్టి, రక్షణ నీ హస్తగతాలు, లోకానుగ్రహం కోసం నువ్వు ఒక పురుషుని పొందాలి తల్లీ! అని విన్నవించగా మహాదేవి ఒకహారం ఆకాశంలోకి విసిరింది. అది కుమార శంకరుని కంఠం అలంకరించింది. దేవతలు పూలవాన కురిపించి ఆనందించారు. బ్రహ్మవిష్ణువుతో అన్నాడిలా మనంవీరికి వివాహం చేయాలి. ఇది లోకకల్యాణకారక ముహూర్తము. ఈశంకరి నీరూపంతోవున్నది. నీవా మెకు తోబుట్టువు. ఈమె శివకామ సుందరి నీవీమెను కామేశ్వరునకు కన్యాదానంచెయ్యి అనగానే శ్రీహరి పరమానందభరితుడై కల్యాణ కార్యక్రమం కావించాడు. బ్రహ్మాది దేవతలు కానుకలు సమర్పించారు, జగన్మంగళకారకమైన ఈకల్యాణం అందరికీ ఆనందదాయక మయింది.

బ్రహ్మ నూతనదంపతులకు వజ్రసారమైన చెరకువిల్లు సమర్పించి కృతార్థు డయ్యాడు. విష్ణువువాడని పుష్పాయుధం. వరుణుడు నాగపాశం, విశ్వకర్మ అంకుశం, అగ్నికిరీటం, సూర్యచంద్రులు చెవిదుద్దులు, సముద్రుడు రత్నాభరణాలు, దేవేంద్రుడు అక్షయమధుపాత్ర, కుబేరుడు చింతామణిమాల, శ్రీహరి సామ్రాజ్య సూచక ఛత్రం, గంగాయమునలు చంద్రకాంతులు వెదజల్లు వింజామరులు నూతనవధూవరుల కర్పించి పులకితులయ్యారు. అష్ట వసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వనిదేవతలు, ఇంద్రాది దిక్పాలురు,మరుత్తులు, సాధ్యులు, గంధర్వులు, ప్రమథ గణపతులు వారివారి ఆయుధములా నవజంటకు సమర్పించి సంతోషించారు.



అశ్వనీదేవతలు ఆకలిదప్పికలులేని ఏనుగులు, గుర్రములు, రోగములులేని ఒంటెలు, అశ్వములు, రథములు కానుకలుగా ఇచ్చేరు. వజ్రకవచాలు, ఆయుధాలున్ను అందించారు. వారికి మంగళసామ్రాజ్యాభిషేకం చేసారు. తదనంతరం బ్రహ్మకు సుమాకారం అనేవిమానం నిర్మించి యిచ్చాడు. అది అమ్లానమాలలతో ఆయుధాలతో అభేద్యమై భూమ్యాకాశాములందు, స్వర్గంలోను కామగమనం గలది అయింది. దాని సువాసన పీల్చగానే భ్రాంతి, రోగం, ఆకలి దప్పికలు తక్షణమే నశించిపోతవి. అది మనో హరము, శుభప్రదము, ఆనందమయము, చామరములు, విసరుకర్రలు, గొడుగులు, జెండాలతో ప్రకాశించే ఆవిమానం నూతనదంపతులు అధి రోహించారు. వీణా వేణుమృదంగాది వివిధ వాద్యధ్వనులు భోరుకొలువగా దేవగణాలతో కూడిన ఆ ఆది దంపతులు రాజమందిరం నుండి బయలు దేరారు. అమ్మవారి తేజస్సుతో ప్రకాశించే వీధిలో విహారం సాగుతున్నది.ఉభయపార్శ్వభవనాలపై నుండి అప్సరసలు, ముత్తయిదువలు వారిపై లాజాక్షతలు చల్లుతున్నారు. మంగళగాథలు పఠిస్తున్నారు. అన్నివీధులు తిరిగి అప్సరసల నీరాజనాలందుకొని విమానందిగి సభలో ప్రవేశిం చారు. శివునితో సహా అమ్మవారు సింహాసనంపై ఆసీనురాలయింది. సర్వజ్ఞ అయిన ఆ మహాదేవి కరుణాకటాక్షంచేత అక్కడి మహాజనులకోరికలన్నీ నెరవేర్చింది. అది చూచిన బ్రహ్మ ఆతల్లిని కామాక్షి కామేశ్వరి అనిపిలిచాడు. ఆతల్లి ఆజ్ఞచే ఆకాశంలో ఏర్పడిన మేఘం అమూల్యదివ్యాభరణాలను వర్షించింది. దేవి యెదుట ప్రతియింట కల్పవృక్షము, కామధేనువు,కమల,చింతామణి కుదురుకొన్నవి. సర్వులకు సర్వ కామములు పూర్ణములైనవి.వారందరు నిత్యసంతుష్టులైరి. సేవానందము మూర్తీభవిం చిన కామాక్షిని సేవించారువారంతా. త్రిమూర్తులు, ఇంద్రాది దిక్పాలురు, సమస్త దేవతాగణాలు, నారదాదులు, సనకాదులు, మనువులు, వసిష్ఠాది మహర్షులు. గంధర్వాప్సర యక్షోగణాలు, భూభువస్సువర్లోకాల్లో అసంబాధులయ్యారు. ఆపురంలో ఎవరికిని ఏబాధలేదు. ఆమె భక్తవత్సల అచ్చటివారిని వదలి ఎచ్చటకును వెళ్లదు. మహాప్రేమగలదైవారందరిని సంతోషింపజేస్తున్నది. భూలోకంలోని మహా రాజులను, ప్రజలకు సమస్తకోరికలు తీరుస్తున్నది. ఆకామాక్షి కామేశ్వరులు పదివేల సంవత్సరాలు సర్వానందం పొందారు.

ఒకనాడు నారదమహర్షి అమ్మవారికి వినయంగా నమస్కరించి ఇలా అన్నాడు. నీవు పరమపవిత్రస్థానమవు, పరబ్రహ్మవు,సంకల్పవికల్పాలు నీ స్వాధీనాలు లోకక్షేమం కోసం నువ్వు రూపంధరిస్తావు. దుష్టశిక్షణ శిష్టరక్షణ నీ స్వభావం. తల్లీ! భండాసురుడు ముల్లోకాలను బాధిస్తున్నాడు. నీవు తప్ప ఇతరులువానిని చంపలేరు. నీ సేవాతత్పరు లైన దేవతలు చిరకాలం నుండి ఇచటనేయున్నారు. నీవు ఆజ్ఞయిస్తే వారి వారి పురములకు వెళ్ళ గలరు. అందరికి అంతా శుభమే జరిగింది. అని విన్నవించగా ఆ అఖిలేశ్వరి వారిని వారినివాసాలకు పంపివేసింది. తదనంతరం త్రిమూర్తులను, ఇంద్రాది దిక్పాలురకు అనుజ్ఞఇచ్చింది. అమ్మను వదలుటకు ఆ బిడ్డలకు మనస్కరించ లేదు. వారి మనసులలో ఆ ఉమామహేశ్వరులను సేవిస్తూ తల్లివద్ద సెలవుగైకొన్నారు.

ఈ లలితాదేవి చరిత్ర ఆయుష్య సర్వశుభకారణమైనది. సత్పురుషులు ప్రాతః కాలమునలేచి, ఈతల్లిపుట్టుక, వివాహము, రాజ్యాభిషేకము పఠించినచో అమృతవాక్కులు ధనసమృద్ధి గలవారగుదురు. ఉభయలోకములందు శుభకీర్తులు సుస్థిరమగును. సమకాలికులలో పుణ్య చరిత్రుడగును. అచంచల స్థిరలక్ష్మీయుతు 1డగును. నిర్భయుడగును తేజో వీర్యబలయుతుడగును. తాపత్రయములంటవు పురుషార్థసిద్ధి యగును. మూడు వేళల ఈ సింహాసనేశ్వరిని ధ్యానించి జపించవాడు ఆరునెలలలో మహాలక్ష్మిని పొందును.

## శ్రీ లలితా ససేనా విజయయాత్ర

త్రిజగత్పీడా తత్పరుడైన భండాసురుని జయించదానికి కామేశ్వరీదేవి (లలిత) సైన్యంతో బయలుదేరింది. శక్తిసేనా వాద్యధ్వనులతో దిక్కులు మారు మోగిపోయాయి. మృదంగధ్వనులు సప్తసముద్రాలలోను, ఆకాశ వీధుల్లోను ప్రతిధ్వనించాయి. అనేక వాద్య ధ్వనులు, భేరీలు, డప్పులు, తప్పెటలు, తాళాలు, దుందుభులు, ఘటములు, మొ॥శక్తిసేనలు మ్రోగించిరి. ఆ ధ్వనులమధ్య లలితాదేవి అంకుశమునుండి సంపత్కరి అనే శక్తిదేవత పుట్టి తన శక్తిసేనతో తల్లి వెనుక కదలివచ్చింది. పర్వత సమానమైన రణకోలాహలం అనే ఏనుగును సంపత్కరీదేవత అధిష్ఠించింది. ఈగజం మదించి, ఉన్నతమై యుద్ధనైపుణ్యం కలిగినది. సంపత్కరీమాత ఉదయభాను ప్రకాశమాన అనేకకోట్ల ఏనుగులు, గుర్రాలు, రథాలు ఈమెకు సైన్యం, ఈమె స్త్రీసైన్యం ఘోరంగా ధ్వనిచేస్తున్నది. శత్రుసైన్యాన్ని చీల్చిచెండాడే రణకోలాహల గజరాజుపై ఎగురుచున్న జెండాలు ఆకాశాన్ని తాకుచున్నవి. సంపత్కరి ధరించిన ముళ్ళ కవచము ఆతల్లి స్తనాలను కొంచెం బాధిస్తున్నది. ఆమె ధరించిన ఖడ్గం కోపించిన యముని కనుబొమలముడివలెనై మెరపుతీగవలె భయంకలిగిస్తున్నది. ప్రళయ సమయ చంచల పర్వతసంఘమువలె కోట్ల కోట్ల ఏనుగులు ఆమె ననుసరించి పోయినై. (ఇదిగజసైన్యం).

తరువాత లలితాదేవి ధరించిన పాశంనుండి 'శ్రీ'అనే పేరుగల శక్తిపుట్టి అతిపరాక్రమ వేగగమనయై అశ్వం ఎక్కిముందుకుదూకింది. ఆ వెనుక అశ్వసైన్యం కదిలింది. ఆ గుర్రాల గిట్టల తొక్కిళ్లకు భూమిబీటలు తీసింది. గుర్రాల సకిలింతలు వాయుతరంగాలలో మహాధ్వనులీనినై. కాంభోజ, పారద, సింధు, టంకణ, పర్వతీయ, పారసీక, అజానేయ, దరద, వల్మీక యవన, గాంధర్వ, అనే తూర్పుదేశములందు పుట్టిన ఈ గుర్రాలు చక్కని శిక్షణపొందినవి. వినీతములు, వేగవంతములు, స్థిరచిత్తములు గలవి. చక్కగా రౌతులను మోసేవి. ప్రభువుల మనస్సును తెలిసిమసలు కొనేవి. ఘోరయుద్ధాన్ని సహించేవి. శుభలక్షణాలు, శాంతస్వభావలు, శ్రమను లెక్కపెట్టనివి, అశ్వగతుల శిక్షణలో ఆరితేరినవి. తెల్లని సుడులుకలవి,



దేవపద్మ, మణి, స్వస్తికశుభచిహ్నములతో ఒప్పుచు, ప్రభువునకు విజయ, సామ్రాజ్య ప్రాప్తిని కలిగించునవి. ఇట్టివాయు వేగవాజి సంఘాలు 'శ్రీ'ని అనుసరించినై. అపరాజిత నామాశ్వం అపరిమితతేజస్సంభరితము. చురుకు గలది. మిక్కిలియెత్తైనది. కళ్లెముతో అందం చిందులువేసే సుందరసుకుమార వదన సంశోభిత. రెండువైపులకు వాలివేలాడే వెండి,బంగారు రంగుల కేశసౌందర్య సంభరితయై చూపరులను మురిపించేది. దానిస్తనాలు లావైన తోక వెంట్రుకల కదలికలచే తాకబడుచు సోకులు వెళ్లబోస్తున్నవి. పాదము లందు మణులు పొదిగిన చిరుగజ్జెలతో ప్రకాశిస్తున్నది. గిట్టలగట్టి తాకిడు లచే భూమిఅనే మహావాయిద్యాన్ని విజయ సూచకంగా మ్రోగిస్తున్నట్లున్నది. చల్ చలధ్వనులు అర్థంచేసుకుని నడుస్తున్నది. దాని చంచల చామరములు పైకెగురుచుండగా రెక్కల గుర్రంవలె దాటుచున్నది. చిరుగంటలతో కూడిన గుర్రపు అలంకారములతో అందం చిందులువేయిస్తున్నది. ఈ ధ్వనుల వంకతో రాక్షసులను హుంకరించుచున్నదా (వెళ్లగొట్టుట) అన్నట్లు ఆ 'శ్రీ'దేవి గుర్రమెక్కి ముందుకు దూకింది.

నాలుగుచేతులలో పాశము, అంకుశము, పేకబెత్తము, కళ్లెపు పగ్గము ధరించి అవక్ర విక్రమ క్రమ సుశోభితయైనదా శ్రీమాత. ఉదయ సూర్య కాంతిగలిగి, కెరటములవలె ప్రకాశించు మొలపట్టీగలిగి, గుర్రమును నాట్యమాడించు చున్నదా యన్నట్లు గుర్రమెక్కి కదిలిందా జగదంబ. ఆమె వెనుక దండనాథ (స్త్రీసేనాధిపతి) సైన్యము మ్రోగించిన భేరీధ్వనిలోకాన్ని చెవిటిదానినిగా చేసింది. కఠినవజ్రబాణధారులైన కొందరు స్త్రీశక్తులు పాషాణసదృశ మహోన్నతోధృత భుజలై విజృంభించినై. మరికొందరు చండీశక్తులు సేన ఎట్ట ఎదుట నిట్టనిలువుగా నిలుచుంది. కత్తిడాలు ధరించి యుద్ధరంగంలో ముందుకుదూకినై. వందలకొలది బెత్తపుదెబ్బలను రుచి చూపిస్తూ సైన్యసమూహాన్ని విడదీస్తూన్న శక్తులు పైకెగిరి తిరుగచునుండె. దున్నపోతు,లేడి,సింహముగుర్తులగల జెండాలుగల స్త్రీశక్తులు తమ సైన్యంతో ముందుకుపోయినాయి. 'శ్రీ'దండనాథయొక్క తెల్లగొడుగును వేయి విధాల రక్షిస్తూ తమచేతులతో చాచిపట్టుకొని కొందరు స్త్రీశక్తులక్కడకు తెచ్చారు.

## దండనాథ శ్యామల సేనాయాత్ర

శ్యామలాదేవి బయలుదేరినపుడు లెక్కలేనన్ని తెల్లగొడుగులు ఆకాశంలో రెపరెపలాడి చంద్రమండలాలవలె వెలుగొందినవి. గొడుగులలోని చీకటి గొడుగు

కర్రలకు పొదిగిన మణులకాంతులతో పటాపంచలైనది. విసరు కర్రలతో పొదిగిన వజ్రాల ధగధగలు దిక్కులలో మిరుమిట్లుగొలిపె. అవి చూచిన అడవిపందులు భయపడి బొరియలలోదూరి కిక్కురుమనకుండ నుండె. చండుడు, దండుడు మొ॥ భైరవులు శూలాలు ధరించి నాట్యమాడు చుండిరి. వారి జేగురురంగుజడలు దిక్కులలో మెరపులయ్యె సేనకు ఎదుట పరుగెత్తె స్త్రీ శక్తులు తమబాణాగ్నులతో రాక్షసులను మండబెడుతున్న ట్లుండిరి. తరువాత వారాహి కదిలింది. ఆమెవంటి రూపాలు, వస్తువస్త్రాలు, ఆయు ధాలుగల ఆ స్త్రీశక్తులు తమ వాహనాలెక్కి కదిలారు. వారికోరల నుండి వచ్చే అగ్నులపొగలు భూమిని ఆకాశాన్నికట్టివేసినాయి. వారి శరీర వర్ణాలు ముదర తమలపాకులరంగులవి. కళ్లుజేగురులు భయానకాలు క్రూరాలు, వారాహీ సైన్యం వేయిదున్నలనెక్కి కదిలింది. తరువాత శ్యామల 'కిరిచక్రం' అనే ఉత్తమరథం దిగింది. మహాసింహంపై కూర్చుంది ఆ సింహంపేరు 'వజ్రఘోషం' దాని గర్జన వజ్రసమం. అది జూలువిదిల్చింది. నోరుతెరిచింది. దాని ఆకారం వికృతం. కన్నులు విప్పారినాయి. కోరల కటకట ధ్వనులు దిక్కులచివర మారుమ్రోగి అందరికి చెవుడు వచ్చింది. దానిగోళ్లు ఆదివరాహం తలపుర్రె ఎముకవలె కఠినాతికఠినాలు. దాని బరువుమోయలేని భూమిపాతాళానికి దిగబడింది. దాని ఎత్తు 24మైళ్లు. అదితోకనుపై కెత్తింది. మదించిన ఆ సింహాన్నెక్కి శ్యామల యుద్ధరంగానికి వెళ్లింది. క్రోధాగ్నితో మండుతూ అసురసంహారం కావించింది. ముల్లోకాలు ఉద్వేగం చెందినాయి. ఆ వారాహి విశ్వాన్నిదంచి పిండిచేసేలావుంది రోకలిదెబ్బతో భూమిని రెండుగా చీల్చే లాగుంది. నాగలిదెబ్బలతో సముద్రాన్ని అల్లకల్లోలం చేసేలాగుననుంది. ఆకాశంలో ఇలా అనుకొం టున్న దేవతలు భీతావహు లయ్యారు. విమానాల్లో దూరంగా పోయి దేవతలామెను చూచారు. ఆమె పదినామాల్ని పఠించారు. చేతులు జోడించి నమస్కరించారు.

అమ్మవారి పన్నెండు నామాలు తెలపమని అగస్త్యమహర్షి హయగ్రీవుని కోరాడు. అగస్త్యావిను, అవి వింటేచాలు ఆతల్లి ప్రసన్నురాలవుతుంది. పంచమీ దండనాథ, సంకేత, సమయేశ్వరి, సమయసంకేత, వారాహి, పోత్రిణి, వార్తాలీ, మహాసేనా, ఆజ్ఞా, చక్రేశ్వరీ, అరిఘ్నీ అనేవి అవి. ఈ పన్నెండు నామాలు పంజరంలా మానవుని రక్షిస్తాయి. ఎటువంటికష్టం వచ్చినా దుఃఖం పొందడు. ఆకాశంలోని దేవతలు ఆ తల్లిని మరిమరి స్తుతించారు. వారిని రక్షించడానికే తల్లి బయలుదేరింది. మంత్రనాథ మంత్ర నాథ అంటూ రణభేరి మోగించబడింది. శక్తిసైన్యాలు అందాలు చిందు తున్నారు. సుందరవస్తు వస్త్రాలు ధరించారు. పూలకాంతితో, శ్యామలవర్ణం కలిగి, వీణలు ధరించి బయలుదేరినై. కొందరు మదించిన కోయిలల వలె పాడు తున్నారు. నాట్యంచేస్తున్నారు. లీలావిలాస పదక్రమాలతో, వీణా వేణుమృదంగాలు వాయిస్తూ ఆ నాదులతో కలసి నడకలతో శ్యామలాశక్తులు ముందుకు దూకుతుంటే చూచేవారికి సంతోషం పొంగిపొరలింది. కొందరు నెమళ్లనెక్కారు. కొందరు హంసలు,



మరికొందరు ముంగిసలు, ఇంకొందరు వేరేవారు కోకిలలను అధిష్ఠించారు. క్రీడా శకటాలను ఎక్కినవారు, కడిమిపూల మధువుతాగి మత్తెక్కిన వారు, గుర్రాలెక్కినవారు, రకరకాల వాళ్లు అమ్మవారి వెనుకగా బయలుదేరారు. దండనాథ అయిన శ్యామలదేవి ఎత్తయిన జెండా, చక్రాలుకలిగిన రథంఎక్కి బయలుదేరింది. ఆమె కవచం బాలసూర్య సమం. కన్నులు మత్తులో కదలాడుతున్నవి. ముఖపద్మం చిన్నచిన్న చెమటబిందువు లతో ముచ్చటకలిగి స్తుండె, కనుబొమలను పైకిఎగరవేస్తున్నది, వారచూపులతో మదించిన తన సైన్యాన్ని చూస్తూన్నది. తన బలగర్వాలకనుగుణమైన నెమలి యీకల త్రికోణాకారఛత్రం ధరించింది. తనశక్తుల మధ్య బలపరాక్రమ తేజోవిరాజిత. మేఘశ్యామ దేవ, తలామెను దర్శించి, పదియారు నామాలతో ఆమెను స్తుతించారు. ఆ నామాలువిను –

సంగీతయోగిని, శ్యామ,శ్యామల, మంత్రనాయిక, మంత్రిణి, సచివేశీ, ప్రధానేశీ, శుకప్రియ, వీణావతి, వైణికీ, ముద్రిణి, ప్రియప్రియ, నీప ప్రియ, కదంబేశి,కదంబవన వాసిని, సదామద అనేవి ఆ నామాలు. ఈ నామాలతో శ్యామలాదేవిని స్తుతించిన నరుడు మూడులోకాలను తనవశం చేసుకుంటాడు, సందేహంలేదు. ఈమె చూపు ప్రసరింపజేసినచోట శత్రుసైన్యం పూర్తిగా పతనం పొందుతుంది. లలితాదేవిచరిత్ర, ఆమె యొక్క స్త్రీ శక్తుల చరిత్ర సర్వేసర్వత్ర విజయప్రదం అవుతుంది.

ఇక సంగీత యోగిని యొక్క చేతిలోనున్న చిలకపిల్లనుండి సర్వార్థ సాధకమైన ధనస్సు, ధనుర్వేదముపుట్టెను. నాలుగుచేతులు, మూడుతలలు, మూడుకన్నులుగల వీరుడు భక్తితో శ్యామలాంబకు నమస్కరించి అన్నాడిలా తల్లీ! నువ్వుభండాసురునితో యుద్ధంచెయ్యబోతుంటివి, నేను నీకు సహాయం చేస్తా ఈ ధనుస్సు పేరు చిత్రజీవం. దానవనాశకరం, అవినాశి, దీనిని నీవు స్వీకరించు. రెండుబంగారు అమ్ములపొదులు గలది, ఈ బాణాలు అక్షయాలు, దయతో స్వీకరించు, రాక్షస సంహారంకావించు అంటూ సభక్తికంగా నమస్కరించి, ధనుర్వేదము, ధనుస్సు, అమ్ములపొదులు అర్పిం చాడు. వాటిని 'ప్రియకప్రియ'అనే సఖిస్వీకరించింది. శుకప్రియ అనే సఖి 'చిత్రజీవం' అనే గొప్ప ధనువును చేతబట్టింది. అనేకసార్లు నారి మోగించింది. మహాశబ్దం కలిగిందప్పుడు. 'సంగీతయోగిని' అనే సఖితన వింటి నారిని మ్రోగించింది లోకాలకు సంపద కలిగించేలా అది ధ్వనించింది దేవతల మనస్సును తన కనులవెలుగులనెడి ఆనంద సంపదతో పూరిం చింది. యంత్రిణి, తంత్రిణి, అనే వారిద్దరు ఆమె సేవికలు చిలుకను, వీణను ధరించి ఆమెను సేవించారు,'ఘనశ్యామ'అనే సఖి నారిధ్వనిచేయగా అందులో ఆమె కంకణధ్వనులు కలిసి అతిమనోహరంగా వ్యాపించిన ఆ ధ్వని వీనుల విందుచేసింది. 'గీతయోగిని' అనే సఖి 'చిత్రజీవం'అనే ధనువును ధరించింది. కదంబఛత్ర ధనువును ధరించిన కదంబినివలె ఆమె ప్రకాశించింది. కాళికాదేవి చూపువలె తీక్ష్ణ ణంకలిగి, కదిలే నాగుపాముపలె భయంకరమైన బాణాన్ని ఆమె కుడిచేతిలోధరించింది, ఆమె 'గేయచక్రం' అనేరథంఎక్కింది. ఆమెవెనుక వెంబడించిన

వారు శ్యామలవర్ణం గలవారు ధనుర్బాణాలు ధరించిన దేవీశక్తులువారు తీవ్రవేగం గలవారు, మదించి అలిసిపోయిన వారు తియ్యని కిలకిలధ్వనులు చేస్తూ, దశదిశలను ఆనంద పరిచేవారు. వెయ్యిశక్తి సేనలు, వేయ అక్షోహిణుల సంఖ్యగలవి.

## శ్రీ లలితాపరమేశ్వరీ సేనాజయయాత్ర

లలితాపరమేశ్వరి యుద్ధానికి బయలుదేరింది. అందరు ఆమెను ఆశ్ర యించారు. అందువల్ల ఆమె రాజనాయిక అయింది. ఆమె అంకుశం జ్వాలలు వెదజల్లుచున్నది. పాశముసర్పమువలె భయం కలిగిస్తున్నది. హస్త కంకణాలు మంజులధ్వనులు చేయుచుండగా చెరకువిల్లు ధరించింది. తేజస్వంతముల్లైన ఐదుపుష్పబాణాలుదాల్చింది.వేయిమంది ఉదయసూర్యు లను మించిన ఎర్రనికాంతిని తన శరీరంనుండి ప్రవహింపజేస్తున్నది. ఇంకను ఆమె కోటిసూర్యభాసమాన, ఆమె ముఖకాంతులు దిక్కులకు విరజిమ్ముతున్నవి. ఆకాశమందంతట వెన్నెలమయమై యున్నది. 80 మైళ్ళ విశాలము గలిగి మూడులోకాలను ఆవరిస్తున్నట్లున్న ఆమె ముత్యాలగొడుగు చంద్రునకు చెలికాడువలె ప్రకాశించుచున్నది. విజయ మొదలగు నవి నలుగురు పరిచారికలు మణిమయముల్లైన, ఉదయచంద్రకాంతి కిరణాగ్ర శశు హాసములను వెదజల్లు చామరములతో అమ్మకు మృదువీవనలతో సేవలందిస్తుం డిరి. అవి స్త్రీశక్తుల ఏకైక సామ్రాజ్యపదవి, వందలాది రాజ్యచిహ్నములతో ఆసైన్య దేశం అలంకరించబడింది. దేవతాస్త్రీలు నూతన ఆశుకీర్తనలతో, సంగీత వాద్య యుక్తంగా అమ్మవైభవాన్ని సర్వానంద దాయ కం అందరికీ అందిస్తున్నారు. అవి ఆమె తేజస్సును అధికం చేసింది. ఆ రూపం మనస్సుకు, బుద్ధికి, వాక్కులకు అందనిది. భావింపరానిది, సాటిలేనిది, మూడులోకాలలోని శక్తిసామ్రాజ్యముయొక్క గౌరవం పొందుతున్నది. దేవతలు తమ శిరస్సులపై చేతులుజోడించి అహమహమి కతో గుంపులు గుంపులుగా ఆమెను సేవిస్తుండిరి. త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు స్తోత్రపాఠములుగా విస్తుండిరి. లలిత వారిని దయతో ఆదరిస్తున్నది. తేజస్వంతము లైన పుష్పబాణాలనుండి బయలుదేరిన కాంతు లతో జ్యోతిష్మంతాలైన ముల్లోకాలను నిలుపుతుండె. మెరపుతీగలవంటి అప్సరసలగుంపులు జయమంగళ లాజవర్షములు తల్లిపై కురిపిస్తుండిరి. యుద్ధవేషధారిణులై, మనోహరలై, అమితకాంతులు వెదజల్లుచూ, ఆయుధకాంతులతో సూర్యునిగూడ తిరస్కరించే కామేశ్వరి మొ॥ శక్తులు నిత్యము అమ్మపాదాలవద్ద కూర్చుండి సేవిస్తుండిరి. శ్రీచక్రాలు శుభచక్రా లతో అలంకరించబడి, 800 ఎత్తైన జెండాలతో, మేఘాలను తాకుతున్న, మనోహరధ్వనులు గల, మహాశక్తిపరంపరలుగల రథమును యుద్ధరంగంలో ఆ తల్లిని నడిపిస్తున్నది. పైకెత్తబడిన అంకుశపు కపిలవర్ణ కాంతి యుద్ధంలో మనోహరకాంతిని వెదజల్లింది. ఆతల్లి ఇరవైఐదు నామాలు ప్రపంచ పాపాలన్నిటిని ఉపశమింపజేస్తాయి. అట్టి నామ రత్నాలతో మరుత్తులు స్తుతిస్తుండగా లలితాదేవి యుద్ధానికి బయలుదేరింది. అనగా విని అగస్త్యుడు హయగ్రీవునితో అన్నాడు, మహాత్మా! హయగ్రీవా! లలితా



పరమేశ్వరియొక్క 25 నామాలు మాకు వినిపించి శ్రవణానందం కలిగించవయ్యా! అనగానే వినవయ్యా! అగస్త్యా అంటూ హయగ్రీవస్వామి నామవివరణ గావించాడు ఇలా!

సింహాసనా,శ్రీలలితా,మహారాజ్ఞీ,పరాంకుశా, చాపినీ, త్రిపురా మహాత్రిపుర సుందరీ, సుందరీ, చక్రనాథా, సామ్రాజ్ఞీ, చక్రిణీ, మహాదేవీ, కామేశీ, పరమేశ్వరీ, కామరాజప్రియా, కామకోటి,చక్రవర్తీ,మహావిద్యా,శివా,అనంగవల్లభా, సర్వపాటలా కులనాథా, ఆమ్నయనాథా, సర్వామ్నాయ నివాసినీ, శృంగారనాయికా, అనే యీ 25 నామాలతో అమ్మను స్తుతించిన వారు అష్టసిద్ధులను, సౌభాగ్యాన్ని సత్కీర్తిని పొందుతారు. ఈ తల్లి మహా భయంకర సంరంభంగల మహాసైన్యాన్ని కదలిస్తూ భండాసురుని పైకి మిక్కిలి కోపంతో కదిలింది.

## శ్రీచక్రరాజరథ, జ్ఞేయచక్రరథ సర్వదేవతా వివరణ

అగస్త్యమహర్షి హయగ్రీవునితో అన్నాడు. హయగ్రీవా! చక్రరాజమనే రథంయొక్క చక్రంలోగల ఆకులను ఆశ్రయించినదేవతల నామధేయాలు, సంఖ్యలు, శుభవర్ణాలు, ఆయుధాలు ఎట్టివి? వివరించి చెప్పమంటే హయగ్రీవస్వామి అన్నా రిలా. వినవయ్యా! అగస్త్యా! చక్రరాజ మనేరథంలో తొమ్మి దవరేకు (అంతస్తు)ను ఆశ్రయించినదేవతలు సిద్ధిదేవులనబడతారు. వీరంతా స్త్రీమూర్తులే. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ఈశిత, వశిత, ప్రాకామ్య, సర్వకామ, వారిపేర్లు వీరునాలుగు చేతులు గలవారు వీరు కుంకుమ పువ్వువంటి రంగుగలవారు చింతామణి, కపాలము, త్రిశూలము, సిద్ధికాటుక నాలుగుచేతులలో ధరించినవారు దయామయులు, యోగుల సేవలు పొందేవారు. అక్కడ మొదటి సగభాగంలో ఎనిమిదిమంది శక్తులుం టారు. వారు బ్రాహ్మీ, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండ, మహాలక్ష్మి పేర్లుగలవారు.

ఎర్రని ఆకారం, రెండుభుజాలుగలవారు పుర్రె, కలువధరించినవారు, ఎర్రని చీరను కట్టుకున్నారు. ఇంకొకప్పుడు వీరు బ్రహ్మ, మొ॥వారి ఆకారములుగలిగి, వారివారి ఆయుధాలు ధరించినవారు వారిశిరస్థానమున స్త్రీదేవతలు చాలాగొప్ప వారు. వారిచేతులు ముద్రలతోకూడియుంటుంది. పద్మాలవంటిచతులు, దానిమ్మపూల కాంతి గలిగి, పసుపుపచ్చని చీరలు కట్టి అందాలు చిందిస్తువుంటారు. నాలుగుభుజాల యందు చర్మము, ఖడ్గము, రెండిట రెండు ముద్రలు ధరించియుందురు మదంతో వారికళ్ళు ఎరుపెక్కి అటునిటు ఎక్కువగా కదలుతూవుంటవి వారిపేర్లు వినవయ్య సర్వ సంక్షోభిణీ, సర్వవిద్రావిణీ, సర్వాకర్షిణీ, సర్వవశంకరీ, సర్వోన్మాదినీ, సర్వమహాం కుశా, సర్వఖేచరీ, సర్వబీజ సర్వయోని, సర్వత్రిఖండికా, సిద్ధి బ్రహ్మ అనబడుతూ ఆయా ముద్రలు ధరించినవారు వీరు తమ శక్తులను ప్రకటిస్తూ ప్రకటశక్తులు అనబడతారు. భండాసుర సంహారం చేయడానికి ఎర్రనిరథంపై వుంటారు. ఇంకా కొన్ని గుప్తనామాలువిను.

కామాకర్షిణి, బుద్ధ్యాకర్షిణి, అహంకారాకర్షిణి, శబ్దాకర్షిణి, స్పర్శాకర్షణి, రూపాకర్షిణి, రసాకర్షిణి, గంధాకర్షిణి, చిత్తాకర్షణి ధైర్యాకర్షణి, స్మృత్యా కర్షిణి, నామాకర్షిణి, బీజాకర్షిణి, ఆత్మాకర్షిణి, అమృతాకర్షిణి, శరీరాకర్షిణి అనేవి అవి. ఇవి పదహారు. చంద్రకళాశక్తులు. నిత్యాదేవతలు, ఎనిమిదవ అంతస్థులో వీరుంటారు. వీరు పగడపు చెట్టును పోలివుంటారు. చిరునవ్వుతో ఎదుటివారి మనస్సును తక్షణం హరించివేస్తారు. నాలుగుభుజాలు, మూడు కన్నులుగలవారు. వీరి కిరీటాల్లో సూర్యచంద్రులు ప్రకాశిస్తూవుంటారు. ధనువు, బాణాలు, చర్మం, ఖడ్గం, నాలుగు భుజాల్లో ధరించివుంటారు. దివ్యకాంతిగలవారై వుంటారు. అగస్త్యా! వీరంతా భండాసురవధకై సిద్ధంగా వున్నారు సాయంత్రం వెలిగే దీపంలావున్న చక్రరాజ రథంయొక్క ఏడవఅంతస్థులో పరమ రహస్యనామధేయాలుగలవారిని నీకు వివరి స్తానువిను, అనంగమదనా, అనంగమదనాతురా, అనంగలేఖా, అనంగ అనంగవేగా, అనంగాంకుశా అనంగాలింగనపరా అనే ఈస్త్రీ దేవతలు కుంకుమపువ్వు వంటి రంగుగలవారు చెరకువిల్లు, పుష్పబాణాలు, పూలచెండు, కలువపువ్వు నాలుగు చేతులలో ధరించినవారు, మహాపరాక్రమంగలవారు లలితాదేవి ఆజ్ఞతో భండాసురు నిపై కోపించి మండుతున్నట్లుంటారు.

చక్రరాజరథం ఆరవఅంతస్థును ఆశ్రయించిన దేవతలనుగూర్చి విను. చక్కగా జడలల్లుకొన్నారు, సిందూరతిలకం తీర్చిదిద్దుకున్నారు, తీవ్రస్వభా వాలు కాలాగ్ని కాంతిగలవారు అగ్నిబాణం, అగ్నిధనువు, అగ్నిఖడ్గం, అగ్ని ఫలకం ధరించారు. మండుచున్న అగ్నుల వంటి ఆకారాలుగలవారు. భండా సురునిపై కోపించినవారు. మన్మధభస్మం నుండి పుట్టినవారు, వీరంతా లలితాదేవియొక్క మహాతేజస్సుతో నిండినవారు. సర్వసంక్షోభిణీ, సర్వవిద్రా విణీ, సర్వాకర్షిణీ, సర్వాహ్లాదనీ, సర్వసం మోహినీ, సర్వస్తంభినీ, సర్వజృంభణీ సర్వోన్మాదినీ, సర్వద్వంద్వక్షయంకరీ, అనేవి వీరి నామాలు. ఇకఐదవ పర్వంలోని కులోత్తీర్ణశక్తులనుగూర్చి విను. వీరుస్ఫటిక వర్ణులు. పరశువు, పాశము, గద, ఘంట, మణిధరించినవారు. కాంతవిగ్రహాలు, భండాసురు నిపై మిక్కిలి కోపించి పైకి ఎగరవేసిన వంకరైన కనుబొమలుగల ముఖాలు గలవారు, వీరిపేర్లను వినవయ్యా అగస్త్యా! సర్వసిద్ధిప్రదా, సర్వసంపత్ప్రదా, సర్వప్రియంకరా, సర్వమంగళకారిణీ, సర్వకామప్రదా, సర్వదుఃఖవిమోచనీ, సర్వమృత్యుప్రశమనీ, సర్వవిఘ్ననివారిణీ, సర్వాంగసుందరీ, సర్వసౌభాగ్య దాయినీ అనేపదహారు నామాలు వీరివి. ఈ స్త్రీదేవతలు దయామయులు. ఇక చక్రరాజ రథం నాలుగవ అంతస్థులోనున్న దేవతలు ముత్యాల హారాల కాంతులు గలవారు, వీరు నిరగ్భయోగినీ నామాలతో ప్రసిద్ధులు. వీరు పదిమంది. సర్వజ్ఞాదేవి, సర్వశక్తిదేవి, సర్వైశ్వర్యప్రదాదేవి, సర్వసర్వజ్ఞాన మయీదేవి, సర్వవ్యాధి వినాశినిదేవి, సర్వాధార స్వరూపాదేవి, సర్వపాపహరా దేవి, సర్వానందమయీదేవి, సర్వరక్షాస్వరూపిణీదేవి, సర్వేప్సితఫలప్రదాయిని దేవి అనేవి వారి నామధేయాలు వీరునాలుగుభుజాలలో



వజ్రం, శక్తి, తోమరం, చక్రం ధరించారు. భండాసుర సంహారానికి బయలుదేరారు. ఇక చక్రరాజరథం మూడవ అంతస్తులో రహస్యయోగినులు వాగధీశ్వర నామాలతో ప్రసిద్ధులు. ఎర్రని అశోకపుష్పాలకాంతి గలవారు. ధనస్సులు బాణాలు ధరించారు. సర్వాంగ కవచధారిణులు వీణా పుస్తకాలు ధరించారు వశినీ, కామేశీ, భోగినీ, విమల, అరుణ, జయినీ, సర్వేశీ, కౌళినీ అనే నామాలుగలవారు. ఈ ఎనిమిది మంది రాక్షసకారణులైన స్త్రీదేవతలు. చక్రాధరథం రెండవ అంతస్థును ఆశ్రయించిన వారు ముగ్గురు వీరిపేర్లు కామేశీ, వజ్రేశీ, భగమాలినీ అని ప్రసిద్ధి పొందాయి. మూడుపీఠాలపై ఆసీనులయ్యారు. ఎనిమిదేసి చేతులు గలవారు. ధనస్సు, బాణాలు, పానపాత్రం, మాదీఫలం, ఖడ్గం,డాలు, నాగపాశం, మహాధ్వనిగల ఘంట ధరించారు. మదిరతాగిమత్తెక్కి రహ స్యాలు దాస్తూవుంటారు. లలితాదేవితో సమానమైన మహిమ, తేజస్సు గలవారు. సర్వదా ఆతల్లికి అంతరంగులు, రథంయొక్క మధ్య అంతస్థులో ఆనందమహాపీఠంలో వారినివాసం. వీరికి పంచదశాక్షరులనిపేరు. (15 అక్షరాల మంత్ర దేవతలు) నిత్యాతిధులు, కాలస్వరూపలు, విశ్వవ్యాప్తులు వీరు. భండాసురుడు మొ॥ రాక్షసులను చంపుటకై మహాకోపంతో కనుబొమ్మలు ఎగరవేస్తూ భయంకలిగిస్తు న్నారు లలితాదేవి ఆకారాలు గలవారు ఆమె ఆయుధాలనే ధరించినవారు యుగ యుగాల లోకాలకు ఉపకారం చేయడానికి అక్కడవుంటారు. ఓ అగస్త్యా! వారిపేర్లు వినుమయ్యా! కామేశీ, భగమాలా, నిత్యక్లిన్నా, భేరుండా, వహ్నివాసినీ, మహావజ్రేశ్వరీ, దతీ,త్వరితా, కులసుందరీ, నిత్యా,నీలపతాకా, విజయా,సర్వమంగళా, జ్వాలా మాలినికా,చిత్రాఅనే పదిహేను అవి. వీరు ఎల్లపుడు అమ్మకుఉ సేవచేస్తూనే వుంటారు. ఈ స్త్రీదేవతలతోకూడి లలితాంబిక యుద్ధానికి బయలుదేరింది.

## శ్రీ చక్రరాజరథ, గేయచక్ర రథ అంతస్థులలో నున్నదేవతలవివరం

అగస్త్యా! మహాచక్రరథంలో మంత్రినాథ గానంచేసింది. అక్కడ దేవి యొక్క సప్తద్వారాలువున్నవి. గేయచక్రరథంలోగల అంతస్థుమధ్య సంగీత యోగిని నివసిస్తుంది. ఆమె శ్రీదేవికి చాలా యిష్టురాలు అదే మొదటి అంతస్థు. మంత్రిణికి నివాసం. ఇక రెండవఅంతస్థులో రతి, ప్రీతి, మనోజ అనే స్త్రీదేవతలున్నారు. కానుగచెట్లవలెనల్లనివారు, రాక్షస సంహార సమర్థులు వీరు, ధనువు ధరించినవారు. మూడవఅంతస్థులో మన్మధబాణం దేవత లున్నారు. ద్రావిణీ, శోషిణీ, బంధినీ, మోహినీ, ఉన్మాదినీ అనేవి వారిపేర్లు. ధనువులు ధరించినవారు అంతస్థుక్రిందుగా నున్న మహాతేజస్వంతులు వీరు. కామరాజు, కందర్పుడు, మన్మథుడు, మకరధ్వజుడు, మనోభవుడు ముల్లోకప్రసిద్ధ ముత్యాలమాలలతో ప్రకాశించేవారు. శరీరమంతట కవచం కప్పుకున్నవారు. మోదుగపువ్వు కాంతిగలవారు. వీరిని పంచకాములంటారు. భండాసురుని చంపాలనేదే వీరికోరిక.

ఇక గేయచక్రరథంలో బ్రాహ్మీ! మొ॥ సప్తమాతృకలుంటారు. ఎనిమిద వది చండిక. ఈమె సర్వశ్రేష్ఠ. అక్కడి అంతస్థుక్రింద, లక్ష్మి, సరస్వతి, ప్రీతి, కీర్తి,పుష్టి,

తుష్టి అనేశక్తులున్నారు. వీరి కళ్లుకోపంతో ఎరుపెక్కి వుంటాయి. వీరు బల్లెములు, చక్రములు ధరించిన కుమారికలు. ఇక ఐదవఅంతస్థులో 'వామా' మొ॥వారు పదహారుమంది వున్నారు. వారు రథాన్ని వర్ణిస్తూ పాటలు వ్రాసారు. వారి పేర్లువిను. వామా, జ్యేష్ఠా,రౌద్రీ,శాంతి,శ్రద్ధా,సరస్వతీ, శ్రీభూశక్తి,లక్ష్మీ,సృష్టి, మోహినీ, ప్రమాధినీ, ఆశ్వసినీ,వీచి,విద్యున్మాలినీ, సురానందా, నాగబుద్ధికా అనబడేవి అవి. వీరు తుంగ కాయల రంగుగలవారు. లోకాలను గడగడలాడిస్తారు. మాటి మాటికి మహాసరసమైన అన్నాహము అనే ఆహారవిశేషాన్ని ఆరగిస్తుంటారు. వజ్రకవచం కప్పుకున్నవారు కొందరు పెద్దపెద్దగానవ్వుతూ అందంగా వుంటారు. వజ్రము, దండము, శతఘ్ని, భుశుండికా అనేఆయుధాలు ధరించినవారు. ఇక ఆరవఅంతస్థులో అసితాంగుడు మొ॥ భైరవులున్నారు. వారు శస్త్రాలుధరించి భయం కలిగిస్తారు. త్రిశూలం, పానపాత్ర ధరించినవారు, నీలకాంతిగలవారు, వారే అసితాంగుడు, రురుడు, చండుడు, క్రోధుడు, ఉన్మత్తభైరవుడు, కపాలి, భీషణుడు, సంహారుడు అనే అష్ట(8)భైరవులు గేయచక్రరథం ఏడవ అంతస్థులో వున్నవారు మాతంగీ, సిద్ధలక్ష్మీ, మహామాతంగికా, మహతీసిద్ధలక్ష్మీ, శోణాఅనేవారు వీరుబాణాలు, ధనస్సులు, ధరించినవారు. ఆ అంతస్థుకింద లక్ష్మీ,సరస్వతి,శంఖుడు,పద్ముడు,నిధి ఉంటారు వీరంతా శస్త్రాలు ధరిస్తారు. లోకద్వేషియైన భండాసురునిపై కోపం గలవారు. ఇంద్రుడు, మొ॥ విష్ణువు వరకు గలదేవతలు ఈరథానికి పదిదిక్కుల అధిపతులుగా వుంటారు. శక్తిరూపాలు గలిగి అంతస్థుకింద నివసిస్తారు. వజ్రమునందలి శక్తిని, కాలదండము, ఖడ్గము, పాశము, ధ్వజము, గద, త్రిశూలము, దర్భాసనము, వజ్రము వీరుధరిస్తారు.నిత్యము మహాభక్తితో మంత్రినాథను సేవిస్తారు వీరు చాలా కోపిష్టివారు. లోకకంటకులైన భండుని, వాని పరివారాన్ని చంపడానికి మంత్రినాథ ద్వారా లలితా పరమేశ్వరికి జ్ఞాపకం చేయడంలో చాలా వుత్సాహపడుతూవుంటారు.

గేయచక్రరథ సమీపంలో దిక్పాలురు ఆశ్రయాన్నిచ్చారు. సర్వశక్తి దేవతలకు మంత్రిణి ఆధారదేవత. ఈమె ద్వారా లలితాపరమేశ్వరికి చేసిన దేవతల విజ్ఞాపనం కార్యసిద్ధినిస్తుంది. సఫలం అవుతుంది, లేకుంటే మహా తేజస్స్వరూపిణి అయిన లలితా పరమేశ్వరి సమీపాన్ని జేరడానికి ఎవరి తరంకాదు. మంత్రిణి సంగీతవిద్య. ఆవిద్యలలితాదేవికి మహాఇష్టం. కాబట్టి శ్రీదేవికి మంత్రిణి చాలాయిష్టురాలు. ఆమె అమ్మతో చెప్పిన ప్రతివిషయం ఫలించి తీరుతుంది. నిస్సందేహం దేవీసామ్రాజ్యంలో సమస్తకార్యాలు మంత్రిణి అధీనంలో వుంటుంది. ఒకపనిచెయ్యడం, చెయ్యకపోవడం, ఇంకో విధంగా చేయడం అనేవి మంత్రిణియిష్టం. ఈమె అన్నిటికీప్రధాన భూతురాలు. దిక్పాలకులందరు తల్లి జయాన్నికోరి మంత్రిణిని సేవిస్తూ వుంటారు.ఈవిధంగా లలితాదేవియొక్క చక్రరాజథ శ్రేష్ఠలోవున్న అంతస్థులలోని స్త్రీదేవతల నామాలు చెప్పబడినై. భండాసుర సంహారంలో ఆమెయొక్క దివ్యాయుధాలు తెల్పబడ్డవి. గేయచక్ర పర్వాదేవతలును చెప్పబడిరి. ఈ సర్వస్త్రిదేవతల నామాలు విన్న నరులు సర్వపాపాలు తొలగి విజయం పొందుతారు.



## కిరి చక్ర రథ దేవతా ప్రకాశనం

ఓ అగస్త్యా! ప్రాజ్ఞా ! కిరిచక్ర రథశ్రేష్ఠం యొక్క ఐదవఅంతస్థు నాశ్ర యించిన దేవతలను గూర్చివిను. వారి నామాలు విన్నవారికి విజయం లభిస్తుంది. దాని మొదటి అంతస్థుకు బిందువనిపేరు. అక్కడ దండనాయక వుంటుంది. ఆమె ప్రపంచయొక్క మహాకష్టాలను పోగొడుతుంది. అనేక కాంతులతో విజయం చేకూరుస్తూ వుంటుంది. ఆమె వారాహి తన మూతితో కొట్టి గర్వించిన రాక్షసులను ముక్కలు ముక్కలు చేసింది. ఆమె కోరలు చంద్రవంకలవలె ప్రకాశిస్తాయి. ఆ కాంతిలో రాత్రి తెల్లగా ప్రకాశిస్తుంది. ఆమె శరీరవర్షకాలమేఘాలవలె నల్లగా తీగలా వుంటుంది. తెల్లగా ప్రకాశిస్తుంది. ఆమెది వరాహముఖం. ప్రపంచంలోగల కడిమి చెట్లు ఆమె కుమారులు ఆరథం యొక్క రెండవ అంతస్థులో జృంభిని, మోహిని, స్తంభిని వుంటారు. విడిచినదానిమ్మపువ్వు కాంతితో వుంటారు వారు. రాక్షసులను మర్దిస్తారు. మెరిసిపోయే రత్నకంకణాలు ధరించిన చిగురువంటి చేతులతో వుంటారు. రోకలి,నాగలి,మణిమయ పానపాత్ర ధరిస్తారు. వారికన్నులు వాడివై, క్రూరంగా వుంటాయి. వారి కన్నులనుండి వచ్చేమంటలతో రాక్షససైన్యాన్ని దహిస్తున్నట్లుంటారు. వారాహిని సర్వదా సేవిస్తూ వుంటారు. ఇక కిరిచక్ర ధర శ్రేష్ఠం యొక్క మూడవ అంతస్థును ఆశ్రయించిన 'అంధిని'మొ॥స్త్రీలు దేవీయంత్రంలో నివాసంవున్నదేవతలు. కఠినమైన పెద్దపెద్ద నవ్వులతో మూడులోకాలను పగులగొట్టేలా వుంటారు. ప్రళయాగ్ని జ్వాలల్లాగా వెలిగిపోతుంటారు. భండాసురసైన్య రక్తధారలను నాకుతున్న ట్లున్న నాల్కలు గలవారు మహాపరాక్రమమైన దండనాథను సర్వదా సేవిస్తారు. ఇక నాల్గవ అంతస్థులోవున్నవారు పంచమిని, అష్టమిని వదలిన బ్రహ్మ మొ॥వారు ఆరుగురే స్త్రీదేవతలు. ఆరుచక్రాల్లోగల జ్వాలాశరీరులు వీరు అతిపరాక్రమలు. దండనాథ ఆజ్ఞతో ఆప్రదేశాన్ని రక్షిస్తుంటారు. రాక్షసులను తాగుతున్నట్లుం టారు. ఆ అంతస్థు క్రింది భాగంలోనున్నవారు యక్షిణి, శంఖిని, లాకిని, హాకినీ, కాకినీ ధాకిని అనేవారు. వీరందరి ఐక్య స్వరూపిణి మరియొకహాకినీ. ఈమె ఏడవది వీరంతా భయంకర పరాక్రమాలు, ప్రాణులను భూమిని, విరోధుల చర్మాన్ని రక్తమాంసాల్ని, మేధస్సును, ఎముకలను,మజ్జను,శుక్రాన్ని తాగుతూ వికటముఖాలు కలిగివుంటారు. కఠోరసింహ నాదాలతో దశదిశలు దద్దరిల్లేలా చేస్తున్నారు. వీరిపేరు ధాతునాథలు. అణిమ మొ॥ అష్టసిద్ధులను ఇస్తారు. దుష్టరాక్షస మోహన, మారణ, స్తంభన,తాడన, భక్షణ అనేవాటిని సంపూర్ణంగా నాశనం చేసివేస్తారు. అందులో వీరు పండితులు. భక్తుల సమస్త ఆపదలను తుడిచిపెట్టేస్తారు.వీరు ధాతునాథలు,సర్వధాతువులలోను వుంటారు. ఎగిసిపడే కెరటాలతో ఆకాశాన్నంటే సప్తసముద్రాల్ని అరక్షణంలో తాగేసే అతిసాహస, శకటాకారదంతాలు, భయంకర నేత్రాలుగలవారు. స్వామిద్రోహులను, సమయ ద్రోహులను, వైదిక ద్రోహులను, యజ్ఞద్రోహు లను, వీరవైరులను, ఇట్టి రాక్షసులను నమిలేస్తారు. వీరంతా దండనాయకయైన వారాహిని నిత్యము సేవిస్తూవుంటారు.

ఆ అంతస్థు రెండవపక్క దివ్యమందిరంలో క్రోధిని, స్తంభిని అనే ప్రసిద్ధ
దేవతలిద్దరుంటారు. వారు చామరాలు వీస్తుంటారు. అందువల్ల వీరి తీగలవంటి
చేతుల్లో కంకణాలు ధ్వనిచేస్తూవుంటాయి.రాక్షససైన్య రక్త మధువులను తాగి మిక్కిలి
పేట్రేగిపోతూవుంటారు. ఎప్పుడు కళ్లుతిప్పుతూ వుంటారు. సర్వదా పెద్దగా నవ్వే
ముఖాలుగలవారు. కిరిచక్రరథంలో స్థిరంగా వుండేవినాగలి, రోకలి అనే ఆయుధాలు
ఇవి దేవతా రూపాలుగా వుంటాయి. తమకిరీటాల్లో ఆయుధాలను ధరించివుం
టాయి. జగవిద్వేష రాక్షస సంహారం చేసేవి యివే అని దేవతలు ఈ దేవతలను
కీర్తిస్తూవుంటారు. ఈ ఆయుధాలతో లలితాదండనాయిక యుద్ధంలో 'విషంగు'డనే
రాక్షసుని చంపగలదు. ఆ అంతస్థులో దండనాయిక యొక్క ఎదుట భయంకర
సింహంవుండి తన భయంకర గర్జనలతో ఆకాశాన్ని మారుమోగిస్తూవుం టుంది.
దాని కోరల కటకట ధ్వనులతో దిక్కులు చెవుడుబారుతుంటాయి. 'చండోచ్చండ'
అనేపేరుగలవాడు మూడుకన్నులు, నాలుగుచేతులు గలిగి, శూలము, ఖడ్గము,
ప్రేతము, పాశము ధరించి, మిక్కిలి తేజస్సుతో వెలిగి పోతూ తనచూపులతో వారాహిని
సేవిస్తూవుంటాడు. కిరిచక్రరథం ఆరవఅంతస్థులో వార్తాళి, మొ॥ వారు అష్టదిక్కు
లందును ప్రసిద్ధులు. ఎనిమిది పర్వతాలు నేలపై పడినంతధ్వనిగలవారు. ప్రకాశించే
నాగాలంకారాలు గలవారు అమితబలతేజస్వంతులు, వారి విశాల భుజదండాల
వేడిలో కోట్లాది రాక్షసులు హోమం చేయబడతారు. ఇట్టి స్త్రీదేవతలు లలితాదండ
నాథలను అహర్నిశలాసేవిస్తారు. అగస్త్యా! వారిపేర్లువిను. వార్తాళి, వారాహి, స్తంభిని
అనేవీరు శత్రువులను క్షోభకలిగించి, వారినిస్తంభింపజేసి, పారద్రోల దంలో
సర్వసమర్థులు. వారు అంతస్థుయొక్క ఎడమభాగంలో వుంటారు. దండనాథ మహిషం
ఎక్కుతుంది. ఆమహిషం ధూళిధూసరవర్ణ దానిరెండు కొమ్ముల మధ్య ఒకమైలుదూరం
(1.5కి.మీ.) దానిఆకారం 2మైళ్లు దాని వెంట్రుకల నుండి కఠినఖడ్గాలవాడి గలవారు
పుట్టారు. ఆమహిషంచుట్టు వారుంటారు. దానితోక యమునిదండంవలె మహోన్న
తమై భయంకలిగిస్తు వుంటుంది. నల్లనికాటుల కొండవలె వుంటుంది. వికటంగా,
ఉన్నతంగా కోపంతో రోజుతూవుంటుంది. మహానీలపర్వత శ్రేష్ఠంవలె గరిష్టమూపురం
కలిగివుంటుంది. దాని అధికాధికములైన వేడినిట్టూర్పులకు సముద్రాలు కంపించినై.
ఘుర్ఘురధ్వనులతో యమునిదున్నపోతును వెక్కిరించినట్లుంది. దానిగిట్టలతో పుష్కలా
వర్తకమేఘాలను చెల్లాచెదురుచేసింది. ఆ అంతస్థుకింద ఇంద్రాది అష్టదిక్పాలకులుం
టారు. లలితాదేవికి కార్యసిద్ధిని నివేదించడానికి వీరువచ్చారు.

ఇంద్రుడు, 64కోట్లమంది అప్సరసలు, సిద్ధసాధ్యాగ్నులు, విశ్వేదేవ తలు,
మయుడు, మహాబలంగల మాతృదేవతలు, రుద్రులు, పరిచారులు, రుద్రులు, పిశాచ
కులు, అనేక రాక్షసాధిపతులు అరుస్తున్నారు. మిత్రులు, నిత్యగానప్రవీణ గంధర్వులు
వారి ముందునడిచే విశ్వావసువు మొ॥వారు. సేవకాగణాలు, వరుణుడు, వాసవుడు,
విద్యాధరకిన్నరులు, మారుతేశ్వరుడు, చిత్రరథుడు, రథకారులు, తుంబురనారదులు,



యక్షుడు, సోముడు, యక్షేశ్వ రుడు, దేవతలతోకూడిన విష్ణువు, లయకారకుడై,
త్రిశూలధారియైన ఈశానుడు, బ్రహ్మ, దేవతావైద్యులైన అశ్వనీదేవతలు, ధన్వంతరి,
గణనాయకులు, మదంస్రవించే నాగరాజులు, అనంత, వాసుకి, తక్షక, కర్కోటక,
పద్మ, మహాపద్మ, శంఖపాల, గుళిక, సువల అనే సర్పరాజులు, కోట్లాది సర్పాలతో
ఆవరించబడిన నాగేశ్వరులు మొ॥వారు అక్కడ మేలుకొని వుంటారు. అష్టదిక్కుల
వసించివుంటారు. దేవతలు చక్రాకారంగా వుండగావారి నాశ్రయించి అధిష్ఠాన
దేవతలు వుంటారు. జృంభిణి, స్తంభిని, మోహిని అనేవారు. ప్రకాశించెకిరి చక్రప్రాం
తంలో క్షేత్రపాలుడు వారాహిని నిత్యం సేవిస్తూ వుంటాడు. అతని రూపం వినవయ్యా
అగస్త్యా! పెద్దశరీరం, ఆకాశాన్నిచూచే శిరోజాలు పాతాళ బాలంలోవున్న నల్లనికాంతి
కలిగి కపాలంగధరించి అట్టహాసం చేస్తూవుంటాడు. అవి వజ్రాఘాతల్లాగ బ్రహ్మాం
డాన్ని బద్దలు చేస్తూవుంటాయి. అతడు డమరుకంమోగిస్తాడు ఆ ధ్వనులు ఆకాశగుహ
మధ్యాన్ని పగలగొడతై బుసలుకొట్టే మూడుతలల నాగపాశం ఆయన ధరిస్తాడు.
ఈయన వారాహిని నిత్యంసేవిస్తూ తేజస్వంతుడైవుంటాడు. ఆతని సమీపంలో
ఆమె వాహనమైన సింహం వుంటుంది దానినెక్కి లలితా పరమేశ్వరి భండాసుర
వధార్థం బయలుదేరింది. ఈ చక్రరథపర్వం యొక్క క్రిందిభాగంలో వేయిమంది
దేవతలు వారాహిని సేవిస్తూ ఆమెకాంతిని పొంది వుంటారు. ఆయుధాలు కూడ
అవే. అలంకారాలు కూడ అట్టివే. శాంతులు, వరాహముఖులు, చంద్రరేఖాభూషణలు
ఎప్పుడు నాగలి, రోకలి తిప్పుతూవుంటారు. లలితా,శ్యామా,స్వామినీ ద్రోహుల పొంగి
పొరలే రక్తాన్ని కపాలాలలో నింపుతుం టారు. రక్తంకారుతున్న ఆకపాలాలను
గుండెలపై అలంకరించుకుంటారు. నిజభక్తద్రోహుల ప్రేగుల మాలలు ధరిస్తారు.
తమసమయ వాక్కులను అధిక్షేపించేవారికీ రక్తస్రావ పాలమాలలను అలంకరించు
కుంటారు. వీరియొక్క దండినియొక్క నామాలను సహస్రనామాధ్యాయంలో చెబుతా
నయ్యా! ఆ వారాహుల సమీపంలో వారి వాహ నం నల్లలేడి దండిని అదుపులోవుంది.
దాని కొమ్ములు అరమైలుపొడవు. ముఖం పావుమైలు పాదాలు రెండుమైళ్లు కొలత
గలవి. ఎప్పుడు తోకపైకెత్తి వుంటుంది. కడుపుదైన తెల్లని చారవుంటుంది. పెద్దగా
హుంకారం చేస్తుంది. ఇది వాయుదేవునివాహనమైన లేడిని వెక్కిరిస్తున్నట్లుంటుంది.
అది ఆ పర్వం పక్కనేవుంటుంది. ఆ పర్వంలోనే మదిరాసముద్రం దేవతా రూపంతో
వుంటుంది. ఆమె కెంపుపర్వతంవంటి ఎర్రని మాంసపిండం చేతిలో ధరించి వుం
టుంది. కళ్లుతిప్పుతూ వుంటుంది. బంగరు పద్మమాలను ధరించివుం టుంది. ఎర్రని
కమలం ధరించిన 'మదశక్తి'చే గట్టిగా కౌగిలించుకొనబడి వుంటుంది. భండాసురుడు
యుద్ధానికివచ్చినపుడు యుద్ధంవల్ల చెమటపట్టిన స్త్రీశక్తులువాడి రక్తంతాగాలని
తహతహలాడుతూ వుంటారు అలా దాహం వేసినపుడల్లా కల్లుసముద్రం అనే దేవత
ఆ కల్లు రకరకాలుగా వారిమీద జల్లుతు వాళ్లదాహం క్షణంలో తీర్చివేస్తాడు. ఓ
అగస్త్యా! ఇది మహాఅద్భుతం ఇకనేను చెప్పబోయే యుద్ధ విశేషాలు ఆనందంగావిను.

ఆ చక్రరథంపైన కిందవున్న 'హేతుక' మొదలగు వారు పదిమంది. వారిని గూర్చి చెబుతావిను. వారు భైరవులు గొప్ప ప్రసిద్ధిపొందినవారు మహాబలపరాక్రమ సంపన్నులు పదివేల కిరణకాంతులు వెదజల్లే సూర్యుల వంటివారు. దండిని యొక్క ఆజ్ఞతో యుగాంతంలో ప్రపంచాన్ని నశింపజేస్తారు. పరమతీవ్ర స్వభావులు. తమపన్నులతో పెదవులను కరుస్తూవుంటారు. త్రిశూలంకొనలతో మేఘమండలాన్ని ఛేదించి, చిందరవందరగా దూదిపింజల్లా ఎగరగొట్టి ఛిన్నాభిన్నంచేసి పారేస్తారు. హేతుకుడు,త్రిపురారి, అగ్నిభైరవుడు, యమజిహ్వుడు, ఏకపాదుడు, కాలుడు, కరాళుడు, భీమరూపుడు, హాటకేశుడు, అచలుడు అనేవి వారిపేర్లు వీరిభటులు పదికోట్లమంది. ఈ స్త్రీపురుషదేవతలంతా మూడులోకాలను పవిత్రంచేస్తారు. వీరంతా రాక్షస సంహారం చేస్తారు. వారిరక్తంతాగుతారు. ఈగణములతో అనేక రక్షణలు గల కిరిచక్రరథాన్ని దండనాయిక నడిపించింది. ఈ మూడురథాలు నడుస్తుంటే మూడులోకాలు కదలుతున్నట్లున్నది. అక్కడ ఒక శుభ సూచన కనిపించింది. మేరు, మందర, వింధ్యపర్వత సమూహమట్లున్నది. శక్తిసేనా సమూహంలో గొప్పధ్వని సంభవించింది. ఆరథచక్రాలతో భూమికంపించి చీలికలయింది. లలితా చక్రరాజరథ శ్రేష్ఠంలో ఉద్దండపాశగ్రాహ పండితులు ఆరుగురున్నారు. వీరే సారథులు. లలితాదేవి, త్రిపురభైరవి, సంహారభైరవుడు, రక్తయోగినివల్లభుడు, సారసుడు, చాముండ అనేవి వారి పేర్లు. గేయచక్రరథానికి హసంతిక సారథి. కిరిచక్రరథానికి స్తంభిని సారథి. అగస్త్యా! లలితాదేవి రథం ఎత్తు **80**మైళ్లు, గేయచక్రరథం ఎత్తు **56**మైళ్లు, కిరిచక్రరథం ఎత్తు **48**మైళ్లు, లలితరథానికి **80**మైళ్ల విశాలంగల ముత్యాలగొడుగున్నది. అది శక్తిసామ్రాజ్య సూచకం. మిగిలిన రెండు రథాలకు సామాన్య ఛత్రాలున్నాయి. లలితాసర్వశక్తులకు మహేశ్వరి. మహా సామ్రాజ్య పదవినధిష్ఠించిన మహేశ్వరి. భండాసుర సంహారం కోసం యుద్ధరంగానికి కదిలింది. అపుడుదిక్కులు ధ్వనించాయి. భూమికంపించెనుప్రాణులు క్షోభను పొందె, దేవదుందుభులు మ్రోగసాగె, పూలవానలు కురిసె, విశ్వావసు మొ॥గంధర్వులు తుంబురనారదులు, సరస్వతి సారవంతం జయమంగళగీతాలు పాడారు. అందరి శరీరాలు పులకించినాయి. పదేపదే అందరు లలితను స్తుతించారు. మదోన్మత్తులై మరల మరల నాట్యాలు చేసారు. సప్తఋషులు మూడువేదాలు పఠించారు. అథర్వవేదమంత్రాలతో లలితావిజయలక్ష్మిని వర్ధిల్ల జేస్తుండిరి. హవిస్సుతో అగ్నిశిఖలను వృద్ధి చేసినట్లు మహదాశీర్వాచనాలతో లలితను ఆనందింపజేసారు. ఆ విధంగా లలితాపరమేశ్వరి విరాజిల్లుతున్నది. భండాసురుని జయించడానికి మహాసైన్యంతోబయలుదేరింది.

## భండాసుర అహంకారము

శ్రీ లలితా దండయాత్రాధ్వనులువిన్న ఆ పుర ప్రజలు హడలెత్తి పోయారు. దురాశాపరుడు, దుర్బుద్ధి అయిన భండాసురుని నగరం మహేంద్రగిరి సమీప సముద్రతీరంలో వుంది. దానిపేరు శూన్యకపురం, తన తమ్ముడు విషంగునితో



భండాసురుడు ఈ పురంలో వసిస్తున్నాడు. ఆ పురం **800** మైళ్ళ విస్తారం కలది. లలిత వచ్చిందేమోనని రాక్షసులు భయ సంభ్రమాలతో మతులు పోగొట్టుకున్నారు. ఉపద్రవ సూచకంగా అక్కడ పొగలువ్యాపించాయి. ఆ పట్టణంలో గోడలు బీటలు తీసినాయి. ఆకాశం నుండి ఉల్కలు రాలినాయి, భూకంపంవచ్చింది. భూమి మండి పోయింది. రాక్షసుల గుండెలు అదిరిపోయినాయి, భవనాలపైనున్న జెండాలపై వ్రాలి రాబందులు, గద్దలు, కొంగలు మొ॥ సూర్యుని చూస్తూ గట్టిగా కూస్తున్నాయి. మాంసాహారులైన పక్షులు ఎవరికీ కనిపించకుండానే కఠినపదజాలాలతో తరచు కూస్తున్నవి. అంతటను ఎగురుచున్న జెండాలు మాసినట్లు కనిపిస్తుండె, అది చూచిన రాక్షసులు హడలిపోయారు. రాక్షస కాంతాల అలంకారాలు జారిపడిపోయినాయి, వారు పెద్దగా ఏడిచేసారు. అద్దాలు,కవచాలు, ధ్వజాలు, ఖడ్గాలు, సంపదలు మణులు, వస్త్రాలు మురికి అంగళ్లు, సభలు,కోనేరులు, తలవాకిలి పక్కగదులు, సౌధాల కిటికీలు సైన్యాలు, సర్వరక్షణ గృహాలు,తూర్పు,దక్షిణ, ఉత్తరరాజగృహాలు, హడలెత్తిన అంతః పుర పంక్తులు, తూర్పువాకిలిగల రాజగృహాలు, అన్ని అంతఃభవనాలు, గోపురాలు, తలుపులు, కిటికీలు, గదులు, మొ॥ అన్నిచోట్ల నివసించిన వారంతా దెయ్యాల భయంకర వాక్యాలనువిన్నారు.పచ్చని దిక్కులు భయంకరములైన అనేకరంగులతో భయానకములయ్యెను, కాకులు అసహ్యంగా అరుస్తూ, సూర్యుని చూస్తున్నవి, కోటానుకోట్ల పుర్రెలు పెద్దధ్వని చేస్తూ ఆకాశం నుండి భూమిపై పడుతున్నవి. యజ్ఞవేదికలపై రక్తబిందువులు పడుతున్నవి. పొగచూరిన వెంట్రుకలు ఎగురుతుండె, భూర్భువస్సువర్లోకలు త్వాతాలని అందరు తెలుసుకున్నారు. చాలా బాధపడ్డారు. అవిభండాసురునకు చెప్పారు. వాడులెక్కపెట్టలేదు. ధైర్యంగావున్నాడు, మంత్రాలోచ నకై సింహాసనం అధిష్టించాడు. నవరత్నఖచిత రత్నసింహాసనం మేరుపర్వతంలా మెరిసిపోతున్నది. వాడికిరీట రత్నకాంతులు దిక్కులను మిరుమిట్లు గొల్పుతున్నవి.

ఆస్థానమండపం, 8మైళ్ల విశాలం, సోదరులు భండాసురుని సేవిస్తుం డిరి. విశుక్రుడు, విషంగుడు వాని సోదరులు, మహాబలపరాక్రమ సంప న్నులు,వాళ్ల భుజదండాలు ముల్లోకాలకు ముళ్లవలె నాటుకుని భయంకలి గిస్తూ వుంటాయి. వాళ్లు అన్నగారి ఆజ్ఞను, తు.చ. తప్పకుండా పాలిస్తారు. అన్నగారి త్రిలోక విజయ కీర్తినివారు వర్ధిల్లజేస్తారు. వారితలలు అన్నగారి పాదాలపై వుంచుతారు. అతనికి చేతులు జోడించి నేలపై కూర్చుంటారు. దేవశత్రు శ్రేష్ఠుడు భండాసురుడు ఆస్థానంలో వుండగా సామంతరాక్షస రాజులు అతనిని చూడ్డానికి వచ్చారు. వాళ్లకు లెక్కలేనంత సైన్యంవుంది. వారుతమపేర్లు చెబుతూ భండాసురునకు నమస్కరించారు. భండా సురుడు తన ధీరదృక్కులతో వారిని చూస్తూ గౌరవించాడు. క్షణం గడిచింది. ఇంతలో భండాసురుని తమ్ముడు విశుక్రుడు క్షోభించే సముద్రధ్వని గల వాక్కులను అన్నకు వినిపించాడు. ప్రభూ! నీవు పాపులు, పామరాచారులు, దుర్మార్గులు, నీచులు అయిన దేవతల బలపరాక్రమాలను ధ్వంసంచేసావు. వాళ్ళురక్షణ లేక ఏడుస్తున్నారు.

అగ్నిలోపడిచచ్చారు, ఆ అగ్నినుండి ఒకస్త్రీ జన్మించింది. ఆమెబలగర్విత, ఇంద్రాదులు ఆమెను పుట్టించారట, దేవతలచే ప్రోత్సహించ బడిన ఆ వనిత బహుపరాక్రమ స్త్రీపరివారసహిత. వాళ్లు చాలా ఆయుధాలు గలవారట, మనల్ని జయించడానికి వస్తున్నారట,అబలలు సబలులపై యుద్ధం ప్రకటించడమా? ఎంత హాస్యాస్పదం, విధి క్రూరమైనది కదా! చిగురాకుతో బండను బద్దలుగొట్టుటా? ఇది ఊహించడానికే పరిహాసాస్పదం కదా! మన వీరసేనానులకు కూడ భయం కలుగుతుందట. అది వెక్కిరించడం వంటిది కదా! ఎంతసిగ్గుచేటు, నా సైన్యానికి ఆయుధాలకు ఇంద్రాదులు భయపడ్డారు. బ్రహ్మఆశ్చర్యంతో విస్తుపోయినాడు. విష్ణువు సంగతి వేరే చెప్పనక్కర లేదు. శివుడుకూడ భీతిచెందాడు. దిక్పాలురుపారిపోయారు. శత్రువులకు కనపడ కుండానే మనబాణాలు వారి కవచాలను ఛేదించివేసినాయి. వారి కండకావరం నీరుగారిపోయింది, అట్టి మహాభుజ బలపరాక్రమ తేజంగల మనలను జయించ డానికి ఒకఆడది వస్తున్నది. ఆడది కదా మనం ఆమెను తక్కువగా లెక్కించరాదు. తమశక్తి బాగా తెలిసిన జయశీలురు అల్పుడైనను శత్రువును తక్కువగా భావించరాదు. అదినీతి, ఆమెను సాగనంపడానికి సేవకులను పంపాలి, లేదా ఆ మదవతిని జుట్టు పట్టి ఈడ్చుకురావలె, ఆ దుష్టురాలు మన అంతఃపురకాంతలకు అది సేవకురాలుగా వుంటుంది మనసైన్యంలో ఒక్కొక్కనివల్ల ముల్లోకాలు గడగడలాడతాయి. దానవరాజా! తదుపరి తమచిత్తం! అంటూ విశుక్రుడు అన్నగారికోపం అధికంచేసాడు.

తరువాత విషంగుడన్నాడు. వీడు మహాబలశాలి, వివేకి, సువిమర్శి అన్నగారితో అన్నాడిలా ఓశత్రుసంహారా! మీరు కార్యజ్ఞులు నీతిజ్ఞులు, మీకు తెలియనిదేమీ లేదు. బాగా ఆలోచించి చెయ్యాలి మనం. రాజనీతికి సమాలోచన చాలా ముఖ్యం సమాలోచనలేని కార్యం సర్వనాశనం అయిపోతుంది. తప్పక శత్రునగరానికి గూఢచారులను పంపాలి. జయంకోరేవాడు శత్రుబలాబలాలను అవశ్యం తెలుసు కోవాలి. రాజుకు చారులేకన్నులు. దృఢ ప్రజ్ఞాశాలి శంకలులేనట్లు కనపడాలి. కాని మనస్సులో ప్రతివానిని శంకించాలి. ఎవరిని నమ్మకూడదు. మంత్రులతో మాత్రమే రహస్యంగా మంత్రాలోచనచెయ్యాలి. ఆరుఉపాయాలు చక్కగా ప్రయోగించే వాడు సర్వత్ర పూజ్యపదంలో వుండి అఖండవిజయం పొందుతాడు. అనాలోచిత కార్యం చేసేవాడు అప్పుడే వినాశనం పొందుతాడు. విమర్శ చేయకుండా ఆచరించే (కార్యం వినాశనకారి అవుతుంది. మంచిచెడ్డలు విమర్శించి చేసే పనులు విశేష విజయాన్ని సమకూరుస్తాయి. మృగమని, స్త్రీఅని, అల్ప అని రాజులు శత్రువును తక్కువగా లెక్కించకూడదు. ప్రతిచోట శక్తివుంటుంది. స్తంభంలో మృగశరీరం ధరించి పుట్టిన మాయావి హిరణ్యకశ్యపుని చంపలేదా! చండికఅనే స్త్రీయుద్ధంలో మహిషా సురుని సంహరింపలేదా? అలాగే మాయగా నిశుంభ శుంభులను అంతం చేసింది కదా!అపుడే చాలామంది రాక్షసులు చంపబడ్డారు. అందువల్ల స్త్రీని తక్కువ చెయ్యడం తగదు. విజయలక్ష్మిఅంటే శక్తి అనిఅర్థం. స్త్రీ పుంలింగాల శక్తితో మనకు భయంలేదు.



సంసారమంతట శక్తివున్నది. ఇపుడు మనం దురాశాపరురాలైన ఆయుద్ధో న్మాదియైన అబల పూర్వాపరాలు తెలుసుకోవాలి. ఈమె ఎవరితాలూకు? తల్లి దండ్రులెవరు? ఆమె ఆచారం, ఆశ్రయం, బలం, సహాయం ఇవన్నీ తెలుసుకోవాలి ఆలోచించండి అని విషంగుడు చెప్పగా విని భండాసురు డన్నాడు.

సోదరా!విషంగా! ఓజస్తేతోద్యుతిధరులకు విచారణతో పనిలేదు. మన సైన్యంలో మహాబలంగల వందమంది అక్షౌహిణి సేనాధిపతులున్నారు. వారు సముద్రాలను తాగేస్తారు. స్వర్గాన్ని తగలబెట్టగలరు. నీసమాచారం దోషయుక్తం. ఆడదాన్ని అనుమానిస్తావా; అదంతా ఇప్పటికే గూఢచారులద్వారా నేను విన్నదేరా లలిత అనేది ఒక నాజూకుమనిషి. సుమృదు, త్రిలోకసుందరి, సుమసుకుమార! సార్థక నామధేయి. దానికి బలపరాక్రమాలులేవు. యుద్ధమంటే ఏమిటో తెలియదు. కార్యా కార్య విచారణలేనిది. కాని చాలా కార్యాలు చేస్తుంది. దానికి మాయలెక్కువ తెలుసు తన శరీరంనుండి బలహీనలను చాలామందిని పుట్టించింది. ఇంతమాత్రానికే దానికి జడవాలా? ఒకవేళ దానికి మహాబలం వుందనుకో! త్రిలోక భీకరపరాక్రమ శాలియగు భండాసురుని ఎవరు జయించగలరు? ఏనాడో నాభుజబల మర్దనంతో మూర్ఛలో మునిగిన దేవతలు నేటి వరకు ఊపిరి పీల్చుకోలేపోతున్నారు. కొందరు పాతాళంలో, పర్వతగుహల్లో, పొదరిళ్లలోదాక్కున్నారు. వాళ్లకు భార్యాబిడ్డల సంబంధం తెగి పోయింది. అధికారాలు, సంపదలు అంతరించిపోయినాయి. పశువేషాలతో పరిభ్ర మిస్తున్నారు. నా బాహుబలం లలితకు తెలీదు. అది మొన్నమొన్న పుట్టింది. మదంతో మత్తెక్కింది. మూర్ఖస్త్రీలు నిజం తెలుసుకోలేరు. పనికిమాలిన సాహసం చేస్తారు. కార్యాకార్యాలు తెలియరు. వినాశనం పొందుతారు. అది అలావుంచు.

ఆ స్త్రీని ముందుంచుకుని దేవతలు, నాగులు, సిద్ధసాధ్యులు, త్రిమూ ర్తులు, ఇంద్రాదిలోక పాలకులు యుద్ధానికివస్తే నేను వాళ్లను పిండిగుండ చేసిపారేస్తాను. నా సేనా నాయకులు యుద్ధోన్మాదులు. శత్రువులను పండు దోసకాయలను పిండినట్లు పిండివేస్తారు. సరదాకోసం కొన్నిపేర్లు చెబుతా. కుటిలాక్ష, కరంక, బలాహక, కర్కటక, మదన, కల్కివాహన, పుల్కస, జంబుకాక్ష, చతుర్బాహు, వజ్రఘోష, అంధక, యమాంతకం, పురజిత్, స్వర్గశత్రు, పురుషేణ, మలక, బభ్రువాహన, మహాదంష్ట్ర, దుర్వినీత, మహోత్కట మొ॥వారిని వందలాది వేలాదిమందిని చెప్పవచ్చు. అహ్హాహ్హా! వీళ్ళుహిరణ్యకశిపు సమానులు. ఇక నాపుత్రులు హిరణ్యాక్ష సములు. నామనవలు వందలాదిమంది వున్నారు. నా సేనానాయకులు మదించి వున్నారు. వారి వెనుక నా పుత్రులు శీఘ్రగాములు. యుద్ధంలో బాగారెచ్చి పోయిన దేవాధముల్ని వారు చంపివేస్తారు. వేయి అక్షౌహిణీపతులు కోపిస్తే దేవతలు బూడిదవుతారు. ఇక ఈ అమాయక ఆడదాని సంగతి!! దానియుద్ధ రంగంలో అన్నీ మాయావిలాసాలు, మాయావినోదాలు జరుగుతవి.మనసైన్యంకోపిస్తే ఆస్త్రీసైన్యం మాడిమసి అవుతుంది. విషంగా! అన అవసర అనుమానాలతో ఆలోచించి మనస్సు పాడుచేసుకోకు. అంటూ

భండాసురుడు సింహాసనం నుండిలేచాడు. మహాబలుడైన తన సేనాని కుటిలాక్షుడు నితో అన్నాడు. ఒరేయ్! లేవరా సైన్యం సిద్ధం చెయ్యరా! శూన్యకపుర ద్వారముల వద్ద సైన్యాన్ని గస్తీవుంచు. నూరువలలు పన్ను, మంత్రి, పురోహితులతో దుష్ట అభిచారహోమాలు చేయించు, శస్త్రాలు సిద్ధంచెయ్యి, ఇక యుద్ధమే. ఒక సేనాపతిని ఎల్లప్పుడు ముందునడిపించు వాడు సైన్యంతో అక్కడ భయంకరంగా వుండాలి. యుద్ధంలో హఠాత్తుగా సైన్యందాడి చెయ్యాలి. దేవబలంతో మదించిన ఆ మూర్ఖ రాలిని సిగలాగి పట్టుకో. అంటూ అంతఃపురానికి వెళ్ళాడు భండాసురుడు. మూడు వేల సైన్యానికి అధిపతియైన కుటిలాక్షుడు యుద్ధానికి బయలుదేరాడు. శ్రీదేవి యొక రణభేరీధ్వనులు రాక్షసులువిన్నారు. వాళ్లకు చెవుడు వచ్చేసింది.

## దుర్మద కురండ వధ

శ్రీ లలితాదేవి సేనాపటహధ్వనిపైకి వినిపించింది. రాక్షసయోధులు దుందుభి ధ్వనిచేసారు. ఆధ్వని దిక్కులను మర్దించేసింది.సముద్రమధ్యంలో అల్లకల్లోలం అయింది. లోకానికి చెవుడు వచ్చింది. ముల్లోకాలు కంపించి నాయి. రాక్షసుల పటాహధ్వని దిక్కులను మర్దించింది. పర్వత గుహలను పగుల గొట్టింది. ఆకాశ మంతట వ్యాపించింది. నరసింహుని హుంకార ధ్వనివలె అయింది. రాక్షసులపెద్ద డోలు ధ్వని వికృతంగా అయింది. కిలకిలా రావంచేసే కోట్లమంది రాక్షసులు కోపించి లలితపైకి యుద్ధ సన్నుద్ధు లయ్యారు. విచిత్ర రత్నకవచం కప్పుకున్న ఒక రాక్షసుడు రోహణాచలంలా వున్నాడు. ఇంకొకడు శస్త్రకారునిచే దాచబడిన, తెల్లని ఖడ్గం ఝాడించాడు. అది కాలరాత్రివలె భయంకిలిగించేది, మరొకడు చిగురాకు వంటి బల్లెం పైకెత్తి చూపిస్తూ గుర్రమెక్కి వీధులలో సంచారం చేసాడు. కొందరు వీరులు ఎత్తైన కవచాలున్న ఏనుగుల నెక్కారు. ఆ ఏనుగుల ప్రళయకాల వాయువులచే కదలించబడే పర్వతాలవలెనున్నవి, పట్టిస, ముద్గర, భుశుండి, కుఠార. త్రిశూల, ముసల, సర్పముఖ ఫణిదంత, పాశాయుధ, మొ. ఆయుధాలు ధరించిన కోట్లాది రాక్షసులు కవచధారులయ్యారు. అశ్వ, గజ, ఖర, ఉష్ట్ర, శునక, కాక, కంక, వ్యాఘ్ర, గృధ్ర, సింహ,శరభ, భేరుండ,వరాహ,సర్ప,శవ మొ॥ వాహనాలెక్కి లలితకు ఎదురుగా వెళ్లారు. కుటిలుడు దుర్మదుడనే సేనానాయకుని పది అక్షౌహిణుల సైన్యంతో లలిత పైకిపంపాడు. సమస్త ప్రపంచాన్నీ దహించడానికా అన్నట్లున్నవి, దుర్మదుడు పటహ ధనులు చేస్తుంటే పధ్నాలగులోకాలు పగులునా అన్నట్లున్నవి, భండా సురుని ఆజ్ఞతో కుటిలుడనే రాక్షసుడు శూన్యకపుర తూర్పుద్వార రక్షణకు పది అక్షౌహిణుల సైన్యంతో తాలజంఘుని పంపించాడు. దక్షిణద్వారానికి తాలభుజుని పది అక్షౌహిణులతో రక్షకునిగా వుంచాడు. పశ్చిమద్వారానికి పదిఅక్షౌహిణులతో తాలగ్రీవుని కాపుంచాడు. ఉత్తర ద్వారానికి పది అక్షౌహిణులతో మహాబలశాలియైన తాలగ్రీవుని నియమిం చాడు. శూన్యకపురంలో మద్దిచెట్లు వలయంలో వానర ముఖగృహాలకు మండలాకార రక్షణకు పదిఅక్షౌహిణులను కాపలావుంచాడు. మొత్తం 50 అక్షౌహిణుల సైన్యాన్ని



అలా నియమించిన కుటిలాక్షుడు ఆ సమాచారం భండాసురునకు అందించాడు. ప్రభూ! మీ ఆజ్ఞానుసారం నగర రక్షణకు సైన్యాన్ని నియమించా దుర్మదుని లలితతో యుద్ధం చెయ్యడానికిపంపా. మనసేవకుని చూడగానే ఆమె నిరాశచెందింది. అయినా గాని నగర రక్షణ రాజాచారం. అంటూ సెలవుగైకొన్న కుటిలాక్షుడు మహా గర్వంతో సేనాపతులను సైన్యాన్ని సిద్ధం చేసాడు. భండాసురుడు ముందుగా కుటి లాక్షుని ద్వారా లలితవద్దకు దూతను పంపాడు. వాడు పెద్దగాఅరుస్తూ ససైన్యుడై లలితా స్తైన్యాన్ని ఆవరించాడు. రాక్షసులు కిలకిలధ్వనులతో కత్తులు తిప్పుతూ శక్తిసైన్యంతో తలపడ్డారు. శక్తులు మహాఅట్టహాసంచేస్తూ, మెరిసే శస్త్రాలతోరాక్షసు లతో తలపడ్డారు. ఈయుద్ధంవల్ల ముల్లోకాలు శోభిల్లినై యుద్ధధూళి ఆకాశాన్ని కప్పివేసింది. రథంయొక్క వెన్నుకాడలలో, ఏనుగులకంఠాల్లో, గుర్రాలు విడిచే గాలుల్లో వ్యాపించి చెల్లాచెదురై ఆకాశాన్ని పొందినాయి. పదిఅక్షౌహిణుల సైన్యంతో తన మీదికి వచ్చే దుర్మదుని 'సంపత్కరీదేవి' చూచింది. వాడిని ఎదిరించింది. ఆమెతో సమానలైన శక్తులు ఎక్కిన గుర్రాలు, మదపు టేనుగులు, రాక్షససైన్యాన్ని మర్దించివేసె, దుమ్మురేగిపోయె, రక్తపుటేరులు ప్రవహించె, రాక్షసరథ పతాకులు చిరిగి, తెగిక్రింద పడ్డవి. గొడుగులు విరిగిపడి దొర్లిపోయె, సంధ్యాకాలంలో పడమటి అరుణరాగంలో చంద్రు డున్నట్లుగా ఆరక్తారుణభూమిలో ఆ గొడుగులు ఉపమించబడె. ప్రళయాగ్ని వలె శత్రుసైన్యాలను శక్తిసైన్యాలు ముట్టడించినాయి. మంటలుకక్కే శస్త్రాల అంచులు రాక్షసకంఠాలు నరికి నేలరాల్చినాయి. వాళ్ళతలలతో యుద్ధరంగం కిక్కిరిసిపోయింది. పెదవులు కొరికేవికొన్ని, కనుబొమలు ముడివేసినవి మరికొన్ని, కోపంతో ఎరుపెక్కినకళ్లు గలవి ఇంకాకొన్ని భయంకలిగిస్తున్నవి, కొందరు చావుదెబ్బలు తిని మూర్ఛపోయారు. కొందరు చెల్లాచెదురై పోయినారు. అందరినీ కూడగట్టుకొని ఓదార్చాడు దుర్మదుడు. ఒంటెనెక్కేడు, సంపత్కరిని ఎదరించాడు, ఒంటెను గట్టిగా కొట్టేడు, అది అమిత లాఘవం చూపింది. దానివెన్క దానిలా ఉన్నతులైన సైనికులు ఉరుకుతుండిరి. మేఘంవంటి దుర్మదుడు వర్షధారల్లా బాణాలు కురిపించాడు. వాటినుండీమెరుపులు ఉరుముల ధ్వనులు వెలువడె, భూమ్యాకాశాలు, సంపత్కరీ సైన్యము వాటిలో మునిపోయిరి. కదలలేకపోయె స్త్రీసైన్యం సంపత్కరి కళ్లు ఎర్రబడ్డవి. ఏనుగునెక్కి దుర్మదుని మీదికి దూసుకువెళ్లింది. ధనుస్సునారిని చెవివరకు లాగింది. ఆతల్లి కరకంకణాలు మంజులధ్వనులనీనినాయి. హస్తవేగం ధనస్సులో దర్శనీయ మయ్యె, బాణవేగం తెలియడంలేదు. అవి సూర్యకిరణా లతో సమానాలై ఆకాశానికెగిరి శత్రుమారణ కారణాలయ్యాయి ఆ యుద్ధం అద్భుతం. పరస్పర ప్రయోగ బాణాలు ఒరుసుకుని నిప్పులుకక్కినాయి. సూర్యునికిప్పవేసి చీకటిని గప్పివేసినవి.

ఇక రణకోలాహలం తన అవయవలాఘవం చూపక యుండలేకపోయె దాని వెనుకవి రెండుచాలాపెద్దవి, వాటితో చాలమందిని నొక్కి నొక్కి చంపింది. తొండం దెబ్బలతో కొందరిని, కాళ్ళతోతొక్కి, యింకొందరిని రోకళ్ళ వంటివై వాడిగానున్న

దంతాఘాతాలతో మరికొందరిని, తోకదెబ్బలతో, ఫేత్కారాలతో, శరీరమర్దనంతో, గోళ్లదెబ్బలతో అధికమద ప్రేరిత పృథుయోని ఘాతాలతో, ఇలా వివిధరీతుల నెందరినో పచ్చడిచేసి రుచికూడా చూచింది. నూతన చరిత్రను సృష్టించిందా సంపత్కరీ గజవాహనం. దుర్మదుదు కోపంతో రెచ్చిపోయినాడు సంపత్కరీ దేవి కిరీటాన్ని వాడి బాణంతో కొట్టి అందలి అమూల్యరత్నాన్ని అపహరించాడు. ఆమె సహనం కోల్పోయింది. బాణంతో వాడి గుండెపైకొట్టింది. వాడు ప్రాణాలు విడిచాడు. శక్తిసేనా నాయికలు కిలకిలా రావాలుచేసి మిగిలిన వాళ్లను చంపారు. చావగా మిగిలినవారు శక్తిబాణాలవల్ల చెల్లాచెదరై పరుగులంగించుకుని శూన్యకపురం చేరారు.

ఈ వృత్తాంతం విన్నాడు భండాసురుడు. ఉగ్రుడైపోయినాడు. భూ, బాహు యుద్ధాలకు సిద్ధమయ్యాడు. కత్తిచేతబట్టాడు, కుటిలాక్షునితో అన్నాడు. ఆ బుద్ధిహీన దుర్మదుని ఎలాచంపిందిరా, వాడు మహాబలశాలికదా! విధాత నిర్ణయం తిరుగు లేనిదిరా, దేవతలు, యక్షులు, నాగులు దుర్మదుని చంపలేక పోయినాసరే! ఒక్క అబల వాడిని చంపిందే. ఆహా! ఎంత విచిత్రం, ఆ దుర్మార్గులిని జయించి కొప్పుపట్టి ఈడ్చుకురావలె, సేనాపతి కురండుని పిలువమని ఆజ్ఞాపించగా కుటిలాక్షుడాపని క్షణంలో పూర్తిచేసాతడు. కురుండుడు వచ్చి స్వామికి నమస్కరించాడు, నీవు మాయా, చిత్రకూట, యుద్ధాల్లో నేర్పరివి, వెళ్ళి సైన్యాన్ని సిద్ధం చెయ్యిఅని వానికి ఆజ్ఞయిచ్చారు. చండపరా క్రముడు కురుండుడు యుద్ధానికి బయలుదేరాడు. ఇరవై అక్షౌహిణులసేన రథ,గజతురగ పదాతిదళాలతో నిండింది. కురండుడు దుర్మదుని అన్న. వాడు మహాభయంకరుడు, తమ్మునికైశోకించాడు. సంపత్కరిపై కోపించాడు. ధీరుడయ్యాడు, జవనాశ్వంఎక్కాడు. ధూళిరేపేడు, ఆకాశంనింపాడు, కొమ్ము ధనువు 'ఠం'మ్మనిపించాడు. బాణవర్షం కురిపించాడు. ఓసి పాపిష్ఠిదానా! నా తమ్ముని చంపి మదవతినని పరాక్రమినని మిడిసిపడి పోతుంటివే! నిన్ను యమపురికి పంపుతా నన్ను చూడు. నీకొత్తనెత్తురు వేడివేడిగా యుద్ధంలో సంచరించే పూతనలకు పానీయంగా అందిస్తా, నా తమ్ముని చంపిన పాపఫలం ఇక అనుభవిస్తావు నాభుజబలం చూడు అంటూ ఏనుగునెక్కి సంపత్కరీదేవిని భయపెడుతున్నాడు. సైన్యాన్ని రెచ్చగొట్టు తున్నాడు. గుర్రంఎక్కాడు, కురండుని సైన్యాన్ని మర్దించడానికి తన సైన్యాన్ని ప్రోత్సహించింది చండి, సంపత్కరి వద్దకు అశ్వారూఢగావచ్చిన ఆమెమహాప్రేమతో అంది. ఈ యుద్ధం నేనుచేస్తా, నాకు కీర్తిరావాలి, క్షణంఆగు. యుద్ధంలో వీడునాచేతిలోనే చస్తాడు, నువ్వు చంపలేవనికాదు, అనగానే సంపత్కరి చిరునవ్వు నవ్వింది. తనసైన్యాన్ని ఆగమంది, బాలసూర్యప్రభా భాసమానమైన స్త్రీ సైన్యం వాయువేగంతో ఎగిరే గుర్రాలెక్కారు. సముద్రతరంగాల్లాగా ఎగిరెగిరి వెడు తున్నవవి. వాటిదెక్కల గుర్తులు భూమిపై నాటుకుని చెరగకున్నవి. ముందుకాళ్లు పైకెత్తి ఎగిరేవి. రకరకాల నడకలుగలవి. గిట్టలుచప్పుళ్లు చేసేనైపుణ్యాల, దూరంగా, దగ్గరగా చుట్టివచ్చే నేర్పరి తనాలున్నవి ఇంకా అనేకరకాల హృదయాలుగల అశ్వహృద యాలు తెలిసిన స్త్రీశక్తులు



వాటిని నేర్పుగా నడిపిస్తుండిరి. కురండ ప్రేరితులైన రాక్షసులు మదించి యుద్ధం చేసారు. అపరాజితాశ్వాన్ని ఎక్కిన శక్తికురండకునిపైకి దూకింది. కదిలే జడతో సుందరమైనది ఆ మదవతి. శరత్కాలచంద్రకళవలె తెల్లని ప్రకాశం కలది. సంధ్యా కాలారుణ చంద్ర మండలోపమానసుందరముఖి. చిరునవ్వుతో నున్నట్లున్నది. రత్నాల ధనువునుచేత ధరించింది. బాణవర్షం వానిపైకురిపించింది. ఆ బంగరు బాణాలు దశదిశల కమ్ముకున్నాయి. దుర్మదుని అన్నయైన కురండుడు కోపించి బహుబల విక్రముడై శరీరాంగము అనే తన ధనువునుండి చండికపై బాణవర్షం కురిపించాడు. ఆమెఎక్కిన గుర్రం తనగిట్టలతో శత్రువులను మట్టుపెడుతున్నది. దాని సకిలింపు ప్రళయ సమయ సముద్రధ్వనివలెనై, అదివిన్న రాక్షససైన్యాన్ని మూర్ఛితులను చేసింది. దివ్యపాశాయుధాన్ని వదిలింది. అందుండి కోట్లకొలది సర్పాలవంటి భయంకర పాశాయుధాలు వెడలి రాక్షససైన్యాన్ని కట్టిపడవేసినాయి. వాళ్లు మూర్ఛలో మునిగారు. అదిచూచిన కురండుకుడు కోపంతో మండిపడ్డాడు. ఒకబాణంతో అశ్వారూఢ వింటి నారిని తెగ్గొట్టాడు. ఆమె వాడిపైకి అంకుశం విసిరింది. అది మంటలు విరజిమ్ముతూ వాడివేడిరక్తం పానం చేసింది. వజ్రందెబ్బకు నేలపైపడిన వృక్షంలా కురండకుడునేలపై పడి ప్రాణాలు విడిచాడు. ఆ అంకుశంనుండి క్షణంలో కొందరు పూతనలు పుట్టి పాశములనుండి తప్పించుకున్న సైన్యాన్ని కరకర నమలిమింగి మాయ మయ్యారు. చావగా మిగిలినవారు పారిపోయారు. భండాసురుడీ గాథవిని మండిపడ్డాడు.

## కరంక మొ॥ పంచసేనాపతుల వధ

అశ్వారూఢశక్తి కురండుని చంపిందని భండాసురుడువిని ఆమెతో యుద్ధంచేయ గోరి కుటిలాక్షునితో అన్నాడు. కలలో కూడా ఇలాజరగదు. లోగడ ఎవరూ ఇది వినలేదు. మనస్సులోకూడ నేను శంకించలేదు. ఇంత కష్టం వచ్చిపడింది. కురండ దుర్మదులు మహాబలవంతులు. నాహితులు ఇద్దరు చనిపోయినారు. నీచదాని, మాయాచతురి! ఆదేవి ప్రభావం చాలాగొప్పది. యుద్ధవిశారదులు, శూరులు, శరీరాపేక్షలేనివారు అయిన కరంకుడు మొ॥ ఐదుగురు సేనానులను నూరు అక్షౌహిణులసైన్యంతో యుద్ధానికి పంపమన్నాడు కుటిలాక్షుని కబురువిని వారువచ్చి స్వామికి నమస్కరించారు. కుటిలాక్షుడు వారికి ఆజ్ఞఇచ్చాడు. అగ్నిలో ప్రవేశించే మిడతల్లా వారు శూన్యకపురం నుండి బయలుదేరారు. దిగ్గజాల చెవులు బద్దలయేలా! రణభేరీమోగించారు. సముద్రతరంగాలవలె గుర్రాలు, ఏనుగులు కదలి నాయి. గుర్రాల సకిలింపులు, ఏనుగుల ఘీంకారాలు సైనికుల జయజయ ధ్వానాలతో రథ చక్రాల సింహగర్జనలు కలిసిపోయాయి భయోత్పాతం అయి పోయింది. రథచక్రాలు భూమినితవ్వి దుమ్మురేపి సూర్యునికప్పి వేసినాయి. సైనికులు ఆధూళిలో మునిగి పోయారు. మత్స్య, సర్పచిహ్నాలుగల రాక్షసరథ ధ్వజాలు ధూళిలోకదులుతూ సముద్రం లాగా వెలుగొందిదాదృశ్యం. లలితాసైన్యం మీదికి వెళ్లే రాక్షసులను చూస్తూ దేవతలు భయపడ్డారు. కరంకుడు మొ॥ సేనానులు సర్పిణి అనే మహామాయను సృష్టించారు.

దానిని లలితాసైన్యం మీదికి పంపించారు. అది మహాసముద్రవంటి ఉదరం కలిగి వుంది. స్త్రీశక్తులుభయపడేలా ముందుకు కదులుతున్నది. నాగమాత రెండవరూపమా అన్నట్లు సర్పాలంకారాలు కలిగివుంది. దాని శరీరంనుండి అనేక సర్పాలు బయటకు వస్తున్నవి. భూమిపై వంకరగా పాకుతున్నది. తరువాత మైమరచి ఉభయపక్షాలు దొమ్మియుద్ధానికి సిద్ధమైనవి. వారు విడిచిన శస్త్రాలుండొకటి తాకి నిప్పులురాలుస్తున్నవి. వాటి మాటలు దిక్కుల కొనలకు ఎగబాకుచున్నవి. రక్తపుటేరులలో ఏనుగులు కొట్టుకుపోతుండె, మాంసపు బురదలో రథాలు కూరుకుపోయి కదలకున్నవి. చచ్చినరాక్షస శిరోజాలు నాచువలెనయ్యె. నిష్ఠురయోధ సింహనాదాలు భయదాలు. ధూళివల్ల అంధకారం ఆక్రమించింది. అస్త్రభిన్నాలైన రాక్షసకంఠాలు రక్తధారలను ఎగజిమ్మినాయి.

కరంకుడు మొ॥ సేనానులు సర్పిణిని ప్రేరేపించారు. దాని శరీరంనుండి అనేక సర్పాలు పుట్టినాయి. తక్షక, కర్కోటక, వాసుకి మొ॥ వారి కాంతిగలవి అది. చిత్రవిచిత్ర దేహకాంతులు, భయంకరదృష్టులు కలవి. విషజ్వాలలచే ముల్లోకాలను కాల్చేవిగావున్నవి. దారద, వత్సనాభ, కాలకూట, సౌరాష్ట్ర, బ్రహ్మపుత్ర, ప్రతిపన్న, శాక్తికేయ అనేపేర్లతో భయంకరములు. తమ ద్విజిహ్వలతో విషాగ్నులను శత్రు సైన్యంపై వెదజల్లుతుండె, ధూమ్రవర్ణంగల రెండు తలల సర్పాలు మహాభయంకరాలు. అవి సర్పిణి కన్నులనుండి పుట్టి కోపంతో మండిపోతుంటాయి. పచ్చని రంగులు, మూడుతలలుగలిగి కోరలతో వికటముఖాలుగల సర్పాలు సర్పిణి చెవుల నుండి కోట్లాదిపుట్టినవి. ముందు, వెనకపడగ, ముఖముగలిగి నల్లనిశరీరంతో ఆస్వాదము లనే సర్పాలు సర్పిణిపడగనుండి పుట్టి, కొన్ని చిత్ర వర్ణాలు, నాలుగుముఖాలు, నాలుగు పాదాలుగలవి, భయంకరకాంతి గలవి సర్పిణిముక్కు కన్నాలనుండి పుట్టేయి. సర్పిణివ్రేలాడే పెద్దచర్మంచే చుట్టబడిన స్తనాలనుండి, నాభినుండి ఎర్రనివి, హాలా హలం ధరించినవి అగు సర్పరాజాలు పుట్టినాయి అవిశక్తి సేనలో ప్రవేశించాయి. వారిని కరుస్తున్నాయి, విషాగ్నులతో దహిస్తున్నాయి. పడగల పాశాలతో బంధిస్తున్నవి. చంపుతున్నవికూడ, లలితాసైన్యం వాక్యులంచెందింది. శక్తిసైన్యాలు కోట్లకొలది శస్త్రాలతో వాటిని ఖండిస్తున్నవి. అయినా అవిగుంపులు గుంపులుగా పాకుతూ పెరిగిపోతూ, చస్తూ, పుడుతూ ఒకసర్పంచస్తే అనేకంపుడుతూ భయదాలవుతున్నవి. దీనికి మూలకారణం మూలంచావక పోవడమే. అదేసర్పిణి. అదిచస్తే ఇక కథే లేదు. శక్తిసైన్యాల శరీరాలు విషాగ్నులతోదగ్ధం అవుతుంటే భరించలేక యుద్ధం మాని పారిపోయినాయి. అదిచూచిన కరంకుడు మొ॥ ఐదుగురు సేనానులు తమ బలపరాక్రమ ప్రదర్శనబహుముఖంచేసారు.

కరీంద్రి అనేవాడు నూరుగాడిదలులాగే రథంఎక్కేడు. పదునైనచక్రంతో శక్తి సైన్యాన్ని మర్దించాడు. వజ్రదంతుడనేవాడు ఒంటెనెక్కి యుద్ధంచేసేడు. వజ్రం వంటి తనబణం దెబ్బలతో వారిని బాధించాడు. వజ్రముఖుడు రథమెక్కి బల్లెపుదెబ్బలతో



పీడించాడు. వజ్రదంతుడు రెండుగద్దలు లాగే రథం ఎక్కి బాణఘాతాలతో నొప్పించాడు. వీళ్ళప్రోద్భలంతో నూరు అక్షౌహిణులసైన్యం మూకుమ్మడిగా శక్తిసైన్యాన్ని ముట్టడించింది. సర్పిణిమాటి మాటికికోట్లకొలది సర్పాలను సృష్టించింది. గరుత్మంతునిపైనున్న నకులాదేవి వికలత్వం చెంది రోషంతో పెచ్చరిల్లి యుద్ధరంగంలో దూకింది. ఆమె కాల్చిన బంగారురంగులోవుంది. లలితాదేవి దవడలనుండి పుట్టింది. దంతాలు వజ్రమయాయి. వాక్కుల స్వరూపం, తనసైన్యాన్ని సర్పిణికి ఎదు రుగా నడిపించింది. గరుత్మంతునిపై ఆమెకూర్చున్నది. గరుడుని రెక్కల గాలికి పర్వతాలు కదలిపోతున్నవి. నడుస్తున్నమేరుపర్వతం లావున్నాడాయన. నకులి సర్పిణి శరీరం నుండి పుట్టిన భయంకర సర్పాలనుచూచి కోపంతో చూచినోరుతెరిచింది. ఆమె దంతాలు**32**, మహావాడికలవి. ఆ దంతాలనుండి **32** కోట్ల ముంగిసలు పుట్టినవి.అవి విజృంభించాయి. తమకోరలతో ఆసర్పాలను ముక్కలుచేస్తున్నవి. వాటి చెవులు నిక్కబొడుచు కున్నవి. వెంట్రుకలులేచి నిలుచున్నవి. కొంతవుబ్బి పెద్దగా కనిపిస్తున్నవి. పాములు ముక్కలు ముక్కలైనవి. పాముపడగల నుండి కారుచున్న రక్తాలతో ముంగిసల పెదవుల చివరలు ఎర్రనయ్యె. చిగురుటాకులవంటి పెదవులు నాకుతూ యుద్ధ రంగంలోకిదూనయ్యవి. సర్పాలశరీరాలు మరణ వికార చేష్టలతో నిండిపోయినై. ముంగిసలనుచుట్టబెడుతూ వాటి దంష్ట్రాఘాతాలకు ముక్కలైన పడగులు గలవయ్యెనవి. వాటినుండి చెదరిపడే మణులతో యుద్ధరంఘం వెలిగిపోయె. ఈదృశ్యం చూచిన సర్పిణి కోపించింది. నకులేశ్వరి దాన్ని చూచింది. దానితో ఘోరయుద్ధం చేసింది. మహాక్రూరమైన గరుడాస్త్రం దానిపై ప్రయోగించింది. ఆ అస్త్రం నుండి మంటలురేగినాయి. దశదిశలు కాల్చివేసినాయి. సర్పిణి శరీరంలో ప్రవేశించినాయి. దాని మాయను హరించివేసినాయి, సర్పిణి సర్వనాశనం అయింది. అది చూచిన పంచసే నానులు కోపంతో రగిలిపోయినారు. హఠాత్తుగా శస్త్ర సమూహాలను నకులిపై గుమ్మరించారు. నకులి ఒక్కతెయే వారితో యుద్ధం చేసింది. అడ్డకత్తులు, రోకళ్లు, గుదియలతో వాళ్లను చావమోది యుద్ధంచేసింది. వజ్రతుల్య దంతాఘాతాలతో ముంగిసలు వాళ్లమర్మస్థానాలలో కరచినవి. రాక్షసకింకరుల హాహాకారాలు ఆకాశాన్నంటినవి. కొన్నిముంగిసలు ఆకాశానికి కెగిరి ఛీత్కారాలుచేసినాయి. మరికొన్ని రాక్షససైన్యాల్ని కరిచినాయి. ఇంకొన్ని కొందరి చెవులను కరిచినాయి. శిరస్సులు, వీపులు మొ॥ దొరికినచోటల్లా కసితీర కరిచినాయి. వికారచేష్టలు చేసినాయి. వారి కవచాలను చింపి ముక్కలుచేసినాయి, వారు భయంతో శస్త్రాలు జారవిడిచారు. కొన్నిసర్పాల తెరిచిన ముఖాలను, పడగలను పట్టిలాగి వాటి నాలుకలను కరిచినాయి, రాక్షసుల చెవులలో కొన్నిదూరినాయి, సూక్ష్మరూపా లతో వారి ముక్కులలో దూరి కరిచి బాధించినాయి, ఈదృశ్యం చూచాడు కరంకుడు. మిగిలిన నాయకులను రెచ్చగొట్టాడు. వారందరు వాడిబాణాలు ప్రయోగించారు. అవి ముంగిసల దంతాలను తాకి ఒరిపిడికలిగించినై. నూరు బాణపుదెబ్బలు

తిన్నముంగిసల దంతాల నుండి మంటలు రేగినాయి, కోట్లబాణపు దెబ్బలుతిన్న ముంగిసలు నకులేశ్వరి చుట్టుచేరిపోయినాయి, నకులేశ్వరి వాటికి అభయం ఇచ్చింది. అక్షీణనకులం అనే మహాఅస్త్ర ప్రయోగం చేసింది. శారంగం అనే ధనువు నుండి ఆ అస్త్రం బయలుదేరింది. దానికి అనేక ముఖాలు, మంటలు కక్కుతున్నది. దానినుండి కోట్లకొలది ముంగిసలు పుట్టినవి. వాటి శరీరం, వెంట్రుకలు వజ్రమయాలు. వజ్రదంష్ట్రలవి. అతివేగం గలవి, వజ్రపు వల వలె భయదములు, వజ్రాకారనఖాలతో వేగంగా భూమిని చీలుస్తున్నవి. వజ్రరత్న కాంతుల కన్నులతో వెలిగిపోతున్నవి. వజ్రాలవలె మీదపడు తున్నవి. ముక్కులతో ఛీత్కారాలుచేస్తున్నవి. కోట్లాది దంతాలతో సైన్యాన్ని మర్దించినై. పరమపవిత్రమైన అవి బహువిధ పరాక్రమ ప్రకటితలైనవి. రాక్షసుల అవయవాలు ఖండించబడినై. నూరు అక్షౌహిణుల సైన్యం సర్వనాశనం అయినది. పంచసేనానులేమిగిలేరు. అతి రోషం అధికభయం, ఆక్రోశంతో యుద్ధంచేసారు, నకులేశ్వరి పట్టిసం అనే ఆయు ధాన్ని ప్రయో గించింది. ఒకనిచేయి, ఇంకొకని తలనేలరాలినవి. గరుత్మంతుడు ఎగిరెగిరి కాకవాసితుడు మొ॥నలుగురు శత్రువుల శిరస్సులను నరికివేసాడు. శ్యామ లాంబిక నకులియొక్క యుద్ధనైపుణ్యంచూచి ఆమెను బహువిధాల బహు మానిం చింది. తన అంగదేవతగా ఆమెను నియమించుకొన్నది. చావగా మిగిలినవారు ప్రాణభయంతో నకులీదేవిని శరణుజొచ్చిరి. అమ్మవారిని దయతో చూచింది. భయపడకండి అంటూ నవ్వింది. వెళ్లి ఈవిశేషాలు మీ రాజుకు చెప్పండి, అనివారిన పంపించింది. వాళ్లు యుద్ధ భూమిని చూచారు. హమ్మయ్య ! బతికిబట్ట కట్టేం అనుకొంటు సంతోషించారు. మళ్లీ భయపడుతూ శూన్యకనగరానికి పరుగెత్తారు. చావుకబురు చల్లగా ప్రభువుచే వినవేసారు. అదివిన్న భండాసురుడు కోపంతో భయంకరుడయ్యాడు.

## బలాహకాది సప్త సేనాపతి వధ

భండాసురుని మనస్సు అతలాకుతలం అయ్యింది. యుద్ధానికి పోవా లనుకున్నాడు. సేనాపతి 'కుజలాశు'నితో అన్నాడు. సేనానీ! నీవు భద్రుడవు. మనకు అభద్రం వచ్చిపడింది. మహాభుజ పలరాక్రమ సంపన్నులైన కరం కాదిపంచ సేనానులు పంచత్వం పొందారు. సర్పిణి మాయ సంపూర్ణంగా నశించింది. ఇక బలాహకాది సప్తసేనానులను యుద్ధానికి పంపాలి. వారు బహు భుజబలశాలురు. యుద్ధశీలురు, మూడువందల అక్షౌహిణీ సైన్యాన్ని తోడిచ్చి వారిని యుద్ధానికి పంపు. మాయా యుద్ధమహానిపుణులైనవారు లలిత సైన్యాన్నిలయం చేసి నావద్దకు వస్తారు. వీరితల్లి ఎముకలరాక్షసియైన కీకస. ప్రచండ పరాక్రములైన ఈ ఏకోదరులు సర్వదా విజయులే. తప్పక ఈ యుద్ధలోవారికి విజయం లభిస్తుంది. అంటూ భండాసురుడు చెప్పగావిని కుటిలాక్షుడైన కుజలాశుడు వారిని స్వామి సన్నిధికి రప్పించాడు. వారి పేర్లువిను: బలాహకుడు, సూచీముఖుడు, ఫాలముఖుడు, వికర్ణుడు, వికటా ననుడు, కలాలాయువు, కరటకుడు, అనబడే ఈఏడుగురు భండా సురునకు నమస్కరించి



యుద్ధోత్సాహులై ఉప్పొంగి పోయినారు. పరస్పర రక్షణ, సహాయం వీరి ఐకమత్య లక్షణాలు. మూడువందల అక్షౌహిణీసైన్యంతో యుద్ధానికి బయలు దేరారు. వారిజెండాలు ఆకాశాన్ని అంటుతున్నవి. భూమికుంగిపోయేలా నడుస్తుండిరి. సముద్రాలను తాగేసేలా వున్నారు. భేరీ,పణవ, ఆ నకధ్వనులతో ప్రపంచాన్ని మారు మోగిస్తున్నారు. మొత్తం ప్రపంచం వీళ్లు, వీళ్లసైన్యంతో నిండిపోయినట్లున్నది. కోపంతో ఎరు పెక్కి సూర్యునిలా మండిపోతుండిరి. సూర్యకిరణాలవంటి శస్త్రాలు ధరించారు. వారి శరీరరోమజాలం నిక్కబొడుచుకొనియున్నవి. వీరు వృద్ధతులు పూర్వం విశ్వ విజయకాంక్షులై భండాసురునితో వెళ్లినవారు వీళ్లు ఏడులోకాలను జయించేరనే అనాలోచితబుద్ధితో భండాసురునితో వెళ్ళినారు. వీళ్లు ఏడులోకాలను జయించేరనే అనాలోచిత బుద్ధితో భండాసురుడు వీళ్లను లలితాదేవి సైన్యంమాదిరి పంపేడు. వాళ్లుగొడుగులు చేతబట్టి యుద్ధరంగంలో దూకుతూ శత్రుసైన్యానికి ఎదురుగా పరుగెత్తారు. పదే పదే కిలకిల ధ్వనులు చేస్తూ పదిదిక్కులను మారుమోగిస్తు దేవీసైన్యం మీదికి దండెత్తారు. లలితాదేవి సైన్యం కూడశస్త్రాలు ధరించి భయంకర యుద్ధానికి సన్నద్ధ మయింది.

వారు నిష్ఠూరంగాచూస్తుంటే కనుబొమ్మలు వంకరలై ముడుచుకొన్నవి. అగస్త్యా! వారి ఆయుధాలపేర్లు చెబుతా వినవయ్యా! పాశాలు,రోకళ్లు, చక్రాలు,ముద్గరాలు, పట్టిసాలు, విల్లులు వారు ధరించారు. తీవ్రస్వభావ లైన ఆశక్తులు హఠాత్తుగా రాక్షససైన్యంపైకి వెళ్లారు. ఆ రాక్షస సముద్రాన్ని తాగేసేలా వున్నారువారు. వాళ్లను చూచిన దుష్టదానవులంటున్నారు. దుష్టలారా! పాపిష్ఠలారా! నీచలారా! మాయా మోహినులారా! మాబాణాలను చూడండి. ఇవి బుసకొట్టే సర్పాలు ఇవి మిమ్మల్ని ఇపుడే యమసదనానికి పంపగలవు. అంటూ శక్తిసైన్యాన్ని భయపెడుతుతూ యుద్ధం చేస్తున్నారు రాక్షసులు. ఒకశక్తి పట్టిన ఆయుధంతో రాక్షసాధిపతి కంఠం తెగనరికింది. వాని కంఠం నుండి రక్తం ఎగజిమ్మింది. అక్కడ గద్దలు గుమిగూడినై. అవియ మునిగొడుగులాగు నున్నవి.వేరొక శక్తి రక్తాయుధంతో తనపైకి వచ్చే రాక్షసునితలను, ఆశక్తిని తన బాణంతో నరికివేసింది. మరియొక శక్తి ఏనుగునెక్కి ఒకరాక్షసుని గుండెలో ఆ ఏనుగుదంతం గుచ్చుకొనేలాచేసి మహానైపుణ్యంతో వానిని చంపింది. ఒకానొక శక్తి శత్రుభటులెక్కిన ఏనుగు కుంభస్థలంపైకొట్టి దానిని అపుడే చంపివేసింది. ఒకరాక్షసుని ధనువును తన బాణంతో కొట్టిముక్కలు చేసిన ఒకశక్తి తన కనుబొమ లుగా పోల్చే లాగునచేసింది. మరొకశక్తి తనవాడి బాణాలతో విరోధిని చంపి, కత్తిచేత బట్టి తనశరీరం గగుర్పాటు చెందగా పులకాంకురాలతో పులకరించి పోయింది. ఒకఆమె తన ముద్గర ఆయుధపు దెబ్బలతో విరోధులను తునా తునకలుచేసి రధచక్రాలు వంటి పిరుదులు తుళ్లిపడగా మైమరచిపోయింది. ఒక ఆమె తనశక్తితో శత్రురధంయొక్క నొగనుఖండించి తన సంతోషాన్ని భూమిపై విస్తరింపజేసింది. రాక్షస, శక్తిసైన్యాలు పరస్పరం కలిసిపోయినై. పాలునీళ్లవలె అవి

కలిసి అభేదాలంకారమైనది. శక్తుల కత్తిదెబ్బలకు రాక్షసుల ఏనుగుల తొండాలుతెగి, దంతాలువిరిగి యుద్ధరంగం అంతట చెల్లాచెదురుగాపడినవి. ఆ ఏనుగులు మదించిన అడవిపందుల వలె కనబడుచున్నవి. ఇది భయంకరతీవ్రయుద్ధం. దీని అంతు తెలియకపిరికివాళ్లు హడలెత్తిపోతుండిరి. రణోన్మాదియై నబలాహకుడు సంహారగుప్తం అనేపెద్ద గద్దనెక్కి వివిధ రీతుల యుద్ధంచేసాడు. ఆ గద్ద ముక్కుగోళ్లు వజ్రసమాలు. అదియమదండం వంటిది. దాని పిక్కల్లో భయం కర పరాక్రమం వున్నది. ముందుభాగంపైకిలేచి, పొగరంగు కలిగివున్నది. దానిరెక్కల తాకిడి మహా భయంకరం. భయంకరశబ్దాలతో దానిరెక్కలు మైలుదూరం వ్యాపించివుంటై. దానినెక్కి బలహాకుడు అనేకరకాల యుద్ధాలు చేసాడు. నిప్పులుకురిసే నోరుతెరచి శక్తిసేనను అది కరకర నమిలేసింది. దానికన్నులు మహాక్రూరాలు, దాని వీపుపైనున్న బలాహ కుడు శరీరం జలజల్లాచేస్తురెక్కల పర్వతంపై మేఘంలా వున్నాడు. సూచీముఖుడనే రాక్షసరాజు సూదియాకులు, రెక్కలుగల కాకినెక్కేడు. కఠిన సమరంచేసాడు. ఆకాకి మదించిన పర్వతశిఖరంలా వుంది. దానిముక్కుదండం వంటిది. దానిపిక్కలు యమ దండంలాగున మహాభయదాలు. అది పుష్కలా వర్తకమహా మేఘంవలె నుండె. శరీరకాంతి బురదలానున్నది. దానిరెక్కలు 2 మైళ్లదూరం గలవి. దాని అరుపు మహాకటువు. అది దానియినప ముక్కుతో శక్తిసైన్యాన్ని గుచ్చిగుచ్చి ఏడిపిస్తున్నది.

తరువాత ఫాలముఖుడనే సేనాని నాగలి కర్రవంటి తన ఆయుధాన్ని ధరించి రాబందునెక్కి యుద్ధంలో వెలిగిపోయినాడు. మహాబలుడైన వికర్ణు డనే సేనాని గండభేరుండపక్షినెక్కి భయంకరయుద్ధం చేసాడు. పట్టిశం అనే ఆయుధం ధరించిన వికటాననుడు పెద్దకోడిపై యెక్కి కదిలాడు. ఆ కోడి యీకలు నిక్కబెట్టింది. దాని కన్నులు మండుతున్నవి, అదిశక్తి సైన్యాన్ని చూస్తూ వారి కెదురుగా వెళ్లింది. ఆరవ సేనాపతి కరాలాక్షుడు చాలా గొప్పవాడు వజ్రోపమకంఠస్వనియై ప్రేతవాహనంయెక్కి కదిలాడు. వాడు శ్మశానమంత్రసిద్ధులు పొందిన శూరుడు. పూర్వం వీడు భూతంతో కూడిన ప్రేతాన్ని వశంచేసుకున్నాడు. ఆ ప్రేతం ముఖం వాల్చివుంటుంది. పొడవైన చేతులుగలది. పాదాలు చాచివుంటుంది. ఏడవ సేనాని కరటకుడు. వీడిది భేతాళ వాహనం ఆ భేతాళుడు 8మైళ్ల విశాలశరీరి. కళ్లు క్రూరాలు. యజమాని తన మంత్రశక్తితో వీనిని ఆజ్ఞాపించాడు.శక్తిసేనను వీళ్లిద్దరు మర్దిస్తున్నారు. రకరకాల యుద్ధాలు వీరుచేసారు. సప్తసముద్రాల్లా వున్నారీ నాయకులు. శక్తిసైన్యం తల్లడిల్లి పోయింది. పూర్వం వీళ్లు ఘోరతపస్సు చేసి సూర్యభగవానుని మెప్పించారు. ఆయన ప్రత్యక్షమై నాయనలారా! మీతపస్సుకు మెచ్చాను. వరం అడగండి అన్నాడు. వాళ్లన్నారప్పుడు, స్వామీ! సూర్యనారాయణ స్వామీ! యుద్ధంలో మాశత్రువులను దహించే నీవు మాకళ్లతో, కడుపులో వుండాలి అపుడు మేము చూచినదంతా బూడిదై పోవాలి. శత్రుసైన్యం నిశ్చేష్టలైవుండాలి. అపుడు మేము వారిని సులభంగా చంప గలుగుతాం. అనగానే భాస్కరుడు తథాస్తుఅన్నాడు.ఆ వరబలంతో వారు మదించి



పోయారు. తమ కన్నులతో శక్తిసైన్యాన్ని చూచారు. వారు స్తబ్ధులైపోయినారు. వారి శస్త్రాలు పనిచెయ్యడంలేదు. బుసకొడుతూ నిలిచిపోయిరి. ఇదే అదను అని సైన్యాన్ని పురికొల్పేరు సేనానులు. వారు శక్తి సైన్యాన్ని అస్త్రశస్త్రాలతో నొప్పించి వారి వజ్ర కవచాలను భేదించారు. వారి శరీరాలు రక్తపుష్పాలంకృతాలైనట్లుగా శస్త్రగాయాలతో విలసిల్లినై. హాహాకారాలు చేస్తూ లలితాదేవిని చేరుకున్నారు వారు. దేవి ఆజ్ఞతో లలితకు అంగరక్షిణియైన తిరస్కరిణి కాదేవి యుద్ధానికి సిద్ధమయింది. అన్నివైపుల ముఖాలుగల తమోలిప్తం అనే విమానం ఎక్కింది. శక్తులకు అభయం ఇచ్చింది. ఆమె ఆకారం నెమలి కంఠం రంగు, అదే రంగు గల కవచం ధరించింది ఆమె. చీకటివలెనున్న నల్లని గుర్రం ఎక్కింది. ధనువును చేతబట్టింది, దానిపేరు వాసంతీ మోహనం నారిమోగించి సింహనాదం చేసింది. సర్పాలవంటి బాణాలు వర్షం కురిపించింది. అవినల్లతాచుల వలెనున్నవి. కింద రోకలివలెనున్నవి. రాక్షసులు వాటిదెబ్బలను సహించ లేకుండిరి. మిక్కిలి ప్రకోపించిరి. అమ్మ ఆజ్ఞాపించింది. తిరస్కరిణి అంధం అనే మహాఅస్త్రాన్ని శత్రుసైన్యం మీదికి వదిలింది. బలాహకుడు, మొ. సైనికుల కళ్లలో చీకటి కప్పబడింది. వాళ్లు గుడ్డివాళ్లయ్యారు. కళ్లు పోట్లు, మంటలు, వాళ్ల శస్త్రప్రయోగం ఆగిపోయింది. శక్తులు సింహనాదాలు చేసారు. తిరస్కరిణి దేవిని ముందుంచుకుని యుద్ధానికి సిద్ధమయ్యారు. మహాబలిష్ఠా ! తిరస్కరిణికాంబా! జయహో! బలేబాగున్నది తల్లీ! సార్థక నామధేయా! శత్రుసైన్య తిరస్కారంగావించావు. దుర్జననేత్ర తిరస్కార ఔషధీ! దేవకార్యం సఫలం చేసితివమ్మా! ఈ సప్తసేనానులను నువ్వేచంపు. అదివిని లలితాంబ ఆనందిస్తుంది. దండిని సంతోషి స్తుంది. మంత్రిణి మహదానందం పొందుతుంది. సైన్యాన్ని మేంచంపుతాం. అని శక్తులు ప్రేరేపించారు.

తిరస్కరిణియుద్ధ కుతూహలంతో చీకటిపూయబడిన రథం ఎక్కి రాక్షస సైన్యం మీదికి దాడివెడలింది. ఆమెనుచూచిన సప్తసేనానులు సూర్యుడిచ్చిన వరం స్మరిం చారు. సూర్యతేజం వాళ్లకళ్లలో ప్రవేశించింది కాని అది తిరస్క రిణిని ఏమీ చేయలేక పోయింది. కోపంతో కన్నుమిన్ను తెలియనివాడు, మహాబలపరాక్ర సంప న్నుడు, కోపంవల్ల అస్త్రప్రయోగం చేసే ఆలోచనలేక గుడ్డివాడైన బలాహకుడనే మహారాక్షసుని శిగపట్టి యీడ్చి తిరస్కరిణీదేవి తనకత్తితో వాని తలనరికి వేసింది. వాని వాహనమైన గద్దయొక్క తల ఒక్కబాణంతో తెగవేసింది. తరువాత సూచీముఖుని వైపు వెళ్లింది ఆ తల్లి. కఠినమైనవాని తలనుపట్టిశ ఆయుధంతో తెగనరికింది. తక్కిన ఐదుగురి తలలను నేలరాల్చింది. వాళ్లతలవెంట్రుకలతో ముడిపెట్టి ఆకపాల మాలను కంఠంలో ధరించి తిరస్కరణికా మాతపెద్దగా అరిచింది. ఇతర శక్తులు కోపంతో రెచ్చిపోయి ఒళ్లు తెలియనివారై రాక్షససైన్యాన్నిచంపి, రక్తపుటేరులు ప్రవహిం చేలా చేసారు ఇదంతా భయసంభ్రమాశ్చర్య కారణం అయింది. చావగా మిగిలిన రాక్షసులు మతులుపోయి ఏడుస్తూ భండాసురుని శరణుజొచ్చారు. దండినిని, మహామాయను

మరిమరి పొగిడి పొగిడి అవాక్కయ్యారు. మహామాయ అనుగ్రహదృష్టితో బతికిబయట పడినందుకువారు జగదంబను ప్రశంసించారు. శక్తులందరు మాటిమాటికి పొగుడుతూ, తలలూపుతూ బలే బలే అంటూ తిరస్కరిణిని ఆనందింప జేసారు.

## విషంగ పలాయనం

ఇదంతా విన్నాడు భండాసురుడు. నల్లనాగరాజులాగా బుసకొట్టాడు. మహోదరులను ఇద్దరిని పిలిపించాడు. ఏకాంతంగా మంత్రాలోచన చేసాడు. యుద్ధంలో లలితను జయించదలిచాడు. యువరాజు మహాకోపంతో తాను, తమ్ముడైన విషంగుడు వచ్చాడు. భండాసురునకు నమస్కరించాడు. మంత్రా లోచన స్థానంచేరుకున్నాడు. కుటిలాక్షుడు మొ॥ ఆప్తమంత్రులతో మంత్రా లోచన చేసాడు. ఎట్లయినా లలితను జయించాలి అంటూ కుంటిపడ్డాడు అన్నాడు భండుడు. చివరకు రాక్షసనాశనం అయ్యేరోజువచ్చి పడింది. విధి బలవంతుడు, మనలను ఉపేక్షిస్తున్నాడు. నా సేవకుల పేరు వినగానే దేవతలు పారిపోయేవారు. ఇపుడు మార్పువచ్చింది. దుష్టబ్రహ్మ బలవంతుని నపుంసకునిగాను, ధనికుని దరిద్రునిగాను, దీర్ఘాయువును ఆయుర్హీనునిగాను చేసిపారేస్తాడు. భవిష్యత్తు దుఃఖమయం. మనబాహుబలం సరిపోదు. అసలీ నీచస్త్రీ ఎక్కడిది? అతిలోకసుందరి! అసమయంలో విధి దీనిని సృష్టించాడు కదా! అతడుచాలా కఠినాత్ముడు, మహాశౌర్యంగల సర్పిణి మాయతో విజృంభించిన రాక్షససేనానులు యుద్ధంలో మరిణించిరాయె. ఈ స్త్రీమహామదవతి! మాయావతి కూడ. ఇది మనలను చావగొడుతున్నాది. మనభుజబలానికి ఇదిధిక్కారము. ఈమాట అనడానికి నేను సిగ్గుపడుతుంటి. మదగర్వయైన ఒకసామాన్య స్త్రీ మనసైన్యాన్ని ఎలా చంపగలిగింది? ఇపుడు దాని మూలం నరకడానికి ప్రయత్నించాలి. అది మహాబలిష్ఠి అని చారులు చెప్పగావిన్నా, మొత్తం సైన్యంవెనక ఆమె వుంటుందట. ఆమె ముందు గుర్రాలు, ఏనుగులు, రథాలు, సైన్యంనడుస్తాయట ఆ సమ యంలో మనం వెనుకనుండి ఆమెనువధించాలి. ఈదండయాత్రకు విషం గుడు చతురుడు అతనికి తోడుగా యుద్ధంలో అజేయులు, మదోన్మత్తులు అయిన సైనికులు పదిహేను అక్షౌహిణుల సైన్యంవెళ్లాలి. ఆ స్త్రీకి వెనుకపరి వారం అంతగావుండదు. కాబట్టి విషంకుడు ఆమెను సులువుగా బంధిస్తాడు. విషంగా! నీ చెక్కిళ్లు మదముతో వుబ్బెత్తుగా వుంటుంది. నీ రహస్య పన్నాగంతో ఆ స్త్రీని వెనకనుండి బంధించు, ముందుగా నీతో కొద్దిమంది సైనికులు మాత్రం వస్తారు. ఆ తరువాత దిక్పాలకుల విజయంలో విజృంభించిన సేనానులురావాలి. ఈవిధంగా పది, ఐదు అక్షౌహిణుల సైన్యం నడవాలి. నువ్వు రహస్య వేషం ధరించి ఆ నీచస్త్రీపైకి దుమికి పట్టిబంధించి చంపు. ఆమె సమస్త శక్తులకు మూలకారణ మహాశక్తి. అదిపూర్తిగానశిస్తే అన్ని శక్తులు నశించినట్లే. తామరదుంపను పీకిపారేస్తే తూడు,ఆకు,పువ్వు,విత్తులు, అన్నీ నశిస్తవి. అందరికంటె వెనకవుండి వెలుగులుచిమ్మే రథం ఆమెది. 80మైళ్ల ఎత్తు, అన్నిగొడుగుల కంటె ఎత్తుగామెరిసే పెద్దగొడుగు ఆరథానికి అలంకారం. నాలుగు



చామరాలుంటాయి. ఎత్తైన జెండాలు ఆకాశందాకా ఎగురుతూ వుంటవి. ఆ రథంలో ఆనీచ, లేడికన్నుల పిల్లవేస్తుంది. రహస్యంగా ఆమెను గుర్తించు. హఠాత్తుగా మీదకు దూకు. కొప్పులాగిపట్టుకో, మర్దించు, జయించు సైన్యంఅంతా ముందు పోతూ వుంటుంది. ఒకే ఒక్కఆడది దానికి సాయంగావుంటుంది. అందువల్ల సునాయాసంగా ఆ స్త్రీ నీవశం అవుతుంది. మదనకుడు, దీర్ఘజిహ్వుడు, హుబకుడు, హులములుడు, కక్షసుడు, కక్షివాహనుడు, ధుక్లసుడు, పుంద్ర కేతువు, చండబాహువు, కుక్కురుడు, జంబుకాక్షుడు, జంభనుడు, తీక్ష్ణశృంగుడు,త్రికంటకుడు, చంద్రగుప్తుడు అనేవారు మహాసేనా నులు నీతోవస్తారు. ఒక్కొక్కరికి ఒక్కొక్క అక్షౌహిణీ సైన్యం సహాయంగా వస్తుంది. శత్రురాజధానికి తెలియకుండా ఆ స్త్రీ వెనుక భాగానికి చేరు. విజయలక్ష్మి నిన్ను వరిస్తుంది. అంటూ భండాసురుడు విషంగుని లలితపైకి పంపాడు. యువరాజు తమ్ముడు విషంగుడు లలితాదేవిని వెనుకనుండి పట్టుటకు సిద్ధముకాగా సూర్యుడస్తమించాడు మొదటిరాజు యుద్ధం లోకభయంకరమయింది. చీకటి ఆక్రమించింది.

ఆ చీకటిదున్నపోతు మూపురంవలె పొగరంగు కలిగివుంది. అడవిపంది శరీరం వలె, శివుని కంఠంవలె కారునలుపు. గట్టం పొదలలో దట్టంగావుండి వాటి సందుల నుండి పరుగు పెడుతున్నట్టున్నది. భూరంధ్రాలనుండి అనేకవేల విధాలుగా బయటకువస్తున్నట్టున్నది. పర్వతగుహల్లో నుండి కూడ పరుగున బయటపడుతున్నట్టున్నది. దీపకాంతులకు భయపడుతున్నట్టు కొన్నిచోట్ల అగుపించుచున్నది. స్త్రీలు చెవులలో ధరించిన నల్లకలు వల కాంతి గలిగియున్నది. కాటుకయందు తేడాలేకుండా కలిసిపోయి మదించిన దిగ్గజంవలెనున్నది. పచ్చికబయలుతో మహామైత్రి కలదానివలెనున్నది. పదునులేని కత్తివలెనల్లనైనది. నల్లని వనపంక్తులతో రహస్యంగా ప్రవేశించినట్లు నల్లగనున్నది. క్రమక్రమంగా వ్యాపిస్తూ దట్టమైపోయె. అందాల రాత్రి సుందరి ధరించిన నల్లని కవచంలా పెల్లుబికింది. విశ్వమంతా ఆవరించింది.

రాక్షసులకు రాత్రికాలం చాలా బలంగా వుంటుంది. ఇది వాళ్లమాయా విలాసం రాత్రియందే బలం వర్థిల్లుతుంది. విషంగుడు సైన్యాన్ని నడిపించాడు. వాళ్లకత్తులు తెల్లని మెరుపు తీగల్లాగా కాంతులు వెదజల్లినై. చీకటి గుంపులు చెదురుతుండె. దమనుడు మొ॥వారు నల్లని ముళ్లకవచాలు ధరించారు తలపాగాలు, వస్త్రాలు అదేరంగు. చీకటిలో కలిసిపోయినారు. అన్నకు నమస్కరించారు. అతనిని అనుసరించారు. విషంగుడు కపట యుద్ధంతో లలితను జయించాలనుకొంటున్నాడు. మేఘడంబరం అనే ముళ్లకవచం రొమ్ముపై ధరించాడు. ఆవేషం రాత్రియుద్ధానికి అనుకూలంగావుంది. వాని సైన్యంకూడా వానివేషమేవేసింది. యుద్ధభేరీలు, మద్దెలలు, గర్జనలు, పణవ,ఆనక, మొ॥ రణగణ ధ్వనులులేవు. చీకటి సాయంతో వాళ్లంతా యుద్దానికి కదిలారు. రహస్యంగా నడుస్తుండిరి. శత్రువులకు కనిపించని మార్గాలు. చేతులలో దూసినకత్తులు లలితసైన్యానికి ఎదురుగా, పడమరగా పోతుండిరి. ఊపిరికూడ విడువక అతిరహస్యంగా ఆవరించ బడిన ఉత్తరమార్గంతో

పూర్వభాగాన్ని ఆశ్రయించారు. చాలాశ్రద్ధతో నడుస్తూ లలితాదేవిని వెనుకనుండి పట్టుటకై మల్లీపురముయొక్క దిగ్భాగానికి వెళ్లి వేగం తగ్గించారు. మీరెవరిని ఎవరేనా అడిగితే లలితాసైన్యమే అంటున్నారు. చప్పుడు చెయ్యకుండా లలితాదేవి వెనక్కు చేరేరు. దేవియొక్క చక్రరాజరథాన్ని చూచారు. అదిమేరు, మందర పర్వతాలవలె వుంది. తేజ స్వంతశక్తులతో చుట్టుముట్టబడివుంది. ఆరథంలో ముత్యాల గొడుగుకింద వెయ్యి సూర్యులకాంతితో ప్రకాశిస్తూ పడమర ముఖంగావున్న లలితాపర మేశ్వరిని చూచారు. ఆమెతో కామేశ్వరి మొ॥నిత్యాశక్తులు వేళాకోళాలాడు తున్నారు. వారంతా లలితదేవివలెనే తేజస్వంతలు. మహాదురాశయుడైన విషంగుడు అనుపమయుద్ధ ప్రయత్నంగల లలితాదేవిని, ఆతల్లి సైన్యాన్నిచూచాడు. తేరిపారచూచాడు కుతూహ లంతో చూచాడు. ఆదేవినే భావిస్తు న్నాడు. ఆమహాశక్తి కూర్చున్న చక్రరాజ రదేంద్రాన్ని వెనకభాగనుండి సైనికులతో తాకాడు. అక్కడ అణిమాదిశక్తి సైన్యంవున్నది. వందకు మించిన ఆశక్తులు మహాకలకలం చేసారు. వజ్రంవేటు వెయ్యగల పట్టిశము, దృఘు ణము, భిండివాలము, భుశుండి మొ॥ ఆయుధములతో మహాబలశాలురైన రాక్షసులు ఆ శక్తులను బహుబహుమానించారు. ఇది ఆకస్మిక యుద్ధం. దానవులరణోత్సాహం శక్తిసైన్యం రూపురేకలు మారిపోయినై, అకస్మాత్తుగా అల్లకల్లోలమయింది. చీకట్లు సృష్టించే రాక్షసులు గొడ్డళ్లతో రథాన్ని చీలుస్తుండిరి. చక్రరాజరథం తొమ్మిదవ అంతస్థులోవున్న స్త్రీశక్తులు కవచాలు శస్త్రాలు కనబడక అతలాకుతలం అయ్యారు. రాక్షసులబాణాలతో అటు ఇటు కప్పబడిన మర్మాలుగలవారై చాలాబాధ పడ్డారు. లలితాదేవిని గూర్చి పెడబొబ్బలు పెట్టారు. తూర్పు దక్షిణ పశ్చిమాల్లో మహాభయం వచ్చిపడిందక్కడ.

ఆ చెవిన, ఈచెవిన విన్న చరిత్ర లలితాదేవికి కోపం తెప్పించింది. ఇంతలో చండుడైన భండాసురుడు దుర్మంత్రణ పండితుడయ్యాడు. పది అక్షౌహిణులసైన్యంతో మహాతేజ స్వంతుడైన కుటిలాక్షుని పంపాడు. కుటిలాక్షుడు వెనుకనుండి వచ్చే కలకలంవిని, ముందున్న లలితాసైన్యం రాకుండా మహాయుద్ధం చేసాడు. లలితాదేవికి ముందు, వెనుకకూడ యుద్ధం జరుగుతున్నది. శక్తుల సైన్యంలో దొమ్మీయుద్ధం, భయంకర ఘోరయుద్ధం జరిగింది. రాత్రికాలంలో బలవంతులు, చీకటిచే ఆవరించ బడ్డవారు, విజృంభించినవారు అయ్యుకంటకంలో పడిరాక్షసులు అటుయిటు కదలక మెదలక నిట్టనిలువునా స్తంభించి పోయిరి. విషంగదమనాది సేనాపతులచేత, సైన్యం చేత కొట్టబడి కోట్లకొలది శత్రువులు పడిపోయ్యారు. రాక్షస శస్త్రసమూ హంతో కొట్టబడి ఆవరించబడిన చక్రరాజధరం కొంగలగుంపుతో చుట్టబడిన హిమాలయ పర్వతంలా ప్రకాశించింది. విషంగుడు చక్రరాజరథం క్రింది అంత స్థును ఆక్రమించి లలితాదేవిపైకి ఒకబాణం వదిలాడు. అదిదేవియొక్క విసనకర్రను చూర్ణంచేసింది. ఆబాణం గురితప్పడంవల్ల శక్తిసంఘం తడబాటుపొందింది. కామేశ్వరి. మొ॥నిత్యా శక్తులు కోపోద్రిక్తులయ్యారు. శ్రీదేవి ముఖపద్మం కొద్దిగా కనుబొమల ముడివేసింది.



అదిచూచిన నిత్యాశక్తులు ఉద్వేగంచెంది మిక్కిలి శ్రమపడ్డారు. నిత్యాశక్తులు కాలస్వరూపలు. వాళ్లు తిథి విగ్రహాలు. మహాసామ్రాజ్ఞియైన లలితాపరమేశ్వరి కోపం చూచి యుద్ధప్రయత్నం చేసారు. మహోదయ,మహారాణి, మహాదేవి అయిన లలితా దేవికి నమస్కరించారు. యుద్ధకుతూహలలయ్యారు. కంఠాలు బొంగురు పోయినాయి. అకస్మాత్తుగా అన్నారు.

ఓతల్లీ! మహారాణీ! నీముందున్న సైన్యందండిని, మంత్రనాథ మొ॥ మహాశక్తులచే రక్షించబడుతున్నది. పిరికి రాక్షసులు వారిని ఎదిరించ లేకపోయిరి. మోసంతో వెనుకనుండి యుద్ధంచేస్తూ చక్రరాజ రథాన్ని పాడుచేస్తుండిరి. చీకటి ఆకారాలుగల రాక్షసుల గర్వాన్ని మేము అణచివేస్తాం. ఇప్పుదేచూడు, వహ్నివాసినీ నిత్యాశక్తి జ్వాలామాలినీ, పరాశక్తి, వీరిద్దరు జ్వాలామాలలు వెదజల్లేయుద్ధం చేస్తారు. దానిని రాక్షసులు చూడలేరు. దొంగయుద్ధంచేసే రాక్షసులకండ కావరం అణస్తాం. నీవద్దకువస్తాం. నిన్నుసేవిస్తాం. నువ్వాజ్ఞాపించు, ఆ దుర్మార్గుల్ని చావగొడతాం, అని వారనగానే లలితాదేవి తథాస్తు అంది. కామేశ్వరీ నిత్యాశక్తి లలితాదేవికి నమస్క రించింది. బయలుదేరింది, ధనువును ఎక్కుపెట్టింది. కూటయుద్ధదీక్షా విశారదులైన దుష్టరాక్షసులను చంపుటకు సిద్ధమయింది. బాలసూర్యునివలె ఆమెముఖం ఎర్రగా మారింది. ఓరేయ్ పాపాత్ములారా! నిలవండిరా. నామాయతో క్షణంలో మిమ్మల్ని తునాతునకలు చేస్తా. చీకటి బలంతో మాయయుద్ధం చెయ్యడం మరేం గొప్పకాదు అనివాళ్లను బెదిరిస్తూ అమ్ముల పొదినుండి బాణంతీసింది. కోపంవల్ల తొట్రుపాటు చెందింది. రథం అంతస్థునుండి కిందికి వురికింది. భగమాల మొ॥నిత్యాశక్తులు కూడా దిగారు జ్వాలామాలిని,వహ్నివాసిని యుద్ధానికి సిద్ధమయ్యారు. తేజఃపుంజా లయ్యారు. యుద్ధమండలం వారి కాంతిపుంజాలతో కనుల పండువు చేసింది. రాక్షసులు కూడ కాంతి శరీరులుగా మారారు. ఆ తేజస్సులో మునిగిపోయినారు. మహాకోపంతో మండిపడుతున్నారు.

కామేశ్వరి మొ॥నిత్యాశక్తులు పదిహేనుమంది. ఆయుధాలు ధరిం చారు. సింహాల్లా గర్జించారు. రాక్షసులను మర్దించారు. రణరంగం మహా కలకలంతో కలకలయింది. క్షీరసాగరమథన సమయతరంగ మాలా ఉద్ధృత మయింది. నిత్యా శక్తులు ప్రాణంఅనే ధనువును లాగియుద్ధంలో విజృంభిం చారు. వారి కరకంకణ ధ్వనులు ధనుధ్వనులతో అవినాభావ సంబంధం కలవైనవి. మూడుజాములు యుద్ధం జరిగింది. వారిపదును బాణాలతో అక్షౌహిణీ సైన్యం చంపబడింది. ముందుగా కామేశ్వరి దుష్టదమనుని చంపింది. భగమాల దీర్ఘజిహ్వుని చీల్చింది. నిత్యక్లిన్నహుబ కుని భేరుండ హులుమల్లకుని, వహ్నివాసిని కక్లసుని నూరుబాణాలతో చంపిరి. మహా వజ్రేశ్వరి దుష్టదమనునిచంపింది. భగమాల దీర్ఘజిహ్వుని చీల్చింది. మహా వజ్రేశ్వరి కేకివాహనుని వధించింది. శివదూతి పుక్లసునియమనగరానికి పంపింది. త్వరితాశక్తిమహాబాహువైన పుండ్రకేతువును చీల్చిచంపింది. కులసుందరి చండ

బాహుని, కుక్కురునిఛేదించింది. నీలపతాక, విజయ జంబుకాక్షుని, జృంభణుని నరికివేసారు. సర్వమంగళతీక్ష్ణ శృంగుని ముక్కలు చేసింది. జ్వాలమాలిని ఉగ్రత్రికర్ణుని సంహరించింది. చిత్రాశక్తి దుష్టచంద్ర గుప్తుని చంపివేసింది. అందరు చచ్చారు. విషంగుడు కోపించాడు. ముందుకు నడిచాడు.

అప్పటికి జామురాత్రి మిగిలింది. రెండుఘడియలు (48ని.) విషంగుడు నిత్యాశక్తులతో యుద్ధంచేసాడు. బలహీనుడై పారిపోతున్నాడు. కామేశ్వరిలాగి విడిచిన బాణాలతో వాని కవచం తెగింది. వాడు వివశుడయ్యాడు. చావగా మిగిలినవారితో కలసి పలాయనం చిత్తగించాడు. దండనాథ వానిని చంపవలసి యున్నందువల్ల కామేశ్వరి వాణ్ని విడిచి పెట్టింది. తరువాత తెల్లవారింది. దిశలు తేటలైనవి. పారిపోయేవాళ్లను ఏమీ చేయరాదని నిత్యాశక్తులు యుద్ధంమానివేసారు. దానవశస్త్రఘాతాలవల్ల నయిన గాయాలనుండి రక్తంస్రవిస్తుండగా వచ్చిన నిత్యాశక్తులు విజయగర్వంతో లలితాపరమేశ్వరికి నమస్కరించారు. వారిని చూచింది తల్లి, కృపతోచూచిన ఆ ఓరచూపువల్ల వారి గాయాలు మటు మాయ మయ్యాయి. వారి పరాక్రమానికి లలిత ముగ్ధయయ్యె. – ఇది మొదటిరోజు యుద్ధము



## విషంగ పలాయనం

పది అక్షౌహిణుల సైన్యంతో సహ మహావీరుడైన కుటిలాక్షుడు దండనాథ యొక్క తీక్షణ బాణాలకు చావుదెబ్బతిని యుద్ధరంగం వదలి భయంతో పారిపోయె. ఇదంతా విన్నభండాసురుడు కలవరపడ్డాడు. దుర్మార్గులైన రాక్షసులు రాత్రికాలంలో చేసిన రాక్షసుల కపటయుద్ధ తంత్రంవిని మంత్రిణి, దండనాథ అసహ్యించుకున్నారు. వాళ్లనుకున్నారు. సమయానికి మనంలేము. చాలాదూరంగా ముందుకు నడిచాం. సమయానికి తల్లికి సహాయపడలేకపోయాం. చక్రరాజరథ రక్షణ స్త్రీశక్తులు చేయలేక పోయినారు. ఈఅవకాశం చూసుకుని రాక్షసులు పరాక్రమించారు. అమ్మయుద్ధం చేసిందా? ఇతర శక్తులెవరైనా అక్కడ వున్నారా? ఇది విమర్శ చెయ్యాలి. అక్కడ ఏం జరిగిందనలు అమ్మ మనసులో ఏమనుకుంటున్నదో అను కొంటూ దండనాథ మొ॥వారు శంకాకుల మనస్కులై మంత్రిణిని ముందు పెట్టుకొని లలితాదేవివద్దకు వెళ్లారు. శక్తిసేనాయకు రాళ్లందరు రథాన్ని చుట్టుముట్టారు. మంత్రిణి, దండానయక, వాహనాలు దిగారు. రథాలెక్కారు. శక్తుల సూచనలమేరకు వేగంగా నడిచారు. చక్రరాజరథం తొమ్మిదవ అంతస్థునుదాటి లలితాంబికను చేరిన నుతిచేశారు. సాష్టాంగంచేసి వినతించారు.

తల్లీ ! మహాప్రమాదం వచ్చిందని విన్నాం. నీచదానవులు కూటయుద్ధం చేసి అపకారంచేసారు. పగటియుద్ధానికి భయపడ్డ పిరికిపంద దురాచారంతో ఈ విధంగా విజయం ఆశిస్తున్నాడు. మనరాణికి బాణఘాతాలు అవుటలేదు. ఇదంతా దైవ విలాసం. అందువల్ల ఆ నీచభండాసురుడు ఇంతరవకు బతికి బయటపడ్డాడు. నీపాదమేమాకాధారం. మేమందరంబతికి బాగున్నాం. మేము తల్లికి అంగరక్షణ



చేయవలసివుంది. బాగా ఆలోచించి మాయా నివారణమంత్రం ప్రయోగించండి. ఆపత్సమయంలో భండాసురుడు మొ॥ దుష్టరాక్షసులను చంపితీరాలి. అపుడు కపటయుద్ధం కాస్తా కడతేరిపోతుంది. మహేంద్రపర్వతానికి దక్షిణంగా **800** మైళ్ల విస్తీర్ణంతో శిబిరంనిర్మించాలి. సేనాని నివాసరక్షణకు గుండ్రని అగ్నిప్రాకారం తయారు కావాలి. అప్పుడు శత్రుగర్వం సర్వంనశిస్తుంది. ప్రాకారానికి మధ్యప్రవేశం ఏర్పరచాలి. అగ్నిప్రాకారానికి దక్షిణంగా ద్వారం వుండాలి. శూన్యకపురం దక్షిణంగా వున్నది. సాయుధలైన శ్రీశక్తులు ద్వారం దగ్గరవుండాలి. వచ్చేపోయేవాళ్లను వారు అడ్డుకుంటారు. వారికి అలసట, నిద్రమత్తు వుండవు. సర్వకాల సర్వావస్థలయందు సిద్ధంగా వుంటారు. ఇలాచేస్తే సంధ్యాకాలం, రాత్రి రాక్షసులు చేసే కపటయుద్ధం వాళ్లకు సాధ్యంకాదు. హఠాత్తుగా వాళ్లుచేసే ఆక్రమణ కూడ నెగ్గదు. దురాశా పీడితులు, మహామాయావులు అయిన రాక్షసులు ఎలాటి వారంటే మనం చూస్తుండగానే మన బంగారం దొంగిలించేవారు మనబలాన్ని, మహాసైన్యాన్ని మనం చూస్తుండగానే కళ్లలో కారం జల్లినవిధంగా హరించివేస్తారు. ఇలా ఈమాటలువిన్న లలితాదేవి మెల్లగా నవ్వింది. ముత్యాలవంటి మెరుపులు ఆమె దంతాలు మిలమిల మెరిసినాయి అంది ఇలా –

మీరు బుద్ధికుశలలు, ప్రజ్ఞాధురీణలు, మీది కుశాగ్రబుద్ధి. మీది ప్రాచీననీతి. జయించు తలంపుగల మీరు సైన్యరక్షణం, అవశ్యంచెయ్యాలి. పరసైన్యాన్ని ఆక్రమించాలి. అంటూ జ్వాలా మాలిని అనే నిత్యాదేవతను పిలిచియిట్లున్నది. బాలా! నువ్వు అగ్నిరూపవు. నీ ఆకారంజ్వాలామాలా యుతము. నువ్వే మనసైన్యాన్ని రక్షించు. ఎనిమిది వందలమైళ్లదూరం లోపునవున్న ప్రాణులను ఆవరించివుండు. రెండువందల మైళ్లదూరంపైకి వచ్చే మంటల ఆకారంవహించు, ద్వారప్రవేశంలో మాత్రం ఎనిమిది మైళ్లు విడిచిపెట్టు. మిగిలినదూరం అంతట నీమండుచున్న శరీరం మంటలు కక్కుతూ వుండాలి. అలా మనసైన్యాన్ని రక్షించుమంటూ లలితాదేవి మహేంద్రగిరి ఉత్తర దిశకు ప్రయాణమయింది. నిత్యయైన ఆ నిత్యాశక్తి చతుర్దశీ తిథి స్వరూపము ఆమె అమ్మ ఆజ్ఞను శిరసావహించినది. తల్లికి నమస్కరించింది. ఇంతకుముందే లలితాదేవి చెప్పిన మహేంద్రగిరి ఉత్తరభాగాన్ని చుట్టుముట్టి ఒకసైనిక నివాసంవలె వెలుగుతున్నది. అదిభయంకర అగ్నిజ్వాలలతో రక్షించబడుచున్నది. దండిని, మంత్రనాథల యొక్క సైన్యం కూడ ఆకాశాన్ని అంటుచున్న జ్వాలా మాలామయమై వెలుగుచున్నది. శక్తి సైన్యం అంతా ఆ జ్వాలల మధ్య నిశ్చింతతో వున్నవి. మధ్యలోచక్రరాజ రథం వుండేలాగున దండిని నియమించింది.

తనరథాన్ని ఎడమభాగంలో వుంచింది. కుడివైపు శ్యామలాదేవి రథాన్ని నిలిపింది. పడమరను సంపత్కరిని, ముందు అశ్వారూఢను, అమ్మవారి రథం చుట్టు శక్తులు రథాలలో వున్నట్లును ఏర్పాటుచేసింది. ద్వారంవద్ద స్తంభిని అనే దేవతను నిలిపింది. ఆమెకు ఇరవై అక్షౌహిణుల సేనవున్నది. ఆమెమంటలుకక్కే దండాయుధం

ధరించింది.మహాభయంకరంగా వుందావిడ స్వరూపం. ఈమె దండనాథయొక్క విఘ్నదేవి. పగ్గంతాడు ధరించిన దండనాథ సేనాశిబిరాన్ని సురక్షితం చేసింది. సూర్యోదయంకాగానే యుద్ధం ప్రారంభం అయింది. శక్తిసైన్యం కిలకిలారావాలు చేసింది. అగ్నిప్రాకారం నుండి మహాధ్వనులతో బయలు దేరింది. ఈ విషయమంతా చారులవల్ల భండాసురునకు తెలిసింది. వాడిని నయంకాని జ్వరం వచ్చింది. కుటిలాక్ష మొ॥ మంత్రులతోను విషంగు, విశుక్రులతోను ఆత్మస్తుతులుచేసుకుంటూ సమాలోచన చేసాడు. పుత్రుందలరినీ ఒకేసారి యుద్ధానికి పంపాలను కున్నాడు. వాళ్లు నాలుగు సముద్రాలవంటివారు, రణవిశారదులు, చతుర్బా హువు మొ॥ ఈతనపుత్రులను పిలిచాడు. విషయం వివరించాడు, వాళ్లను యుద్ధానికి పంపాడు, వీళ్లు ముప్పదిమంది. ఘోరాకారులు, అతిబలులు, ఉబ్బినబుగ్గలు గలవారు. చతుర్బా హువు, చకోరాక్షుడు, చతుశ్శిరుడు, వజ్రఘోషుడు, ఊర్ధ్వకేశుడు, మహాకాయుడు, మహాహనువు, మఖశత్రువు, మఖస్కందీ, సింహఘోషుడు, సిరాలకుడు, లడునుడు, పట్టిసేనుడు, పురాజిత్, పూర్వమారకుడు, స్వర్గశత్రువు, స్వర్గబలుడు, దుర్గుడు, స్వర్గకంటకుడు, అతిమాయుడు, బృహన్మాయుడు, ఉపమాయుడు, వీర్యవంతుడు, అనే వీళ్లు దుర్మదులు, దుర్బుద్ధులు, తండ్రితో సమానమైన ఆకారము, దుష్టపరా క్రమముగలవారు. వీళ్లు వచ్చి భండాసురుని పాదాలకు భక్తితో నమస్కరిం చారు. వారిని ప్రేమతో చూచాడు భండుడు, సగౌరవంగా అన్నాడు.

నాయనలారా ! మీతోసమానులు ఈలోకంలో లేరు. మీబలం ఆసరాగా ఇంతకుముందు నేను ప్రపంచాన్ని జయించాను. యుద్ధంలో మీరు కోపంతో దిక్పాలకులను జుట్టుపట్టియీడ్చేరు. మీరున్నారు. శస్త్రాస్త్రా లున్నవి. కాని కులభ్రంశం వచ్చింది. ఒకమాయావి, యుద్ధమదోన్మత్త దుష్ట సుందరి ఒక స్త్రీ, తనవంటి అనేకమంది స్త్రీలతో కలసి మనల్ని చంపుతున్నది. కాబట్టి మీరామెను యుద్ధంలో వశంచేసుకోవాలి. ప్రాణాలతో ఆమెను పట్టుకొనాలి. మీరు ఆ గ్రహోదగ్రులు, ఒక అబలపైకి మిమ్మల్ని పంపడం తగదు. అయినను విధినిర్ణయం తప్పించలేం. ఇది మీశౌర్యకీర్తికి వ్యతిరేకం. అసహనంవలదు, అంటూ భండాసురుడు వారిని యుద్ధానికి పంపేడు. రెండువందల అక్షౌహిణి సైన్యం కూడ వారివెంట పంపాడు. భండపుత్రులు కోపంతో కనుబొమలుముడిచారు. శస్త్రధారులై యుద్ధానికి వెళ్లారు. అపుడు భూమి కంపించింది. ఉత్పాతాలు పుట్టినై. లోకం భయపడుతున్నది, భండ సుతులపై ముత్తయిదవలు పేలాలుజల్లేరు. వందిమాగదులు స్తుతించారు. ప్రతిద్వారంవద్ద పురస్త్రీలు మంగళహారతు లిచ్చారు. వారినడకలకు భూమి బద్దలగు చుండె, ఆకాశంలాగబడినట్లున్నది. సముద్రాల్లోను సుడిగుండాలు తిరుగుతుండె, క్రూరముఖాలతో పురం వెలుపలికి వచ్చారు. ఒక్కక్షణంలో శక్తిసేనలను నమిలేస్తాం, వాళ్ళ ఆయుధాల్ని చూర్ణం చేస్తాం. అగ్నిప్రాకారాన్ని ఆర్పివేస్తాం. లలితను బందీని చేస్తాం.అంటూ వీరాలాపాలాడుతూ, గుర్రాలను నడిపిస్తూ అగ్నిప్రాకారం సమీపం



చేరారు. యౌవనమధాందులైయున్నారు. కుటిలముఖాలతో సింహనాదాలు చేసారు. కాలమేఘం నుండి పడిన పిడుగుల్లాగున వున్నవవి. బ్రహ్మాండం బద్దలైనట్లయింది. ఇది అపూర్వశబ్దవిజృంభణం. శక్తిసైన్యాల చెవులను, మనస్సును భేదించి వేసింది. స్త్రీ శక్తులపై ఆయుధప్రయోగాలుచేసి వాళ్లనుమూర్ఛలో ముంచి కలకలం సృష్టించారు.

బ్రహ్మముఖాలవంటి ఆభండకుమారులను చూచి చాలాశక్తి చాలా ఆనందిం చింది. ఆమె లలితాదేవి కుమార్తె, తల్లివద్దనే ఎప్పుడూ వుంటుంది. శక్తిమండలం ఆమెను పూజిస్తూ వుంటారు. మహాపరాక్రమశాలిని, లలితా కార, అలిగిందామె, నవవర్షవిద్యలగని, బాలసూర్యుని వంటి ఎర్రని గుండ్రని పిరుదులుగలది. ఎర్రని తీగవంటి శరీరం, తల్లిపాదాలదగ్గర ఆమె నిత్యనివాసం, లలితకు బహిఃప్రాణం. నాలుగోకన్ను. భండపుత్రులను శీఘ్రంగా చంపుతానని నిశ్చయించుకున్నదామె. తల్లితో అన్నదిలా. మాతా! భండపుత్రులు యుద్ధానికి వచ్చారు. నేను బాలను, వారితో యుద్ధంచెయ్యాలని మహాకుతూహలంతో వున్నాను. నా బాహువులు దురద పెడుతున్నవి. యుద్ధక్రీడలో కృతార్ధనవుతా, బాలలకు క్రీడలందాశమిక్కుటము కదా! నాకు నువ్వడ్డురాకు. నేనే చంపాలివాళ్లని, ఒకక్షణం రణక్రీడాప్రీతనవుతా, అని బాలాంబ విన్నవించింది. దేవి అన్నది చిన్నబుల్లీ ! నీవు అతిసుకుమారవు నవవర్షవు, నూతనక్రమవు, యుద్ధశిక్షణ ఈమధ్యనే ముగిసినదినీకు నాకు ఏకైక పుత్రికవు, నీవు లేకుండా నేనొక్కక్షణం జీవించలేను. నీవు నాప్రాణం. నువ్వుయుద్ధానికి వెళ్ళొద్దు. దండిని, మంత్రిణి, మొ॥శక్తులు కోటానుకోట్ల మందివున్నారు. చిన్నమ్మా! పరాకు మాటలాడకు, అంటూ కుమారిని ఆపే యత్నం చేసింది. కుమారి మరల మరల అడిగింది. ధృఢనిశ్చయఅయింది. చూచింది లలితాంబిక. పిల్లను గట్టిగా ఒత్తి కౌగిలించుకుంది. అనుమంతిం చింది. తనకవచం నుండి మరొక కవచంతీసి యిచ్చింది. తన ఆయుధాల నుండి ఆయుధాలు తీసిచ్చింది. యుద్ధానికి పంపింది.

అమ్మవారి ధనువు నుండి 'కర్ణీ' అనే రథంపుట్టింది. దానిపై అధివసిం చింది బాలాత్రిపురసుందరి, ఆ రథాన్ని నూరుహంసలు లాగుతున్నవి. దాని అంతస్థులలో ఖడ్గధారులైన దేవతలు బాలకు నమస్కరించారు. ఆబాలరథందిగి సైన్యంలో ప్రవేశిం చింది. కోపంవల్ల ఎర్రగా వెలిగిపోతున్నది. ఆమెనుచూచి మంత్రిణి, దండనాథ భయకంపితులయ్యారు. ఆమెతో అన్నారు. తల్లీ! నీవుమాకు ఉపయజమానివి. నువ్వు యుద్ధానికి రానవసరంలేదు. అత్యవసరమనుకొని అమ్మ నిన్ను యుద్ధానికి పంపి నదా? సైనికులున్నారుకదమ్మా! నీవు లలితాదేవికి సాకారప్రాణమవు. నీకు నమ స్కారం. తిరిగివెళ్లు అని ప్రార్ధనాపూర్వక విన్నపంచేసారు. బాలాసుందరి యుద్ధమే చేస్తా అన్నది. చాలా ఆశ్చర్యమయింది, మంత్రిణీదండనాథలు ఆమెకు అంగరక్షకులై ఇరువైపుల నిలిచి ఆమెతో యుద్ధరంగానికి కదిలారు. సైన్యం కదిలింది. అగ్ని ఆవరణగా నిలిచిన బాల ముందుకుసాగింది. కర్ణీరథం ఎక్కింది. సేనానాయకలు, సేనలు ఆమెకు నమస్కరించిరి. ఆమె వారిని అనుగ్రహించింది. భండపుత్రులను

దూరంగా నెట్టింది. సైన్యంతక్కువే. పదిఅంగుళాల దూరం కూడా లేదు. ఆ బాలాసైన్యంతో లలితాసైన్యం కలిసింది. చెలరేగిన పరాక్రమంతో బాలాసుందరి రాక్షసరాజులపై బాణ వర్షం కురిపించింది. ఈయుద్ధం దేవదానవులకు చూసి తీరాలనిపించింది. తొమ్మిదేళ్ల పిల్లచేసే యుద్ధం చూడముచ్చటయింది. ఆ బాలను ఆసక్తితో చూస్తు భండపుత్రులు ఆశ్చర్యంలో మునిగిపోయారు. పరిచారికలు ఆయుద్ధ విశేషాలను లలితకు విన్నవించారు. మంత్రిణీ దండనాథలు బాలను రెండు వైపుల రక్షిస్తూనే వున్నారు. ఆమెను, యుద్ధాన్ని చూస్తూనేవున్నారు. ఒక్కబాల ఒక్కొక్క సూర్యునివలె ప్రతి ఒక్కరికి కనిపించింది. ఆమెముఖం ఎర్రకలువ వలె ఎరుపెక్కింది. మంటలు కక్కే బాణాలతో రాక్షసుల మర్మస్థానాలను భేదించింది. ఆకాశమందున్న దేవతలు, భూమిపైనున్న మంత్రిణీ దండనాథలు "ఆశ్చర్యం! బలేబలే" అన్నారు. చురుకైన చేతులతో బాలాకుమారి కరుకైన యుద్ధంచేసింది. ఇది రెండవరోజుయుద్ధం. అస్త్రాలకు ప్రత్యస్త్రాలు ప్రయోగించి రాక్షసులను ఛేదిస్తూ, లలితాపుత్రిక స్వబల ప్రదర్శనతో ప్రకాశించింది. నారాయణాస్త్రంవేసి రెండువందల అక్షౌహిణిసైన్యాన్ని క్షణ కాలంలో బూడిదపోగులుగా మార్చివేసింది. అది చూచిన రాక్షసులు కోపోద్రే కంతో హఠాత్తుగా బాలపైకి చెలరేగారు. స్త్రీశక్తులు, దేవతలు కలవరపడ్డారు. బాల ముప్పది బాణాలు ఒక్కసారే వదిలింది. ఆ అర్ధచంద్రబాణాలతో భండపుత్రులు ముప్పదిమంది తలలుతెగి నేలకూలేరు. దేవతలు బాలపై పూలవాన కురిపించారు. మంత్రిణీ దండనాథలు సంతోషంతో బాలను కౌగిలించుకున్నారు. విజయనాట్యం చేసారు. శక్తులు, సెబాష్ః అహో ! అంటూ మెచ్చుకున్నారు. ముల్లోకాలు ఆనందంతో మునిగినాయి. శక్తి సేనానులు దండనాథలను ముందుంచుకుని ఈ ఆశ్చర్యవిషయాన్ని అమ్మకు తెలుపబోయిరి. వారునివేదించిన సవాలక్ష విషయాలలో అతిముఖ్య బాలా విజయగాథ విని లలితాంబ అధికానందం పొందింది. దేవతల్లో కూడ పూర్వం ఎన్నడులేని ఈ బలభుజపరాక్రమ కీర్తులువిని అక్కడి శక్తిసమూహం ఆశ్చర్యం వెలిబుచ్చింది.

## గణనాథ పరాక్రమం

పుత్రులు నశించారు. కులక్షయం అయిపోయింది. శ్లోకాగ్ని చుట్టు ముట్టింది. భండుడు దుఃఖంలో మునిగిపోయాడు. కుమారులారా! గుణ ధురీణులారా! పితృభక్తి తత్పురులారా! నా కన్నులలో అమృతం నింపిన మత్కులవి వర్ధనులారా! సమస్త దేవతా మదభగ్నతత్పరులారా! అయ్యో! అయ్యో! అయ్యో! నాయనలారా ! సమస్త దేవతాస్త్రీ మనస్సంమోహిత మన్మథులారా! నాతోమాట్లాడండి. నాతొడపై ఎగిరి కూర్చోండి. రండి మీకై సర్వస్వం అర్పించే మీ ప్రీతిపాత్ర పితరుడు భండునివదిలి వెళ్లారా బిడ్డలారా! మీ సుఖం మీరు చూచుకున్నారా? మీరులేని ఈ రాజ్యభోగాలు శోభిల్లవురా సుపుత్రులారా ! భుజబలగర్విష్ఠులైన, మత్కులాంకురములైన మిమ్ముందరిని ఒకేసారి ఆ నీచవనితయుద్ధంలో ఎలాచంపింది నాయనలారా ! నా సుఖాలు నశిం



చినై. మీరు పుణ్యాత్ములు. నా పూర్వపుణ్యాలు మీ పుణ్యాలలో కలిసిపోయినై. మీనాశనం నన్ను నష్టపరిచింది. ఆపదలు నన్నావహించినై, హతోస్మి! పుత్రులారా! నేను మందభాగ్యుణ్ని. అంటూ శోకిస్తు మూర్ఛపోయాడు భండుడు. తలవెంట్రుకలు చెల్లాచెదరైనవి. గుండె జారిపోయింది. ఆసనం నుండి కిందపడ్డాడు, విశుక్రుడు, విషంగుడు, కుటిలాక్షుడు దైవాన్ని దూషించారు, భండుని ఓదార్చారు.

విశుక్రుడన్నాడు. ప్రభూ! పామరునివలె శోకించకు. వీరమరణం పొందిన నీ పుత్రులను గూర్చి శోకించతగదు. ఈమరణం ధార్మికం శాశ్వత మార్గం పూజ్యం. మననాశనం కోసమే ఆస్త్రీ వచ్చింది. మనసైన్యాన్ని, నాయకులను, నీపుత్రులను చంపింది. ఇది హృదయ శల్యంలా నన్నుబాధిస్తు న్నది. ఇది హఠాత్పరిణామం. అనగా విని భండుడు దుఃఖం దిగమింగాడు. కాలాగ్ని సమకోపిఅయ్యాడు. ఒరనుండి యమసమఖడ్గం లాగాడు. కన్నులు పెద్దవిచేసాడు. తేజస్వంతుడయ్యాడు. ఆ దుష్టస్త్రీని యిపుడే చంపుతా శాంతిస్తా, బంధుసుఖం అందిస్తా. అంటూ నాగువలె బుసకొడు తున్నా దతడు.మదించి పైకిలేచి కదిలాడు. దానవ శ్రేష్ఠులందరు భ్రాంతిచెంది అతనిని ఆపేరు, కోపంతో మండిపడుతూ అన్నారు. స్వామీ ఆ నీచస్త్రీకోసం ఇంతసాహసం దేనికి? మేము ససైన్యంగా యుద్ధానికి వెడతాం. మీరు ఉంటేచాలు. బ్రహ్మాండభాండం బద్దలుకొట్టగలం. ఈ అబల ఒకలెక్కా! సప్తసముద్రాలను జుర్రివేస్తాం. కులపర్వతాలు కూల్చివేస్తాం. ముల్లోకాలు తలక్రిందులుచేస్తాం. దేవత లను ఛేదిస్తాం, భువనాలను భేదిస్తాం, దిక్పాలురను పిండి గుండచేస్తాం, ఆజ్ఞనివ్వండి మహామతీ! అంటూ మహదహంకార గర్వంతో పలికిన ఆమాటలవిని మహాకోపంతో కళ్లెర్రజేసాడు భండుడు. విశుక్రా! వెళ్లు అదృశ్యరూపంతో, శత్రురాజధానిలో జయవిఘ్న మహా యంత్రం స్థాపించు. అనగానే విశుక్రుడు కోపోద్రిక్తుడయ్యాడు. అదృశ్య రూపంతో లలితసైన్యంలోనికి చొచ్చుకుపొయ్యాడు. సూర్యుడస్తమించాడు, దిక్కులన్నీ ఎరుపెక్కినై, సంధ్యాదేవి సూర్యానురాగంగలదై పాతాళం అనే పొదరింటిలో రమించు కోరికతో సూర్యునివెంబడించినట్లున్నదా మనోహర దృశ్యం. అస్తసముద్రంలో వేగంగాపడుతున్న సూర్యుని తాకిడికి లేచిన నీటి బిందువులు నక్షత్రాల్లా మెరిసినై, కాటుకవంటి చీకటి నల్లగా వ్యాపించింది. మాయారథమెక్కి విశుక్రుడు కటికచీకటిలో, అదృశ్యాకారంలో లలితారాజధానీనగరం చేరాడు. మంటలు కక్కుతూ ఎనిమిది వందలమైళ్ల విస్తారంగల అగ్నిప్రాకారమండలాన్ని ఆశ్చర్యంగా చూచాడు. ఉద్రేకంతో అటు చూచాడు.లలితాదేవి యింటిచుట్టు తిరుగుతూ సమయం కనిపెట్టి దక్షిణ ద్వారం చేరాడు. ఆ ద్వారదేశంలో స్త్రీశక్తులను చూచాడు. మహాబలులు, ఆయుధ ధారులు, ఏకాగ్రతలు కవచధారులు, వాహనారోహకులు అయి వున్నారువారు. ఇరవై అక్షౌహిణులసేన అక్కడవున్నది. వారిని ద్వార రక్షణకై దండనాథ నియమిం చింది. ఆశ్చర్యపోయాడు. ఆలోచించాడు ఎంతోసేపు. లలితాదేవి యింటి బయటనే వుండి విఘ్నయంత్రం విస్తరింపజేసె. 4×4 పొడవు వెడల్పు కొల్తలతోనున్న శిలా

ఫలకంపై ఆ ఉత్తమ యంత్రం లిఖించాడు. అష్టదిక్కులందు అష్టశూలాలువ్రాసి, మారణబీజాలు శిరోభాగంలో వ్రాసిన అష్టదేవతలతో యంత్రం అందంగా వ్రాసాడు. అలస, కృపణ, దీన, నితంద్ర, ప్రమీలక, క్లీల, నిరహంకార అనే వారే ఆ దేవతలు. ఎనిమిదిశూలాలపైన ఎనిమిదిమంది దేవతలను చిత్రించి ఆ యంత్రాన్ని చక్కగా మంత్రించాడు. మేకపోతులు మొ॥ బలులిచ్చాడు. దానిని శత్రునగర యుద్ధరంగంలో స్థాపించాడు. ఆయంత్రం పైకిలేచి, ఒక్కఉదుటునదూకి, యుద్ధరంగంలో కటక వ్యూహంలో పడింది. అదిచూచిన, అక్కడున్న శక్తు లందరు విస్తుపోయి హస్తశస్త్రాలు జారవిడిచారు. వారనుకున్నారు.

చచ్చిన రాక్షసులు మనలనేమియు చేయలేరు. ఇక యుద్ధంచాలించండి. యుద్ధహింస ఉభయపక్షాలవుంటుంది. అది పాపహేతువు. దేవతలకోసం మనంచేసే యుద్ధంవల్ల మనకేం లాభం? ఫలితం శూన్యం. ఈలలితా మహారాణి మనస్వామిని అసలెవరీవిడ, దండనాయక, మంత్రిణి, వీళ్లెవరు? మనం వీళ్లకు సేవచెయ్యడమేమి? దానివల్లమనకు ఒరిగేదేమి? ఒకరాణి, ఇంతమంది సేవకులా? ఏమంతగొప్ప ఇది, అమాయకుల శరీరాలుచీల్చే ఆయుధాలవల్ల ఏం ప్రయోజనం, మనశరీరాలు ఆయుధ ఆఘాతాలతో అలమటించిపోతాయి. యుద్ధం అంటే మరణం, ఇక చాలిది, జీవితాలు వ్యర్థాలు, మన ఉత్సాహం ఇకపనిచెయ్యదు, హాయిగా నిద్రపోదాం ఆలస్యం తో సమానమైన మనశ్శాంతి మరొకటి వుండదు. ఇలావున్న మనల్ని చూచిన రాణిమాత్రం ఏంచేస్తుంది? మనవల్లే ఆమె రాణిగా నిలబడింది. ఇలా మనం వుపేక్షిస్తే రాణిబలహీన అవుతుంది. అపుడామె మనల్ని ఏమిచెయ్యలేదు. అంటూ యుద్ధం విరమించి, ఆయుధాలువిడిచి ఆ శక్తిసైన్యం నిద్ర మత్తులోతూగుతూ ద్వారం వద్ద తిరుగుతున్నట్లు కనిపించారు. ఇది ఒక సైనిక ఉదాసీనత, విస్మరణ, విప్లవం ప్రతిఘటన నిర్లిప్తత ఏమో ఏదో తెలియని విచిత్ర పరిస్థితి అక్కడ ఏర్పడింది. కార్యమాంద్యం, ఆలస్యం అంతట తాండవిస్తున్నది. శక్తిమహానగరం శిధిలమయింది. ఈవిపత్కర పరిస్థితితో రెండవరోజు అర్ధరాత్రి దాటింది. ముప్పది అక్షౌహిణుల సైన్యంతో విశుక్రుడు శత్రుసైన్యంవున్న నగరానికి మహా ఆర్భాటంగావచ్చాడు. యుద్ధ భేరీ మోగించాడు. శక్తిసేనలు తమకు పట్టనట్టుండె. విఘ్నయంత్ర వికారాలు మహాప్రభావవతులైన మంత్రిణీ దండనాథలను తాకలేదు. మిగిలిన శక్తులు ఆవికారాలు తాకినలిగి పోయారు. మిక్కిలి చింతించారు. అయ్యో! ఆశ్చర్యం! మహాకష్టం! భయం! అను కుంటూ యుద్ధసంరంభం అస్తమింపజేసారు. నిద్రమత్తులోతూలుతూ తిరుగుతున్నారు. మామాటలువినడంలేదు వాళ్లు. లలితను గౌరవించడంలేదు. ఉదాసీనంగావున్నారు. శక్తులందరు సహనంకోల్పోయారు. అనిచింతిస్తూ మంత్రిణీ దండనాథలు చక్రరథ మెక్కి లలితతో అన్నారు.

మంత్రిణిదేవీ! పరమేశ్వరీ ! శక్తులు యుద్ధవిముఖులయ్యారు. కారణం అబోధం. నీవు విశ్వవశవు, వీళ్లు అవశ్యలు పరస్పర విరక్తులు. నిష్కర్మలు. పరస్పరం ఎడమొగం,





పెడమొగంగా వుంటున్నారు. నిద్రానిమగ్నులు, దుష్ట వాక్య ప్రచారకలు, దండిని, మంత్రిణి, మహారాణి, యుద్ధం, ఏమిటివన్నీ? అంటూ ఎద్దేవాచేస్తున్నారు. ఇంతలోనే శత్రువు భయంకరంగా యుద్ధానికి వచ్చాడు. భూభాండం బద్దలగొడుతున్నాడు. ఈ రహస్యం నీవు గ్రహించాలి అంటూ మాతతో అని ఇద్దరూ నమస్కరించారు తల్లికి. లలితాదేవి కామేశ్వరుని ముఖంచూచి చిరునవ్వు నవ్వింది. ఆమె దంతపంక్తి మిక్కిలి ఎర్రగా మెరిసింది. ఆ చిరునవ్వుల కిరణ సమూహంలో గజముఖుడు జన్మించాడు. మదధారలు స్రవించగా, మందారపూల రంగుగలిగి, చంద్ర కళాధరుడై, బీజాపూర, గద, చెరకువిల్లు, శూలము, సుదర్శనచక్రము, పద్మము, పాశము, కలువ, వరివెన్ను, వరదహస్తము, అంకుశము, రత్న కుంభము పదిహస్తములలో ధరించి, బొజ్జగలవాడై, చంద్రుని శిగలో తురిమి, ఘీంకారముచేస్తూ, సిద్ధిలక్ష్మిని కౌగిలిలో నుంచుకొని వచ్చిన ఆగజ ముఖుడు పరమేశ్వరికి నమస్కరించాడు. తల్లి ఆశీస్సులను పొందాడు. ఆమె శాసనం శిరోధార్యం అన్నాడు. జయవిఘ్న యంత్రచ్ఛేద నకై బయలు దేరాడు. రాచనగరులో తిరుగుతున్నాడు. రహస్యంగా ఒకచోటనున్న జయ విఘ్నయంత్రాన్ని చూచాడు. భయంకరములైన తనదంతాలతో ఆ శిలా యంత్రాన్ని ముక్కలుచేసాడు. ఆయంత్రంలోని దుష్టదేవతలను దుమ్ము దుమ్ముచేసాడు. దానిని ఆకాశానికి విసిరివేసాడు. మత్తువదలింది శక్తిదేవత లకు కిలకిలా రావాలు గావించారు. శస్త్రాలుధరించారు, యుద్ధానికి సిద్ధ మయ్యారు. క్షణంలో జరిగిన యీ దురాగతానికి భండుడు క్షోభించాడు. గజముఖుడు అనేక గజముఖులను సృష్టించాడు. వారిగండస్థలాల నుండి మదధారలు స్రవిస్తున్నవి. అక్కడ తుమ్మెదలు గుంపులుగాచేరినై, ఝుంఝుం అంటున్నవి. గణపతి విజయగాధను గానంచేస్తున్న ట్లుగా వున్నదాఘట్టం. ఈగణపతులందరు దానిమ్మపూల కేసరములరంగు గలిగియున్నారు. సముద్రాలను లీలావిలాసంగా రక్షించదానికి సిద్ధమవుతున్నారు. ఆమోదుడు, ప్రమోదుడు, సుముఖుడు,దుర్ముఖుడు, అరిఘ్నుడు విఘ్నకర్త అనే ఆర్గురు విఘ్ననాయకులు. బుద్ధి మొ॥శక్తులచే సేవించబడేవారు. ఏడుకోట్ల హేరంబులకు నాయకులు వీరు మహాగణపతియొక్క యుద్ధంలో ముందుగా వెళ్లి, అగ్నిప్రాకారం వలయందాటి, కోపంతో హుంకారంతో అనేక వైపుల నుండి రాక్షసులపై పడ్డారు. భయంకర పూత్కారాలుచేసారు లోకాలు చెవుడు బారినై.

విశుక్రుడు చూచాడది. ససైన్యంగా గజాసురునిపంపేడు. వాడు దుర్బుద్ధి. గణపతి ఏడక్షౌహిణుల సైన్యంతో వెళ్లేడు. సింహనాదంచేసేడు గజాసురుడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. గజాసురుని భుజబలంతగ్గు తున్నది. గణేశ్వరుని పరాక్రమం హెచ్చుతున్నది. అదిచూచి విశుక్రుడు పాలిపోయినాడు. మూషికవాహనుడైన గణేశ్వ రుడు వీరశ్రేష్ఠుడయ్యె. ఏడక్షౌహిణులసైన్యంతో గజాసురుని చావగొట్టె వాడుచచ్చాడు. గణపతివెళ్లి అమ్మ అంకమందు హాయిగా వున్నాడు. ఆ రాత్రి రాక్షసులకు కాళరాత్రిగా మారింది. తెల్లవారింది లలితాదేవి గణపతిపరాక్రమాన్ని ప్రశంసించి ప్రీతి పొందింది.

ఆయనకు వరమిచ్చింది. కుమారా ! దేవతలందరి పూజలకు ముందుగా నువ్వు పూజించబడుతావు అంది. అది ఉత్తమవరం.

## మూడవరోజు యుద్ధం

తన సోదరుడు గజాసురుడు యుద్ధంలో మరణించాడన్న వార్త విని యుద్ధవిశేషాలు కూడవిన్న భండుడు సంతాపానికి గురయ్యాడు. విషంగ, విశుక్ర అనపేర్లు గల ఇద్దరు సోదరులను యుద్ధానికి పంపాడతడు. వాళ్లిద్దరు మహోత్సాహంతో బయలుదేరారు. ముల్లోకాలను ముప్పుతిప్పలుపెట్టే వాళ్ళ సైన్యం వాళ్లను అనుసరించింది. నాలుగు వందల అక్షౌహిణుల సేనవిశుక్రుని చుట్టి వస్తున్నది. వాడు మహాప్రతాపం చూపిస్తుండె. భండుని మేనల్లుడు ఉలూకుడు మొ॥వారు మదోన్మత్తులై బయలు దేరారు. వీళ్లు భండుని అక్క అయిన ధూమిని కొడుకులు. భండాసురుడే వీళ్లకు అస్త్రవిద్యాగురువు. వీరపరాక్రమశీలురగు వీరు సేనాధిపతులుగా వచ్చారు. ధనుష్టంకార ధ్వనులతో దశదిశల మారుమోగిస్తుండిరి. మేనమామ లకు ఆనందం కలిగిస్తుండిరి. వాహనాలెక్కి మహదహంకారులై ధనువుల అల్లెత్రాడును అల్లేలాగి అట్టహాసంచేసి అనుసరించారు. విశుక్రుని యువరాజ చిహ్న ఛత్రచామర ప్రకాశియై మదగజమెక్కిన విశుక్రుడు యుద్ధరంగంలో అట్లే ప్రవేశించాడు. సైనికులు కలకల ధ్వనులుగావించారు. వాడు సింహనాదంచేసాడు. ఆ గంభీర భయంకర నాదం విన్నారు శక్తులు. కలతచెందారు. తొట్రుపడ్డారు. విజృంభించారు. పంక్తులుదీరి ఆఅగ్ని ప్రాకార వలయంనుండి బయటకువచ్చారు. వారి కాంతులతో ఆకాశం మెరుపులతో నిండిపోయింది. వారి శరీరకాంతులతో ఆకాశం ఎర్రతామరలు పూసి నట్లుంది. భండసోదరులు విన్నారీ విశేషాలు. హఠాత్తుగా మంత్రిణీ దండనాథులపై యుద్ధానికి సిద్ధమయ్యారు. మంత్రిణీ దండనాథలు కిరిచక్ర, జ్ఞేయ చక్ర రథా లెక్కారు. రాజచిహ్న ఛత్రచామరాలా రథాల కలంకారాలు. చామరాలు వీచుచున్నవికూడ. అప్సరసలు గానం చేస్తున్నారు. వీరిద్దరు లలితాదేవి ఆజ్ఞతో విషంగ విశుక్రులతో యుద్ధం చెయ్యడానికి శ్రీచక్ర రాజ రథరక్షణకు నియమించబడ్డారు.

రథంలో కూర్చున్నది దండనాథ. అస్త్రభయంకరసైన్య సహిత ఆమె. రణోన్ము ఖయై బయలుదేరింది. ఒకచేతివేలితో నాగలి ఆయుధాన్ని తిప్పు తున్నది. వేరొక చేతితో రోకలి ఆయుధాన్ని మాటిమాటికి తిప్పుతున్నది. ముఖపద్మం ముద్దులొలుకు తున్నది. మేలిముసుగు నుండి సిగలోని చంద్ర కళ తళతళమెరుగు లొలుకుతున్నది. మేలిముసుగునుండి సిగలోని చంద్రకళ తళతళ మెరుగులీనుతూ మిలిమిలలాడు తున్నది. శత్రువుకంటె ముందుగానే దెబ్బకొట్టే ప్రయత్నంచేస్తూ పరాక్రమంతో విజృంభిస్తున్నది. ధనుష్టం కారం ప్రపంచవ్యాప్తంగా చేస్తున్నది. అందంగా అల్లిన జడలో చంద్రుడనే చివురాకు అలంకరించుకున్నది. మూడవకన్ను సిందూరతిలకంలా చిత్రం! అనిపిస్తున్నది. హస్తపద్మం మణికంకణంతో అత్యంత సుందరమై అదేదో పద్మంలా భాసిస్తున్నది. అమ్ములపొదినుండి లాగిన బాణం అలవోకగా తిప్పుచున్నది.



విజయీభవ! వర్ధస్వ! అంటూ అమృతవాక్కులతో అతి సంతో షంతో నాట్యాలుచేస్తూ దేవతలు, మునులు ఆశీర్వదిస్తుండిరి. గేయచక్ర రథోత్తమచక్రపుటంచుల ఘట్టనలు భూమిని చీలుస్తూ రాక్షసహృదయాలనుబీటలు తీయిస్తుండె. అసంఖ్యాక దేవయువ తులు విశ్వసమ్మోహన గీతగానములతో దండనాథ యొక్క సకలలోకాతిశయవైభవాన్ని వర్ణిస్తూ ఆమెకు ఆనందంకలిగిస్తుండిరి. కల్పాంతకాల కల్లోలసాగరోపమ సమరవి జృంభాష్టాక్షౌహిణీ సైన్యాన్ని తనతో లాక్కుపోతున్నది దండనాథ.

అగస్త్యా ! ఆసైన్యంలోగల స్త్రీశక్తుల వివిధ వర్ణాలనుగూర్చి వివరిస్తా విను. బంగారము, దానిమ్మపండు, సిందూరము, కలిగొట్టుపువ్వు, శ్యామ లము, మణులు, గరుడపచ్చలు, పంచబాణ మిశ్రిత శతకోటికాంతి దేహులు, చిత్రవిచిత్ర వస్త్రధారులు, విశేష వర్ణ శరీరులు, వివిధాయుధ ధారులు అగు అనేక స్త్రీశక్తులు దండినీసైన్యంలో దండిగావున్నారు. (కొందరి శరీరాలు బంగారురంగు ఇంకొందరు దానిమ్మపండు రంగు, ఇలావున్నాయి) గాజుపర్వతాల వంటివస్త్రాలు ధరించినవారు. దండినీ సైన్యం వీరితో అసంఖ్యాకంగా కదిలింది. ప్రభావము, సద్గుణము ఆశ్రితరక్షణము రాక్షస సంహారము, సర్వారాధన మొ॥ వానితో దండిని లలితాపరమేశ్వరితో సమానమైనది. ముఖ్యవిశేషం ఏమంటే పరమేశ్వరి మంత్రాధికారంకోసం తనచేతి ఆజ్ఞాముద్రాంగుళీ యకమును దండిని వశంచేసింది. ఇదొక్కటే ఇద్దరికీ తేడా. మరేదీలేదు. మంత్రిణీ దండనాథల సైన్యం ప్రయాణిస్తుంటే భూమి బీటలుతీసింది. ధరాధూళిరేగి సముద్రాలు బురదలైనవి. దొమ్మి యుద్ధం గగుర్పాటు కలిగించింది. గుర్రాలు, రథాలు, గజాలు అధిష్ఠించి పరస్పరం ఘోరయుద్ధం చేస్తుండిరి. పదాతులు బహు ప్రావీణ్యతను ప్రదర్శించారు. దండనాథ విషంగునితోను, శ్యామాశక్తి విశుక్రునితోను యుద్ధం ఆరంభించారు. శ్యామమణిధనువు ధరించింది. అశ్వారూఢ వులూకజిత్తుతో సంపదీశ పురుషునితో, నకులీదేవి విషునితో, మహామాయకుంతి షేణునితో, ఉన్మత్తభైరవిమల దునితో, లఘుశ్యామకు శూరునితో, స్వప్నేశిదైత్య రాజుమంగళునితో, వాగ్వాదిని ద్రుపణునితో, చండకాళికోలాటునితో, యుద్ధంచేసారు. వీరిది నూరు అక్షౌహిణుల సైన్యం, వారిది ఒక అక్షౌహిణి మాత్రమే. శక్తి సేన వర్ధిల్లుచున్నది. తన సైన్యం తగ్గుచున్నది. విశుక్రుడు చూచాడు. కోపోద్రిక్తుడై దాహం కలిగించే తృషాస్త్రంవారిపై ప్రయోగించాడు. శక్తిసైన్యం దాహంతో విలవిలలాడింది. దాహం జ్వరం వారిని ఆక్రమించి పీడించసాగింది. ఇంద్రియాలు పనిచేయడం మానివేసినై, నోరెండి పోయింది. చేతులనుండి ఆయుధాలు జారిపోయాయి. భూమిమీద పడ్డారు వారు. మంత్రిణి, వారాహి ఆ పాటుచూచి చాలా చింతించారు. రథమందుండి భయాన్ని శంకిస్తున్న మంత్రిణితో దండనాథ అన్నది. చెలీ ! వారాహీ ! ఈ దుష్ట విశుక్రుని తృషాస్త్రంమన శక్తులను శిథిలం చేస్తున్నది. ఇది విధి నిర్ణయం. శక్తులు యుద్ధం మానేసేరు. మాటామంతీ లేదు వీరికి ఈపరిస్థితి తల్లికి చెప్పాలి. ప్రతీకారం తెలుసు కోవాలి. మనది 82 వేల అక్షౌహిణీసైన్యం. అందరికీ దాహమే. ఈ అవకాశంతో

రాక్షసులు శక్తులను సులువుగా సంహరిస్తారు. నువ్వు వుపాయం ఆలోచించు. నేనుయుద్ధ ప్రయత్నంచేస్తా.నీ రథంలో ఒకభాగంలో మదిరాసింధువు (కల్లు సముద్రం) వున్నది. ఆ స్వామిని నువ్వాజ్ఞాపించు. కావలసినంత మదిరమన వారికి లభిస్తుంది. మన వారి దాహంతీరుతుంది. యుద్ధోత్సాహం కలుగు తుంది. మహాబలం కలుగుతుంది. అనగానే వారాహి సుధాసింధువును పిలిచెను.

అతడు వచ్చెను. బంగారుశరీరము, మత్తులోవాలిపోయే ఎర్రనికళ్లు. పూల మాలలు ధరించినవాడు. దండనాథకు నమస్కరించాడు. లేత సూర్యుని వలె నున్న ఆతడు ఆమె ఆజ్ఞను పాలించాడు. బహువిధాలుగా రూపుదాల్చాడు. చీకటి మానులా నల్లని వాడయ్యాడు. ఇంకొకచోట తెల్లగ నున్నాడు. ఈ సింధురాజు మహావాయు సహితుడై వ్యాపించి ఏనుగు తొండాలవంటి కోటానుకోటల్ల మధుధారలు సర్వత్ర వర్షించాడు. పుష్కలావర్తకాది మేఘాలచేత తడుపబడిశక్తిసైన్యంపై పడ్డాడు. ఈ సువాసన తగలగానే చచ్చినవాడు కూడ బతికిలేచి నిలబడతాడు. బలహీనుడు అధిక బలుడవుతాడు ఆ మధుదారలు తాగుతూ శక్తిసైన్యం దప్పిక నశించగా లేచి నిలబడ్డారు. ఆ మధుధారలు రాక్షసుల మీద పడకుండా లలితా పరమేశ్వరి శక్తిసైన్యం చుట్టూ బాణప్రాకారం నిర్మించింది. దేవతలాశ్చర్య పోయారు. శక్తులు వారి వారి యిష్టానుసారం రుచులెంచుకొంటూ మదిరలు సేవించారు. పీకలుదాకా మిక్కుటంగా వెక్కసంగా తాగుతూ తూలుతుండిరి. మూడవరోజు యుద్ధంలో రెండుజాములు (6గం) ఇలా మధువర్షం కురిసింది అందలిరకాలు. బెల్లంతోచేసినవి, పిండితో చేసినవి, ఇప్పపువ్వుతో చేసినది, గోమంత పర్వతంపై ఒక కడిమిచెట్టు తొర్రనుండి వచ్చినది, మూడు రకాలతాటికల్లు (హైతాలి, లాంగలేయ, తాలజాత) కల్పవృక్షం నుండి పుట్టినది. మంచిరుచి, వాసనగలిగి అనేక దేశములందు పుట్టినవి. పొగడపువ్వ వాసనగలిగి, ధ్వనిచేస్తూ నురుగుతోనున్నవి. కారము, వగరు, చేదు, తీపి గలవి, అనేక రంగులుగలవి, కోయనివి, దట్టమైనవి, చల్లనివి, చురుకైనవి, ఎముకలను అతుకునవి, యుద్ధభ్రమను పోగొట్టునవి, చల్లనివి, చురుకైనవి, కొంచెం వెచ్చనివి, బాధలను పోగొట్టునవి, అయిన ఈ మద్యములు వరుణదేవుని పుత్రికలు.జయము నిచ్చునవి. ఇట్టి అనేక మదిరా ధారలు సుధాసింధువు వర్షించాడు. ఆ యుద్ధంలో ఒక్కొక్క శక్తిమూడు గంటలసేపు ఐరావతము తొండంతో సమానమైన సుధాధారలను ఆపు లేకుండా సంతోషంతో సేవించింది. నోరుపైకెత్తి ఆశతో నాలుకలల్లలా డిస్తూ సంతోషంతో కన్నులు మూసి, మదిర మనసారా సేవించారువారు. తదనంతరం సుధాసాగరుడు దివ్యరూపం ధరించాడు. దండనాథుకు నమస్క రించాడు. లలితమ్మతో మాట్లాడాడు. తల్లీ ! మహారాణీ ! శక్తిసేన దాహం తీర్చాను. వీరిని కృపతోచూడు. మృదుమధురగానాలు, మంజుల ధ్వనులనాట్యాలు,తాళశబ్దాలు, కదిలే సుందరస్తనలు, సుహాసినులు, ఆనందమంద గమనాలతో ఒకరిపై ఒకరు పడేవారు, పిరుదులపై జారేవడ్డాణాలు, వస్త్రాలుగల హంసగమనలు, ఎగసిపడేవారు, ఆయుధాలులేకనే





చేతుల తిప్పేవారు, వీళ్లనుచూడండి అనగానే పరమేశ్వరి సంతోషంతో వారిని చూచింది. మదిరా సముద్రునితో అన్నదిలా. సుధాసముద్రా! నీ సహాయానికి మెచ్చాను. ఇది దేవకార్యం నీవల్ల నిర్విఘ్నమయింది. ద్వాపరయుగంలో యజ్ఞాలలో నీవు సోమపానంవలె మిక్కిలి ఉపయోగపడగలవు. యజ్ఞంలో మంత్రపూతమైన నిన్ను దేవతలందరు సేవిస్తారు. అట్టి నిన్ను మానవులు సేవిస్తే సిద్ధిబుద్ధి, బలం, స్వర్గం, మోక్షం పొందగలరు. పార్వతి,శివుడు, బలరాముడు, శుక్రుడు, దత్తాత్రేయుడు, బ్రహ్మ, విష్ణువు, మొ।। మహాజనులు నిన్ను సేవిస్తారు. వీరందరికి నువ్వు సిద్ధులు అనుగ్రహిస్తావు అంటూ అమ్మవారు ఆతనిని అనుగ్రహించింది. ఆయన ఆనందిం చాడు.

దండిని మంత్రిణిని యుద్ధానికి తొందరపెట్టింది. శక్తులు తిరగబడ్డారు. కొత్త కల్లు పీకలదాకా తాగిమత్తెక్కి వున్నారు. కళ్లుచింతనిప్పుల్లాగా భగభగ లాడుతున్నవి. వికటాట్టహాసాలు చేస్తున్నారు. ఆ ధ్వనులు అన్ని దిక్కులా వ్యాపించి పర్వతాలను బద్దలుచేస్తున్నవి. హఠాత్తుగా శక్తులు రాక్షస సైన్యంపై చెలరేగారు. హెచ్చి పెచ్చుమీరి పోయిరి. రాక్షస రక్తంతో వాళ్ల వస్త్రాలు ఎరుపెక్కిపోయె. వాళ్లకాళ్లు, మాటలు తడబడుతుండె. వీరభాషలు, విజృంభణలు, విశృంఖల విహారాలు, మృత్యువుల్లా మితిమీరి, నిర్భయంగా స్వైరవిహారులై యువరాజు సైన్యాన్ని మట్టుబెట్టు తుండిరి. సర్వాంగదృష్టులై సమూహంగా గుండ్రని ఆకారాలు ధరించిన శక్తి సైన్యంమతిమరచి మరిమరి చెలరేగి చిత్తు చిత్తుగా శత్రుసైన్యాన్ని చీల్చి చెండాడె. దండ్రిని నూరక్షౌహిణుల సైన్యాన్ని చీల్చి వేసింది. మంత్రిణి నూటయాభై అక్షౌహిణులసైన్యాన్ని మట్టు బెట్టింది. మదించిన అశ్వారూఢమత్తెక్కిన యెర్రని కన్నులుగలదై నూటయాభై అక్షౌహిణుల సైన్యాన్ని యమసదనానికి పంపింది. సంపత్కరి. మొ. శక్తి దండనాయికలు శత్రువుల ముఖాలను చీల్చివైచిరి. సూర్యాస్తమయం అయింది. తరువాత శ్యామలాదేవి విశుక్రునితో యుద్ధం చేసింది. దేవతల అస్త్రప్రత్యస్త్రాలను భయంకరంగా వదులుతూ మంత్రిణి మహానైపుణ్యంతో యుద్ధం చేసింది. ఆమె మహాతేజస్విని. విశుక్రుని ఆయుధాలను బాణాలతో ఖండిస్తున్నది, వాడు వానిధ్వజాన్ని, రథసారథిని, ధనువును, ఖండించింది. మండుతున్న అగ్నికాంతిగల బ్రహ్మశిరోనామక అస్త్రంతో విశుక్రుని మర్ధించింది. వాడుపురుషాకృతభస్మపుంజమై నేలగూలాడు. దండ నాథ విజృంభిం చింది. విషంగునితోయుద్ధంచేసింది. భయంకరముసలాయు ధంతోవాడిని మోదుతున్నది. వాడిగదయమదండం వంటిది. వాడు ఆగడను పైకెత్తి మహాభయంకర యుద్ధం చేసాడు. గదాయుద్ధంతో వారిద్దరు తమ శరీరాలను కుళ్లబొడుచుకుంటు న్నారు. గతిభేదాలతో, అట్టహాసాలతో, హాహా కారాలతో పరస్పరాభిఘాతాలుకు నేలకూలి మూర్ఛిల్లిలేస్తుంది. వారి గదా ముసలధ్వనులు ఆకాశంలో మారుమోగు తున్నవి. అర్ధరాత్రి దండనాయిక విషంగుని అంతిమయాత్రకు అంకురార్పణ గావించింది. వారాహి విషంగుని తలకు నాగలి తగిలించిముందుకులాగింది.

రోకలితోవాడినెత్తిపై గట్టిగామోదింది. ఆదెబ్బకు వాడు ప్రాణాలు విడిచాడు. రథంతో బాటు చూర్ణమైనేలపైబడ్డాడు. మంత్రిణీ దండనాయికలు మనశ్శాంతితో శిబిరాలకు చేరుకున్నారు.

## నాల్గవరోజు యుద్ధం

అగస్త్యుడడిగాడు. హయగ్రీవ! మహానుభావా! తమరు మంత్రిణీ బలం వర్ణించారు. విషంగవధ వివరించారు. ఇకరణరంగంలో శ్రీదేవి పరాక్రమం వినాలనే కోరిక నాలో విస్తరిస్తున్నది. సోదరమరణం తరువాత భండాసురుడు చేసిన కృత్యాలు వినదలంతు. వాని రణోత్సాహం ఎట్టిది? ఎవరితోయుద్ధంచేసాడు? సోదరులు, పుత్రులు చనిపోయినవానికి ఎవరు సహాయకులయ్యారు? అని కోరగా హయగ్రీవ స్వామి అన్నాడిలా. అగస్త్యా! లలితాదేవి చరిత్ర సర్వపాపహరం పుణ్యప్రదం. అణామాది గుణదయకం. విషువత్తు (రాత్రిపగలు సమముగా నున్నకాలము)నకు సంబంధించిన అయన ప్రారంభకాలములందు, పుణ్యసమయములందు, ఐదు పర్వములందు ఈ చరిత్ర పఠించినవారికి సర్వసిద్ధులను లభిస్తాయి. ఇది కీర్తి ప్రదము ఇకవిను.

సోదరులు విషంగవి శుక్రులు యుద్ధంలో మరణించారు. ఆ పిడుగు పాటు వార్త విని భండాసురుడు నేలవ్రాలాడు. కుంగికృశించి పోయినాడు. శిరోజాలు చెదరిమూర్ఛిల్లాడు. వాడు ఏడుస్తునేవున్నాడు. కోపిస్తూ కుటిలంగా క్రూరంగా ఫాలభాగం, కనుబొమలు ప్రదర్శిస్తూ భయంకరంగా వున్నాడు. కన్నులు కణకణమనేనిప్పు కణాల్లావున్నవి. కృష్ణసర్పంలో బుస్సు మంటున్నాడు. మాటి మాటికి ఖడ్గచాలనం చేస్తున్నాడు. ప్రళయకాలమేఘంలాగా హుంకరిస్తున్నాడు. సేనాపతి కుటిలాక్షునితో అన్నాడు. ఇదిగో కుటి లాక్షా! ఇలాచూడు. విను నామాట యుద్ధంలో తనచూపు మాత్రంచేత నేనా సోదరులు, కుమారులు, వేలాది సేనానాయకులు ఈమెచేత చంప బడ్డారు. ఈశోకాగ్ని ఎలాచల్లారుతుంది అంటావా? ప్రమద అయిన ఆ స్త్రీకంఠం. యుద్ధంలో తెగనరుకుతా. ఆ రక్తంతో ఈఅగ్ని చల్లారుస్తా. నువ్వు వెళ్ల సైన్యాన్ని సిద్ధంచేయ్ అంటూ వజ్రపుదెబ్బలను కూడ ఎదిరించే కవచం ధరించాడు. భుజాలమధ్య వీపున రెండు అమ్ముల పొదులు కట్టు కున్నాడు. గొప్ప అల్లెతాడు ధ్వనిగల ధనువు తిప్పుతున్నాడు. ప్రళయకాలాగ్ని లాగా కోపంతో పురం నుండి బయలుదేరాడు. పురద్వారంవద్ద వున్న తాళ జంఘాదులు నలుగురు శస్త్రాలు, కవచాలు ధరించి అతి గర్విష్టులై అతనిని వెంబడించారు. కుటిలాక్షుడు మొ. ముప్పై అయిదుగురు సేనానులు సహాయంగా వచ్చారు. కుటిలాక్షుడు సర్వసైన్యాధ్యక్షుడు. మిగిలిన వారు వెలిగిపోయే ఆయుధాలు ధరించారు. వారికేశపాశాలు మెరుపులు వెదజల్లుతున్నవి. మిక్కిలి మెరిసే వారి సూక్ష్మరోమాళి శరీరాలలో పులకింతలు రాగా లేత ఎరుపురంగులో మిలమిలలాడి పోయింది. రెండువేల అయిదు అక్షౌహిణులసైన్యం ఒక్కదెబ్బతో శత్రువులను చంపుతాం అంటూ భండా సురునితో



బయలుదేరింది. శూన్యకపురంలో ఒక్కస్త్రీ మాత్రం మిగిలింది. భండాసురుని రథం పేరు అఖిలం. వేయి సింహాలు దీనిని లాగు తున్నవి. వాడు రణగర్వంతో రథం ఎక్కాడు. వాడిఖడ్గంపేరు ఘాతుకం. అది చంద్రహాస సమాకార. ప్రళయకాలాగ్ని జ్వాలా సమాన, అదియుద్ధా నికి తొందరపడుతున్నది. సేనాయానంవల్ల ధూళిరేగింది. దానిని భరించలేని భూమి ఆకాశానికి వెళ్లినట్లున్నది. కొంతసైన్యం భూమిచాలక ఆకాశ మార్గంలో వెళుతున్నది. కొన్నిరధాలు కొందరి భుజాలపైనుండి కదులుతుండె. దిక్కులు, భూమి,ఆకాశం చివరిభాగం ఆ సేనలకు చాలలేదు. పరస్పరం ఒరుసుకుంటూ, పీడిస్తూ,ఏడుస్తూ, నడుస్తుండిరి. అంతటా సేనాసమ్మర్దం. రధచక్రాల్లో నలిగిన వాళ్లు. ఏనుగులకాళ్ల కింద పడ్డవాళ్లు, భండాసురుడు మహానాదంచేసాడు, వజ్రఘోష, మేఘధ్వని సమంఅది. ఆ కఠోరసింహనాదానికి లోకంబద్దలయింది. సముద్రాలెండి పోయినాయి. సూర్యచంద్రులు పారిపోయిరి. నక్షత్రాలు నేలరాలినై. భూమి వూగింది. దిగ్గజాలు భయపడ్డాయి. దేవతలు మూర్ఛపొయ్యారు. శక్తులనగరం అకస్మాత్ భయంతోవశం తప్పె. అతికష్టంగా యుద్ధమధ్యంలో ప్రాణాలర చేత పట్టివుంటున్నారు. భయంతో జారవిడిచిన ఆయుధాలు మరల ధరిస్తున్నారు శక్తులు. అగ్ని ప్రాకారవలయం ప్రశాంతమై మరలలేచింది. భండాసురుని సింహనాదాలు, సైనికుల ధనుష్టంకారాలు, యోధుల అరుపులు జగమంతా శబ్దమయం. ఆ మహానాదం విన్న లలితాంబ భండాసురుడు యుద్ధానికి వచ్చాడని గ్రహించింది. ఇతర శక్తులు ఇతనిని ఏమీచేయలేవని నిశ్చయించుకున్నది. తానే యుద్ధానికి సిద్ధమయింది. చక్రరాజరథం కదిలింది. దానికి నాలుగువేదాలు చక్రాలైనవి. ధర్మార్థ కామమోక్షాలు దానికి అభయం ఆనందమే ధ్వజం. అంతస్థులు తొమ్మిది. బాణాలు ఎక్క పెట్టిన స్త్రీదేవతలు అందులో సిద్ధంగావున్నారు. వారి పరివారం సమృద్ధి. అది పరార్థసంఖ్యను మించినది. వీరిచే దశదిశల రధరక్షణ జరుగుతున్నది. ఆ రథం ఎనభైమైళ్ళు ఎత్తు. 32మైళ్ళ విస్తీర్ణం. అది వెలిగిపోతూ ముందుకు కదులుతున్నది. దండనాథశ్యామ దానిని కదిలించింది. బాలగేయచక్రరథం, కిరి చక్రరథం వరుసగా కదిలినై. నరులు, సింహాలు, ఒంటెలు, సర్పాలు, మృగాలు, పక్షులు, గుర్రాలు, ఏనుగులు, భేరుండాలు, శరభాలు, పులులు, గాలినెదిరించి పరిగెత్తే ఇర్రిజింకలు ఇలా అనేక వాహనాలపై ఇతర శక్తులు కదిలినై. భూమ్యాకాశాలపైవారి ప్రయాణం, యుద్ధకాంక్ష వారి చరమాశయం. భండాసురవధ అంతిమవాంఛ. ఇంతే ! అగ్ని ప్రాకారచక్రం యొక్క ద్వార మండలం 8 మైళ్ల పొడవుంది. అయినా సేనాపతికి చాల లేదు. ఆ ద్వారాన్ని జ్వాలామాలిక అనే నిత్యాశక్తి సైన్యం వెళ్లడానికి వీలుగా విశాలం చేసింది. జగన్మాత లలితాపరమేశ్వరి మహాభ్యుదయంతో ప్రతాపంతో అగ్నిపురం నుండి వరద్వారం ద్వారా బయలుదేరింది. దేవదుందుభులు మ్రోగసాగెను. పూలవానలు కురిసె, పెద్ద ముత్యాల గొడుగు ఆకాశానికి అనంత కాంతినొసగె. లలితా సైన్యంలో విజయసూచక శకునం. శత్రు సైన్యంలో ఉత్పాత సూచకశకునం రెండును ఒక్కమారే ప్రవర్తిల్లినై.

ఉభయ సైన్యానికి యుద్ధం జరిగింది. ప్రయోగబాణసమూహం రెండు వైపుల జరగడంవల్ల యుద్ధభూమిలో కారుచీకట్లు కమ్ముకొంటున్నవి. ఏనుగులు చస్తున్నవి. రక్తం చిమ్ముతున్నది, రాక్షసుల శిరస్సులపై నున్న తెల్ల గొడుగులు నేలరాయితున్నై. ఆకాశం,దిశలు, భూమి,ఏనుగులు, మొ॥ ఏమీ కనిపించడంలేదు. ఉభయ సేనారక్తం నదిగా పారుతున్నది. తలలు తెగి నాట్యంచేస్తున్న మొండాలు తీరాలకు కుప్పలు తెప్పలుగా చేరుతుండె. అవి వృక్షాలను ఆవిష్కరించినట్లున్నై, రాక్షసుల తలవెంట్రుకలు రక్తపు టేరును కోమలంగా చేసినై. తెగిపడిన తెల్లగొడుగుల ఆ నదితెల్లతామరలవలె వెలుగు చుండె. చక్రాలవల్ల తెగిపడిన ఏనుగులపాదాలు తాబేళ్లవలె వెలుగు తున్నవి. శక్తులచే నరకబడిన రాక్షసుల చెక్కిళ్లు, కంఠాలు ఆనదిలోగండ శిలలవలె దొరలు తున్నవి. కాండములు తెగిపడిన సైనికుల చామరాలు ఆనదికి నురగలై అందగించి నవి. వాడికత్తులనే తీగల గుంపుతో దట్టమై ఆనదీ తీరాలు విలసిల్లినాయి. చనిపోయిన రాక్షసుల కన్నులపంక్తి ముత్యాల మూటలవలె ముక్తిస్థానాలవలె నొప్పె. వందలాది రాక్షస వాహనసమూహాలు ఆనదిలో మొసళ్లవలె, చేపలవలె ప్రకాశిస్తుండె. ఈ ఉభయసేనారక్తనది, నిజనదివలె పయనిస్తున్నది, ఈ విధంగా నాల్గవరోజు యుద్ధం ఉదయం ఆరంభమై ఆరుగంటల సమయం వరకు మృత్యుభయంకరంగా సాగింది. తరువాత భండాసురునకు లలితాదేవితో యుద్ధం ప్రవర్తిల్లింది. అస్త్రప్రత్యస్త్ర సంక్షోభం దిక్కులకొనలవరకు దట్టమయ్యె దిక్కుల వివరం తెలియరాలేదు. ధనుస్సు నారీతం కారాలు, హుంకారాలతో యుద్ధం భయం కలిగించింది. శత్రుప్రాణాపహారులైన బాణాలు ఆ తల్లి అమ్ములపొది నుండివస్తున్నవా? హస్తవేగంతో ధనువు నుండి వస్తున్నావా ? తెలియ రాకున్నది. ఆమె ఒక్క బాణమే ప్రయోగిస్తుంది. అది ధనువు నుండి విడిపోయి పదిబాణాలుగా మారుతుంది. ముందుకు పోయేటప్పుడునూరవు తుంది. రాక్షససైన్యాన్ని చేరినపుడు వెయ్యవుతుంది. రాక్షస శరీరాలను తాకినపుడు కోటి సంఖ్యలై వాళ్లను తాకుతుంది. లలితాదేవి బాణప్రయోగం సర్వత్ర చీకటి కమ్మివేసింది. ఆకాశాన్ని బద్దలు చేసింది. ప్రచండుని మర్మాలను తాకింది, ఛేదిం చిందిం.

తరువాత భండాసురుని కళ్లు కోపంతో ఎరుపెక్కినవి. వాడు తల్లిపై బాణవర్షం కురిపించాడు. అంధతామిస్ర అస్త్రంప్రయోగించాడు. లలితా పరమేశ్వరి సూర్యాస్త్రంతో దానిని త్రుంచివేసింది. వాడు పాషండాస్త్రం ప్రయోగించాడు. గాయత్రీ అస్త్రంతో దాని అణచివేసింది అమ్మ. శక్తులదృష్టి నివారకమైన అంధకాస్త్రం వాడు ప్రయోగిం చాడు. చాక్షుష్మత అస్త్రంతో దాన్ని అణచివేసింది అంబ. వాడు శక్తినాశకాస్త్రం వేశాడు. సూర్యాస్త్రంతో దాన్నినాశనం చేసింది. వాడు అంతకాస్త్రంవేసాడు. మహామృత్యుం జయాస్త్రంతో దానిని భస్మం చేసింది. సర్వఅస్త్ర స్మృతి నాశనం అనే అస్త్రం వాడు విడిచాడు. మేధాఅస్త్రం ప్రయోగించి దాని బలం నశింపజేసింది పరమేశ్వరి భయాస్త్రం ప్రయోగించి శక్తులకుభయం కలిగించాడువాడు. అభయప్రదమైన ఐంద్రాస్త్రం ప్రయో



గించి ఆభయాన్ని పోగొట్టింది అమ్మ. మహారోగాస్త్రం ప్రయోగించాడువాడు. క్షయ మొ॥ అనేకరోగాలు శక్తిసైన్యాన్ని కమ్మివేసినై, శక్తులు అనేకరోగాలతో విలవిలలాడి పోయిరి. నామత్రయ మహామంత్ర మహాస్త్రాన్ని ప్రయోగించింది ఆతల్లి. ఆ అస్త్రం నుండి అచ్యుతుడు, అనంతుడు, గోవిందుడు పుట్టి హుంకారం ఉచ్చరించి క్షణంలో ఆ రోగాలను నాశనం చేసి వారికి ఆనందం కలిగించారు వారు అమ్మకు నమస్కరించి మూడు లోకాల్లో ఆమె భక్తుల రోగాలు పోగొట్టడానికి నియమించబడిన లోకాలకు వెళ్లిపోయినారు. భండుడు, ఆయుర్నాశనాస్త్రం విడిచాడు. కాలసంకర్షిణి అనే అస్త్రంతో దాన్ని అంతంచేసింది అంబిక. వాడు మహాసురాస్త్రం ప్రయోగించాడు. అందుండి మహాకాయులు, మహాబలశాలురు అయిన అనేకమంది రాక్షసులు ఆవిర్భవించారు. మధు,కైటభ, మహిషాసుర, ధూమ్రలోచన, చండ, ముండ, చిక్షుభ, చామర, రక్తబీజ, శుంభ, నిశుంభ, కాల కేయ, ధూమ్ర, అనే రాక్షసశ్రేష్ఠులు పుట్టారు. ఇంకా అనేకమంది మహాబల శాలురుపుట్టి తమ కఠిన శస్త్రాలతో శక్తిసైన్యాన్ని మర్దించారు. భయంకరంగా గర్జించారు. శక్తిసైన్యం హాహాకారాలుచేస్తూ రక్షించమంటూ లలితాదేవిని శరణు పొందారు. ఆతల్లి మహాకోపిష్టి అయింది. అట్టహాసంచేసింది. అందుండి దుర్గ పుట్టింది. ఆమె సమస్తదేవతల తేజస్వరూపిణి. విశ్వరూపిణి.

ఆమెకు శివుడు శూలం ఇచ్చాడు. విష్ణువుచక్రం ఇచ్చాడు. వరుణుడు చక్రమిచ్చాడు. అగ్నిశక్తినిచ్చాడు. మరుత్తు ధనువు, అమ్ములపొది ఇచ్చాడు. ఇంద్రుడు వజ్రాయుధం ఇచ్చాడు. కుబేరుడు పానపాత్ర నిచ్చాడు యముడు కాలదండం, మహాదండం, పాశం ఇచ్చాడు. బ్రహ్మకమండలం, ఐరావతం ఘంట, మృత్యుదేవత ఖడ్గం, డాలు, సముద్రుడుహారం, విశ్వకర్మ భూషణాలు, ఇంకా కొందరు అనేక వస్తు వస్త్రాలంకారాలు ఇచ్చారు. ఈ అలంకారాలు సూర్యపంక్తుల్లాగా ఆమె దివ్యశరీరంపై మెరుస్తున్నవి. సింహవాహనం ఎక్కి ఆమెయుద్ధం చేసింది. మహిషా సురుడు మొ॥రాక్షసులను చంపింది. ఇదంతా పూర్వం. సప్తశతిలో చండిక చేసినట్లున్నది. ఈ దుష్కర కృత్యం నిర్వహించిన దుర్గ. లలితకు నమస్కరించింది. ఇంతలో దుష్టభం డుడు శక్తిసైన్యంపై మూకాస్త్రం ప్రయోగించాడు. మహావాగ్వాదిని అనే అస్త్రంతో దానిని అంతం చేసింది లలిత. భండుడు వేదాలను దొంగిలించే రాక్షసులను సృష్టించాడు. లలిత తనకుడిచేతి బొటనవ్రేలి గోరుతో దానినినెట్టి వేసింది. వాడు అర్ణవాస్త్రం ప్రయోగించాడు. దానినుండి పుట్టిన జలసముద్రంలో శక్తిసైన్యం మునిగిపోయింది. అపుడు లలితకు కుడిచేతి చూపుడు వేలుగోటినుండి విష్ణుస్వరూప మైన మహాకూర్మాన్ని సృష్టించింది. అది ఎనిమిదిమైళ్ల పొడవు, వెడల్పుగలది. దాని విశాలమైన చిప్పపై శక్తులందరు ఎక్కారు. భయంపోయింది, ఆనీరంతా ఆది కూర్మం తాగి వేసింది. భండుడు హైరణ్యాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రం నుండి వేలాది హిరణ్యా క్షులు పుట్టారు. శక్తిసైన్యాన్ని వాళ్లు బాత్తున్నారు. శక్తులు సొమ్మసిల్లుతున్నారు యుద్ధంమానేసి పరుగులుతీసారు. లలిత తనకుడిచేతి మధ్యవ్రేలి గోరునుండి తెల్లని

వరాహాన్ని పుట్టించింది అదికైలాసపర్వతంవలె ప్రకాశిస్తున్నది. ఆ వజ్ర సమవరాహం కోట్లాది హిరణ్యాక్షులను చీల్చి చంపింది. భండుడు కోపంతో కనుబొమలు ముడిచాడు. అందుండి హిరణ్యకశ్యపులు కోటి మంది పుట్టారు. మండే సూర్యుల్లావెలుగుతున్నారు. ఆయుధాలు అటువంటివే ధరించారు. శక్తిసైన్యాన్ని, ప్రహ్లాదుని మర్దించారు. శక్తులయొక్క ఆహ్లాదమే ఈ ప్రహ్లాదుడు. మహేశ్వరి కుడిచేతి ఉంగరపువేలు గోరును విదిలించింది. అందుండి నరసింహుడు ఆవిర్భవించాడు. చేతులు తల సింహం రూపం క్రిందిభాగం నరరూపం, జూలువిదిలిస్తున్నాడు. మండే మూడుకన్నులు క్రూరముఖం, గోళ్లే ఆయుధాలు, ప్రళయకాల రుద్రస్వరూ పం, భయంకరఅట్టహాసం వేయి భుజాలు లలిత ఆజ్ఞను పాలించేవాడు, క్షణంలో తన గోళ్లతో ఆ హిరణ్య కశ్యపులందరిని చీల్చివేసాడు.

భండదైత్యుడు లలితాదేవిపై దేవతా వినాశకరము, భయంకరము అయిన బలీంద్రాస్త్రం ప్రయోగించాడు. అందుండి అనేక మంది బలి రాక్షసులు పుట్టారు. లలితాంబ తనకుడిచేతి చిటికెన వ్రేలికొననుండి ఓజస్వంతులైన వందలాది వామనులను సృష్టించింది. వారు క్షణక్షణం వృద్ధిపొంది, మహాబలవంతులై, పాశాలు ధరించి బలీంద్రులను బంధించారు.లలితాపరమేశ్వరి కుడిచేతి చిటికెన వేలికొన నుండి పుట్టిన మహాశరీ రులు, ఉత్సాహులు, మహాకామేశుని స్త్రీలు ఆ బలీంద్రాస్త్రాన్ని నశింప జేసారు. భండుడు హైహయ అస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రంనుండి వేలు, కోట్ల సంఖ్యల్లో వేయి చేతులుగల కార్తవీర్యార్జునులు పుట్టారు. అపుడు లలితాదేవి తన ఎడమచేతి బొటనవ్రేలి గోరునుండి పరశురాముని సృష్టించింది. ఆ స్వామిమండి పడ్డాడు. సింహనాదం చేసాడు. తనపదునైన గండ్రగొడ్డలితో కార్తవీర్యార్జునుల నందరినీ ముక్కముక్కలుగా నదికి వేసాడు. ఆ దృశ్యం తిలకించిన భండుడు కోపంతో హుంకారం చేసాడు. దాని నుండి రావణాసురుడు పుట్టాడు. వాడిచేతిలో చంద్రహాసం అనే ఖడ్గం వున్నది. వెయ్యి అక్షౌహిణుల సైన్యం వాడి వెంటనున్నది. కుంభకర్ణుడు, ఇంద్రజిత్తు వానివెంటనుండిరి. రావణుడు శక్తిసైన్యాన్ని చాలమందిని మర్దించేసాడు. అపుడు లలితాంబ ఎడమచేతిచూపుడు వ్రేలిగోరునుండి లక్ష్మణునితో కూడిన కోదండ రాముని సృష్టించింది. అతడు జటాజూటం, ధనుర్బాణాలు, అమ్ములపొది ధరించాడు. నల్లకలువ వంటి శరీరం. మాటి మాటికి ధనస్సును వంచుతు, నారిమోగిస్తున్నాడు. దివ్యాస్త్రాలతో క్షణంలో రావణసైన్యాన్ని నశింపజేసాడు. తరువాత రావణకుంభకర్ణు లను మర్దించాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపాడు. భండుడు మహాభయంకరమైన ద్వివిదాస్త్రం సృష్టించాడు. అందుండి అనేకమంది వానరులు పుట్టారు. వారం దరు హనుమంతునితో సమానులు. తమ పింగళనేత్రాలు గిరగిరతిప్పుతూ, అతిక్రూరంగా క్రేంకారంచేస్తూ శక్తిసైన్యాన్ని చంపివేసారు. అప్పుడు లలిత తన ఎడమచేతిమధ్య వ్రేలిగోరునుండి బలరాముని సృజించె. అతడు కోపారుణనేత్రుడు. సనాతన వాసు దేవుడు. నల్లనివస్త్రం కప్పుకున్నాడు. కైలాసపర్వతంవలె స్వచ్ఛశ్వేతవర్ణి. అతడు వానరు





లందరిని చంపివేసాడు. భండుడు రాజాసురం అనే మహాఅస్త్రాన్ని సృష్టించాడు. అందుండి శిశుపాలుడు, దంతవక్త్రుడుశాల్వుడు, కాశీపతి, పౌండ్రకుడు, వాసుదేవుడు, రుక్మి, డింభకహంసకులు, శంబరుడు, ప్రలంబుడు, బాణాసురుడు, కంసుడు, చాణూరమల్లుడు, ముష్టికోత్పల శేఖరులు, అరిష్టుడు, ధేనుకుడు, కేశి,కాలియుడు, యమలార్జునులు, పూతన, శకటుడు, తృణావర్తుడు మొ॥రాజరాక్షసులు పుట్టారు. నరకుడు, మురాసురుడు శస్త్రాలు ధరించి, సైన్యంతో బయలుదేరారు. వాళ్లను చంపడానికి అమ్మవారు తన ఎడమచేతి ఉంగరంవేలు గోరునుండి వాసుదేవుని సృష్టించింది. ఇతడు సనాతనుడు, తరువాత అంబమరి నలుగురు విష్ణురూపులను సృజించింది, వాసుదేవుడు, సంకర్షణుడు, అనిరుద్ధుడు అనే ఈ నలుగురు చతుర్వ్యూహా లలోవారు, వీరంతా ఆయుధాలతో బయలుదేరారు. దురాచారులు, భూభారం పెంచినవాళ్లు, రాజవేషంలో దాగివున్న మహారాక్షసులు అయిన వారందరిని చంపివేసారు. తరువాత కోపించిన భండాసురుడు సర్వధర్మ వినాశకర “కవి”అస్త్రాన్ని ప్రయోగించాడు. దానినుండి ఆంధ్రులు, పుండ్రులు, కిరాతకులు, శబరులు, హూణులు, యవనులు, వేదనిందకులు, ధర్మద్రోహులు, ప్రాణి హింసకులు, వర్ణాశ్రమ ధర్మసంకరులు, మలినశరీరులు పుట్టారు. వీళ్లందరు లలితాసైన్యాన్ని మర్దించి వేస్తుండిరి. అప్పుడు లలిత తన ఎడమచేతి చిటికెనవేలి గోటినుండి (జనార్దనుడు–విష్ణువు) కలికిమూర్తిని పుట్టించింది. ఆయన గుర్రం ఎక్కాడు. ముఖసిరి తేజోకిరణా లను విరజిమ్ముతున్నది. అట్టహాసం చేసాడు. అది వజ్రసదృశం, ఆ ధ్వనికి కిరాతులు మూర్ఛపోయి యుద్ధం మానేసారు. శక్తులు సంతోషించారు. దశావతార నాధులైన వీరందరు కష్టమైన ఈ శత్రునాశన కర్మ అవలీలగా చేసి, లలితాంబకు నమస్కరించి నిలబడ్డారు. లలితాంబవారిని ప్రతికల్పం లోను ఈ రూపాలతోనే అవతరించి ధర్మ రక్షణచెయ్యమని ఆదేశించింది. తరువాత వారు వైకుంఠానికి వెళ్ళిపోయి నారు.

ఈ విధంగా భండుడు ప్రయోగించిన అన్ని అస్త్రాలు నశించిపోయి నాయి, దురాశయంగల భండుడు మహామోహాస్త్రాన్ని సృష్టించాడు. దాని చేత శక్తులు మూర్ఛపోయిరి. అంబ శాంభవాస్త్రం వదలి దానిని నశింప చేసింది. ఇంతలో సూర్యాస్తమయం అవుతుండె. నారాయణాస్త్రం ప్రయో గించి రాక్షస సైన్యాన్నంతని నాశనంచేసింది పరమేశ్వరి. వాడి అక్షౌహిణు లన్నీ బూడిదఅయినవి. ఆ తరువాత కాలాగ్నివలె మండుచున్న పాశుపతా స్త్రాన్ని ప్రయోగించింది పరమేశ్వరి. భండుని సేనానాయకులు ఇరవైనాలుగు మంది ఆమంటలోపడి భస్మమయ్యారు. ఇక ఏకాకి మిగిలాడు. వాడే భండుడు. బంధుహంతకుడు, నిర్లజ్జి, జగద్విప్లవకారి, కోపాగ్ని దీప్తి, మహాసురుడు, మహాబలుడు, భయంకరపరాక్రమ సహస్రసూర్య ప్రకాశి, ఇట్టి మహాహంకారి క్షణంలో భస్మమయ్యాడు. అమ్మవారు ఈ దుష్టాగ్రేసర అసుర చక్రవర్తి భండాసురుని మహాకామేశ్వరాస్త్ర ప్రయోగంతో భస్మంచేసివైచింది. బూడిదలో నుండి పుట్టినవాడు బూడిదైపోయినాడు. మట్టినుండి పుట్టినవాడు మట్టి అయిపోతాడు

అనేదాన్కి ఇదే పెద్ద ఉదాహరణ. వాడిముఖ్య పట్టణం శూన్యకనగరం శూన్యమైపోయె, ఎలాగంటే – స్త్రీ,బాల,గో, ధన, ధాన్య సమేతంగా ఆ పట్టణం మహాకామేశ్వరాస్త్ర జ్వాలల్లోపడి మాడిమసై పోయింది. శ్మశానంలా కాళీస్థలం మాత్రం మిగిలింది. బూడిదబోలెడంత మూడులోకాలు భండాసురుని మరణానికి హర్షం వెలిబుచ్చినాయి. సుశీల, శ్రీచక్రరాజ రథమండల కలంకారసంపద, త్రిలోకజనని, ప్రకాశవైభవ అయిన కామేశ్వరీదేవి (లలిత)ఈవిధంగా భండాసుర సంహారంచేసి, విజయశ్రీతో విరాజిల్లు తున్నది. (12-12-09) మహాప్రభావంగల ఆ శ్రీదేవి సూర్యాస్తమయం కాగానే, యుద్ధపరిశ్రాంతలు, భండాసుర ప్రబల బాణాగ్నితప్తలు అయిన తన సమస్త స్త్రీశక్తు లను, తన శిబిరానికి తీసుకువచ్చింది. ఓతపోధనోత్తమా?అగస్త్యా! క్లుప్తంగావున్న ఈ భండాసురవధ చరిత్ర ఒక్కసారి పఠించినాగాని వార్కి యుద్ధభయం వుండదు. అష్టసిద్ధులు సిద్ధిస్తాయి. భుక్తి, ముక్తివారి అరచేతిలో వుంటుంది. పవిత్రం, పాపఘ్నం, సమస్త సిద్ధిదం అయిన ఈ లలితా పరాక్రమ చరిత్ర పఠించువారు ఉత్తమ భాగ్య సమృద్ధిని పొందుతారు.

## మదన పునర్జన్మ

అగస్త్యుడడిగాడు. ఓమహాప్రాజ్ఞా! హయాననా! నీవలన ఉత్తమ లలితోపా ఖ్యానం విన్నాను. ఆ తల్లి మహాపరాక్రమాన్ని తెలుసుకున్నాను. సర్వ పాపఘ్నమైన లలితా చరిత్రవిని సంతుష్టుడనయ్యాను మంత్రిణీ దండనాథుల మహాశక్తినికూడ విన్నాను. నాల్గవరోజురాత్రి యుద్ధానంతరం తెల్లవారగానే అంబిక ఏమిచేసింది. అనగా విని హయగ్రీవ స్వామి సెల విచ్చారు. ఓ ప్రాజ్ఞ! కుంభసంభవా! భండాసురవధ అయింది. తరువాతి కథవిను, భండాసురుని అస్త్రశస్త్రాది శతాధిక అయుధ ఘాతబాధా తప్త దేహులైన సమస్త స్త్రీశక్తులను, సైన్యాన్ని లలితాపరమేశ్వరి కరుణారసామృత దృష్టితో చూచింది. వారిగాయాలు నయమయ్యాయి. స్వస్థదేహులయ్యారు వారు. ఆనందించారు, ప్రీతమనస్కులయ్యారు, పరిశ్రమ ఫలించింది. శ్రమ నశించింది. భండాసురవధకు ఆనందించిన బ్రహ్మ,విష్ణు,ఇంద్రాది దేవతలు అందరు తమస్వామిని లలితేశానిని సేవించాలనే కోరికతో అచటకు విచ్చేసేరు. రుద్ర,ఆదిత్య, వసు, మరుత్త, సాధ్యదేవతలు, సిద్ధ, కింపురుష, యక్ష, నిర్పతి, మొ॥రాక్షసులు ప్రహ్లాదాదిదైత్యులు, బ్రహ్మాండవాసులందరు వేంచేసిరి. సింహాసనాధిష్ఠిత అయిన లలితాపరమేశ్వరిని సంతో షంతో స్తుతించారు.

బ్రహ్మాదులన్నారు : ఓతల్లీ ! నీవులోకానికి ఏకైక రక్షవు. నీకు నమస్కా రం. నీపేరు త్రిపుర, అట్టి నీకు నమస్కారం, భండాసుర సంహారిణీ కామే శ్వరీ; సుకేశీ! ఇష్టార్థదాయినీ, చింతామణీ, ధ్యానాతీతా! చిత్స్వరూప తరంగమాలాధారీ! జ్ఞానసముద్రరూపిణీ! చిత్రాంబరీ! విచిత్ర జగత్సృష్టి కారిణీ! చిత్రానామక నిత్యాశక్తీ! సుఖదాయినీ ! నీకు నమస్కారం. మోక్ష దాయినీ! చంద్రకళాధరీ! సురుచిరహాసినీ! మోహవిభేదినీ! ముద్రేశ్వరీ, రాజ్యతంత్రప్రదా ! నీకు నమస్కారం. అంతకాంతకీ !



కోమలాంగీ ! క్రోధకాళీ! వారాహీ! శక్తిసైన్య చక్రపాలినీ ! సమస్త భయనివారిణీ ! నీకునమస్కారం. షడంగరక్షకీ ! కృష్ణ స్వరూపిణీ ! షట్ శాస్త్రాలభ్యా! షట్ చక్రసంస్థితా! షడూర్మిస్థితా ! షడ్భావరూపిణీ ! ఓశ్రీలలితా ! నీకునమస్కారం. స్త్రీరూప మన్మథ రూపిణీ !శివాస్వరూపిణీ ! నిత్యస్వరూపిణీ ! మనోహర స్వరూపిణీ ! కాంతాసనాంతా! పద్మాయతాక్షీ ! వాంఛితార్థ ప్రదే ! కామశంకర కామినీ !మోక్షప్రదే ! కళాధిపా ! నీకు నమస్కారం. దివ్యౌషధే! నగరరూపిణీ ! దివ్యే ! సూర్యసహస్రకాంతిమతీ ! దయామయీ! దేవతా సంతోష స్వరూపిణీ ! నీకునమస్కారం. అణిమాది అష్టైశ్వర సేవితే! సదాశివాత్మికే ! దివ్యమంచస్థితే ! సభారూపిణీ ! సత్ప్రదపాదే ! సృష్టికర్త్రే! సప్తమాతృకాపూజ్యే ! జ్ఞానప్రియే ! బ్రాహ్మణబంధభేదినీ ! జ్ఞానప్రవాహ విహార రాజహంసీ ! బ్రహ్మేశ్వరీ ! శ్రీలలితా ! నీకునమస్కారం సంక్షోభిణ్యాది సమస్త ముద్రాసేవితే ! సంసార బంధధ్వంసినీ! సంసార లీలాకారరూపిణీ! పద్మాక్షీ! అధినాథా! లలితా ! నీకు నమస్కారం. షోడశకళాపరిపూర్ణా ! సర్వాకర్షిణీ ! సర్వాధీశ్వరీ ! ప్రమథగణ సంసేవితా! నిత్యాశక్తి స్వరూపిణీ అభయస్వరూపిణీ ! నీలాలకశ్రేణీ విలాసినీ! నీకునమస్కారం. మన్మథపుష్ప రూపమన్మథభార్యాసంసేవితే !అమంగళ హారిణీ !శివదూషకాంతకీ ! వర్ణమాలాస్వరూపిణీ !శత్రుఘ్ను, శ్రీలలితే ! నీకు నమస్కారం. సంక్షోభిణ్యాది చతుర్దశ జ్వాలామాలా పరివృత ప్రకాశినీ ! సర్వాత్మధారిణీ! విలాసశోభినీ శుభ్రస్థానా, శుభ్రపాదే నీకు నమస్కారం. శర్వసిద్ధాదిశక్తివంద్యే సర్వ సంసేవిత పాదపద్మే ! సర్వాధికే! సర్వజగన్నివాసే ! సర్వసిద్ధిప్రదే ! శ్రీలలితే! నీకు నమస్కారం. సర్వదేవాశ్రిత శ్రీ చక్రస్వరూపిణీ ! సమస్త దేవవాంఛా పరిపూరక రూపిణీ! సర్వలోకస్రృష్టికర్త్రీ! పాహిమాం!రక్షమాం! వశిన్యాది వాగ్దేవతా వాగైశ్వర్య రూపిణీ ! చక్రాకారకాంతి ప్రవాహవాహినీ ! మేఘవర్ణశిరోజమాలా ధరీ ! వాక్సముద్రే! వరదాయినీ! సుందరీ! లలితా! విశ్వాన్నిరక్షించు, బాణాది దివ్యాయుధ సార్వభౌమ చక్రవర్తి స్వరూపిణీ! భండాసుర సైన్యవన మధ్యదావాగ్నిరూపిణీ ! వజ్రేశ్వరీ ! ఖగేశ్వరీ! భగేశ్వరీ ! ఆత్మస్వరూపిణీ! కన్యే ! కలిస్వరూపిణీ ! అంతకాంతకీ ! సర్వదైత్యధ్వంసినీ! స్వాధీనవల్లభే! లక్ష్మీస్వరూపిణీ! నీకు నమస్కారం. బిందుస్థితే ! బిందుకళైకరూపిణీ! బిందుస్వరూపిణీ ! జ్ఞానప్రకాశప్రకాశినీ ! వక్షస్థలస్థిత పద్మమాలా మనోహరీ! విశాల ప్రభావా! శ్రీలలితా నీకునమస్కారము. కామేశ్వరాంక సుస్థితా! కాలస్వరూపిణీ ! దేవీ దయామయీ! కల్పాంతకాల విజృంభయమస్వరూపిణీ కామ్యకల్పవృక్షస్వరూపిణీ, నీకు నమస్కారం. మద్యాలసా ! ఇందు శీతలా! ఏణాక్షీ! పద్మముఖీ ! బ్రహ్మానంద స్వరూపిణీ ! సకల విద్యేశ్వరీ ! నీకు నమస్కారం. జ్ఞానాగ్నిలో నీపుట్టుక. శంకరుడు నీ ప్రభావం ప్రటించినాడు. అట్టి నీవు జగత్కంటకభయం కరరాక్షసులను, భండా సురుని సంహరించావు. నీదయామృతం మాపై కురిపించావు. మా శారీరక మానసిక గాయాలు మటు మాయమైనవి. నూతన శరీరాలు మాకు లభించినాయి. సకల లోక వాసులు సుఖ జీవులయ్యారు.

శంకరుని రెండవతేజము ప్రసరించినచోట స్థాణుఅనే ఆశ్రమమున్నది. సతీ వియోగంతో విరాగియైన శివుడచటనుండె. హిమవంతుని కుమార్తెగా పుట్టిన ఉమను శివునితో కలపగోరిన దేవతలు మన్మథుని ప్రేరేపించి ఘోర తపస్సులోవున్న శివుని పైకి పంపారు. తన తపోవిఘ్నం చేసిన మన్మథుని తన నేత్రాగ్నికి ఆహుతిచేసాడు ముక్కంటి. ఆ మన్మథ భస్మం నుండి పుట్టినవాడే భండాసురుడు. వాడిని నువ్వు సంహరించావు. మన్మథుడు భస్మమైనందున రతీదేవి రెండువిధాల బాధపడుతున్నది. మొదటిది భర్తృవియోగ దుఃఖం రెండవది భరించరాని వైధవ్యం, ఇప్పుడు నీ అనుగ్రహం కావాలి. మన్మథుడు జీవించాలి. రతీదేవి సువాసిని కావాలి. ఈ రతీమన్మథులు శంకరుని సమ్మోహితుని చేయాలి. ఆ శంకరుడు తనకు చిరకాల సపర్యచేసిన పార్వతిని పెళ్లిచేసుకోవాలి. వారికి కుమారస్వామి జన్మించాలి. అతడు దేవసేనా నాయకుడు కావాలి, అతడు భండాసురపుత్రుడైన తారకాసురుని సంహరించాలి. అప్పుడు దేవతలు ఆనందించాలి, నీదయతో ఇదంతా జరిగి తీరుతుంది. ఓ జగదంబా! ఇదిగో ఇటుచూడు. భర్తృమరణదుఃఖంతో బక్కచిక్కిన రతీదేవి, విరబోసుకున్న తలవెంట్రుకలు బొట్టుచెరిగిన ఫాలభాగం, పసుపు, పారాణిలేనిపాదాలు, ఆనాటి వస్త్రమే మలినమయం దుఃఖజలంతో చారలుకట్టిన చెక్కిళ్లు. ఇట్టి దీనానన నిన్ను శరణుపొందింది నీకు నమస్కరిస్తున్నది. నీ కారుణ్యకళ ఈమెపై ప్రసరింపజెయ్యి. అంటూ బ్రహ్మాదులు దుఃఖంతో బక్కచిక్కి అలంకార హీనయై, మలినదేహంతో మసి పూసిన మాణిక్యంలావున్న రతీదేవిని లలితాంబకు చూపించారు. ఆమె జగదంబకు నమస్కరించింది. పరమేశ్వరి కరుణా కటాక్షం ఆమెపై ప్రసరించింది. చిరునవ్వుముఖం, అపూర్వకాంతిదేహం, యవ్వనమదం, నున్నటి రెండుభుజాలు, సమస్త వస్తు వస్త్రాలంకారాలు, పుష్పబాణాలు, పుష్పధనువు, ధరించిన మన్మథుడు తన పూర్వజన్మ ప్రియరతీ దేవిని క్రీగంటితో చూస్తూ ఆవిర్భవించాడు. రతీదేవి తనభర్తనుచూచి ఆనంద సముద్రంలో మునిగి, తేలి పరమానందభరిత అయింది. ఇద్దరు ఆత్మానంద భరితులై లలితాదేవి యందు భక్తిని ప్రకటించారు. రతీదేవి సిగ్గుతో తలవంచుకొని నిలుచుంది. చూచిందిలలిత. శ్యామలతో అన్నది. శ్యామలా! రతీదేవిని స్నానం చేయించు, సర్వాలంకారభరితనుచెయ్యి తొందరగా తీసుకురా! అనగానే తల్లి ఆజ్ఞ శిరసావహించిన శ్యామలాలంబ శీఘ్రం ఆచరించింది. అమ్మ ఆజ్ఞతో వసిష్ఠాది బ్రహ్మర్షులు వారిద్దరికి వివాహం చేసారు ఇంద్రాదిదేవతలు, ఋషులు సంతోషించారు. అమ్మను సంస్తుతించారు. భక్తితో నమస్కరించి వారు ఆమెపై పూలవానకురిపించారు. రతీమన్మథులు అమ్మపక్కనన నమస్కరిస్తూ నిలుచున్నారు. మన్మథుడన్నాడప్పుడు.

తల్లీ ! లలితా పరమేశ్వరీ ! ముక్కంటి కంటిమంటలో దగ్ధమైన నా శరీరాన్ని నీకటాక్ష వీక్షణంతో మరల పొందాను. ఇపుడు నేను నీపుత్రుడను, దాసుడను, నాకు ఆజ్ఞాపించు, ఏకార్యమైనా నీశాసనంతో ఆచరిస్తా, అనగానే అమ్మవారన్నది



మన్మథునితో నాయనా ! మనోభవా ! మన్మథా ! నీకిక భయంలేదు. నీ ఆయుధాలు అక్షయాలు, వీటితో లోకాలను సమ్మోహింప జెయ్యి. నీ బాణ ప్రయోగంవల్ల అధైర్యం పొందిన శివుడు వెంటనే గౌరిని వివాహం చేసుకుంటాడు. నాదయవల్ల నీనుండి పుట్టిన వేయికోట్ల మన్మథులు అందరి శరీరాల్లోను ఆవేశించి వారికి ఉత్తమరతినివ్వగలదు. ఇక ఈశ్వరుడు నిన్ను కటాక్షిస్తాడు. ఇది నా అనుగ్రహం. ఎవరికీ కనిపించని శివుడు అందరికీ సంసార వ్యామోహంకలిగిస్తూ వుంటాడు. భార్య విరహంతో వున్న ఆ పరమశివుడు పార్వతికి తన సగశరీరం ఇస్తాడు. ఇక నీబాణ ఘాతాలు తగిలిన శివుడు పిరికివాడవుతాడు. ఈ రోజునుండి నిన్ను నిందించేవారు. నీ విముఖులైనవారు, నపుంసకులవుతారు,పాపులు,దుర్మార్గులు, నాభక్తులకు ద్రోహంచేసేవారు మొ॥వారిని కలవకూడని స్త్రీల వలలోపడవేసిచంపు, నా పూజలందు, నాభక్తులందు, ఆదరంగలవారికి కోరికలుతీర్చి కామసుఖం ప్రసాదించు, అని ఆజ్ఞాపించిన లలితాదేవి వచనం శిరసావహించిన మన్మథుని రోమకూపాలనుండి శోభన, సుందర విశ్వమోహనాకారులై మన్మథులు అనేకమంది ఆవిర్భవించారు. వారి ద్వారా మన్మథుడు జగన్మోహనంకావించాడు. ఈశ్వరవిజయం కోరి మరల స్థాణు ఆశ్రమానికి వెళ్లాడు. స్నేహితుడైన వసంతుడు, సేనానిచంద్రుడు, విదూష కుడు రాగము, పిల్లగాలుల వేగము, గండుకోయిలల గానము అనేడప్పుల చప్పుళ్లు అతని వెన్నంటి వచ్చారు. మన్మథునివేషం శృంగారవీరం సుసంపన్నం రతీదేవి కౌగిలిలో వున్నాడాయన. జయశీలమైన తన ధనువు కదుపుతున్నాడు. ముందునడుస్తూ శివుని ముందు నిర్భయంగా నిలిచాడు. తపోనిష్టలోనున్న శివస్వామిని బాణాలతో కొడుతున్నాడు. చంద్రకళాధరుని ధైర్యం సన్నగిల్లింది. తపస్సు చాలించాడు. నీ మాటలు నిలిచిపోయినాయి. ధైర్యం నశించింది, పార్వతి నామస్మరణ చేస్తూవుండిపోయాడు. కామజ్వరం కమ్మివేసింది, నిట్టూర్చాడు చెక్కిళ్లు తెల్లబడిపోయాయి కన్నీరు నిండి పోయింది. గౌరీ విరహబాధితుడయ్యాడు. ధైర్యవిహీన సంతప్తుడయ్యాడు. ఇంతకు ముందు చూచిన గౌరినేస్మరిస్తూ వుండిపోయాడు. మన్మథ బాణాగ్ని చేతపిస్తున్నాడు. చంద్రలేఖ, గంగతాపశాంతిచెయ్యలేకపోయేను. నంది, భృంగి, మహాకాలుడు సిద్ధంచేసిన పూలపానుపుపై పొర్లుతుండె. నందీశ్వరుని చెయ్యి ఆసరాగాతీ సుకుని, ఒక పుష్పశయ్యనుండి వేరొక పుష్పశయ్యకు మారుతునుండె. మాటిమాటికి వికృతచేష్టలుచేస్తున్నాడు.పూలపాన్పునుండి, చంద్రరేఖనుండి జాలువారిన అమృతం, మంచునీరు శివుని కామజ్వరాన్ని చల్లార్చడంలేదు. మంచునీటి ఫలకాల మాటిమాటికి అసీనుడవుతూన్నడు. చిత్రపటం గౌరీరూపం లిఖిస్తున్నాడు. ఆరూపం మాటిమాటికి చూచి మరి బాధపడుతున్నాడు.గౌరీ చిత్రం సిగ్గుతో తలవంచి, వాలుకన్నులతో తనను చూస్తున్నది. దానిని చూచి పులికించిపోయి గుండెలకు హత్తుకుంటున్నాడు. మూడుబాధలు ఆ స్వామిని ముప్పుతిప్పలు పెడుతున్నవి. మహా చింతాసాగరం, మహారతిసంపద, మహామన్మథతాపం వీటివల్ల వ్యథపెరిగి పోయింది.

అంతటా ఆమే కనిపిస్తోంది. అస్తమానం ఆవిడనే చూస్తున్నాడు. మనస్సులగ్నం చేస్తున్నాడు. మాట్లాడుతున్నాడు. పిచ్చెక్కిపోయింది, హృద యంలో ఊహలలో, కథలలో ఆమెయే నిండివుంటున్నది, రాత్రి, పగలు ఇదేకాలక్షేపం, ఆమెశీలవర్ణనం, రూపదర్శనం, సౌందర్యభోగసంకల్ప మాలలు మాలలుగా ధరిస్తున్నాడు. తపిస్తున్నాడు, చికిత్సలేదు, గౌరీపాణి గ్రహణమే దీనిపరమౌషధం అనుకున్నాడు. వివాహప్రయత్నం మొదలైంది. తనకోరిక నెరవేరింది. పార్వతిపై మన్మథుడు బాణప్రయోగం చేసాడు.

విరహజ్వరం ఆతల్లిని విలవిలలాడించింది. ఆమె శ్వాసాగ్నులు పెదవు లను ఎండించివేసినాయి, అవి మలినాలైపోయినాయి, చెక్కిళ్లు మిక్కిలి తెల్లనైనవి. ఆహారం, పాన్పు, నిద్ర అసహ్యం అయ్యె, వేలాది చెలులు శీతలోపచారాలు చేస్తుండిరి. మాటిమాటికి తాపం, అల్లే వివశత్వం. మన్మథ మహాగ్నిబాధాశాంతిలేదు. నిద్రలేదు, ఆమెశరీరతాపం తండ్రికి దుఃఖప్రద మయింది. ఈవిరహానికి ప్రతీకారంలేదు. హిమవంతుడు దుఃఖించాడు. తల్లీ! సర్వమంగళా ! తపస్సుతో సంతోషపెట్టి ఆస్వామిని పెళ్లిచేసుకో! అన్నాడు. అదే గౌరీశిఖరంపైకి వెళ్లి పతిలాభం కోసం దుష్కరతపం ఆచరించింది గౌరి. అదే గౌరీశిఖరం! జల, అగ్ని, సూర్యాగ్నులలో ఘోరతపం చేసింది. సంతోషించి ప్రసన్నుడయ్యాడు శివుడు. నిన్ను పెళ్లాడతానన్నాడు. సప్త ఋషులు సంధానకర్తలు పార్వతీ కల్యాణం పరమశోభాయమానంగా జరిగింది. అత్తవారిల్లు ఓషధీప్రస్థపురం. చాలాకాలం స్త్రీసుఖంలో మైమరచి అక్కడేవుండి పోయాడు శివుడు. తరువాత కైలాసానికివెళ్లేడు. ప్రమథులతో తిరిగివచ్చి పార్వతిని కైలాసానికి తీసుకువెళ్లాడు. శివుడు కైలాసం, మందరం, వింధ్య, హిమాలయం, మలయా, పారియాత్ర మొ॥రమ్య పర్వతవనాల్లో పార్వతితో రమించి ఉగ్రవీర్యం వదిలాడు. దానిని పార్వతి భరించలేక పోయింది. భూమిపై వదిలింది. భూమి అగ్నియందు, కృత్తికల యందు ఆ వీర్యం వదిలింది. కృత్తికలు గంగలో వదిలారు. గంగరెల్లుగడ్డియందు వదిలింది. అక్కడ ఆరుముఖాలు కలిగిన మహాసేనుడు (కుమార స్వామి) పుట్టాడు. ఆస్వామినితెచ్చి శివుడు గంగాతీరంలో పెంచాడు. అతడు మహా పరాక్రమశాలియై, శివునివద్ద సమస్త విద్యలు పొందాడు. తండ్రి అనుమతి పొంది దేవసేనా నాయకుడయ్యాడు. తారకాసుర సంహారం గావించాడు. ఇంద్రుడానందించి తనకుమార్తె దేవసేనను స్వామికిచ్చి పాణిగ్రహణం కావించాడు. దేవసేన పరమానంద భరితఅయింది. నరకాసుర వధతో మన్మథుడు దేవి ఆజ్ఞపూర్తిచేసాడు. శ్రీపురానికి వెళ్లాడు. లోకాలకు సంపత్సమృద్ధి కలిగించడానికి లలితా పరమేశ్వరి ఆ పురంలో వసించింది. మన్మథుడు ఆ తల్లిని సేవిస్తూ వున్నాడు.

### శ్రీమాతా శ్రీపురం వివరాలు మతంగ కన్యలు

అగస్త్యుడడిగాడు. మహానుభావా! హయగ్రీవా! శ్రీపురం అంటే..అది ఎలావుం టుంది. పూర్వం ఎవరునిర్మించారు? దానిప్రమాణం, వర్ణం అన్నీ వివరించండి. అనగానే హయగ్రీవస్వామి అన్నారు. అగస్త్యా ! శ్రద్ధగావిను. బ్రహ్మవిష్ణు మహేశ్వరులు



దేవతల ప్రార్థనపై లలితాదేవికి శోభనమందిరం నిర్మించాలనుకున్నారు. దేవశిల్పి విశ్వకర్మ, రాక్షస శిల్పిమయుడు ఇందుకు సమర్థులని నిశ్చయించారు. లలితాదేవి ఆజ్ఞపొందారు. వారితో అన్నారు. మహాత్ములారా! మీరు సర్వశాస్త్రజ్ఞులు. భవన నిర్మాణకోవిదులు. సంకల్పమాత్ర మహాశిల్ప కల్పనా విశారదులు, శ్రీనగరం మీరు నిర్మించాలి. పదహారు క్షేత్రాల మధ్యలో సమసంఖ్యలో ఈక్షేత్రం వుండాలి. నానారత్నా లంకారంకావాలి. అందు పదహారు రూపాలుధరించి పరమేశ్వరి విశ్వ రక్షణకోసం నివసిస్తుంది. ఇది మాకిష్టం. దేవతలకు, మనుష్యులకు కూడ ప్రీతిజనకం. లలితాదేవి పేర ఇది నిర్మించాలి. అంటూ ఆజ్ఞాపించిన త్రిమూర్తులతో వారిద్దరు తథాస్తు అన్నారు. ఏ క్షేత్రాలలో ఈనగరాలు నిర్మించాలో తమరు సెలవియ్యండి అనగానే బ్రహ్మాదులన్నారు వారితో.

మేరు, నిషధ, హేమకూట, హిమాచల, గంధమాదన, నీల, మేష, శృంగార, మహేంద్ర పర్వతాలపై ఈ నగరాలు నిర్మించాలి. తరువాత సప్త సముద్రాలు ఇందుకు తగినవి. ఈ పదహారు క్షేత్రాలు శ్రీపుర నిర్మాణానికి ప్రశస్తాలు. ఇవి అమ్మ యొక్క నిత్యానామాలతో ప్రసిద్ధిపొందుతాయి. నిత్యా రూపంతో కాలవ్యాప్తి చేసే అమ్మనిత్యాశక్తి స్వరూపిణి. లోకక్షేమం ప్రసాది స్తుంది. కామేశ్వరపురి, భగమాలాపురి, నిత్యక్లిన్నాపురి అనేవి మిక్కిలి ప్రసి ద్ధాలు. రంగుతోగాని, వర్ణముతోగాని ఈ శుభపురి నిర్మించాలి అనగానే ఆ శిల్పులిద్దరు ఆవిధంగా పురనిర్మాణం కావించారు.

అఖిలలోకాశ్రయమైన మేరుపర్వతంలెక్కలేనన్ని మైళ్లవిస్తారంగలది. అన్ని లోకాలకు ఆశ్రయమైనది. దానికి నాలుగుశిఖరాలున్నవి. తూర్పు,నైరుతి, వాయు వ్యము, మధ్యభాగమున ఆ శిఖరాలున్నవి. మధ్యశిఖరం 3200మైళ్ల ఎత్తు, విస్తారం గలది. మొదటిది ఉక్కుప్రాకారం. 1ల. 28వేల మైళ్లపొడవు గలది. ఇక్కడే శ్రీపురం నిర్మించబడింది. దీనికి నాలుగు ద్వారాలు, ప్రాకారం ఎత్తు 32 మైళ్లు శాలక్రిందిభాగం వైశాల్యం 80వేల మైళ్లు. శాలకొనభాగం 4 మైళ్లు. శాలద్వారం ఎత్తు 8 మైళ్లు. గడియ 1 మైలు పొడవు. నాలుగు ద్వారాల కొల్తసమానం. మొదట చెప్పిన శాలము 8 మైళ్లు. రెండుపక్కల రెండు యోజనాలు. మధ్యశాలము 8 మై. విస్తారం కూడ 8మై.ఇది ద్వార గర్భితము. కొలత 40మై. రెండుపక్కల 5మై. అన్నీకలిపి 40మై. ఇలా గోపురం నిర్మించబడింది. గోపురం మొదలు క్రిందిభాగంచుట్టు 160 మై. పైకిపోయే కొలది తగ్గుతూవుంటుంది. గోపురం ఎత్తు 200 మై. ప్రతి 8 మై.కు. తలుపులుగల అందమైన ద్వారం వుంటుంది. భూమికలుకూడ ఆవిధంగానే వుంటవి. గోపురవిస్తారం పొడవు కూడ 8మై. అక్కడ మూడు ముకుటాలున్నవి. ముకుటం విస్తారం 2 మై.ఎత్తు4 మై పైకి వెళ్లేకొలది కొల్తతగ్గుతుంది. ముకుటంమధ్య భూమి 1మై. ముకుటము పడమర, తూర్పు, దక్షిణము, ద్వారగోపురమున వున్నది. పడమర ద్వార గోపురమున దక్షిణోత్తరముగా ముకుటాలున్నవి. దక్షిణ ద్వారంవలెనే ఉత్తర ద్వారముకుటాలున్నవి. పశ్చిమద్వారాంవలెనే తూర్పు ద్వారాన ముకుటాలున్నవి.

ఉక్కుశాల మధ్యన కిటికీలున్నై. కంచుశాలమధ్యన పూర్వంవలెనే గోపురమున్నది. శాలమూల ప్రమాణం పూర్వంచెప్పినదే. ఈశాలకుకూడ తూర్పు మొ. దిక్కులలో ద్వారాలున్నవి. ప్రతిద్వారాన గోపురాలున్నై అవి అంతస్థులుగలవి. ఈరెండుశాలల మధ్య గొప్ప ఉద్యానవనముండె వేయికి మించిన వృక్షాలక్కడ సర్వకాలఫలపుష్పపల్లవ సమన్వితాలు. సుగంధ భరితాలు మామిడి, లొద్దుగ, కొండగోగు, దిరిసెన, దేవదారు, సురపొన్న, పున్నాగ, ఏలకు,లవంగ, తక్కోల, కర్పూర, పనస, ఇంగువ, పాటల మొ॥ ఫలవృక్షాలు జడలుగల చెట్లు, మధ్యలోకాసేవి. (మేడి)దానిమ్మ, అశ్వకర్ణ, హస్తికర్ణ, సంపెంగ, తులసి, సదాఫల, తాడి, తమాల, ఖర్జూర, చెరకు, క్షీరవృక్షాలు, జీడిమామిడి, స్వర్గపుష్పిక, చంద్ర, చందనం, కాలాగురు, చింత,మర్రి, మేడి, మద్ది, రావి, జమ్మి,వృక్షములు, కొండమల్లె, సప్తపర్ణి,వెలగ,చింతమొ॥చెట్లు నానారుతువులలో జేరునవి. ఇవన్నీ దేవికి శృంగారసాధనాలు. మహోన్నతశాఖా జాలములు.

కంచుశాల మధ్య **56** మైళ్లు. దూరంలో చతురశ్రమైన రాగిశాల మున్నది. అది **56**మై. ఎత్తు, రెంటిమధ్య కల్పవాటిక. కల్పవృక్షాలు కర్పూర గంధం గలవి. రత్నాలవంటి గింజలు, బంగారుబెరడు, బంగారురంగుగల పళ్లతో నిండుగా పండిన చెట్లుండినై. వాటికొమ్మలు చిగురించె. అపుడవి దివ్యపీతాంబరధారులట్లు మెరుస్తుండె. ఆ పువ్వులలోనున్నతేనె అమృతము. అనేక వృక్షాలు ఇలా భాసమానాలక్కడ.రెండవది కల్పవాపి. ఈ శాలమధ్య నాగశాల వున్నది. ఈ రెండిటిమధ్యదూరం **56** మై. కల్పవాపికి సమానాకా రంలో సంతానవాటివున్నది. దాని మధ్య హరిచందనవాటి. కల్పవాటికలో వున్న వృక్షాలన్నీ ఇక్కడ కూడనుండె. ఈ అన్నిశాలలోను పూర్వమువలెనే ద్వార, గోపుర, ముకుట కల్పనజరిగింది. ప్రతిద్వారంలోను ద్వార గోపు రాదుల ఏర్పాటున్నది. ఇత్తడిశాలమధ్య **56** మై. దూరంలోపం చలోహమ యశాల యుండె. అదిపూర్వశాలతో సమానకారముగలది. ఆ రెండింటిమధ్య మందార వృక్షవాటిక గలదు. పంచలోహశాలమధ్య **56**మై. దూరంలో వెండిశాలనిర్మించబడింది. అది ఇంతకుముందు చెప్పిన శాలల లక్షణంగలది. ఈ రెండింటిమధ్యన పారిజాత ఉద్యానవనముండె. అది దివ్య సుగంధ భరితం. ఫలపుష్పభారోజ్జ్వల. వెండిశాలమధ్య **56** మై. విస్తారంగల బంగారుశాలయున్నది.ఇది పూర్వశాలలవలెద్వార సంశోభిత, ఆ రెంటిమధ్య కదంబవృక్షవాటిక అక్కడ **16**మై. ఎత్తుగల దివ్యవృక్షాలు వేప, అవి ఎల్లప్పుడు కల్లుతో కదలాడుతుంటై. దట్టమైన పువ్వులు మెరుస్తూవుంటై వాటినుండి యోగినులకు భోగమునిచ్చు కాదంబరీపుష్పా సవంస్రవిస్తూ వుంటుంది. అది విశిష్ట మదిరోద్యానం. మంత్రిణ్యంబకు ప్రియమైనది. ఆవేపచెట్ల నీడలు పరమసుఖప్రదాలు. దట్టమైన ఆకులు, చిగురాకులతో శోభిల్లునవి. వాటిసుగంధం తుమ్మెదలనాకర్షించేది ఆ చెట్లలోపల సర్వత్రా తుమ్మెదల ఝంకారాలే. అక్కడమంత్రిణీ నాథమనోహర మందిరమున్నది. కదంబవనవాటి విదిశలలో ఆగ్నేయదిక్కుతో ప్రారంభము. ఎత్తయిన నాలుగు మందిరాలు శిల్పి అక్కడనిర్మించాడు. ఒక్కొక్కమందిరం విస్తారం



**40** మై. అంతేపొడవు, ఏడు ఆవరణలు. ఇదేవిధంగా ఇతర విదిశలలో అంతట ప్రియకవృక్షాలుంటవి. ఇదిశ్యామాశక్తినివాసనగరి సేవకోసం మహా పద్మాటవీస్థలంలో మరొకనగరివున్నది.ఇక్కడ అనేక యోజనాలదూరంలో ఆమె గృహమున్నది. ఆకార ణంగా మంత్రిణిచే శ్రీదేవియొక్క నిత్యసేవ జరగదు. అందువల్ల చింతామణి గృహ సమీపంలో మంత్రినాథబవనం త్వష్టచేత, మయునిచేత నిర్మించబడింది. శ్రీపురంలో మంత్రిణీదేవి మందిరాన్ని ఆదిశేషుడుకూడ వర్ణించలేడు.మాన్యలైనమతంగ కన్యలు కాదంబరి ఆసవ సేవనామదంచే పూర్తిగా ఎరుపెక్కినకన్నులుగలవారై, మధురవీణతో లలితాగుణాల్నిగానంచేస్తు నాట్యంచేస్తారు. అంటే విని అగస్త్యు డన్నాడు హయగ్రీవు నితో మాతంగుడు, మతంగకన్యలు, వారిజన్మవిశేషం, మధుమదంతో వారు మంత్రిణీ నాథను సేవించేవిధం వివరించు మహాత్మా! అన గానే హయగ్రీవుడారంభించాడు. మతంగుడు మహాతపశ్శాలి. మహాప్రభావం గలవాడు. లోకాన్ని సృష్టించాలనే అత్యాశ ఆయనకు కలిగింది. తపశ్శక్తితో, మంచిబుద్ధితో సర్వేసర్వత్ర తనశాసనం చెల్లుబాటు చేసేవాడు. అతనికొడుకు మాతంగుడు. ధీరుడు, ధీమంతుడు అయిన ఆతడు మంత్రనాయికయైన ముద్రిణిని ఘోరతపంతో మిక్కిలి పూజించాడు. మంత్రిణి సుప్రసన్నయై ఆతనికి వరమిస్తానన్నది. మాతంగుడన్నాడు. తల్లీ! నీ స్మరణమాత్రంచేత నాకు అణిమాది సర్వసిద్ధులు లభించినై. మూడులోకాల్లోను నాకు కావలసి నవి ఏవీలేవు. నీ ప్రసన్నత నిష్ఫలంకారాదు. వరం అడుగుతా, పూర్వం నేను హిమవంతుని స్నేహితుణ్ణి, అతనితో వేళాకోళంచేసా అతడు క్రీడామదంతో కూడని మాటలాడాడు. తాను గౌరి తండ్రినని అతనికి లోపల అహంభావం అన్నిగుణాలు మాయిద్దరికీ సమానమే.నాకుమాత్రం గౌరిపుత్రిక కాలేదు. ఆఒక్కకోరికనాకు తీరాలి. నీవునాపుత్రివి కావాలి. నాపేరు ప్రసిద్ధిపొందాలి అనగానే 'తథాస్తు'అంది మంత్రిణి. అంతర్ధాన మయింది. మాతంగుడానం దించాడు. మంత్రిణ్యంబ మాతంగమునికి స్వప్నంలో కానుగుచెట్టు పూగుత్తిని చెవి అలంకారముగా ఇచ్చింది. ఆ స్వప్న ప్రభావంవల్ల మాతంగముని భార్య సిద్ధిమతి గర్భంధరించింది. ఆ గర్భంలో లఘుశ్యామ పెరిగి పుట్టింది. ఆ బిడ్డమాతంగి, లఘుశ్యామ అనిపేరు పొందింది. మాతంగ కన్యలు మనోహరులు, కోటానుకోట్లమంది. లఘుశ్యామలు మహాశ్యా మాతంగీ బృందముతో కూడినవారు, వీరు అంగశక్తులై ప్రియక ప్రియను సేవిస్తారు. ఇదీకథ.

## శ్రీనగర త్రిపురాసప్తకక్షలను పాలించు దేవతల కథ

అగస్త్యుడడిగాడు: స్వామీ! హయగ్రీవా! లోహాదిసప్తశాలల రక్షకుల పేర్లు వివరించవయ్యా! అనగానే హయగ్రీవస్వామి అన్నారప్పుడు. అగస్త్యా! అనేక ఉద్యానా లకు మహాకాలుడు రక్షకుడు.అతడునల్లగావుంటాడు. సర్వలోక భక్షకుడు నల్లనికవచం ధరిస్తాడు. మదంవల్ల ఆయనకన్నులు ఎరుపెక్కి వుంటాయి. విశ్వం అనేపాన పాత్రలో రసాయనం తాగుతూ వుంటాడు. మహాకాళిని వారచూపులతో చూస్తాడు. ఆమెనల్లని మేఘంలా వుంటుంది. కామంవల్ల మనస్సు కరుగుతూవుంటుంది. ప్రపంచవినాశన

(ప్రళయ) సమయంలో సింహాసనంపై కూర్చుంటాడు మహాకాలుడు. లలితాధ్యానంలో మునిగివుంటాడు. లలితనే పూజిస్తూవుంటాడు. లలితాభక్తివల్ల ఆయుర్దాయం పెంచుకుంటూవుంటాడు. ఆయనను కాలమృత్యువు మొ॥ సేవిస్తూవుంటారు. మహాకాళి, మహాకాలుడు లలితాదేవి ఆజ్ఞనుపాటిస్తూ వుంటారు. ప్రథమ మార్గము నుండి ప్రపంచాన్ని పాలిస్తారు. మతంగుని కాలచక్రం మహాకాలునకు ఆసనం, దీనికి నాలుగు ఆవరణలు, మధ్యనగల బిందువుతో మనోహరంగా వుంటుంది. 3,5 కోణాలుగలది. పదహారు రేకులకమలం. 8 రేకుల మహానిశ అనే మహాకాలుని శక్తులుందురు. పంచకోణాగ్రంలో ప్రత్యూషుడు, పితృప్రసువు, ప్రాహ్ణ, పరాహ్ణ, మధ్యాహ్ణ అనుమహాకాలుని శక్తులు అయిదుగురు వుంటారు. ఇకపదహారు దళాలపద్మంలో దినమిత్ర, తమిస్ర, జ్యోతి, పక్షిణి, ప్రదోష, నిశీథ, ప్రహర, పూర్ణిమ, రాక, అనుమతి, అమావస్యిక, సినీవాలి, కుహు, భద్ర, ఉపరాగ, అనేశక్తులుంటారు. కల,కాష్ఠ, నిమేష, క్షణ, లవ, తృటి, ముహూర్తము, కుతప, హోర, శుక్ల పక్షము, కృష్ణపక్షము, దక్షిణ ఉత్తరాయణములు, విషుద, త్రయోదశి, సంవ త్సర, పరివత్సర, ఇదావత్సర, అనబడేశక్తులుంటారు. ఇద్వత్సరా ఇందు వత్సర, వత్సరపద్మంలో తిథివారాలు, నక్షత్రాలు, యోగాలు, కరణాలునాగ పత్రకమలంలో వుండేశక్తులు. కలి,కల్ప,కలన, కాళి అనేవారు ద్వార పాలకశక్తులు కాలచక్ర స్వభావాన్నిబట్టి వీరి మహాకాలునిభార్యలు. మదముతో నవ్వినముఖాలుగలవారు. మదిరతోనిండి, పూర్తిగా ఎర్రనైన పాన పాత్రగలవారు, నల్లనివారు, వీరు లలితాపూజ, ధ్యాన, జప, స్తోత్రాలలో మాత్రమే కాలం వెళ్లబుచ్చుతారు. కాలచక్రాసనంలో వున్న మహాకాలుని సేవిస్తారు.

ఇక కల్పవృక్షవాటికను రక్షించేవాడు వసంతరుతువు. మహాతేజశ్శాలి అయిన యీయన లలితాదేవికి ప్రియసేవకుడు. పుష్పసింహాసనంపై కూర్చుంటాడు. పుష్పాసవమదంవల్ల ఎర్రగావుంటాడు. పుష్పాయుధాలు ధరిస్తాడు. పుష్పాలంకారాలు పెట్టుకుంటాడు. పూలగొడుగులో లీలావిలాసంగా వుంటారు. ఇతనికి విలాస క్రీడకు మధుశ్రీ, మాధవశ్రీ (చైత్రం,వైశాఖం) అనే ఇద్దరు భార్యలుంటారు. వీళ్లుపుష్పాసవం సేవించిమత్తెక్కి వుంటారు. కామలాలసలు. సంతానవాటికను పాలించేవాడు గ్రీష్మ రుతువు. వీనికళ్లు తీక్షణమైనవి. నిత్యములలితాదేవిని సేవిస్తూవుంటాడు. ఆమెశాసనం చెల్లుబాటు చేస్తూవుంటాడు. ఇతని భార్యలు శుక్రశ్రీ, శుచిశ్రీ (జ్యేష్ఠ, ఆషాఢాలు) అనబడేవారు. హరిచందనవాటికా పాలకుడు వర్షరుతువు. ఇతడు మహాతేజస్వం తుడు. మెరుస్తున్న జేగురురంగు కళ్లుగలవాడు, అతడు పెద్దగానవ్వితే పిడుగులు పడ్డట్లు అవుతుంది. మదించిన మేఘం ఇతని వాహనం, మేఘకవచం తొడుగుతాడు, మణిధనువు ధరిస్తాడు. లలితాజప, ధ్యాన, పూజా, స్తోత్రాలయందాసక్తిగలవాడు. వింధ్యనుమదిస్తూ ముల్లోకాలకు సంతోషం కలిగిస్తాడు. నభశ్రీ,నభస్యశ్రీ (శ్రావణ భాద్రపదాలు) ఇతనిభార్యలు. ఇంకాస్వరస్యా, రస్యమాలిని, అంబ, దుల, నిరాలి, అభయంతి, మేఘయంత్రిక, వర్షయంతి, చిబుణిక, వారిధార అనేశక్తులుకూడ



ఈతని భార్యలు. మొత్తం 12మంది. వీరుమదంతో ఎరుపెక్కిన కళ్లుగలవారు. వర్ష ఋతువు వీరితో కలసి ఎల్లప్పుడు లలితా జపంచేస్తూ వుంటాడు. తన రుతువులో పూలసమూహంచేత, సర్వసంపదలచేత లలితా భక్తులదేశాలను అలంకరిస్తూ వుంటాడు.లలితావిరోధులదేశాలనుఅనావృష్టిచేపీడిస్తాడు. ఇతడుఎల్లప్పుడుదేవీ సేవకుడు.

మందారవాటికను శరత్‌రుతువు రక్షిస్తూ వుంటాడు. అదిలోకుల మనస్సులను ప్రశాంతంగా వుంచుతుంది. ఇషశ్రీ,ఊర్జశ్రీ, (ఆశ్వీజం, కార్తీకం) శరత్‌రుతువు భార్యలు వీరితో కలసి ఒక్కచోట జలం వుండేలా చేస్తాడీయన తన రుతువు నందలి పూవులతో లలితాదేవిని పూజిస్తాడీయన. హేమంత రుతువును మహాతేజస్సుగల వాడు. మంచుతోకూడిన చల్లని ఆకారం గలవాడు. ఇతని ముఖం ప్రశాంతమైనది. లలితాదేవికి ప్రియసేవకుడు. తనరుతువులోని పుష్పాలతో లలితాదేవిని పూజిస్తూ వుంటాడు. ఇతడు అగ్నిని శాంతింపజేసి పారిజాత వృక్ష వాటికను రక్షిస్తూ వుంటాడు. సహశ్రీ, సహస్యశ్రీ (మార్గశిరం, పుష్యం) ఇతని భార్యలు ఇతడు కదంబవనవాటికకు రక్షకుడు, ఆ కదంబవనవాటిక చల్లగ ముడుచుకు పోవునట్లు చేయబడుతుంది. అక్కడ వుండేదేవత శ్యామాదేవి. శిశిర ఆకృతిగలది. తపఃశ్రీ, తపస్యశ్రీ (మాఘం, ఫాల్గుణం) ఇతని ఉత్తమభార్యలు.వీరితో కలసి ఈతడు లలితాదేవిని అర్చిస్తూవుంటాడు. ఇది విన్న అగస్త్యుడు హయగ్రీవ స్వామిని అడిగాడు. స్వామీ! హయగ్రీవా! ప్రథమోద్యానపాలకుడు మహా కాలుడు. అతనిది నాలుగు ఆవరణలుగల చక్రం. కల్పక ఉద్యానవాటులలో మహాకాలుడు కాకుండా, ఆరురుతువులకు పాలకత్వం వేరుగాఉన్నది. కాని చక్రదేవుల స్త్రీలెవరు? వసంతాది చక్రముల ఆవరణదేవతలెవరు? వివరించు మనగా స్వామి అన్నారు. అగస్త్యా! అన్నీచెబుతా, విను, పూర్వం చెప్పినకాల చక్రం వాసంత చక్రం అనబడుతుంది. అది 3,5 కోణాలుగలది. నాగదళాలు గల కమలం. పదహారు ఆకులుగలది మరియొక కమలం. 20 ఆకులుగల కమలం ఇంకొకటి. ఇది చతురస్రం. ఏడుఆవరణలుగలది, దానిమధ్య బిందు చక్రంలో వసంతుడుంటాడు. మహాతేజశ్శాలి. అతని రెండువైపుల మధుశ్రీ, మాధవశ్రీ వుంటారు. వసంతుడు తన రెండు చేతులతో వారి ఒక్కొక్కస్తనాన్ని పీడిస్తూవుంటాడు. తనరెండు చేతులలో సుగంధపుష్పాసవ పానపాత్ర. మాంసము ధరించివుంటాడు, ఈవిధంగా అన్ని రుతువుల ధ్యానం వుంటుంది. వర్షరుతుధ్యానంలో అతనిభార్య లిద్దరు తొడపై వుంటారు. తక్కినవారు సమీపంలో వుంటారు. వసంత చక్రదేవతలు మధు శబ్దంతోకూడి మధు శుక్లపాడ్యమి, మధుశుక్ల విదియ, అనబడుతూ పూర్ణిమ వరకు మధుశుక్ల పూర్ణిమగా వ్యవహరించబడతారు. తరువాత మధుకృష్ణ పాడ్యమి, మధుకృష్ణవిదియ అనబడుతూ మధ్యమా (చైత్ర బ.అమావాస్య)తో ముగుస్తుంది. (మధు=చైత్ర) ఈ దేవతలు 30మంది. ఈవిధంగా మాధవం (వైశాఖం) 30శక్తులు గలది. మొత్తం వసంతరుతు శక్తులు 60మంది వారు తమ తమ మంత్రాలతో విధి విధానంగా పూజించదగ్గవారు. వాసంత చక్రరాజానికి ఆవరణలు7. అరవైభూము

లలో అరవై దేవతలుంటారు. సాధ కులువారిని వేరు వేరుగా ఆయామంత్రాలతో పూజించాలి. మిగిలిన 3 చక్రాలు వాసంత చక్రంవలెనే వుంటవి. గ్రీష్మరుతు చక్రంలో **60**మంది శక్తులుంటారు. ఈవిధంగానే వర్షరుతువు చక్రంలో వుంటారు. ప్రతి చక్రానికి **60** మంది శక్తులుంటారు. వీరు రుతుసంబంధశక్తులు, లలితాభక్తు లకు సుఖమిస్తారు. లలితాపూజా జపధ్యాన స్తోత్రాలయందాసక్తి గలవారు. కల్పాదివాటికా చక్రంలో సంచరించే శక్తులు మదాలసలు. తమతమ వాటికలలోని పుష్ప స్రవమధువు లతో లలితాంబను తృప్తిపరుస్తారు. మొత్తం శక్తులు **360.** ఇదీ విషయం తరువాత మిగిలిన విశేషాలు విందువుగాని.

## పుష్పరాగ ప్రాకారాది ముక్తాప్రాకారాంత సప్తకక్షాంతర కథ

రత్నమయశాలలవి. బంగారుశాలకు, పుష్యరాగశాలకు మధ్య **56**మై. గలదు. అక్కడసిద్ధులు, వారి భార్యలు మదవివశులై రసరసాయనాలతోను ఖడ్గాలతోను, పాదాలకాటుకలతోను క్రీడిస్తూవుంటారు. లలితాభక్తులై మహాత్ములను ఆనందింప జేస్తారు.రకరకాలమదిరారసాయితాగుతారు. పుష్యరాగభవనాలకు ద్వారాలు, మొ॥పూర్వశాలలకున్నట్లే వుంటవి. తలుపులు గడియలు, గోపురాలు మొ॥అన్నీ పుష్యరాగనిర్మాణాలే, చంద్రసూర్యుల్లాగా ప్రశాశించే ఆశాలలు ఎత్తయినవి బంగారు చక్రప్రాకరచక్రానికి పుష్యరాగ ప్రాకార చక్రానికి మధ్యనున్న భూమి పుష్యరాగములతో నిర్మించబడినదే. ఇకచెప్పబోయే మహాశాల భవనాలగదులతో, అంత్యపురాలలో నిర్మించబడిన పక్షులు, సరస్సులు అన్నీ పుష్యరాగనిర్మితాలే. నదులు, వృక్షాలు కూడా అట్టివే పూర్వం అనేక రకాలుగా లలితాదేవిని ఉపాసించిన వారు సిద్ధులై భార్యలతో అక్కడ ఆనందిస్తున్నారు. లలితామంత్రంజపిస్తున్నారు. ఆ తల్లి ఆజ్ఞలో నడుచుకుంటు న్నారు. లలితానామసంకీర్తన చేస్తున్నారు. పుష్యరాగ మహాభవనానికిమధ్య గాలివచ్చు టకు చతురస్రమైన పద్మరాగ మయభవనం నిర్మించబడింది. అక్కడినేల, గోపురం అన్నీ పద్మరాగమణిమయాలు. అక్కడ చారణ దేశంలోవున్న చారణులు పూర్వదేహం నశించి పోవడంవల్ల లలితాపాద పద్మ సేవకులై సిద్ధిపొందారు. వారిస్త్రీలు కూడా మహా అందగత్తెలు. మదలీలా విలాసలు. వీరులలితాగీతాలను మాటిమాటికి గానం చేస్తూవుంటారు. అక్కడ కల్పవృక్షాలమధ్య వేదికయందుండి, భక్తులతో కలసి మధు ఆనవరసాన్ని తాగుతూ వుంటారు. పద్మరాగ భవనంలోపల పూర్వభవనాలతో కలిసిన గోమేధికనిర్మితమహాభవనం వున్నది. ఆ తరువాత చాలా ఎత్తయిన వజ్ర భవనం వున్నది. ఆరెంటిమధ్యన వజ్రభూమివున్నది. అక్కడ పూర్వజన్మలో లలితాదేవిని అర్చించిన గంధర్వోత్తములు అప్సరసలతోబాటు వుంటారు. వీణలు వాయిస్తూ లలితా గుణగానంచేస్తుంటారు. కేవలం మన్మథాకారులు. కామభోగరసికులు. సుకుమారులు, దేవీభక్తి తేజంతో వెలిగిపోయేవారు. గోమేదికరత్నభవనం పూర్వభవనాలతో సమాన మైనది. దానిలో కోట్లాది యోగినులు, భైరవులు వుంటారు. వారుభక్తితో లలితాంబను సేవిస్తారు. గోమేదిక మహాభవనంలో ఊర్వశి,రంభ,మేనక, మొ॥ దేవవేశ్యలు గంధర్వు



లతోకూడి కొత్త కల్పవృక్ష మధువులుతాగి, మాటిమాటికి లలితాదేవిని ధ్యానిస్తూ, తమసౌభాగ్యవృద్ధి కోసం లలితామంత్రాన్ని లెక్కప్రకారం జపిస్తారు. **14** స్థానాలలో పుట్టిన అప్సరసలందరు, సంతోష హృదయాలతో దేవిని పూజిస్తూ అక్కడవుంటారు. అంటూ హయగ్రీవుడు చెప్పగావిని అగస్త్యుడడి గాడు.

స్వామి! అప్సరసల **14** జన్మలను వివరించవయ్యా! అనగానే హయగ్రీవస్వామి అన్నారు. బ్రాహ్మణుడు, హృదయము, మన్మథుడు, మృత్యువు, భూమి, వాయువు, సూర్యకిరణాలు, చంద్రకిరణాలు, వేదాలు, అగ్ని, విద్యుత్తు, అమృతము, దక్షకన్య, జలము, అనేవి గంధర్వజన్మస్థానాలు, చక్కని సౌభాగ్య సంపదగల దేవతాస్త్రీలకు సంబంధించిన వీరందరు గంధర్వు లతోబాటు చక్రిణిని లలితను అర్చిస్తారు. కిన్నర, కింపురుషులు సస్త్రీకులై వజ్రస్థలాన్ని ఆశ్రయించారు. లలితామంత్ర జపాలతో పాపాలు పోగా నాట్యము గానము చేస్తూవుంటారు. ఇక్కడ 'వజ్ర' అనేనది ప్రవహిస్తూ వుంటుంది. అదిమహాపవిత్రజీవనది. లలితాభక్తులు దాని ఉదకాలు తాగి వజ్ర శరీరులై, రోగాలులేనివారై దీర్ఘయుష్మంతులై వుంటారు. ఇంద్రుడు ప్రయోగించిన వజ్రాయుధాన్ని భండాసురుడు మింగివేసాడు. వజ్రహీనుడైన ఇంద్రుడు వజ్రనదీ తీరంలో వజ్రేశ్వరినిగూర్చి భక్తితో తపస్సు చేసాడు. అందు ప్రత్యక్షమైన దేవి ఇంద్రునకు వజ్రాయుదం ఇచ్చి మాయమయింది. ఇంద్రుడు ఆనందంతో స్వర్గానికి వెళ్లాడు.

వజ్రభవనంలో పూర్వంవలెనే ఎత్తయిన గోపురంతోకూడిన ఉన్నత వైడూర్యమణి నిర్మిత భవనం వున్నది. అక్కడి స్థలం కూడ వైడూర్యమణి నిర్మితం. పాతాళలోకంలోని లలితా ఉపాసకులు సిద్ధులై ఇక్కడ వుంటారు. సర్వసుఖాలు అనుభవిస్తారు. శేషుడు, వాసుకి, శంఖ, తక్షక, మహాపద్మ, అనబడే సర్పరాజులు సస్త్రీకులై అక్కడ వుంటారు. బలిచక్రవర్తి, ధర్మాత్ములైన రాక్షసులు వారి స్త్రీలతో అక్కడ నివసిస్తారు. లలితాశాస్త్ర దీక్షితులు, లలితా జపపరాయణలు, నిత్యలలితాపూజా సక్తులు అక్కడ నివసిస్తారు. అక్కడ వైడూర్య నిర్మిత భాగంలో చన్నీటినదులు, బెగ్గురు పక్షులతో అందమైననిర్మల జలసరస్సులు వైడూర్యమణి నిర్మిత దివ్యభవనాలు ఉన్నాయి. ఆభవనాల్లో నాగులు, రాక్షసులు వారిస్త్రీలతో క్రీడిస్తూవుంటారు. వైడూర్య భవనంలో మరియొక చక్రవాలం వలె నున్న ఇంద్రనీలమణి భవనం వున్నది. దాని మధ్యభూమి నీలరత్నమయం. అక్కడ మధురములైన నదులు, చల్లని సరస్సులు వున్నవి. సరసభోగ్య వస్తువులు అనేకంవున్నాయి. భూలోకంలోని లలితామంత్రసాధకులు దేహాంతమున ఇక్కడకు చేరుకుంటారు. వారి స్త్రీలతో కూడి దివ్యవస్తువులను అనుభవిస్తారు. మధురమైన మద్యంతాగి భక్తితో నృత్యం చేస్తారు. అక్కడినదులలో, సరస్సులలో అందములైన తీగపొదిరిళ్లలో మహసంపన్న మందిరాలలో ఎల్లపుడు శ్రీదేవిని జపిస్తూ, ఆ తల్లిగుణాలువర్ణిస్తూ, మహాభాగ్యవంతులు స్త్రీలతో చుట్టబడి నివసిస్తారు. భూలోకంలో చేసిన కర్మల పుణ్యఫలం నశించగానే మనుష్యులుగా భూలోకంలో పుడ తారు. పూర్వజన్మ సంస్కారంవల్ల మరల లలితాదేవిని పూజిస్తారు. మరల ఈ నగరానికి

చేరుకుంటారు. ఆ స్థలప్రభావంవల్ల రాగద్వేషాలతో నీల (మలిన) భావాలు కలిగివుం టారు. ఇంద్రియాలను జయించిన మానవులు జ్ఞానులై ఆశ్చర్యంగా అమ్మవారిలో ప్రవేశిస్తారు.

ఇంద్రనీలమణిభవనంలో ముత్యాలభవనం వున్నది. దానిగోపురాలు పూర్వం వంటివే. వాటిమధ్యలో స్వచ్ఛంగా ప్రకాశించే చదరమైన నేలవున్నది. అదంతా ముత్యాలు పొదగబడి చాలా చల్లగా హాయిగా వుంటుంది. అక్కడ తామ్రపర్ణి, మహాపర్ణి, ముక్తాఫలోదక, మొ॥ మహానదులు ప్రవహిస్తుంటాయి.వాటి తీరాల్లో దేవతలుంటారు. వారుపూర్వజన్మలో దేవీ మంత్రోపాసకులు ముక్తాశాలచుట్టు అష్ట దిక్పాలకులలో ముక్తాశాల, నీలిశాలలమధ్య ఇంద్రలోకంవున్నది. కోణంలో అగ్నిలోకం, దక్షిణానయమలోకం వున్నవి. యముడు లలితామంత్రం జపిస్తూవుం డును. ఇతడు తీవ్రస్వభావి. అమ్మ ఆజ్ఞను పాలిస్తూవుంటాడు. చిత్రగుప్తుడు, యమభటులతోబాటు శ్రీదేవి ఆజ్ఞను గుహుడు నియమిస్తాడు. గుహునిచే శపించబడి దురాచారులను, లలితాద్వేషము కలిగించువారిని, కపటభక్తులను, మూర్ఖులను, మొద్దులను, అతిగర్విష్టులను, మంత్రాలు దొంగిలించువారిని, చెడ్డమంత్రాలు జపించే వాళ్లను చెడువిద్యలు గలవారిని, పాపులను, నాస్తికులను, అనవసరంగా ప్రాణులను బాధించువారిని, స్త్రీలను, లోకాలను ద్వేషించేవారిని, యముడు అనేక నరకాలలో బాధిస్తాడు. ఇదంతా లలితాశాసనం వల్ల జరుగుతుంది. నైరుతిభాగంలో నిరృతిఖడ్గం ధరించి, రాక్షసలోకం ఆశ్రయించి లలితను అర్చిస్తూ వుంటాడు అతనికి ఉత్తర భాగంలో రెండు ద్వారాల మధ్యన వరుణలోకంలో వరుణుడుంటాడు.ఆయన మద్యం సేవించి మత్తెక్కివుంటాడు. శుభ్రమైన తెల్లనిశరీరం కలవాడు. చేప ఈయన వాహనం. సర్వదా శ్రీ చక్రక్రమాన్ని సాధిస్తూవుంటాడు. లలితాదర్శనం ద్వేషించేవారిని పాశాలతో బంధించి కిందికి తొక్కివేస్తాడు. భక్తులకు బంధవిముక్తి కలిగిస్తాడు. అతనికి ఉత్తర కోణంలో వాయులోకంవుంది. అది మహాతేజోవంతం అక్కడ వాయు శరీరులు మహదానంద భరితులు సిద్ధులు, రుషులు, యోగులు వాయు దేవుని మిత్రులు. వాయువు అనేక ఆకారాలతో వుంటాడు. ప్రపంచంలో ప్రతిప్రాణి అతని ఆకారం. ఇడ, పింగళ, సుషుమ్న అనుముగ్గురు ఆయన శక్తులు. వీళ్లు ఎల్లప్పుడు మద్యమదంతో వశం తప్పివుంటారు. వాయువు చేతిలో ధ్వజంవుంటుంది. మృగవాహనం, లలితా యోగ, ధ్యాన, క్రమపూజలో ఆయననిమగ్నుడు. అంగాంగములందు ఆనందం తొణికిసలాడే శక్తులతో చుట్టబడినవాడు. లలితాబలంతో ఆయనముల్లోకాలను గడగడ లాడిస్తాడు. సత్వసిద్ధికోసమే సర్వాభరణాలు అలంకరించుకుంటాడు. ఆ లోకానికి తూర్పున రెండు ద్వారాల మధ్యనయక్షలోకం వున్నది. అక్కడ మహాతేజస్వి, శ్రీమంతుడు అయినకుబేరుడుంటాడు. అతడు నవనిధులతో, బుద్ధి వృద్ధి, మొ॥ శక్తులతో కూడిలలితాభక్తులను ధనసంపదలతో నింపుతూ వుంటాడు. అనుకూలవతు లైన అందగత్తెలైన యక్షిణులతో అనేకమద్యాలతో శ్రీచక్రస్వరూపిణి అయిన లలితా



పరమేశ్వరిని ఆనందింప జేస్తాడు. ఈయన సేనానులు మణిభద్రుడు, మణిమంతుడు, మణికంధరుడు, ఆలోకానికి తూర్పుభాగంలో మహాభివృద్ధితో రుద్రలోకముండె. అమూల్య రత్నాలంకారాలుగల రుద్రుడు అక్కడిదైవం. అతడు మహాకోపిష్టి. ధనుర్బాణ ములుధరిస్తాడు. అతనివంటి మహాబలవంతులు రుద్రరూపంలో అక్కడ వుండి లోకాలను రక్షిస్తూవుంటారు. పదహారు ఆవరణలలో ధనువులను ఎక్కుపెట్టి వుంటారు వారు. లలితా జపతత్పరులు, రుద్రుడును లలితాజప తత్పరుడు అతని పక్కన అనేక కోట్లరుద్రాణులుంటారు. వారిశరీరాలు వెలుగులు జిమ్ముతూవుంటవి. నవయౌవనమదశాలురు, లలితాధ్యానిమ గ్నులు. సత్ అనేమద్యం సేవించి వశం తప్పివుంటారు. మహారుద్రుడు త్రిశూలధారి, హిరణ్యబాహువు లలితను దర్శించని వారిని, గురుధిక్కారం చేసినవారిని శూలంతో కుళ్లబొడిచిముక్కలు చేస్తాడు. త్రినేత్రా గ్నితో కాల్చివేస్తాడు. పుత్రమిత్రకళత్రంగా వారిని సర్వనాశనం గావిస్తాడు. లెక్కకు మించిన రుద్రులుంటారక్కడ. భూమియందలి రుద్రులు కోట్లమంది స్వర్గంలో కూడా అంతే వారి అన్నంబాణం, వారి ప్రాణాలు బాణాలు. వారి వర్షం బాణం. మిక్కిలి వెలిగే వారి కన్నులు పింగళవర్ణాలు సముద్రంపైన, ఆకాశాన ఓజస్సుగలవారు. జడలు,మధువులు,నల్లనికంఠాలుగలవారు. పాటలవర్ణం (ఎరుపు+తెలుపు) గలవారు. భూతాధిపతులు, బాణధారులు, జటాజూటులు, పాత్రలతోతాగుతున్నరు మనుష్యులను అన్నములోవుండి బాధించువారు మార్గాలలో రథాలుగలవారు. తీర్థాలలోనివసించే వారు వేలాది మంది రుద్రులు బాణాలు, రత్నహారాలు, ధనువులు గలవారు, ఈ రుద్రులంతా లలితాదేవి ఆజ్ఞను పాలిస్తూ దిక్కులందున్నారు. వారు మహా మహులు. క్షణంలో ముల్లోకాలను దహించు సమర్థులు. దయామయులు, లలితాధ్యాన నిష్టులు లలితాభక్తులను రక్షిస్తారు. ముత్యప్రాకారమండలంలో 16 ఆవరణల చక్రాశ్రయులై హిరణ్యబాహుడు మొ॥రుద్రులు కోపంతో జ్వలించే మహారుద్రుని ఉపాసిస్తారు.

## దిక్పాలాది శివలోకాంతర కథనం

అగస్త్య మహర్షి అడిగాడు. హయగ్రీవస్వామి ఆరంభించారు. రుద్రాధి దైవతమైన షోడశావరణ (16 ఆవరణలుగల) చక్రం అక్కడవున్న రుద్రులపేర్లు. అవివారి క్రియలనుబట్టి వచ్చినవా? నిరర్థకములైనవా? అనగా స్వామి అన్నారు. అక్కడ ముత్యాలతో నిర్మించిన ఆలయమున్నది. అది 40 మై.విస్తారము, అంతేపొడవుగలది. 16 ఆవరణలు, మధ్యగల పీఠం చాలా అందమైనది. అందు మహాకోపిష్టి, ధనుర్ధారి, ముక్కంటి అయిన రుద్రుడు స్థిరంగా వుంటాడు. త్రికోణంలో ముగ్గురు రుద్రులుం టారు.రుద్రా ధ్యాయంలో (నమకం)2వ అనువాకంలోగల రుద్రులు హిరణ్యబాహువు, సేనాని,దిక్పతి అనేవారే ఆముగ్గురు. 1.బంగారు భుజాలుగలవాడు 2. కుమారస్వామి రూపుడు 3. అష్టమూర్తి. 1.వృక్షస్వరూపులు 2. బంగరు వెంట్రుకలుగలవారు 3. ఉత్తమపశుపతి 4.లేతపచ్చిగడ్డిరంగు గలవాడు,పసుపు,ఎరుపు కలిసిన రంగుగల వాడు, 5. కాంతిమంతుడు 6. దక్షిణ ఉత్తర, మార్గాలకు అధిపతి, ఆరుకోణాలలో

వుంటారు. వృషభవాహనులు, శత్రువులను బాధించువాడు, అన్నాధిపతి, హరికేశ ఉపవీతి, పుష్టానాంపతి, భవుడు, హేతి, అనేవారు ఎనిమిది కోణాలలో వుంటారు. హరికే ఉపవీతి, షష్టానాంపతి, భవుడు,హేతి, అనేవారు ఎనిమిది కోణాలలో వుంటారు. జగతాంపతి, రుద్రుడు, మహారక్షకుడు, క్షేత్రపతి, సూతుడు,నేను, రోహితుడు, స్థపతి, వృక్షపతి అనబడే వీరంతా ధనువులు ఎక్కుపెట్టి సిద్ధంగా వుంటారు. వాణిజుడు, కక్షపతి, భువంతి, వారివుడు, ఓషధీపతి, ఉచ్చైర్ఘోషుడు, ఆక్రందయంతుడు, సతిపతి, కృత్స్నవీతుడు, ధావంతుడు, సత్త్వనాంపతి అనబడే ఈ పన్నెండు మంది పంచమావరణంలో పన్నెండు దళాల్లో వుంటారు. సహమానుడు, నిర్వ్యాధి, అవ్యాధినాంపతి, కకుభుడు, నిషంగి, స్తేనానాంపతి, నిచేరువు అనేవారు ఆరవ ఆవరణలో వుండే రుద్రులు. పరిచరుడు, అరణ్యపతి, సృకావి, జిఘాంసతుడు, ముష్ణతాంపతి,అసిమంతులు,నక్తంచరుడు ప్రకృతిపతి, ఉష్ణీవి,గిరిచరుడు, కులుంచానాంపతి, ఇషుమంతులు, ధన్వావిదులు, ఆతన్వానులు, ప్రతిదధానులు, అయచ్ఛంతులు, ఈ16మంది 16దళాలలో వుంటారు. విసృజంతులు అస్యంతులు విధ్యంతులు, ఆసీనులు, శయానులు, జాగ్రతులు, తిష్టంతులు, ధావంతులు, సభికులు, సభాధిపులు, అశ్వస్వరూపులు, అశ్వపతి స్వరూ పులు, ఆ వ్యాధినులు వివిధ్యంతులు, గణాధ్యక్షులు, బృహంతులు, గృత్సుడు ఈ 8మంది 8వ ఆవరణలో వుందురు. గృత్సాధి పతులు వ్రాతులు, వ్రాతాధిపులు, గణులు, గణపులు,విశ్వరూపులు, విరూపకులు, మహాంతులూ, క్షుల్లకులు, రధులు, అరధులు, రధులు, రధపతులు, సేనా స్వరూపులు సేనానాయక స్వరూపులు, క్షత్తలు, సంగ్రహీతులు, తక్షులు రధకారకులు, కులాలురు అనే రుద్రులు 9వ ఆవరణలోవుండే దేవతలు. కర్మారులు, పుంజిష్టులు, నిషాదులు, ఇషుకృత్తుగణములు, ధన్వకారులు, మృగయులు, శ్వనయులు, శ్వానులు, అశ్వములు, అశ్వపతులు, భవుడు, రుద్రుడు,శర్వుడు, పశుపతి, నీలగ్రీవుడు, శితికంఠుడు, వృష్ణకేశుడు, సహస్రాక్షుడు, శతధన్వుడు, గిరిశుడు, శిపివిష్టుడు, మీఢుష్టముడు, ఈ 10మంది పదవ ఆవరణలో వున్న దేవతలు.

ఇషుమంతుడు, హ్రస్వుడు, వామనుడు, బృహంతుడు, వర్షీయసుడు, వృద్ధుడు, సమృద్ధి, అగ్ర్యుడు, ప్రథముడు, ఆశువు, అజిరుడు, శీఘ్రియుడు, శీభ్యుడు, ఊర్మి, అవస్వన్య స్రోతస్యుడు, ద్వీప్యుడు, జ్యేష్ఠుడు, కనిష్టుడు, పూర్వజుడు, అవరజుడు, మధ్యముడు, అవగమ్యుడు, అపగల్భుడు, జఘన్యుడు,బుధ్న్యుడు,సోభ్యుడు, ప్రతిసర్యుడు, యామ్యకుడు, క్షేమ్యుడు, వోచవుడు, ఉర్వర్యుడు ఖల్యుడు, శ్లోక్యుడు, అవసాన్యకుడు వన్యుడు, కక్ష్యుడు శ్రవుడు, ప్రతిశ్రవుడు,ఆశు షేణుడు, ఆశురధుడు, శూరుడు, అవభిందుడు వర్మి, వరూధి, బిల్మి, కవచి, శ్రుతుడు, సేనుడు, దుందుభ్యుడు ఆహనన్యుడు, ధృష్టుడు, అనువారు పదకొండవ ఆవరణలో వుండే రుద్ర దేవులు. ప్రమృశులు, దూతలు, ప్రహితులు, నిషంగులు, ఇషుధిమంతుడు, తీక్ష్ణేషువు. ఆయుధి, స్వాయుధుడు, సుధన్వుడు, సృత్యుడు, పథ్యుడు, కావ్యుడు, నాట్యుడు, సూదుడు,



సరస్యుడు, నాధమానుడు, వైశంత్యుడు కుప్యుడు వర్ష్యుడు, అవర్ష్యుడు, మేఘ్యుడు, విద్యుత్యుడు ఈధ్ర్యుడు, ఆతప్యుడు, వాత్యుడు, రేష్మియుడు, వాస్తవ్యుడు, వాస్తుపుడు, సోముడు, అనువారు పన్నెండవ ఆవరణములోని మహాబలరుద్రులు.

పదమూడవ ఆవరణలో రుద్రుడు, తామ్రుడు, అరుణుడు, శంకుడు, పశుపతి, ఉగ్రుడు, భీముడు, అగ్రేవధుడు, దూరేవధుడు, హంత, హనీయ సుడు, వృక్షుడు, హరికేశుడు, తారుడు, శంభుడు, మయోభువు, శంకరుడు, మయస్కరుడు, శివుడు, శివతరుడు, తీర్థ్యుడు, కూల్యుడు, పార్యుడు, అవార్యుడు, ప్రతారణుడు, ఉత్తరణుడు, ఆతార్యుడు, ఆలాద్యుడు శష్పుడు, ఫేన్యుడు, అనువారు రుద్రదేవతలు. పధ్నాలుగవ ఆవరణలో సికత్యుడు, ప్రవాహ్యుడు ఇరిణ్యుడు,ప్రపద్యుడు, కింశిలుడు, క్షయమణుడు, కపర్ది, పులస్త్యుడు, గోష్ఠ్యుడు, గృహ్యుడు, తల్ప్యుడు, గౌహ్యుడు, కాట్యుడు, గహ్వరేష్ఠుడు, నివేష్ప్యుడు, పానవ్యుడు, రజస్యుడు, శుష్క్యుడు, హరిత్యుడు, లోప్యుడు, ఉలప్యుడు, ఉర్వ్యుడు, సూర్యుడు,పర్ణ్యుడు,పర్ణశద్యుడు, అవగురమాణుడు, అభిఘ్నంతుడు, అక్షివంతుడు, ప్రక్కిదంతుడు, కిరికులు, దేవానాం హృదయులు, 32 రుద్రదేవతలు 15వ ఆవరణలో ఆయుధాలు ధరించి వుంటారు. 16వ ఆవరణలో తూర్పు మొదలు ద్వారముల వద్ద విక్షిణత్కులు, విచిన్వత్కులు, నిర్హతనాయకులు, ఆమీవత్కులు, వీరందరను మహారుద్రుని ఉపాసిస్తారు. ఆ మహారుద్రుడు లలితాదేవి ఆజ్ఞకు బద్ధుడై వుంటాడు. అనగా నమకంలో 2వ అనువాకం మొదలు నవమ (9) అనువాకంవరకు గలరుద్రులు 16 ఆవరణలలోను వున్నారు. మహారుద్రుడు ముత్యాలభవ నంలో వుంటాడు. లోకాలను కాపాడుతూవుంటాడు. ముత్యాల భవనం లోపల మరకతమణి (పచ్చలు) నిర్మితభవనం వుంది. దాని ఎత్తు 32మై. పూర్వంవలె గోపురాలున్నై. ఆగ్నేయ, నిరృతి, వాయువ్య, ఈశాన్యదిశలలో శ్రీదండనాథ భవనాలు నాలుగున్నాయి. అవి దూత్రిణుల గృహవిస్తరములు. అవి గీతిచక్రరథశేష్టము యొక్క పర్వాలను ఆశ్రయించియున్నై. భండాసుర మహాయుద్ధంలో ఆ స్త్రీ దేవతలు అక్కడ జాగ్రత్తగా వున్నారు అక్కడి చదరపు నేలలు పచ్చలు పొదగబడి ధగధగ మెరుస్తుండె. అవి బంగారు లతావనాలతో శోభాయమానాలు. సమస్త వస్తు సమృద్ధాలు అచటి స్త్రీదేవతలు దండనాధను ఆశ్రయించి వుంటారు. తాడిచెట్లు బంగరు రంగుతో లెక్క లేనన్ని అక్కడ చిత్రించబడె. వాటికాండాలు 8మై. పొడవు విశాలమైన ఆకులు, బంగారు బెరడు, దట్టములు, మంచినీడలుగలవి. విరగకాసిన పళ్లు, మూలం మొదలు ఆకులవరకు కల్లుకుండలతో నొందినవి. ఇవన్నీ దండనాథ సంతోషం కోసం శిల్పులు నిర్మించినవి.

పొంగిన ఆ తాటికల్లు ప్రవాహాన్ని తెగతాగి, మత్తెక్కిన చక్రస్థిత జృంభిణి, మొ॥ దేవతలు, హేతుకుడు, మొ. భైరవులు ఏడుగురు నిగ్రహదేవులు, మదంతో వశంతప్పి నాట్యం చేస్తూవుంటారు. ఆగ్నేయం మొదలు నాలుగు మూలల దండిని యొక్క విశాల దృష్టులున్నచోట తూర్పుమొదలు దేవీ సమతేజస్వులుంటారు.

ఉన్మత్తభైరవి, స్వప్నేశి అన్నిదిక్కులలో వుంటారు. దండ నాథునివాసం కేవలం నామమాత్రం. ఆమె సేనావాసం మహాపద్మాటవీ స్థలంలో వుంటుంది. ఆమె గృహ భాగం చాలాదూరంలో వున్నందువల్ల సేవకొరకు ఆమెగృహం అక్కడవుంది. తరువాత మరకతమణి నిర్మిత భవనం. అది 56మై.వెడల్పు, పొడవుగలది. దాని కోటగోడ పగడాలతో నిర్మించారు. అది ఉదయసూర్యకాంతిగలది. అచటి స్థలాలన్నీ పగడాలతో నిర్మించినవే. బ్రహ్మ ఉపబ్రహ్మలతోవచ్చి అక్కడ లలితను సేవిస్తూవుం టాడు. లోకాలకు సంపదలందించడం కోసం 14 విద్యలు, వేలాది ఉపవిద్యలు, 64 కళలు రూపంధరించి ఆ ప్రాకారంలో అమ్మ ఆజ్ఞనుప్రకారం నడుచు కుంటారు. ఈభవ నంలో మాణిక్యమండప స్థానంవుంది. దానిచుట్టు లలితా సేవోత్సాహ విష్ణు లోకం వుంది. ఆ విష్ణులోకంలో ఆదివిష్ణువు 4,10,12 విధాలుగా రూపాలుధరించి లలితా సేవకోసం వేచివుంటాడు. భండాసుర మహాయుద్ధంలో లలితాదేవి గోళ్లనుండి పుట్టిన దశావతార దేవతలు ఆ మండపంలో వుంటారు. తూర్పుభాగం నుండి ఆయనకు పైన ఆచ్ఛాదన మాణిక్యాలతో నిర్మించబడింది, అక్కడ శంఖచక్ర గదాధారి యైన విష్ణువు 12 రూపాలతో తూర్పుమొదలుగా అన్ని దిక్కులను రక్షిస్తూ వుంటాడు. నేరేడుపండు రంగుతో మిలమిలమెరిసే చక్రధారియైన కేశవుడు తూర్పు దిక్కును రక్షిస్తాడు. నల్లని మేఘంవలెనున్న శంఖధారియగు నారాయణుడు, నల్లకలువ రేకువలె నున్న మధుమంతుడైన మాధవుడు పశ్చిమదిక్కును రక్షిస్తూ వుంటాడు. చంద్రకాంతిగల గోవిందుడు ధనువు ధరించి దక్షిణ దిక్కును రక్షిస్తాడు. పద్మకేసరవర్ణంగల బలరామావ తారమైన విష్ణువు ఉత్తర దిక్కును రక్షిస్తూవుంటాడు. రోకలిధరించిన మధుసూదనుడు ఆగ్నేయదిక్కును రక్షిస్తాడు. అగ్నికాంతిగల త్రివిక్రముడు కత్తిచేతబట్టి నైరుతి దిక్కును రక్షిస్తూ వుంటాడు. బాలసూర్యకాంతిగల వామనుడు వజ్రాయుధం ధరించి వాయువ్య దిక్కును రక్షిస్తాడు. తెల్లతామరకాంతిగల శ్రీధరుడు పట్టిశాయుధం ధరించి ఈశాన్య దిక్కును రక్షిస్తూ వుంటాడు. మెరపుకాంతిగల హృషీకేశుడు ముద్గరాయుధం ధరించి పడమరదిక్కును రక్షిస్తాడు. ఇంకను వేయిసూర్యుల కాంతిగలిగిన శారంగమనే ధనువుధరించి, మాణిక్యమండపస్థానాన్ని సవ్యంగా చుట్టివుంటాడు. సర్వాయుధాలు, సర్వశక్తులుగల సర్వజ్ఞుడు, సర్వతోముఖుడు, ఆరుద్రపురుగువంటి ఎర్రనిపట్టురంగు గలవాడు, పాశధారి, అజేయుడు, సర్వాత్ముడు, లలితాభక్తితత్పరుడు అయిన దామోద రుడు మాణిక్యమండప స్థానాన్ని అపసవ్యంగా రక్షిస్తూవుంటాడు. వీరిద్దరు ఎదురు బదురు అవుతూ తిరుగుతూంటారు. ఈ విధంగా విష్ణువు 12 శరీరాలతో మాణిక్య మండపమందువుంటూ విష్ణులోకంలో విలసిల్లుతూ వుంటారు. తరువాత నానారత్న భవనంలో సహస్ర స్తంభమండపమున్నది. అది సుమనోహరం, నవరత్నఖచితం, మహోన్నతం. వేలస్తంభాల్లో ఒక పంక్తి అడ్డుగా వుంటుంది. నలువైపుల అటువంటి పంక్తులు అనేకం వున్నాయి. రత్నాలచెక్కలపైకప్పు కూడా వుంది.అక్కడే శివలోకం వుంది. ఆకారం ధరించిన 28 శైవ ఆగమాలు అక్కడ ప్రకాశిస్తూవుంటాయి.సహస్ర



స్తంభమంటపంలో భృంగి, మహాకాలుడు మొ॥ ఉత్తములు, 26మంది తత్త్వ దేవతలు, వేలకొలదిగణపతులు వుంటారు. అన్నివిద్యలకు ఆదిమూల మైన శంకరుడు లలితా దేవి ఆజ్ఞను పాలిస్తూవుంటాడు. లలితామంత్రంజపిస్తూ బ్రహ్మానందం అనుభ విస్తూ వుంటాడు. తన భక్తులకు మంత్రసిద్ధిని అనుగ్రహిస్తూ వుంటాడు. మాలోపల, వెలుపల వున్న అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చేస్తూ వుంటాడు. మామేధాశక్తిని ప్రకాశింప జేస్తాడు. ఈ విధంగా సర్వజ్ఞుడు, సర్వకర్త అయిన మహాదేవుడు లలితాభక్తి తత్పరుడైన సహస్ర స్తంభమండపంలో వుంటాడు.

## మహాపద్మాటవీ అర్ఘ్యస్థాపన కథ

అగస్త్యా ! ఇప్పుడు చెప్పబోయేకథ విన్నంతమాత్రంచేతనే మహదైశ్వర్యా భివృద్ధి కలుగుతుంది. ఇక్కడ మూడుదిగుడుబావులున్నవి. వేయిస్తంభాల భవనంలో మనస్సు అనే మహాభవనంవుంది. అది నానారత్నఖచితం. పూర్వభవనాలవలెనే గోపురాలు ద్వారాలు, తలుపులు, గడియలు, మొ. దీనికి వుంటాయి. దానిమధ్యభాగంలో అమృత బావివుంటుంది. అందలి రసాయనం సేవించిన పురుషులు, యోగులు, సిద్ధులు, వజ్రశరీరులై, మహాబలంగలిగి, ప్రాజ్ఞులవుతారు. దాని సువాసన పీల్చిన వారికి సిద్ధులు వశం అవుతాయి. ఆ రెండు భవనాలపక్కన అమృతపు బావి రెండు తీరాల పక్కనవున్న పురుషులు, ఆ నీటిని తాకకున్న పుణ్యాత్ములవుతారు. మిగిలిన బావులన్నీ 2మై. పొడవు, 32మై.లోతు కలిగివుంటాయి. దానిమెట్లు చిత్ర విచిత్ర రత్ననిర్మి తాలు. హంసలు, బెగ్గురుపక్షులు బంగరు, రత్నముల రంగు లతో మిలమిలమెరుస్తుం టవి. చిన్నచిన్న కెరటాలు తీరాలను తాకుతుంటవి. పక్షులు ఆ నీటినితాగి, ముసలి తనము, మరణము లేకుండనుంటవి. అచటికారండవ పక్షులు కూస్తుంటే లలితా మంత్రమే వినిపిస్తుంది. ఆబావులనుచుట్టి రావాలంటే నౌకలే తప్ప వేరేమార్గం లేదు. మంత్రిణీ దండనాథల ఆజ్ఞవున్నందువల్ల 'తార' అనే మహాశక్తి మాత్రమే ఆబావులలో విహరిస్తుంది. నల్లకలువలవలె నల్లనైన సేవికలు చాలామంది తారను సేవిస్తూవుంటారు.వారు అనేకవేల రత్ననౌకలలో ఆజలంలో విహారంచేస్తూ వుంటారు. అటూఇటూ తీరాలకు చేరుతూ కిలకిలారావాలు చేస్తుంటారు. వీణ,వేణు, మృదంగాది వాద్యాలు వాయిస్తూ వుంటారు. ఆ తారానావికలు నవయౌవనం గలిగిన కోట్లాది మంది వుంటారు. దేవికీర్తిని గానం చేస్తుంటారు. నాట్యాలాడతారు. కొందరు తెడ్లచేత బట్టినవారు. కొందరు ఆ అమృతజలంతాగుతుంటారు. వీరిమధ్య తారాదేవి వుండి జలవేగాన్ని తగ్గిస్తూవుంటుంది. శివునకు కూడ ఆ విహార క్రీడలో తార ఆజ్ఞ ఇవ్వదు. మంత్రిణీ దండనాథల ఆజ్ఞ ఇందులకు అత్యవసరం. పానపాత్రలుచేతబట్టి మధువులు తెగత్రావి, ఆటపాటలతో, రత్ననౌకలతో విహరిస్తారు. మణిగృహాల్లో నివసిస్తారు. మొసలి, లేడి, సింహం, ఏనుగు ముఖాల ఆకారంతో నౌకలు రత్నస్వర్ణమయాలగుచు ముచ్చట మురిపెము కలిగిస్తుంటాయి. వీటిమధ్య విచిత్ర నౌకలో తారాంబవిహరిస్తుం టుంది. అనుకూల, వ్యతిరేక సంచారాలుచేస్తూ తారాంబ భవనంలోని లోపలి భాగాన్ని

రక్షిస్తూ వుం టుంది. మనస్సుఅనే భవనం మధ్య 56మై. దూరంలో 'బుద్ధిశాల' అనబడే ప్రసిద్ధభవనం వున్నది. దానిఎత్తు 32మై. దానిమధ్య 'ఆనందవాపిక' వున్నది. పొగడలపరిమళాలతో దివ్యంగా వుంటుందది. కరిగించిన బంగారుపు కాంతిగలదివ్య మద్యమే అందలిజలం. పూర్వవాపికలవలెనే వుంటవివి. వీటిమెట్లు, పక్షులు, మొ॥ పూర్వంవలెనే వుంటవి. ఆ జలరూపమద్య సేవనంతో మత్తెక్కిపిచ్చివార్లై, ఎర్రబడిపోయి తెగతిరుగుతూ వుంటారక్కడి స్త్రీలు, అక్కడి నౌకకు అధినాయిక వారుణీదేవి. సుధా మాలిని, అమృతేశ్వరి అంటారామెను. మణినౌకలో వారుణీదేవి వుంటుంది. చుట్టూ శక్తిసేన, ఆమె వారచూపులవల్ల ముల్లోకాలు మత్తెక్కి పోతవి. బాలసూర్యకాంతితో వుంటుం దామె. మదంతో మత్తెక్కిన ఆమె చెక్కిళ్లు ఎర్రబారివుంటాయి. ఆమె కొప్పు చుట్టు పారిజాతమాలచుట్టబడి వుంటుంది. ఆమె మద్యపాత్ర ధరించి వుంటుంది. అది కదులుతున్న కలువవలె నుంటుంది. మరొక మణి పాత్రలో వండినమాంసపు ముక్కవుంటుంది. మంత్రిణీ దండనాథల అనుమతి తోను ఆమె యితరులకు ఆ వాపిలో నౌకావిహారీనికి ఆజ్ఞ ఇస్తుంది. శివునకైనా సరే చెల్లదు.

బుద్ధిభవనంలో అహంకారమనే మహాభవనం వున్నది. దాని గోపురాలు మొ. పూర్వంవలెనే వుంటాయి. ఈ రెండుభవనాల మధ్య 'విమర్శవాపిక' అనేది వున్నది. అది సుషుమ్నానాడికి సంబంధించిన అమృతాకారం. మహాయోగుల ప్రాణాయామ వాయువు నింపిన మనస్సుయొక్క రూపం, అది సుషుమ్నా దండముయొక్క రంధ్ర మున పరమామృతముగా మేలుకొని వుంటుంది. అదే ఆవాపియందలిజలం. ఆ తీరమందలి నౌకలు, పక్షులు పూర్వంవలెనే వుంటాయి. ఇచ్చటి నౌకేశ్వరీ దేవి పేరు 'కురుకుళ్లా'దేవి. ఈమె ఆకారంకానుగచెట్టువలె నల్లగా వుంటుంది. నల్లని స్తనవస్త్రం ధరిస్తుంది. తనవలెనున్న సేవకులతో, నౌకేశ్వరీలతోచుట్టబడి వుంటుంది. ఆమెచేతిలో రత్నాల తెడ్లుంటవి. నిత్యప్రకాశమదంతో నునుపెక్కి వున్నది. మణినౌకను ఎక్కిచుట్టు తిరుగుతూ వుంటుంది. ఈవాపికలోని నీరు పూర్వం వంటిదే.

అహంకారభవనం మధ్య సూర్యబింబమహాభవనంవున్నది. అది 32మై. ఎత్తు. అక్కడ లలితాపరమేశ్వరి వుంటుంది అందువల్ల సూర్యునకు కూడ అక్కడ అరుణ కాంతి వచ్చింది. వారిద్దరి మధ్య భూమి పద్మరాగములు పొదిగినది. అక్కడ హఠాత్తుగా వచ్చేలేత ఎండలో సూర్యభగవానుడు తపస్సు చేసి తీవ్ర అగ్నికాంతిని పొందాడు. గ్రహనక్షత్రతారకలు ఇక్కడనే తపస్సు చేసి లోకాలను కాంతివంత చేస్తున్నాయి. సూర్యుడనే భైరవుడు అక్కడ ద్వాదశాదిత్యులు (12మంది) గామారేడు. కోట్లకొలది తేజశ్శక్తులతో కూడిన వాడయ్యాడు. అతడు మహాప్రకాశం పొందాడు. మదంతో ఎర్రనైన కన్నులు గలవాడయ్యాడు. ఊడుగుచెట్లమధ్య నిత్యక్రీడకు ఉత్సహిస్తూ తన్మ యుడై తనకు భవనానికి భేదంలేనట్లయ్యాడు. సూర్యబింబంవంటి ఆ మహాభవనశక్తి మహాప్రకాశం అనేపేరుతో నున్నది. చక్షుష్మతి అనేశక్తి. ఛాయాదేవి అనే పరాశక్తి అక్కడ వున్నారు. ఈవిధంగా ముగ్గురు శక్తులతోకూడి లలితా విద్యను హృదయంలో



జపిస్తూవుంటాడా మహాత్ముడు. లలితాభక్తుల ప్రకాశ ఇంద్రియాలను జ్ఞాన ప్రకాశవంతలుగా చేస్తాడు. బయటి చీకటిని, లోపలి అజ్ఞానాన్ని సమూలంగా నాశనం చేస్తాడు. అక్కడి లేత ఎండలో ఆయన ప్రకాశిస్తూ వుంటాడు.

ఈ సూర్యబింబ మహాభవనంలో చంద్రబింబ భవనం వున్నది. అది నాలుగు యోజనాల ఎత్తుగలది. (32మై.)పూర్వంవలెనే గోపురద్వారకవాటా లున్నవి. దానిమధ్య భూమిపేరు చంద్రికాద్వారం, అక్కడ చంద్రుడు మహా ఘోరతపస్సుచేసాడు. అత్రినేత్రంనుండి పుట్టికాంతిని పొందాడు. అక్కడ సోమనాథుడనే దేవుడున్నాడు. ఆయన ఆకారం నిర్మలం. మూడులోకాల చీకటిని నశింపజేసి సృష్టినినడిపిస్తూ వుంటాడు. పానపాత్రం నిండావున్న వెన్నెల అమృతాన్నితాగి, 27 నక్షత్రాలతో కూడి, మచ్చలేనివాడై నిజాకారంతో ప్రకాశిస్తూ వుంటాడు. సభార్యుడై లలితా జపస్తోత్ర పూజా ధ్యానాలతో చంద్రుడక్కడ కాలంగడుపుతూవుంటాడు. తారా నామధేయ ఇతరశక్తులు కూడ వేలకొలది అతని దగ్గరవుంటారు. ఆభవనభాగం వారితో నిండి వుంటుంది.

చంద్రభవనంలో శృంగార భవనం ఉన్నది. అది 32మై. ఎత్తు. శృంగార భవనరూపములైన కౌస్తుభమణులచేత నిర్మించబడినట్లు వుంటుందిది. దాని మధ్య మహాశృంగారమైనకోట గవను వున్నది. అక్కడ శృంగార సంతోషం నిండిన కందకం వున్నది. దానిచుట్టు దివ్యాలంకారభూషితలైన శృంగార శక్తులు దేదీప్యమానంగా వెలుగుతుంటారు. అనేకవేల నౌకలలో విహరిస్తుంటారు. విజృంభించి మదించి నౌకలలోనున్న మన్మథుని ఉపాసిస్తూ వుంటారు. ఆ మన్మథుడు లలితాదేవి శాసనం శిరసావహించి తనపూల బాణాలతో అన్నిలోకాలను సమ్మోహన పరుస్తాడు. అతని ప్రభావానికి ముగ్ధులై మహాపద్మాటవీస్థలంలో నివసించాలని కోరుకుంటారు. పవిత్రవేషం ధరించి లలితా భక్తితో నిండి ఏకాగ్రమనస్కులై అక్కడ చేరతారు. దేవతలు, సిద్ధులు, మనుష్యులు, రాక్షసులు అక్కడకు వెళ్లలేరు. సహజ పవిత్రులైన త్రిమూర్తులు అమ్మ ఆజ్ఞవుంటేనే అక్కడకు వెడతారు. సంసారులు, కాముకులు, సందేహాల పుట్టలో కొట్టుమిట్టాడేవారు, యౌవనమదంలో వివశులు అయినవారు. మహాకందకాన్ని దాటి అక్కడకు వెళ్లలేరు. దీనికి కారణం అతిలోకసుందరుడైన మన్మథుడు దానికి అధికారి.

తరువాత 56మై. గల శృంగార భవనంలో చింతామణిగృహం అనబడే చక్రరాజ మహాభవనం వున్నది. దానిమధ్యభూమి రత్నాలంకారమయం. దానిపేరు 'మహాపద్మా టవి' అది సమస్త సౌభాగ్యాలను ఇస్తుంది. శృంగారం అనే పేరుతో మహాకాలునివరకు గోపురం వున్నది. దానికి నాలుగు దిక్కుల్లోను గోపురాలున్నై, అవివంద, భవనాలు 25. అన్నిభవనాలకు పునాది 8మై. అక్కడ సమస్త రత్నాలు పొదిగిన 49మై. ప్రదేశంలో పెద్ద పెద్ద తూడులుగల, మెట్టతామరలు, పద్మాలు, గులాబులు నున్నవి. వాటి తూడులు 8మై. మెత్తని ముళ్లుగలవవి. వాటిరేకులు పదితాడిచెట్లు పొడవుగలవి.

కోటానుకోట్ల పద్మాలు, నూతన సుగంధభరితాలు, సుమనో హరులు ఎక్కువ దళాలుగలవి. ఎల్లప్పుడు వికసించివుండేవి. సుకుమారాలు, సుందరాలు, వాడనివి. మహాపద్మాటవీ భవనానికి తూర్పున అర్ఘ్యపాత్ర మహా ఆధారంవుంది. దాని ఎత్తు 2మై. దానిరూపంఅగ్ని. ఆకారం గుండ్రం. వెడల్పు 4మై. కళలుపదిగలది. దానిచుట్టు ప్రకాశించే ఆకారాలతో అనేకశక్తులున్నై. అది ధూమ్రార్చి మొ॥ పదిసూర్యకళలు. మిక్కిలి వెలిగిపోయే యౌవన సంపదగలవి. నానాలంకార భరితాలు, ఆధారరూపుడై, శోభా వంతుడై భగవంతుడైన అగ్నికౌగిలించుకొని, మన్మథమదంతో తొణికిసలాడు తుంటై, ధూమ్రార్చి, ఊష్మా,జ్వలినీ, జ్వాలినీ, విస్ఫులింగినీ, సుశ్రీ, సురూపా, కపిలా, హవ్యవాహా, కవ్యవాహా అనబడే ఈ పదికళలు అగ్నిప్రతీకలు అక్కడ ఆధారంలో దేవుడు పాత్రరూపం ధరించాడు. సూర్యుడు మూడు లోకాల చీకటినివశింపజేయ దంలో సర్వసమర్థుడు. సూర్యాత్మకమైన ఆ పాత్ర 12 మై. ఎత్తు, 8మై. పొడవు వెడల్పుగలది. మహాజ్యోతితో వెలుగు తుంటుంది.దానిచుట్టు అంటుకపోయి, దాని పుత్రికలవలె 12 కళలుంటవి. అవి సూర్యునికంటె కాంతిమిన్నలు తపినీ, తాపినీ, ధూమ్రా, మరీచి, జ్వలినీ, రుచి, సుషమ్నా, భోగదావిశ్వా, బోధినీ, ధారుణీ,క్షమా అనేవి వాటి పేర్లు. ఆపాత్రలో ఇతరానంద, పరమానంద కారణాత్మకమైన పరమా మృతమున్నది. అన్ని ఓషధీరసాలు అందున్నవి. సుమనోహర సుగంధభరితం అది. అతిసుగంధభరితాలైన నల్లకలువలు వాడని చెంగలు వలుగలిగి సువాసితమై, నిత్యమనోహరమై వుంటుంది. చల్లగా, తేలికగా, నిర్మలంగా వుంటుంది. వందలాది కెరటాలతో గంభీరమైనదది. లలితాపూజార్ఘ్య, నిత్యశబ్ది, అర్చనాకారణభాసిత ఆ అర్ఘ్యం చంద్రకళామయా మృతం దానియందలి సన్నని చంద్రకాంతి కళలు నౌకా మణులకాంతులతో కలిసి యుంటవి. అమృతా, మానదా, పూష్ణీ, తుష్టి,పుష్టి, రతి, ధృతి, శశిని, చంద్రికా, కాంతి, జ్యోత్స్నాశ్రీ, ప్రీతి, అంగదా, పూర్ణా, పూర్ణామృతా అనేవి వాటి పేర్లు. ఇవి చంద్రకళలు. నవయవ్వనం, నవ్వు మోముగల కళలు. పుష్టి బుద్ధి స్థితి మేధా, కాంతి, లక్ష్మి, ద్యుతి, ధృతి, జరా, సిద్ధా అనబడేవి బ్రహ్మకళలు. స్థితి, పాలిని, శాంతి, ఈశ్వరి, తతి, కామిక, వరద, హ్లాదిని, ప్రీతి, దీర్ఘ అనేవి విష్ణుకళలు. తీక్ష్ణ, రౌద్రి,భయ, నిద్ర, తంద్ర, క్షుత్, క్రోధిని, త్రప, ఉత్కరి, మృత్యువు అనేవి రుద్రకళలు. ఈశ్వరుని కళలు పచ్చునివి, తెల్లనివి, ఎర్రనివి, సితములు అనే నాలుగుమాత్రమే. నివృత్తి, ప్రతిష్ఠ, విద్య, శాంతి, ఇందిర, దీపిక, రేచిక, మోచిక, పర, సూక్ష్మ, సూక్ష్మామృత, కళ, జ్ఞానామృత, వ్యాధిని, వ్యాపిని, వ్యోమ, రూపిక ఈ 16 శక్తులు అక్కడ క్రీడిస్తూ వుంటారు. రుద్రనౌకలో ఎక్కుతారు, చంచలంగా వుంటారు. వేలకొలది విద్యలు ఇటు అటు శక్తిరూపంలో క్రీడిస్తూవుంటారు. హస్తోదక సంశోధన కోసం వీరు బ్రహ్మచేత సృష్టించబడ్డారు. ఆహస్తోదకామృతంతాగి మత్తెక్కి వుంటారు. మహాపద్మాటవిలోవున్నను, మహాచక్రమందున్నను, నిత్యనూతనమైనది, పునఃపునః సుగంధం నిండినది అయిన ఆమహామృత అర్ఘ్యాన్ని వేలకొలది రత్నకుంభా



లలోను, కోట్లాది బంగారు కుండలలోను ఎల్లపుడు నింపి నింపి, చింతామణి గృహమందున్న వారి పరిచారికలు మదగర్వితలై అణిమాదిశక్తు లకు హస్తోదకం ఇస్తారు.

## చింతామణి గృహాంతర కథనం

చింతామణిగృహంయొక్క ఆగ్నేయదిశలో కుండమానకం అనేపేరు గల యజ్ఞ స్థలం వున్నది. దానివెడల్పు పొడవు 8మై. అంతదూరం చాతక పక్షులుంటవక్కడ. అక్కడ అగ్నిమండుతూవుంటుంది. అనేకవందల అమృత ధారలతో అదిపూజించ బడింది అదిపవిత్రమైనది. అమ్మ ఆజ్ఞతో ఐశ్వర్యం ఇస్తుంది. సమిధలు లేకుండానే సహజ జ్వాలామాలలతో మహా మహిమా న్వితమైనది. అమృతంతో తృప్తినొందిన ఆకారంగలది. కంకోలవృక్ష చిగు రులవంటి రంగుగలది. జ్ఞానాగ్ని అక్కడమండుతూ వుంటుంది. సకలలోక రక్షణకోసం శ్రీలలిత, కామేశ్వరుడు అక్కడ నిత్యం హోమం చేస్తుంటారు. వీరిద్దరు పరస్పరానుకూలురు. అనురాగులు, దీనికినైరుతి భాగంలో పద్మాట విలో చక్రరాజరథశ్రేష్ఠముండె. అది మహోన్నతం, 9 అంతస్థులు గలది. సమస్త రత్నభరితం, 32మై. విస్తారం, 80మై.ఎత్తు పైకిపోను పోను కురచలావైన నొగలు, నాలుగు వేదాలు దాని చక్రాలు, ధర్మార్థకామ మోక్షాలు గుర్రాలు, దాని వింజామరలు ద్వైతం అద్వైతం ముత్యాలగొడుగున్నది. భండాసురమహాయుద్ధంలో అనేక సాహసాలు చేసింది. లలితాదేవి ఆసనం కోసం వేరే రథశ్రేష్ఠం నిర్మించబడింది. అది దారునిర్మితం. చింతామణి గృహానికి వాయువ్యమూల పద్మాటవిలోనున్నదది. చింతామణి గృహంయొక్క ఈశాన్యభాగంలో గేయచక్రరథ శ్రేష్ఠంవున్నది. ఈ ప్రదేశం మంత్రిణిది, కిరిచక్రం అనే మహారథం దండనాథకు చాలా యిష్టమైనది. ఈ మూడు రథాలు సర్వక్షేత్రమైన శ్రీపురం యొక్క వరుసలలోనున్నవి.

ఆగ్నేయంలో అగ్నికుండం మండుతూ వుంటుంది. ఇది గాయత్రీ తేజం. అభయప్రదం, కిరణాలుగల సూర్యుడిక్కడుంటాడు, తరువాత ఓంకారము యొక్క మందిరంవుంటుంది. బ్రహ్మస్వరూపిణియైన గాయత్రి స్వనేత్ర దృష్టిని యిక్కడ ప్రసరింపజేస్తూ వుంటుంది. తరువాత గంధర్వ రాజు సభ వుంటుంది. దాని వెనుక రుద్రుడు, తారాంబ వుంటారు. చింతా మణిగృహానికి నైరుతిగృహభాగంలో హరివుం టాడు. ఆయనకు మూడు పేర్లుంటై, అవి మహామంత్రాలు. దానికి ఉత్తరంగా గణపతి తన మహామందిరంలో వుంటాడు. దానికి ఉత్తరంలో 'నమశ్శివాయ' అనబడే శివుడుండు. తరువాత శివుడుండు. ఆయన 'త్ర్యంబక' అనబడు, ఈయన మృత్యుం జయుడు ఆయనకు ఉత్తరంగా సరస్వతియుండు. ఆమెపేరు ధారణ. అకారం మొదలు క్షకారం వరకుగల అక్షరాలే ఆమె మందిరం. దానికి ఉత్తరాన సంపదేశి, కాలసంకర్షిణి, శంభునాథ వుంటారు. వీరు దేవి పుట్టుకకు కారకులు. తరువాత పరాంబ, విశదజ్యోత్స్న, నిర్మల విగ్రహ అనేవారు ఉత్తరోత్తర భవనాలలోనున్నారు. బాల, అన్నపూర్ణ, హయారూఢ, శ్రీపాదుక అనే నలుగురు పైవారికి ఉత్తరోత్తర

భవనాలలో నివసిస్తుండిరి. చింతామణి గృహానికి వాయువ్యమూల పర్వతమునుండి పద్మాటవిలో తక్కిన దేవతల మందిరాలున్నవి. ఉన్మత్తభైరవి, స్వప్నవారాహిక, తిరస్కరిణిక, పంచమి అనేవారు తూర్పువైపు మందిరాలలో శోభస్కరలైయుండిరి. మహాదేవియైన శ్రీపూర్తి, శ్రీమహాపాదుక అనే ఉత్తమ దేవతలు తూర్పునగల భవనాలలో నున్నారు. షఢామ్నాయ సాగరం అనే గ్రంథంలో శంకరునిచే చెప్పబడిన విద్యలన్నీ మహాపద్మాటవీ స్థలంలోనున్నవి. లలితా కిరణాలవంటి స్త్రీశక్తుల భవనాలన్నీ మణినిర్మిత మహాగృహాలు. అతి ఎత్తైనవి, జెండాలుగలవి, మెట్లున్నవి, ఇవన్నీ చింతామణి గృహానికి తూర్పు ద్వారంలోనుండె. దక్షిణాన, తూర్పున మంత్రినాథ మహాభవనంవుండె. ఎడమభాగంలో దండనాథభవనముండె, అది రత్ననిర్మితం, త్రిమూర్తుల భవన అర్ఘ్యస్థానానికి ముందున్నవి. అది రత్నకాంతులు వెదజల్లుతుంటుంది. ఈదేవతలందరు లలితా భక్తులు లలితా మంత్రంజపిస్తారు. అమ్మను ఉపాసిస్తారు.

ఇక చింతామణి గృహం గురించి విను. ఇది శ్రీపురమధ్యమందుండె. 16మై. విస్తారంగలది. దానికి 2మై. విస్తారంగల చింతామణి మయమైన గోడవున్నది. అదిచింతామణి శిలలతోను, పైకప్పులతోను నిర్మించబడింది. కూటరూపంలో అక్కడక్కడ ఎత్తైనది ఇంటిగోడకూడ అదేవిధంగా 32మై. ఎత్తుగలది. దానియొక్క భూమి 160మై. ఎత్తుగలది. ఆపైన పొట్టిగా, లావుగావున్న కిరీటంతో ప్రకాశించేది. ఆమకుటాలు ఇచ్ఛా,క్రియా,జ్ఞానరూపాలు అవి చింతామణిమయాలు. కాంతిభాసాలు. అంతా చింతామణి మయం ఆ గృహం దానికి నాలుగు ద్వారాలు, 3మై. పరిమాణం, ద్వార విస్తారం 2 1/2మై. చింతామణి గృహంలో అన్నిద్వారాల్లోను లలితాదేవి మూర్తి కప్పబడివుంది. అది ఎర్రని సింధువువంటిది. అనేకవేల బాల సూర్యుల కాంతి గలది. చంద్రునివలె చల్లనైనది. ప్రవాహరూపమైనది. తూర్పు మొదలు ఉత్తరం వరకువున్న నాలుగు ద్వారాలు పూర్వ, దక్షిణ, పశ్చిమ, ఆగ్నేయాలుగా చెప్పబడినవి. గృహరాజమధ్య గోడలో రత్నదీపాలు ప్రకాశిస్తూవుంటాయి. వాటి కోటిసూర్యకాంతులతో భవనమంతా వెలిగి పోతూవుంటుంది. మధ్యస్థానంలో వేదికలో ఎత్తయిన మహత్తరబిందు చక్రమున్నది. చింతామణి గృహంయొక్క గోడకు, బిందు చక్రానికిమధ్యలో భూమివున్నది. అది గోడయొక్క కోసును వదలి 6మైళ్ళపరిమాణం గలది. అక్కడ 6మై. దూరంలో అణిమ మొ.ప్రకాశిస్తుంటవి. వాటికి తూర్పు మొదలు మందిరాలున్నవి అణిమ, మహిమ, గరిమ, ఈశిత్వ, వశిత్వ, ప్రాకామ్య, ముక్తి, ఇచ్ఛాప్రాప్తి, సర్వకామ అనేవి ఉత్తమ సిద్ధులురస, మోక్ష, బల, ఖడ్గ, పాదుక, అంజన,వాక్,లోక,దేహ అనేవి అణిమాది సిద్ధులు ఇవికాక యోగులు అంగీకరించినవి చాలావున్నవి. అక్కడ అణిమాదుల మధ్య కోట్లాది సిద్ధులు పరమేశ్వరి చుట్టు సేవిస్తూ వుంటవి. వాటివి కొత్త కొత్త అందాలు. చిరునవ్వుల ముఖపద్మాలు. 16 సం॥ వయస్సు. ఉదారస్వభావాలు, చేతిలోచింతామణులు గలిగి మదంతో క్రీడిస్తూ



వుంటారు. అణిమాదుల మధ్య బ్రహ్మాదుల భవనం వున్నది. అది సుమనోహరం. సురుచిరం. సుందరం, ఎత్తు 20 మూరలు, విస్తారం 1600 మూరలు నాలుగు పక్కల మెట్లవరసలు, అక్కడ బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, మాహేంద్రి, చాముండ, మహాలక్ష్మి అనుమాతృకాభవనాలు న్నవి. అనేక ఆయుధాలు, శక్తుల రక్షణ కవచాలుగల వీరు నాలుగు దిక్కుల భవనాలు నిర్మించుకున్నారు.

బ్రాహ్మి మధ్యన 20 మూరల ఎత్తుగావంగిన 16 మూరల విస్తారము గల మూడువిధాలైన ముద్రాంతరమున్నది. అక్కడ ముద్రాశక్తుల నివాసాలు ఉన్నాయి. పది దిక్కులలోను సంక్షోభిణి, ద్రావిణి, కర్షణి, వశ్య, ఉన్మాదిని, మహాంకుశ, ఖేచరి, బీజయోని, త్రిఖండ, దశమి, అనే శక్తులు ప్రతిష్ఠింప బడ్డవి. ఈ ముద్రాశక్తులు సుందర ఆకారాలు. నవయౌవన వివశలు. తమమనో హరం కాంతులను ఆ గృహమంతటా నింపి వేస్తుంటవి. లలితాంబను సేవిస్తుంటవి. మూడింటి మధ్య త్రైలోక్య మోహనచక్రం వున్నది. ఆ శక్తులలో ఆధిపత్య శక్తులున్నవి. వీరి అధిష్ఠాత్రి త్రిపురా చక్రనాయిక ఆమె చక్రపాలిక. ముద్రాసంక్షోభిణి. ఇకముద్రాంతరంపైన నిత్య కలాంతరమున్నది. దాని ఎత్తు 20 మూరలు. విస్తారం 16 మూరలు ఇది మూడువిధాలు ఉత్తరోత్తర సోపానం. నిత్యాకళామధ్యనకామాకర్షిణులు, సుఖస్వరూపిణులు, షోడశకలా పరిపూర్ణలు చుట్టునుస్థితి నేర్పరచుకొని యున్నారు. వారు చల్లని అమృత ప్రవాహంతో దశదిశల తృప్తిచెందిస్తూ వుంటారు. వీరిపేర్లు విను. కామాకర్షిణి, బుద్ధ్యాకర్షిణి, అర్థాకర్షిణి, గంధాకర్షిణి, చిత్తాకర్షిణి, ధైర్యాకర్షిణి, స్మృత్యాకర్షిణి, నామాకర్షిణి, బీజాకర్షిణి, రసాకర్షిణి, అమృతాకర్షిణి, శరీరాకర్షణి, అనే 12 మంది యోగినులు. త్రిపురేశ్వరి మాత్రం చక్రిణి, సర్వాశా పరిపూరక చక్రానికి అధిష్ఠానదేవత ఈ చక్రంలో పాలకురాలు ద్రావణిక అనేముద్ర. నిత్య కలాంతరమునకు పైన అతి సుందరభవనమున్నది. అది20 మూరలుఎత్తు, 1600 మూరల విస్తారం పూర్వం వలెనే మెట్లున్నది. దానిపేరు సర్వసంక్షోభణం అక్కడ 8 శక్తులున్నవి. తీవ్రమదంవల్ల వీళ్ల కళ్లు ఎర్రగా వుంటాయి. నవయవ్వనంతో మత్తెక్కి పరమేశ్వరిని సేవిస్తూ వుంటవి. కుసుమ, మేఖల,మదన,మదనాతుర,రేఖ, వేగిని, అంకుశ, మాలిని అనే వివారిపేర్లు. వారికి అనంగ మొ. కోట్లాది పరివారమున్నది. ఇది సర్వ సంక్షోభణచక్రం. దాని అధిదేవత సుందరి ఆమెనిగూఢ, చక్ర పాలిక కర్షణిక అనేముద్ర.

అనంద శక్తి అంతరంపైన సర్వసంక్షోభిణి, మొ. వారి అంతరమున్నది దాని ఎత్తు 20మూరలు విస్తారం 1600 మూరలు అది సర్వసౌభాగ్య దాయకం. అక్కడ 14 మందిశక్తులు గర్వితలైవుంటారు. వారి పేర్లు విను. సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వసంమోహిని, సర్వస్తంభిని, సర్వజృంభిణి, సర్వవశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సర్వార్థసాధిక, సర్వసంపత్తి పూరిణి, సర్వమంత్రమయి, సర్వద్వంద్వక్షయంకరి, ఈశక్తులు సంప్రదాయనామాలుగలవారు. చక్రిణీ పురంలో వుంటారు. సర్వవశ్య నామంగలముద్రలు ఆచక్రాన్ని రక్షిస్తూవుంటారు. కోట్ల కొలది

శక్తులు వారి సేవికలు. సంక్షోభిణి ఆద్యంతము యొక్క పైన విష్యం అనే మందిరమున్నది. సర్వసిద్ధాది కల అనబడును. దాని ఎత్తు 20 మూరలు, విస్తారం 1600 మూరలు. సర్వసిద్ధి ప్రద, సర్వ సంపత్ప్రద, సర్వప్రియంకరి, సర్వమంగళకారిణి, సర్వకామప్రద, సర్వదుఃఖ విమోచని. సర్వమృత్యు ప్రశమని, సర్వవిఘ్న నివారిణి, సర్వాంగ సుందరి, సర్వసౌభాగ్యదాయిని, అనే యోగినీ కళలిక్కడ వున్నవి. తరువాత చక్రిణి, శ్రీ అని తెలియాలి. చక్రము సర్వార్థ సాధకం సర్వోన్మాదముద్రలు చక్రాన్ని పాలిస్తారు. సర్వసిద్ధి ఆది అంతరమైన సర్వజ్ఞాతి అంతరంవున్నది. అదే సర్వ రక్షాకర చక్రం. దానిఎత్తు 20 మూరలు, విస్తారం 16 మూరలు, ఇది దివ్యం, ఘనం, ఇక్కడి శక్తులు సర్వజ్ఞ, సర్వశక్తి, సర్వైశ్వర్య ప్రదాయిని, సర్వ జ్ఞానమయి, సర్వవ్యాధి వినాశిని, సర్వాధార స్వరూప, సర్వపాహరి, సర్వానందమయి, సర్వరక్షాస్వరూపిణి; సర్వేప్సితప్రద అనేవారు. వీరు గర్వములేని యోగినీమణులు మాలిని, చక్రిణి సర్వమహాంకుశ ముద్రలు మిగిలినవి విను.

సర్వజ్ఞాది అంతరాలముపైన వశిన్యాది అంతరమున్నది. అది 20 మూరల ఎత్తు. 1600 మూరలు విస్తారము పూర్వంవలెనే మెట్లుండును. అది సమస్త రోగాలను పోగొట్టే సర్వరోగహరచక్రం. తూర్పు, దక్షిణం, మొ. దిక్కులలో వశిని, మొదలగు దేవతలుంటారు. వారు స్వరములు లేనివారు. తరువాత కవర్గతో కూడిన కామేశ్వరుడనే వాఙ్మయమున్నది. చవర్గతో కూడిన వాగీశీ మోదినీ మూడవది తవర్గతో అలంకరించబడిన విమల అనే సరస్వతి తవర్గతో కూడినది. వాక్ప్రధారణ పవర్గతో కూడినది జయిని యకారం మొదలు నాలుగు అక్షరమూలకోణమున సర్వైశ్వర్యాది వాఙ్మయవుంటుంది. శకారం మొదలు అక్షరాలతో కౌలిని వుంటుంది. ఈదేవతలు జపంచేస్తూ వుంటారు. మౌక్తికాలం కారలు, గద్యపద్యలహరు లతో లాలించబడేవారు. అమ్మకు కావ్య నాటకాదులతో శ్రవణానందం కలిగిస్తుంటారు. వీరు తమ రహస్య నామాలతోప్రసిద్ధులు. తమచక్రానికి నాయికలు. చక్రాన్ని సంరక్షిచేతి ఖేచరి. వశిన్యాది అంతరాలముపై అస్త్రం అనే చక్రం వుంది. అది 20 మూరల ఎత్తు 1600 మూరలు విస్తారం. అక్కడ బాణాదుల దేవతలు అయిదుగురు బాణేశ్వరీ దేవతలు ఐదుకామేశ్వర బాణములు, అది స్త్రీ పురుషులైన ఇద్దరియొక్క తేజస్వంతములైన 2 అంకుశములు, 2 ధనువులు 2చెరుకువిల్లులు ధరించినవి. 2 పాశములు నాలుగస్త్రములు కల్పించబడినవి. కామేశ్వరివి 4, మహేశ్వరునివి 4, మొత్తం 8. ఇవి భండాసుర మహాయుద్ధంలో దుష్టరాక్షసుల రక్తాన్ని తాగి చాలా తృప్తిపొందిన దివ్యాస్త్రాలు ఆ తల్లిలో పదిలంగా వున్నవి. వీటికి పరివారాయుధాలు చాలా వున్నాయి. ఇంకా కోట్ల కొలది అస్త్రాలున్నాయి, వజ్రశక్తి, శతఘ్ని, భుశుండి, ముస లము, కృపాణము, పట్టిశము, ముద్గరము, భిండివాలము, మొ. శస్త్రాలు వేలకు వేలున్నవి. ఇవిమద వివశలైన అష్టా(8) యుధమహాశక్తులను సేవిస్తుంటె, శస్త్రాగారంపైన సమయేశీశక్తుల స్థానముండె. అది 20 మూరలుఎత్తు. 1600 మూరల విస్తారం. కామేశి, మొ. ముగ్గురు దేవతలు



ఆభవ నంలో వుంటారు. నాల్గవది చతుర్థిక, ఆమెయే లోకాలన్నింటిని సృష్టించు లలితేశ్వరి. కామేశి,వజ్రేశి, భగమాల అనే ఆ ముగ్గురు దేవతలు అనేక వేల విధాల అమ్మను సేవిస్తుంటారు. సమస్త దర్శనదేవతలు కామేశీ, మొ. వారు అక్కడ లలితను సేవిస్తుందురు. వీరి ప్రస్తావమును నిత్యాశక్తుల ప్రస్తావమున చక్రిణులకును, యోగినులకును లలితా పరమేశ్వరి పరిపూర్తి చేసినది. కామేశ్వర దేవుని తొడపై పరున్న లలితాంబిక కామేశిమొ. వారలలో నాలుగవది. ఆమె నిత్యాశక్తులలో 16వది. యోగిని చక్రదేవతలలో 9వది. సమయేశి అంతరాలంపైన నాభాంతరం అనే భవనం వుంది. దానిఎత్తు 20 మూరలు విస్తారం 1600 మూరలు.పూర్వంవలె మెట్లున్నై. అక్కడ లోకాలను రక్షించే నిమిత్తం కామేశదేవునిచే సృష్టించబడిన నలుగురు యోగనాథులున్నారు. వారు మహాదేవి యొక్క యోగశాస్త్ర ప్రవర్తకులు, అందరికిని మంత్ర గురువులు, సర్వవిద్యా నిధులు, వారిపేర్లు విను. మిత్రి, శోడీశుడు, చర్యుదు, వారిచేత రక్షణకోసం పాదుకాత్మకములైన అనేక లోకాలు సృష్టించబడినాయి. దివ్య విద్యలు గలవారు, మానవ సమూహాలు, సిద్ధసమూహాలు, దేవతలు, తాపసులు, సాలోక, సారూప్య, సాయుజ సిద్ధిని పొందినవారు, గొప్ప గురువులు మొ. అనేకులు, గురువులను సేవిస్తుందురు.

తరువాత నాధాంతరాలంపైన ఉత్తమ నివాస గృహమున్నది. దాని ఎత్తు 20 మూరలు, విస్తారం1600 మూరలు. దానిపేరు నిత్యాంతరం. అదే నిత్యాశక్తి మందిరం, అచటి నిత్యాశక్తులు 15 మంది కామేశ్వరి, భగమాలిని, నిత్య, నిత్యక్లిన్న, భేరుండ, వహ్నివాసిని, మహా వజ్రేశ్వరి, దూతి, త్వరిత, కులసుందరి, నిత్య నీలపతాక, విజయ, సర్వమంగళ, జ్వాలామాలినిక, చిత్ర అనే వివారిపేర్లు, వీరు దేవీ స్వరూపలు, మహాబల పరాక్రమలు, పాద్యమిని ప్రధాన తిథిగా పొందినవారు ముల్లోకాలలోను వ్యాపించినవారు. త్రిలోకస్వరూపలు, కాలకాలలు, బ్రహ్మాదుల ఆయుర్దాయం వీరి చేతిలో వుంటుంది. ఇది అమ్మ ఆజ్ఞ. నిత్యప్రయత్న శీలలు, నిర్భయలు, లలితా పరాంగజనితలు, లోకాల సంపద అభివృద్ధికై అమ్మను సేవిస్తుందురు. వారికి భవన రూపాలైనవారు ఈశ్వరులు, వీరు15మంది సృష్టింబొందుదురు. వారికఇ భవనరూపాలైనవారు ఈశ్వరులు. వీరు15మంది. సృష్టింబొందుచక్రంలో షోడశియొక్క భవనం వున్నది. నిత్యాంతరాలంపైన అంగదేవి భవనం వున్నది. దాని ఎత్తు 20 మూరలు. విస్తారం 1600 మూరలు. పూర్వంవలె సోపానమందిరమున్నది. అందులో హృదయ దేవి మొ. శక్తులుంటారు. హృదయదేవి, శిరోదేవి, శిఖాదేవి, వర్మదేవి, దృష్టిదేవి, శస్త్రదేవి అనే ఆరుగురు వీరు. ఆ కామేశ్వరీ స్త్రీలు చాలాదగ్గరివారు. నూతన సౌందర్య పూరితాంగలు. శ్రద్ధాభరితులు ఆయుధధారిణులు. బిందుపీఠం చుట్టు తిరుగుతుంటారు. మదించి వుంటారు. లలితాదేవి ఆజ్ఞను చెట్లుబాటుచేస్తారు. ఇంద్రియాలను వశమందుంచుకొని వారి పీఠాల్లోవుంటారు. అంగదేవి అంతరానికి పైన గుండ్రంగా బిందునాద మహాపీఠమున్నది. దాని ఎత్తు 10 మూరలు, విస్తారం 32 వందల

మూరలు ఉదయ సూర్యకాంతిగలది, దీనినే శ్రీపీఠం అంటారు. మహాపీఠం, విద్యా పీఠం అనికూడ అంటారు 50 పీఠాలు ధరించే ఆనందపీఠం అనియు అంటారు. పంచమ బ్రహ్మమయమైన ఈ ఆనంద పీఠంలో ముల్లోకాలకు మూలమైన ఐదురత్నాలు గల మంచమున్నది. దానినే సింహాసనం అంటారు. దాని నాలుగు కోళ్లు 10 మూరల ఎత్తయినవి. 3 మూరల విస్తారం గలవి. అవి బ్రహ్మ,విష్ణు, మహేశ్వర, ఈశ్వర రూపాలుగలవి. శ్రీదేవి యొక్క ధ్యానయోగంచేత నిరంతరశక్తి భావం పొంది వుంటవి. అందులో ఒకటి. 5పాదాలు గలది. మందారపుష్పోపమ. రక్తవర్ణ బ్రహ్మాత్మక. ఆగ్నేయదిక్కున నుండు, నాలుగవ మంచపాదం కొండగోగు పువ్వురంగుగలది. (పచ్చన) ఈశ్వరాత్మకం ఈశాన్య దిక్కుననుండు. వీరంతా సర్వాయుధాభరణలు, ఈస్తంభాల మధ్యన పురుషరూపాలు, ఆపురుషులుకన్నులు మూసుకొని శ్రీదేవిని ధ్యానిస్తూంటారు. నిశ్చలశరీరులు, ఆ మంచంపైన పలక సదాశివుడు, దానిమ్మ పండురంగు, దానిపొడవు 2400 మూరలు, విస్తారం 1600 మూరలు, అది నిరంతర ప్రకాశ. అంగదేవతల భవనం మొదలు మంచం యొక్క ఫలకంవరకు చింతామణులతో నిర్మించబడినమెట్లుగలది. 36 ద్వారాలు, ఎక్కేటప్పుడు పంచభూతాలు, శబ్దస్పర్శ రూపరస గంధాలు, ఉపస్థ, వాయువు, పాదాలు, చేతులు, వాక్కు,నాసిక, జిహ్వ, చర్మము, నేత్రము, చెవి, అహంకారము, బుద్ధి మనస్సు, ప్రకృతి పురుషుడు, నియతి, కాలము, రాగము, కళ, విద్య, మాయ, శుద్ధవిద్య, ఈశ్వర సదా శివ శక్తిశివ అనే 36 తత్త్వాలు మెట్లు. మంచానికి తూర్పున పూష సోపాన పంక్తి, పైన హంసతూలికాతల్పము వున్నవి. దీని ఎత్తు ఒక మూర.విస్తారము 1600 మూరలు రెండేసి కాళ్లదిండ్లు, తలదిండు గలది. 64 గద్దకముల బంగారు పాత్రలు ఎర్రగా ప్రకాశిస్తుంటవి. దాని పై చెక్కిన చేపపిల్లలు ఎర్రగామెరుస్తూ వుంటవి. దానిపైన కుసుమ పువ్వురంగుల ఉత్తరీయ మున్నది. అది కెంపువర్ణ, మెత్తనిది. దానిపై కామేశ్వరుడుండు. తూర్పు ముఖంగా, శృంగార వేషంతో మెరుస్తూ 16 సం॥ ప్రాయంలోవుండు, ఉదయ సూర్య కాంతిగలవాడు. నాలుగుచేతులు, మూడుకన్నులునుండు,హారాలు, భుజ కీర్తులు, 3కిరీటం, కంకణాలు అలంకరిచుకు నుంటాడు. అందాల చిరునవ్వు వెన్నెల నిండిన చెంపలు గలవాడు. అతనితొడపై లలితాంబిక ప్రకాశిస్తుంటుంది. ఆమె బాల సూర్యతేజస్విని. 16 సం॥ ప్రాయం. నవయౌవనమదవిలాస కెంపువర్ణ. ఆమె గోళ్లు ఎర్రతామరలు. పారాణి లేకుండానే ఎర్రనైనపాదాలు. మధురధ్వని గల చిరుమువ్వల కంకణాలు మన్మథుని అమ్ముల పొదిని తిరస్కరించు పిక్కలు ఏనుగు తొండం వంటిచేతులు. అరటి స్తంభాలవంటి తొడలు. మెత్తని ఎర్రని, చిన్నపట్టువస్త్రం అలంకరించిన పిరుదులు. సగం తొడలను కప్పే వస్త్రంముడి. రత్నాల వడ్డాణం లోతైన నాభి. ఆ సుడిలో 3 ముడతలు. అది కెరటాల కాలతిగలది మణికట్టువిశాలం మొగ్గవంటి చనుకొనలపై వందలాది ముత్యాలహారాలు మెరుపులీనుతున్నై. దిరిసెన పువ్వురేకు కాంతి గలిగిన నాలుగు





భుజాలు, భుజకీర్తులు, కంక ణాల వరుసలతో అలంకరించబడినై. ఉంగరాలువేళ్లు, భర్తచేతితో తాకిన శంఖంవంటి అందమైన కంఠం. ముఖమనే అద్దంలో గుండ్రంగా నున్న గడ్డం, ఎర్రని పెదవులు, శుభ్రములు, పరిశుద్ధపంక్తులు, విద్యాస్వరూపాలు, మల్లెలకాంతులుగల ఆమెదంతాలు వెన్నెలలు విరజిమ్ము తున్నాయి, లావైనముత్యాలు గుచ్చిన అనేక ఆభరణాలు, మొగలిరేకులలోపలి రేకులవంటి విశాలనేత్రాలు, అర్థచంద్రాకార సుందర ఫాలభాగంలో వాలిన పిల్లజుట్టు, దుద్దులు, మణికుండలాలు అలంకరించిన చెవులు, నూతన కస్తూరీ కర్పూర సుగంధ భరిత తాంబూల రాగవక్త్ర. తిలకరత్నోప ఫాలనేత్ర కటిక చీకటిరంగుగల గొప్ప సూక్ష్మ శిరోజ. పాపిట సింధూరరేఖాన్విత, చంద్రాకళాశిరోభూష. మదచంచలనేత్ర, సర్వశృంగారవేష, (సీమంత) సమస్తాభరణాలంకార అయిన లోకమాత అక్కడ సదానందవర్ధని, బ్రహ్మ, విష్ణు,గిరీశ, ఈ, సదాశివులకు మూలకారణ, తన వాలుకన్నులలోని కరుణా రసప్రవాహంలో అందరిని ఆనందింపజేసే లలితాంబ కామేశ్వరుని తొడపై స్థిరంగా ప్రకాశిస్తుంటుంది. లలితార్చన సర్వదేవతార్చనా ఫలం అంటారు పెద్దలు. ఆమె పూజకు ఫలంఆమెయే. కోట్లవేల సంవత్సరాలు వర్ణించినా ఆమె అంశం ఒకటి కూడ పూర్తి కాదు. సంపూర్ణంగా నేను వర్ణించలేను. వాక్కులను మించిన రూపం గల ఆమె వాక్కులకు, ఎలావశం అవుతుంది. వాక్కులు, మనస్సు ఆమెను పొందలేక వెనుకకు తిరిగి వచ్చినై అనివేదం అన్నది కదా? నాకు పక్షపాతంలేదు. నిజంచెబుతావిను. కల్పతరువు కొమ్మను కలంగా చేసుకుని, సముద్రాలను సిరాబుడ్లుగా మార్చుకుని, 50 కోట్ల విస్తీర్ణం గల భూమిని పత్రంగా చేసుకుని, కాలం చివరివరకు సరస్వతి వ్రాసినా, లెక్క లేనన్ని చేతులతో ఎవరువ్రాసినా చెప్పేవారు బృహస్పతి సమానులైనా శ్రీదేవి పాదపద్మంలో ఒకవేలి వేయివెలుగులలో ఒకచిన్న అంశం కూడ వర్ణించలేరు. బిందుపీఠం చుట్టును చదరంగా మహామాయ అనే తెరవేలాడు తుంటుంది. అదినల్లనిది. దేవికి40 మూరలపైన ఆరుద్ర పురుగు రంగు గల చాందినీ కొట్టబడింది. అది త్రిజగత్ దుర్లభం. అదివర్ణించలేక నా గొంతు బొంగురుపోయింది. అచటి సౌభాగ్యం అంతా అమ్మకే తెలుసు. ఈ విధంగా దేవతాశిల్పులచే నిర్మించబడిన 16 క్షేత్రాలుగల భవనరూపమైన శ్రీనగరంలో వుండి అమ్మవారు అన్నిలోకాలను రక్షిస్తు వుంటుంది. ఈలాగున నేతక్కిన శ్రీపురాలువేరుగ నున్నవి. పేరుమాత్రంవేరు. శ్రీపురకథను చెప్పువారు, వినువారు, అడుగువారు, స్తోత్ర చరిత్రాది గ్రంథాలు ధరించేవారు, వ్రాసేవారు అమ్మసాన్నిధ్యాన్ని పొందుతారు. శ్రీపురపద్ధతిలో శ్రీదేవి భవనం నిర్మించినవారు మోక్షం పొందగలరు.

## లలితామంత్రసాధనం - మంత్ర లక్షణం

అగస్త్యా, అన్నిపదార్థాల కంటె శబ్దం గొప్పది. అన్నిశబ్దాల కంటె వేదం గొప్పది. వేదాలకంటె వేదమంత్రాలు గొప్పవి. అన్నిమంత్రాలకంటె విష్ణుమంత్రాలు వాటికంటె దుర్గామంత్రాలు, వాటికంటె గణతి మంత్రాలు, వాటికంటె లక్ష్మి మంత్రాలు,

వాటికంటె సరస్వతీ మంత్రాలు, వాటికంటె పార్వతీమంత్రాలు, వాటికంటె ఆమ్నాయ మంత్రాలు, వాటికంటె వరాహమంత్రాలు, వాటికంటె శ్యామామాంత్రాలు, వాటికంటె పదివిధాలుగా లలితా మంత్రాలు శ్రేష్ఠాలు, వాటిలో రెండు మంత్రరాజాలు ఉత్తమోత్త మాలు. ఒకటిలోపాముద్రామంత్రం రెండు కామరాజ మంత్రం. అవిహాది, కాది అనబడతవి. (హకారము మొదటగలది, కకారము మొదట గలది) ఇవి హంస, మొ. వాటికి అర్థంగలవి. హాదిమంత్రానికి, కాదిమంత్రానికి 3 అక్షరాలే తేడా, (ఏ, ఈ, హ) కామరాజమంత్రం భక్తులకు శీఘ్రసిద్ధి దాయకం. శివుడు, శక్తి, మన్మథుడు, భూమి, మాయ, హంస, భృగువు, మన్మథుడు, శివుడు, శుక్రుడు, భువనేశ్వరుడు, చంద్రుడు, మన్మథుడు, భూమి, హృల్లేఖ అనే 15 మంది ఈ మంత్రంలోని 15 అక్షరాలను ఒక్కొక్కరు ఒక్కొక్కటి చొప్పున చెప్పారు. ఆమంత్రం (క ఏ ఈ ల హ్రీం, హసకలహ హ్రీం, సకలహ్రీం అయినది. ఈ మంత్రాన్ని జపించిన వారు మహా అదృష్ట వంతులు. సకల సిద్ధులు దీనివలన లభిస్తవి. ఇది పంచత్రిక మహావిద్య $(5 \times 3 = 15$ అక్షరాలు) ఇదేపంచదశి. ఇది సద్గురువు ద్వారా ఉపదేశం పొందాలి. దాని విధానం శ్రద్ధగా విను.

వేకువజామునలేవాలి. తనశిరస్సులో సహస్రదళపద్మం వున్నట్లు భావించాలి. అక్కడ సద్గురువున్నట్లు భావించి ఆ స్వామిని ధ్యానించాలి. తరువాత బయటకు వచ్చి కాలకృత్యాలు తీర్చుకోవాలి. పరిమళతైలం శరీరానికి రాసు కోవాలి. శుద్ధమైన వేడినీటి స్నానం చెయ్యాలి. జలం సహజంగానే పవిత్రమైనది. అది అగ్నిపూతం అవడం మరీ విశేషం పరమపవిత్రమైనది. ఆ స్నానం. తరువాత, లేత ఎరుపు లేక ఎరుపు వివస్త్రాలు రెండు ధరించాలి. ఒకటికట్టుకొని, ఒకటికప్పుకోవాలి. నీమంగా, విద్వాంసుడై వుండాలి. ఆచమనం చెయ్యాలి. తిలకం ధరించాలి. ఏకాంతంగా వుండాలి. మనస్సు పవిత్రంగా వుంచుకోవాలి. సంధ్యావందనం చెయ్యాలి. దర్భలు, అక్షతలు, పువ్వులు, గంధము కలిపిన నీరు రావి ఆకు ఆకారంగల పాత్రలోవుంచాలి. సూర్యునకు3, సూర్యబింబంలోని తేజోరూపం అయిన లలితకు 3 అర్ఘ్యాలను ఇవ్వాలి. మూలమంత్రంతో యధాశక్తి లలితాంబకు తర్పణం చెయ్యాలి. దేవ, రుషి, పితృవర్గాలకు తర్పణాలివ్వాలి. సూర్యునకు, అందలి లలితాదేవికి ఎదురుగా నిలిచి ఉపస్థానమంత్రాలు పఠించాలి. మౌనంగా వుండాలి. పవిత్ర హృదయంతో ముఖ మందిరంలో ప్రవేశించాలి. కర్పూరము, చంద నము, మొ. శరీరానికి పూసుకోవాలి. అలంకారాలు ధరించాలి. శృంగార వేషంతో వుండాలి. శిరస్సున సుగంధ పుష్పాలు ధరించాలి. న్యాసాదులు చెయ్యాలి. మెత్తని ఆసనంపై కూర్చోవాలి. అమ్మవారి శ్రీపురాన్ని, ఉద్యాన వనాలను ధ్యానించాలి. మనస్సున,బయట శుచిర్భూతంగా వుండాలి. అమ్మవారిని పూజించాలి. అమ్మవారు సువాసనలు వెదజల్లే విధంగా పరిమళ ద్రవ్యాలు ఆతల్లికి సమర్పించాలి. తూర్పు లేక ఉత్తరంగా కూర్చోవాలి. పంచదశి మహామంత్రాన్ని జపించాలి. 36 లక్షలు జపిస్తే అమ్మప్రసన్నం అవుతుంది.



జపంలో పదవ వంతుహోమం, హోమంలో పదవవంతు తర్పణం, తర్పణంలో పదవవంతు బ్రాహ్మణ సమారాధన గావించాలి. తరువాత కామ్యజపం (కోరికలను తీర్చేది) చెయ్యాలి. లక్షజపం చేస్తే నరులు వశం అవుతారు. 2 లక్షలకు స్త్రీవశ్యం. 3 లక్షలకు రాజవశ్యం. 4 లక్షలకు నాగకన్యా వశ్యం 5 లక్షలకు పాతాళ స్త్రీవశ్యం. 6 లక్షలకు భూలోక సుందరీవశ్యం. 7లక్షలకు అప్సరసల వశ్యం. 8 లక్షలకు అనేక తెగల దేవతా స్త్రీలవశ్యం. 9లక్షలకు దేవతలందరివశ్యం. 11 లక్షలకు త్రిమూర్తులు, 12 లక్షలకు అష్టసిద్ధులు వశం అవుతాయి. ఈ మంత్రజపం వల్ల ఇంద్రుడు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, సూర్యుడు పదవులను పొందారు.సమస్త దేవతలకు సిద్ధులు లభించె.

లలితామంత్రం జపించేవాడు పుణ్యాత్ముడవుతాడు. ముల్లోకాల్లోను అందగాడవుతాడు. మన్మథునకుకూడ మోహంకలిగిస్తాడు. సర్వసిద్ధులు పొందుతాడు. అన్నీ తెలిసినవాడవుతాడు. అందరిపూజలు పొందుతాడు. అతని దర్శనం వల్ల అందరి కోరికలు తీరుతాయి. బృహస్పతివలె మాట్లాడతాడు. సంపదలో విష్ణుసముడు, బలంలో హనుమంతుడు, స్థిరత్వంలో హిమాలయం.ఎత్తులో మేరుపర్వతం. గంభీరంలో సముద్రం ఆకారంలో స్త్రీలందరికి కలతరేపుతాడు. కనుబొమలు దగ్గరకు చేరిస్తే దుష్టులు స్తంభించిపోతారు. విజృంభణ ఉచ్చాటన, మోహనము కలిగించి చివరకు వాళ్లను చంపుతాడు. కోపిష్టులు ఇతని దర్శనమాత్రంచేత పరమశాంత వంతులై క్షణంలో ప్రసన్నులవుతారు. 18 విద్యలతో మహా ప్రజ్ఞావంతుడవుతాడు. అతని మాట గంగా ప్రవాహంలా మధుర మంజులమై వుంటుంది. అన్ని శాస్త్రాల్లో అతనికి తెలియిన దేదీవుండదు. సమస్తతత్త్వ శాస్త్రరచనలో, ఖండనలో సర్వ సమర్థ డవుతాడు సమస్త తత్త్వం తెలిసి సర్వజ్ఞుడవుతాడు. ప్రాణులయందు అపరిమిత కృపగలవాడవుతాడు. అతడు కోపిస్తే ముల్లో కాలు భస్మమైపోతవి.

అతనిని దర్శించిన లేడికన్నుల సుందరాంగులకు కోకముడులు జారిపోతై, వడ్డాణాలు, కుండలాలు వూడిపోతై. చెమట బిందువులు శరీరాలపై ముత్యాల అలంకారాలవుతై. వారి వాలుకన్నుల కొనలు అనుగారభారాలై చంచలిస్తవి. కమల హస్తులచేతి కంకణాలు జారిపడతవి. తొడలుస్తంభించిపోయి కదలలేరు. సిగ్గుభారంతో తలవంచుదురు. రహస్య స్థలాలు తడిసిపోతవి. కామోద్రేకంవల్ల వారి ఆకారాలే మారిపోతవి. ప్రేమాగ్ని జ్వాలల్లో కాలిపోతూ వుంటారు. మన్మథబాణాగ్ని వర్షంలో మండిపోతారు. ఆతృతతో పీడించబడతారు. వేడెక్కిన శరీర బాధలతో ఏడుస్తుంటారు. శ్రమ జలంతో తడిసిపోతారు. సిగ్గు అడ్డగిస్తోందని చింతిలిపోదురు. కుల, జాతి, శీలం,కుటుంబం, సిగ్గు,లోకభయం, బంధుఅపవాదం, పరలోక భయం మరిచి పోతారు. మనసులో లలితామంత్రజపం చేసేవానిని కోరతారు. వాడు అరణ్యం, పట్టణం, ఆలయం, మరెక్కడున్నా ఆవన్నె లాడులు వానివద్దకే, వాని వెంటే పరుగులు పెడతారు. నీటిని కొట్టగానే ఆనీటితుంపరులవలె, లలితామంత్రం జపించేవానిని

చూడగనే చక్కని కనుబొమలుగల సుందర సుకుమారుల మనస్సులు చెల్లాచెదరులై పోతవి. విద్యలన్నీ అతనిని కోరి కోరివచ్చి వరిస్తవి. సూర్యచంద్రులు స్తనములుగాగల త్రిజగత్ సుందరి అతని యందనురక్తు రాలగు. సామాన్యలోక లెక్కా? పట్టణాల్లో, వీధుల్లో, చౌరస్తా (నాలుగువీధుల మొగలలో) అతని పుణ్యకీర్తి ఘోష కోరినవారికి కల్పవృక్షమై కోరికలన్నీ తీరుస్తుంది. అతనిని దర్శించిన పాపుల పాపాలన్నీ తక్షణం నశిస్తాయి. కవిశ్రేష్ఠులు అతని గుణాలనే వర్ణిస్తారు. అమ్మవారిని ఆమె అక్షరాలు, ఆయుధాలు, అలంకారాలు, వాహనాలు, మొ. వర్ణనలతో కీర్తించిన వారికి సిద్ధులు లభిస్తాయి.

అమ్మవారి మంత్రం మొదటిభాగం (క ఏ ఈ ల హ్రీం) మల్లెవలె, చంద్రుని వలె తెల్లనికాంతిగల దేవీ స్వరూపము. దానిని అహశ్చక్రంలో మంటలుగల దానినిగా మూలకంలో ధ్యానించాలి. మంత్రం యొక్క రెండవ భాగం ఆ రుద్రపురుగులవలె కుంకుమ రంగుగల దేవీస్వరూపం. అహశ్చక్రంలో వెంట్రుకల చివరవరకు మండు చున్న జ్వాలలుగల దానినిగా దానిని ధ్యానించాలి. మంత్రం యొక్క మూడవ భాగం సర్వపాపవినాశకం. దానిని వెంట్రుకల మొదటనున్న రెండు దళాలుగల పద్మం యొక్క లోపల మోక్షరూపిణియై వెన్నెలవలె తెల్లని ఆకారంగల అంబికను ధ్యానించాలి. (2 హసకహల హ్రీం 3సకల హ్రీం) వశీకరణకర్మలో ఎర్రని సంధ్యాకాంతిగల దానినిగా ధ్యానించాలి. సర్వసంపదలు పొందాలంటే శ్యామలాంగిని ధ్యానించాలి. ఎదుట వానిని మూగవానిగా చెయ్యాలంటే నీలవర్ణగా ధ్యానించాలి. స్తంభింపజెయ్యా లంటే పసుపు రంగుగల దానినిగా ధ్యానించాలి. కవిత్వం కావాలంటే స్ఫటికంవలె తెల్లని ఆకారం గల దానినిగా ధ్యానం చెయ్యాలి. ధనలాభానికి లలితను బంగరువర్ణం గల దానినిగా ధ్యానించాలి. మూలా ధారం మొదలుకొని సహస్రారం వరకు లలితాంబికను ధ్యానించువారు. తేజఃపుంజమైన మణిద్వీపం వంటి ఆ ప్రకాశమును దర్శించి ధ్యానించేవారు సకల సిద్ధులు పొందుదురు. ఇలా ధ్యానభేదాలతో శ్రీదేవిని ధ్యానించినవారు మహాసంపల్లక్ష్మిని పొందగలరు. సత్పురుషులే ఈ తల్లిని పొంద గలరు. దుర్జనులు పొందలేరు. తీవ్ర తపశ్శాలురు. ఆమెను ఆత్మలో ధ్యానిస్తారు. వారికి మరుజన్మవుండదు. శివోహం అనేభావంతో ధ్యానం చెయ్యకపోతే ఆమెను పొందలేడు. వంశంలో ఎవరైనా లలితా మంత్రం జపించే వారుంటే ఆ వంశం వారంతా ముక్తినిపొందుతారు. ఈ మంత్రం అన్ని శాస్త్రాల్లోను రహస్యాతి రహస్యమని చెప్పబడింది. వేదశాస్త్రాలన్నీ లలితనే స్తుతిస్తాయి. ఆమె వరాత్మ. పరమాత్మ పరాగతి, మహాస్థలం, మహాతీర్థం, మునులీమెనుగానం చేస్తారు. సనకాదులు ధ్యానిస్తారు, బ్రహ్మాదులు అర్చిస్తారు. పంచసిద్ధులు ఇచ్చేతల్లి ఆమె. కుచరిత్రులు, కుచ్ఛితులు, కటిలాశయులు, దైవబాహ్యులు, వృధాతర్కంచేసే వాళ్ళు విభ్రమబుద్ధులు, స్వధర్మన ష్టులు, దుశ్శీలురు, కులభ్రష్టులు, కఠినులు, దేవ దర్శనాన్ని ద్వేషించేవారు. పాపస్వభా వులు, ఆచారనిందకులు,గర్విష్టులు,డాంబికులు,గొప్పలుచెప్పకునేవారు, స్వాభిమా



నులు, అగువారు, దేవమానవ కోటిలో ఎవరైనా ఆ తల్లిని పొందలేరు. ఈమెతేజో మూర్తి, బ్రహ్మకామాక్షిని లలితాఅని ప్రస్తుతించాడు. లలితాంబికను ధ్యానించే సదా శివుని మనస్సును లాలించడంవల్ల ఈతల్లి లలిత అనబడింది. తరువాతిది విను.

అనగానే అగస్త్యుడన్నాడు. నిత్యము, సూక్ష్మము, ఆదికారణము, ఆనందమును ఎరుకపరచు ఆత్మజ్ఞానరూపమునగు మహాతేజస్సును ధ్యానిస్తా స్వామీ! హయగ్రీవా! లలితాపరమేశ్వరి కాంచీపురంలో కామాక్షిగా వెలసినది కదా! ఆతల్లి రహస్యం వివరించండి. అనగానే ఉపక్రమించాడు హయగ్రీవస్వామి! అణువుకంటె చిన్నది, జ్ఞానస్వరూపిణి, తత్త్వవేత్తలు ఆమెను 'అంత' అంటారు. ద్విభుజ అయిన ఆమెకుడి చేతిలో యోగముద్ర, ఎడమచేతిలో పుస్తకము ధరించింది. శుద్ధశ్వేతవర్ణ, ఈమెను శుద్ధపర అంటారు. మూడవది 'పరాపర' దశసహస్రబాల సూర్యసమాన, సర్వాభరణ భూషిత, పదిచేతులలో పద్మాలు ధరించింది. లేదా ఎడమతొడపై చేతి నుంచి, కిరీటమున చంద్రరేఖా భూషణం గలది. నాలుగు భుజాలు గలది. ఆమె 'పరత్రిపురీ' అరుణవర్ణ, పాశము, అంకుశము, చెరుకువిల్లు, పంచ పుష్ప బాణములు చేతులలో గలది. ఆమెయే లలిత కాంచీపురంలో కామాక్షి అనే పేరుతో వెలసింది. సరస్వతి, లక్ష్మి, గౌరిఆమెను ఉపాసిస్తారు. కాశీ శివకంచి, విష్ణుకంచి అనే మూడును శంకరుని మూడుకన్నులు, విష్ణుకంచి శివసాన్నిధ్యంకలిగిస్తుంది. పూర్వం కాంచీపురంలో బ్రహ్మశ్రీ దేవిదర్శనం కోసం ఘోరతపస్సుచేసాడు. ఆత్మధ్యానంలో నున్న ఆయనకు లక్ష్మిప్రత్యక్ష మయింది.ఆమె పద్మహస్త, పరాత్పర, విష్ణువుతో కలిసి పద్మంలో కూర్చున్నది. సర్వశృంగారవేష, సర్వాభరణాలంకార, సర్వలోక ఏకైకరక్షకి, బ్రహ్మ ఆతల్లిని చూచాడు. మహాసౌందర్యభరిత ఆదిలక్ష్మి అందరి హృదయాలలో నున్నది. ఆమెను బ్రహ్మ,విష్ణు, ఈశ్వరుల తల్లియైన త్రిపుర అంటారు. బ్రహ్మకామాక్షి యని ప్రసిద్ధురాలైన ఆమెను పూర్ణభక్తి కలవాడై స్తుతించాడు.

సకల లోకజననీ ! హేమాతా ! నీకు నమస్కారం. త్రిపుర సుందరీ ! నీకుజయం విష్ణుసోదరీ ! నీకుజయం. సర్వమంగళ రూపిణీ ! నీకు జయం. కరుణారాశీ ! లక్ష్మి నీకుజయం. అందాలరాశీ ! జయం. సర్వసిద్ధేశ్వరీ జయం. శృంగార నాయికా జయం. యోగిజన నమస్కృతా! జయం జగదంబా ! జయం నిత్యరూపిణీ ! జయం సన్నుతలోక సౌఖ్యదాత్రీ! జయం హిమశైలస్తుత్యర్వా ! జయం. శంకరకామన సుందర వామనేత్రా! జయం సంకల్ప మాత్ర సృష్టిస్థితి లయప్రదా ! నమస్కారం. వర్ణాశ్రమ ధర్మ సాంకర్యదోష సంహారీ ! నీకు నమస్కారం! నిగమాగమయోగశాస్త్రము లచే తెలియరాకతనలో తాను తెలియదగు రూపముననున్న స్వాత్మరూపిణి వైన ఓ దేవీ! నీకునమస్కారము. రహస్య ఆమ్నాయములు, వేదాంతములు. తత్త్వవేత్తలు, మునీశ్వ రులు పరబ్రహ్మయని ప్రకటించిన ఆదేవికి నమస్కారం. బ్రహ్మ,విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివులు ఏకాంతధ్యానము చేయు ఆ దేవికినమస్కారం. ఇంద్రాదులు ఆమె పాదసేవకులై ఆమె ఆజ్ఞను శిరసావహిస్తారు. సామ్రాజ్యసంపదకు ఈశ్వరియైన

ఆమెకు నమస్కారం వేదములు ఆమె నిట్టూర్పులు, పంచభూతములు ఆమెచూపులు, సమస్త విశ్వము ఆమె చిరునవ్వు. ఆదేవికి నమస్కారము. వేయితలలు గల ఆది శేషుడు ఆమె ఆజ్ఞతో భూమిని మోస్తుంటాడు. సర్వజనాధారమైన ఆదేవికి నమస్కారం ఆమె ఆజ్ఞచే అగ్నిమండు, సూర్యుడెండగాయు, వాయువు వీచు, జ్ఞానరూపిణియైన ఆదేవికి నమస్కారం. **25** తత్త్వాలు దేవీమయమే అని మునులు చెప్పుదురు. ఆ దేవికి నమస్కారం, శివుడు శక్తి, ఈశ్వరుడు, శుద్ధబోధుడు, సదాశివుడు అనువారు ఆమె కనురెప్పలు తెరచుభేదములు. ఆ దేవికి నమస్కారం, గురువు, మంత్రము, దేవత, పంచప్రాణములు మొ. రూపములతో విరాజిల్లుచిద్రూపిణికి నమస్కారం, ఆమె సర్వాత్మలకు అంతరాత్మ స్వరూపిణి, పరమానందరూపిణి, శ్రీవిద్య అనబడు తుంది. ఆ దేవికి నమస్కారం, అన్నిదర్శన గ్రంథాలు ఆమె అవయవాలని పండితు లంటారు. ఆనియమ స్వరూపిణికి నమస్కారం మణి, మంత్ర, ఓషధీరూప ములుగా సకల లోకాలలోను ఆమె ప్రకాశిస్తుంది. తత్త్వోపదేశ స్వరూపిణి యైన ఆ దేవికి నమస్కారం దేశ, కాల, పదార్థ ఆత్మగా అన్ని వస్తువులందు అన్ని రూపాలతోనున్న ఆ దేవికి నమస్కారం. ఆమె ఆకారం బంగారానికి ప్రతిరూపం. ఆమె కల్యాణగుణ. విశ్వమును మించిన ఆ దేవికి నమస్కారం.



ఈవిధంగా బ్రహ్మ మహాదేవిని స్తుతించి, పరిపరి వందనాలాచరించి, ఆమె శరణం పొందాడు. అమ్మ బ్రహ్మను చూచింది. సంతోషించింది, వరం అడగమంది, బ్రహ్మ అన్నాడప్పుడు, తల్లీ ! నీదర్శనంవల్ల ధన్యుడనైతి ఇదిసత్యం, లోకానుగ్రహ కాంక్షతో నిన్ను అడుగుతుంటి. కర్మభూమి అయిన ఈలోకంలో మానవులు మూర్ఖ లుగావున్నారు. వారిని అనుగ్రహించే నిమిత్తం నీవిచ్చట స్థిరంగా వుండాలి అనగానే మహాదేవి 'తథాస్తు'అంటూ బ్రహ్మకోరికను తీర్చింది. తరువాత బ్రహ్మ కాంచీనగరంలో మహాదేవికి నివాసం సంకల్పించాడు. తదుపరి శ్రీదేవి సోదరుడైన శ్రీమహావిష్ణువునకు నమస్కరించి విష్ణుసాన్నిధ్యం కూడా ఇక్కడ కావాలని అడిగాడు. శ్రీహరితథాస్తు అన్నాడు. అనంతరం బ్రహ్మ శివసాన్నిధ్యం కూడా ఇక్కడ కావాలని అమ్మవారిని ప్రార్థించాడు. అపుడు త్రిపురాదేవి కుడిభాగం నుండి కామేశ్వ రుడు వచ్చాడు. అతడు అన్నివిద్యలకు ప్రాణులకు అధినాయకుడు సాక్షాత్తు శృంగారనాయకుడు తరువాత అమ్మవారి ఫాలనేత్ర కటాక్షంవల్ల ఒక బాల పుట్టింది. ఆమెమహాగౌరి శుద్ధశ్వేతవర్ణ. మహాతేజస్స్వరూప, సర్వశృంగార వేషాఢ్య, మహాసౌందర్యనిధాన తదుపరిబ్రహ్మ, విష్ణువు వారికి కల్యాణం చేయించారు. అపుడు ఇంద్రాది దేవతలు, వసురుద్రాదులు, మార్కండేయాది మునులు, వసిష్టాది మునీశ్వరులు, సనకాది యోగీంద్రులు, నారదాది దేవమునులు, వామదేవుడు మొ. జీవన్ముక్తులైన శుకాదులు, యక్ష, కిన్నర,గంధర్వ, సిద్ధ, విద్యాధర, నాగలోకవాసులు, గదాగ్రణి అయిన మహా శాస్త, దుర్గాదులైనమాతలు, అనేక దేవవర్గం వారందరు విమానాలనుండి ఆ దంపతులకు నమస్కరించారు. బ్రహ్మ తన సంకల్పంతో ఆ నగరమధ్యంలో నిర్మించిన



అమ్మవారి మందిరం అద్భుతం. అతిసుందరం, అత్యంత శోభనం శ్రీదేవి సోదరుడైన శ్రీమహావిష్ణువు సహాయంతో కాంచీపురంలో మహేశ్వ రుడు అగ్నిసాక్షిగా గౌరిని పెళ్ళిచేసుకున్నాడు. దేవదుందుభులు మోగినాయి. పూలవానకురిసె, ఆ మహోత్సవం వర్ణించడం ఎవరి తరంకాదు.

ఆదిశ్రీమందిరానికి వాయవ్యభాగంలో మహేశ్వర మందిరం వున్నది. అది విశాలము, లోకోత్తరము, దానిని బ్రహ్మ నిర్మించాడు, శ్రీమందిరానికి ఆగ్నేయ భాగంలో విచిత్రమైన విష్ణుమందిరమున్నది. కంచిలో ముగ్గురు దేవతలు స్థిరంగా వున్నారు.వారే శ్రీదేవి, మహేశ్వరుడు, విష్ణువు, బ్రహ్మ, విష్ణువులు గౌరీ మహేశ్వరులకు నమస్కరించి ప్రదక్షిణించి దేవ సభకు పక్కనున్న నందనవనోద్యానానికి చేరేరు. అక్కడునున్న వారికి వివాహ విశేషాలు వివరించి చెప్పారు. అక్కడ పరమేశ్వరి సాక్షాత్కరించింది. ఆమె కుడికన్నుతో బ్రహ్మను, ఎడమకన్నుతో విష్ణువును చూచింది. తరువాత ఆమె తేజము నుండి లక్ష్మి, సరస్వతి, అమ్మవారి సేవకై అక్కడకు వచ్చి గంగాయమునలవలె ప్రకాశించారు. వీరు కామాక్షికి జయం పలికి నమస్క రించారు. మూడున్నర కోట్లతీర్థదేవతలు అమ్మను సేవించడానికి అక్కడకు చేరుకున్నారు. అమ్మ వారికి లక్ష్మీ సరస్వతులు వింజామరలు వీచారు. వారి బాహువులందురత్నాలు పొదిగిన చిన్నగంటలు మంజుల నినాదాలు చేసినాయి. ప్రేక్షకులు ఆశ్చర్యచకితు లయ్యారు.కామాక్షి నామం ఉచ్చరించిన మాత్రాన సుఖం లభిస్తుంది. ఆ మూడక్షరాలు సర్వమంగళదాయకాలు. ఆతల్లి సరస్వతిని బ్రహ్మలో నిత్యనివాసం చెయ్యమని ఆదేశించింది. తనచామరం గంగచేతిలో వుంచి సరస్వతి బ్రహ్మముఖంలో ప్రవేశిం చింది. తదుపరి లక్ష్మి అమ్మ ఆజ్ఞతో విష్ణువు వక్షంలో ప్రవేశించింది. లక్ష్మీనారాయ ణులు తాము ఆవరణదేవతలుగా వుండగోరి అమ్మను ప్రార్థించారు. అమ్మ 'తథాస్తు' అన్నది. వారు ఆవరణదేవతలయ్యారు. విష్ణువు ఎత్తయిన తన పీఠానికి ఉత్తరంలో లక్ష్మిని నిలిపి తాను దక్షిణంలో నిలబడ్డాడు. కామాక్షి గౌరిని ఇంకొక రూపం ధరించమని ఆదేశించింది. మహాగౌరి యొక్క ప్రతిబింబం అక్కడ ప్రకాశించింది. ఆమె దివ్యదేహ గౌరీ సమానాకృతి, ఆమె పాదాలు లేత ఎరుపుతో మిలమిల మెరుస్తూ చంద్రకాంతి సౌందర్యం కలిగివున్నవి. పీఠంలో చిరుగంటలు తిత్తిరిపక్షుల్లా మంజుల ధ్వనులు వెలారుస్తున్నవి. మనోహరమైన మణుల మొలనూలు మెరుపువలె మెరుస్తూ మ్రోగుచుండె. రెండుభుజాలు రత్నాలు పొదిగిన కంకణాలు, భుజాలంకార లతో శోభిల్లుతున్నవి. నడుము ముత్యాలు, వైడూర్యాలు మాణిక్యాలు పొదిగిన ఒడ్డాణంతో ప్రకాశిస్తుండె, నాభీమండలం గంగానది సుడివలె శోభిల్లు చుండె. స్తనాలు కుంకుమపువ్వు, కర్పూరము కలిసిన చందన గంధం పూతతో అలంకరించబడినాయి. రవిక ముత్యాల అల్లికతో ప్రకాశిస్తుండె. నడుమున జలతారు గొలుసులు విచిత్రంగా వేలాడుతుండె. కెంపుల పతకాలు కంఠాలంకారాలయ్యె. ఎడమచేతితో పద్మం మనోహ రంగా అంటి యుండె. మోకాళ్ల వరకు వేలాడే కదంబ పూలమాలలు దివ్యాలంకారాలై

శోభిల్లుతుండె. భూషణరత్నాల కిరణపంక్తులు దిక్కులకు కాంతినిస్తున్నవి. మంగళ సూత్రంలోని రత్నకిరణ కాంతులతో కింది కంఠం ఎర్రబారినది. చెవి దుద్దులు కెంపులతో అలంకరించబడినవి. దంతాల వరుసలు దానిమ్మపళ్ల విత్తులవలె ప్రకాశిస్తున్నవి. మెత్తని చెక్కిళ్లు మెల్లని చిరునవ్వుల వెలుగులో వెలయుచుండె. గోటేరు వంటి అందమైన ముక్కునకు పోలికేలేదు. ముక్కు నిర్మలమైనువ్వు పువ్వువలె శోభిల్లుచుండె. కన్నులు కొద్దిగా విడిచిన నల్ల కలువవలె సగము మూయబడి పరమ శాంత స్వభావమును వెలార్చుచుండె. కనుబొమలు కొత్తగా విడిచిన పూలవిల్లును పోలె. ఫాలభాగం అర్ధచంద్రుని వలె అందంచిందె. ముఖం మాత్రం పూర్ణచంద్ర బింబమే. దట్టమైన సుగంధ కస్తూరీ తిలకం ప్రకాశిస్తుడెనందు, చిరు శిరోజాల మోము గండుతుమ్మెదలతో ప్రకాశమాన మగు కమలశోభగలదయ్యె. కొప్పుముడి పారిజాత పూల మాలలతో చుట్టబడె. కిరీటం రత్నాధికం. ఆ తల్లి సర్వ సౌందర్యరాశి. విలాస సంపద్భవంతి. శివుడు, విష్ణువు, అక్కడవున్న వారందరు ఆబింబానికి, దేవికి అభేదం అన్నారు అపుడు మహేశ్వరి ఆ బింబంలో ప్రవేశించింది. ఆ మహాదేవినిచూచి బ్రహ్మ పునఃపునః నమస్కరించియిట్లు ప్రార్థిం చాడు.

పూర్ణ బ్రహ్మ స్వరూపిణి, మహాశక్తి, త్రిపురసుందరి, కామాక్షిగా ప్రసిద్ధి పొందిన నీకు నమస్కారం. దయతో నావిన్నపంవిను. నిత్యకల్యాణీ ! శ్రీదేవీ ! లోకాల సంపదలు వృద్ధిపొందడానికై ఇక్కడ గౌరీ మహేశ్వరుల కల్యాణం ప్రతిసంవత్సరం చెయ్యాలి. దేవతలు ఆనందించాలి. మూర్ఖమాన వులు కూడ మహాదేవికి భక్తితో నమస్కరిస్తే వాళ్లు పుణ్యలోకాలకు వెళ్లాలి. అనగానే పరాశక్తి ఆకాశవాణి రూపంలో తథాస్తు అన్నది. వారిని వారి యిళ్లకు వెళ్లమని చెప్పింది. వారందరు అమ్మకు నమస్కరించి తమ యిళ్లకు వెళ్లారు. బ్రహ్మ, విష్ణ శివులతో ఆ మంత్రోపేతశక్తిని మందిరంలో ప్రవేశ పెట్టి, వేదమంత్రాలతో పూజించి సాష్టాంగనమస్కారం చేసాడు. ఆకాశవాణి రూపంలో అమ్మ బ్రహ్మతో అన్నది. దృఢాశయా ! విష్ణువును శివుని వారి స్థానాలకు పంపు. ప్రతిసంవత్సరం కామగిరి పీఠాన్ని సేవించు. సాక్షాత్తు అవి పురమధ్యలో నున్నది. అది స్వయంవ్యక్తం. శివుడు, కుబేరుడు అంబ ఇక్కడ వున్నారు. ఇది చిదానందాకారం. సర్వపీఠాధిదైవతం.అదృశ్యాకారి. అవ్యక్త, కామగిరిపీఠాన్ని కాంచీ పురం యథావిధిగా ధరించింది. ఇపుడు లోకాలు అభివృద్ధికోసం సంపూర్ణంగా ధరించింది. కాదనరాని, వెలుగులు గల దళముల మణులతో శ్రీదేవి కిష్టమైన మంచి నక్షత్రంలో కామగిరి పీఠాన్ని యథావిధిగా ప్రీతితో పూజించి, శాశ్వతంచేసి నీలోకాన్ని పాలించు, అనగానే బ్రహ్మ తు.చ తప్పకుండా అమ్మ ఆజ్ఞనెరవేర్చి, ఆ మహాదేవిని హృదయంలో నిలిపితనలోకానికి వెళ్లాడు. సాక్షాన్మహాలక్ష్మి అయిన ఆ తల్లి చరిత్ర వినువారికి, నియమంతో చదివిన వారికి భుక్తి ముక్తి కలుగు తుంది. నిస్సందేహం వారు బుద్ధిలో బృహస్పతి అవుతారు. సర్వవిద్యాదిపు డవుతాడు. పూర్వం నా చిరతపస్సునుమెచ్చి దయతో నాకుమారునకు ఆదినారాయణుడు సారూప్యముక్తిని



అనుగ్రహించాడు. మహాత్రిపుర సుందరీ మహిమను ఉపదేశించాడు. తరువాత అతని నుండి నేను కొంత గ్రహించాను.రహస్య మంత్రం చెబుతావిను. త్రిమూర్తులు త్రిపుర మాయా మోహితులు, నాలుగవ వాడు ఈశ్వరుడైన సదాశివుడు, అతడు కూడ ఆతల్లి మహిమ తెలియలేదు. ఆ తల్లి అనుగ్రహంతో అతడు సర్వజ్ఞు డయ్యాడు. సర్వాత్ముడయ్యాడు. సచ్చిదానందరూపుడయ్యాడు. వివశు డయ్యాడు. వీరందరి జన్మలయములకు ఆతల్లియే ముఖ్యకారణం. ఒక విశిష్ట కర్తవ్యాంశం విను. త్రిమూర్తు లకు ప్రభువు ఈశ్వరుడు, వీరికి ఆది కర్త సదాశివుడు, అమ్మ రహస్యం, అద్భుత చరిత్ర నీకు విశదీకరించా ఇంకాచెబుతాను శ్రద్ధగా విను. అన్నాడు హయగ్రీవస్వామి అగస్త్యునితో.

## కామాక్షి విలాసాలు

అగస్త్యా! అమ్మకామాక్షి అందరి హృదయాలలోను వుంటుంది. జీవుల కర్మలననుసరించి వారికి ఫలితాలిస్తూవుంటుంది. లోక వ్యవహారమంతా ఈమె అధీనం. ప్రాణులు కోరుకున్నట్లు కర్మఫలితాలుండవు. అంతా ఆమె ఆజ్ఞానుసారంగా జరుగుతుంటుంది. త్రిపురాశక్తులు ఆమె అవతారాలు. ఆమె మహాలక్ష్మి. పూర్వం ఆమె మూడు అండాలను సృష్టించింది. ఒక అండం నుండి అంబిక, రెండవదాని నుండి విష్ణువు, మూడవ దానినుండి సరస్వతి, శివుడు పుట్టారు. మహేశ్వరి విష్ణ మహేశ్వరులను సృష్టిస్థితి లయ కార్యాలకు నియమించింది.వారు సుఖప్రదాయిని అగు మహాలక్ష్మిని ధ్యానిస్తూవుంటారు. వీరు బ్రహ్మలోకం, వైకుంఠం, కైలాసములలో నివసిస్తారు. ఒకపర్యాయం కైలాసంలో పార్వతీ దేవి విహరిస్తూ వెనుకనుండి శివుని రెండు కన్నులను మూసింది. శివుని నేత్రాలు సూర్యచంద్రులవడం వల్ల లోకాలు అంధకార బంధురాలైనవి. దేవపితృ కర్మలాగిపోయినై. ప్రజలు అయోమయంలో పడ్డారు. అపుడు శివుడు పార్వతోననె. దేవీ ! నువ్వు పాపం చేసావు. నాకన్నులు మూసితివికదా! ఋషుల తపస్సు, వైదికుల సంధ్యావందనాలు, ఆగిపోయినై. వైదిక కర్మలు నశించడానికి కారకురాలవైన నువ్వు ఆపాపం పోవడానికి ఘోరతపస్సు చెయ్యాలి. కాశికి వెళ్లు, కొంత కాలం తపస్సుచెయ్యి. తరువాత కాంచీపురంవెళ్లు, కామాక్షిని దర్శించు, పూజించు, కంపానదీతీరంలో తులసి ముందు తపస్సుచెయ్యి, అని ఆజ్ఞాపించి స్వామి మాయమయ్యాడు. పార్వతిభర్త ఆజ్ఞను అక్షరాలా పాటిం చింది. ఏకాగ్రచిత్తంతో కష్టపడిన పార్వతికి కామాక్షి ప్రత్యక్షమయింది.ఓ సువ్రతా! నీతపస్సునకు మెచ్చాను అన్నది. పార్వతి కన్నులు తెరిచింది. కామాక్షిని దర్శించింది. పదివేల బాలసూర్యుల కాంతితో వెలుగుచున్నది కామాక్షి. కిరీటం, హారాలు, భుజ కీర్తులు, అలంకరించుకున్నది, పాశము, అంకుశము, చెరుకువిల్లు ఐదుబాణాలు చేతులలో ధరించింది. ఆమె సర్వాభరణాలంకార, చంద్రరేఖ కిరీటంలో ప్రకాశిస్తు న్నది. ఆమె సగుణ బ్రహ్మ, ఇహపరలోక సృష్టి నిర్మాణకర్త్రి. ఆ తల్లిని చూచి పార్వతి పరమానంద భరిత అయింది. శరీరంగగుర్పాటు చెందింది. సంతోషంతో కన్నులు

విప్పారినై. చండిక, మంగళ, మొ. తన సఖీజనంతో సహా సాష్టాంగంచేసింది ఆ తల్లి. ప్రదక్షిణం చేసింది, నమస్కరించింది, తనతో ఏకస్వరూపిణి అయిన మహాత్రిపుర సుందరి దయతో చూచింది. కౌగిలించుకుంది, అందిలా, బాలా! నీమనస్సుకోరిని రుద్రుని భర్తగాపొందు, లోకరక్షణచెయ్యి ఇదినా ఆజ్ఞ మనకు అభేదం, నిస్సందేహం, నీవే నేను నీకుపాపంలేదు. నీవేపాపసంహారివి కదా! యోగీంద్రాదులు నిన్ను బహువిధాలస్తుతిస్తూ బహురూపిణి వంటారు. సురూపా! సురుచిరాకృతీ ! ఇదంతా లీలామాత్రం. అన్నది విని అంబికకు సర్వమంగళ భక్తితో నమస్కరించింది. పరాశక్తి ఆమెలో ప్రవేశించింది. పార్వతి పరమానందభరిత అయింది. ఆశ్చర్యపోయింది. ఇదికలా? భ్రమా! అనుకొంది. విమర్శించి పరిసరాలు పరికించింది. చిరు నవ్వుతో నున్న తన సఖులు జయవిజయలతో అన్నది. ప్రియసఖులారా! ఇంత కాలం ఎక్కడకు పోయారే? కామాక్షిని దర్శించారా?అనగానే వారి కన్నులు విప్పారినై. అమ్మకు నమస్కరించారు. పూజాపుష్పాలు ముందుం చారు. అన్నారిలా నిజంతల్లీ ! మేము పరాశక్తినిచూచాం. ఇది కలకాదు, భ్రమకాదు, ఆపరాశక్తి నీ హృదయంలో ప్రవేశం చింది. అంటూ వినయంతో తలవంచి ఆమె ప్రక్కనకూచున్నారు.

ఏకామ్ర వృక్షకిందకూర్చున్న శివుడు పార్వతీ విరహంతో బాధపడుతూ గౌరీ ప్రాప్తిని కోరి, ఇంద్రియాలను బంధించి కామాక్షిని ప్రార్థించాడు. ఆమె శివునకు ప్రత్యక్షమై సంతోషంతో ఇలాఅంది. మారసంహరా! ధ్యానం చాలించు, ఇంద్రియా లను సడలించు, ఏకామ్రపీఠంలో ఎల్లపుడు వుంటున్న, కంపాతీరమందలి గౌరిని అనుగ్రహించు, యోగం, వియోగం విడిచిపెట్టు. అంటూ ఆమె శివుని హృదయంలో అంతర్థానమయ్యె. శివుడులేచాడు. ఆనందించాడు.దేవతలాయన్ను సేవించారు, మహాత్రిపురసుందరిని హృదయంలో ధ్యానించాడు. వివాహమంగళాలాకార, కంపానీరవాసిని, దయామయి, శివ అయిన గౌరిని వివాహవిధితో అంగీకరించి, వృషభం ఎక్కించుకొని కైలాసానికి వెళ్లాడు. అగస్త్యా! ఇక ఆదిలక్ష్మి ప్రభావము నీకుచెబుతా తొలుదొల్త ఒకమహాప్రాజ్ఞుని చరిత్రవిను. ఒకసారి త్రిమూర్తులు బ్రహ్మసభకు వెళ్లి అక్కడ కూర్చున్నారు. దిక్పాలకులు, దేవతలు, సనకాదులు, నారదా దులు,వసిష్టాదిమునులు అక్కడకు వచ్చారు. వారు బ్రహ్మను, శివునిచూ చారు. ఇద్దరకు ఐదుముఖాలున్నవి. భేదం తెలియలేదు. గుసగుసలాడు కున్నారు. ఇందులో ఎవరు బ్రహ్మ ఎవరు శివుడు? అది తెలిసి శివుడు మాయమయ్యె. అపుడు విష్ణువుకు, బ్రహ్మకువాదం మొదలైంది. నేను బ్రహ్మను నేనే బ్రహ్మను, నేను గొప్ప నేను గొప్పఅని, నానాభికమలంలో పుట్టిన నీవు నాకుమారుడవు అన్నాడు విష్ణువు. నేను సృష్టిస్తేనే మీరువచ్చారు. శివుడు, నీవు నాకుమారులు అన్నాడు బ్రహ్మ. ఈ వాదులాట మధ్య 'మీరెవరూకాదు. నేనే బ్రహ్మను అంటూ శివుడు జ్యోతిర్లింగంగా అక్కడ ప్రత్యక్షమయ్యాడు.విష్ణువు ఈలింగం కేవలం శివుడే అని తెలిసి మౌనం వహించాడు. బ్రహ్మ శిరస్సులకుపైన ఒకజ్యోతిశ్చక్రం ఏర్పడింది. ఆచక్రం మధ్యలో ఉమామహేశ్వ



రులు, శివుడు బ్రహ్మనుచూచాడు. బ్రహ్మ మరల అహంకరించాడు. శివుడు కోపంతో బ్రహ్మ విష్ణులనుచూచాడు. వారి నుండి భైరవుడు పుట్టాడు, అతడు తనగోటితో బ్రహ్మతలను తుంచి వేసాడు. అక్కడివాళ్లు అయ్యబాబోయ్ అంటూ పరుగులంకించు కున్నారు. బ్రహ్మ తలభైరవుని గోరుకు అంటుకుపోయింది. ఎన్నిసార్లు విదిలించినా అది భైరవునిచేతిని వదలలేదు. బ్రహ్మహత్యాపాతకం భైరవునకంటుకుంది. అతడు అనేక తీర్థక్షేత్రాలు, గంగాది మహానదులను సేవించాడు. అయినా ఆ పాపం పోలేదు. విషాదం పొందాడు భైరవుడు, తేజోవిహీనుడయ్యాడు. చివరకు కాంచీపురం చేరాడు. అక్కడ భిక్షాటనంచేస్తూన్నాడు. అనునిత్యం పంచతీర్థాలలో స్నానంచేసి పరదేవతను సేవిస్తున్నాడు. భైరవుడు పిచ్చివానివలె అక్కడ వున్నాడు కాంచీక్షేత్ర నివాసం వల్ల క్రమంగా ఆయన పాపాలన్నీ పటాపంచలయ్యె. కుడియెడమలందు విష్ణువు, లక్ష్మి సేవించుచున్న కామాక్షీ దేవికామకోటి పీఠంలోపలి గృహం చేరాడు భైరవుడు, ఆత్మనిగ్రహం కలవాడయ్యాడు. అమ్మధ్యానంలో మునిగి పోయినాడు. పార్వతీ పరమేశ్వరులను ధ్యానించాడు. బ్రహ్మ, విష్ణు, కపిల, సనక, శుక, మొ. వారును చేయలేని ధ్యాన నిష్టఅది. శ్రీదేవి సుప్రసన్న అయింది. అర్థరాత్రి ఆమె పలికింది.

సర్వపాపహరా! నీకు పాపమనేదేలేదు. కేవలం ఇదంతా జగన్నాటకం మాత్రం రేపటినుండి నీబ్రహ్మహత్య నశిస్తుంది. అంటూ అంతర్థానం అయింది. భైరవుడా నందించాడు శేషరాత్రి అమ్మధ్యానంలో గడిపాడు. ఉదయం పంచమహా తీర్థాల్లో మునిగాడు. సంధ్యావందనం, గావించాడు. చేతినున్న బ్రహ్మ కపాలాన్ని విడుపు తూన్నడు. అదివూడలేదు. చాలాదుఃఖించాడు ఇదికలా! మాయా! మానస భ్రాంతియా! అనుకొంటూ వికల మనస్కుడై చింతిస్తున్నాడు. మరల ధైర్యం తెచ్చుకున్నాడు. తులసీ మండలానికి నమస్కరించాడు. ఎదుట నిలిచి పూజించాడు. ఇంద్రియ నిగ్రహం వహించాడు. సమాధిలోకివెల్లాడు. ఒక జాముగడిచింది. అమ్మ వారు మరల ప్రత్యక్షమయింది. సమాధిచాలునయ్యా, ఈ సరోవరంలో మునగు అంటూ మాయమయింది. ఇదికలా ! మాయా అనుకున్నా డాయన. ఏం చెయ్యాలి? పాలుపోలేదు. మొదట అమ్మ చెప్పింది. అబద్ధమా! మళ్లీ చెప్పిందినిజమా ? మొదటి జాము గడిచిపోయింది. ఇదంతా అబద్దమే అనుకొంటూ చింతలోమునిగాడు. నీటిలో మునుగు అంటూ ఆకాశవాణి గర్జించింది. సందేహం నశించింది. నిజం నిశ్చయ మయింది. గంగా సరస్సులో మునిగాడు గంగాధరుడు. మునిగిలేచి కాశిని చూచాడు. కపాలం మాత్రం వూడలేదు. సూర్యుడు పైపైకివచ్చాడు. భిక్షాటనకు బయలుదేరాడు ఆదిభిక్షువు, కొన్నిగృహాలకు వెళ్లాడు, మార్గమధ్యంలో దేవతాకృతిలో వున్న ఒక మొలనూలు, కాంచిని చూచాడు. ఆమె ఆయనకు జ్యోతిర్మయి భిక్ష పెట్టి మాయ మయ్యె. ఆ క్షణంలోనే బ్రహ్మకపాలం ఆయన గోటినుండి ఊడి పడ్డది. ఈశ్వరుడు అద్భుతం అనుకున్నాడు. ప్రసన్నముఖుడయ్యాడు. కామాక్షి దయాశీలాన్ని మరిమరి తలుస్తున్నాడు. కాంచీపురి పుణ్యరూప, కంపానది పరమపవిత్ర, కనబడినది కామాక్షి

దేవత అని ఆమెను పొగు డుతూ స్వస్థానానికి వెళ్లిందాయన. అగస్త్యా ! ఇంకొక దేవీ మహిమ చెబుతావిను. మహాదేవీ ప్రభావం విన్నవారికి కోరికలు తీరుతవి. అయోధ్యానగరాన్ని దశరథుడు పాలిస్తున్నాడు. చాలాకాలం వరకు ఆయనకు సంతానం కలుగలేదు. శోకంతో కుమిలిపోతున్నాడు. కులపురోహితుడైన వసిష్ఠ మహర్షిని రహస్యంగా పిలిచాడు. సర్వశాస్త్రార్థకోవిదా !సత్పురుషా ! ఆచార సంశుద్ధా! చాలాకాలం గడిచిపోయింది. నాకుబిడ్డలు కలగలేదు. నావాంఛ ఎలాతీరుతుంది. ఈ దుఃఖం పోయే ఉపాయం సెలవియ్యండి అని ప్రార్థించాడు. విన్నాడు ముని, అన్నాడపుడు రఘువంశోత్తమా ! నీకొక రహస్యం చెబుతావిను అయోధ్య, మధుర, మాయ, కాశి,కాంచి,అవంతి, ద్వారవతి అనే నగరాలు ఉత్తమోత్తమాలు. పరమపుణ్య ప్రదాలున్నూ, కాంచీనగరంలో మహాత్రిపుర సుందరిని ఆరాధిస్తారు. అయోధ్యలో ఆమె అధిదేవతను అర్చిస్తారు. త్రిపుర సుందరితో సమాన పరదేవతలేదు. త్రిమూర్తులు సశ్రీకులై ఆమెను సర్వదా పూజిస్తారు. కొబ్బరికాయలు, పనసపళ్లు, అరటిపళ్లు, కోకొల్లలుగా ఆమెకు అర్పిస్తారు. పెద్దపెద్ద పాత్రలతో తేనె, నెయ్యి, శర్కర, పాయసం, సిద్ధ ద్రవ్య విశేషాలతో త్రిపురసుందరిని నువ్వు పూజించాలి. వెంటనే ఆ తల్లి నీ కోరిక తీరుస్తుంది. అనగానే దశరథుడానందించి కానుకలిచ్చి కులగురు వును సాగనంపాడు. తరువాత గుర్వాజ్ఞానుసారం దశరథుడు లలితా పరమేశ్వరిని పూజిం చాడు. ఇలా చాలాకాలం అర్చించిన దశరథునకు అర్థరాత్రి గడిచాక మగత నిద్రలో పరమేశ్వరి ప్రత్యక్షమయింది. నాలుగు భుజాలు, పాశం, అంకుశం, ధనువు, బాణాలు ధరించింది. సర్వాలంకార శోభిత, సర్వశృంగార వేషాఢ్యగా వుంది. ఇందుమతీ పుత్రుడైన దశరథునితో అన్నది.

శ్రీమంతా!దశరథా! పుణ్యపురుషా! నీకు పుత్రభాగ్యం కలదయ్యా పూర్వపాప కర్మల ఫలితంగా అశుభఘడియ యింకను రాలేదు. ఆ పాప పరిహారం కోసం నువ్వు కాంచీపురంవెళ్లు, కంపానదిలోస్నానం చెయ్యి. అపుడు నన్ను దర్శించు, కాంచీపురమధ్యంలో ఒకగుహవున్నది. దానికి ఏడుద్వారాలు ఆగుహలో కామకోష్ఠం అనే అంతర్గృహంవుంది. అదిసామ్రాజ్యాన్ని సూచిస్తుంది. త్రిమూర్తులకు అది సిద్ధిని అనుగ్రహించింది. అందులో నువ్వు ప్రవేశించు అక్కడ సింహాసనంపై తూర్పు ముఖంగా నేనుంటా అది మహాలక్ష్మీ స్వరూపం. రెండు భుజములందు పద్మాలు ధరించివుంటా,చక్రేశ్వరిని, మహారాణిని అయిన నేను సూక్ష్మదృష్టిలేనివారికి కనబడను. నాకన్ను నుండి పుట్టిన గౌరి నాకుడివైపున వుంటుంది. ఆమె సౌందర్యరాశి సర్వాభరణాలంకార అక్కడ ఆమెకు నేను నివాసం కల్పించా; మహాలక్ష్మీరూపంలో గల మాయారూపమా అన్నట్లుంటుంది. పీఠం మొదలు శిరస్సు వరకు చూస్తూ ఆమెను నాఅంశగా గుర్తించిన వారికి మహాపాపాలు తక్షణం నశిస్తవి. చెడు సంస్కారం, చెడ్డబుద్ధి, కుతర్కాలు, దుష్టస్వభావం, నాస్తికత్వం, మొ. నశిస్తవి. శర్కర, తేనె, నెయ్యి, పాయసాలు, అనేక భక్ష్య భోజ్యాలు, షడ్రసాలు మొ. పదార్థాలతో



నాకు మహాపూజచెయ్యి. అపుడు నేను నీకు ప్రసన్ననైవరం అనుగ్రహిస్తా, అంటూ ఆతల్లి మాయమయ్యె.

దశరథుడు కన్నుతెరిచాడు. ఆశ్చర్యం, శుభలక్షణ అయిన కౌసల్యను లేపాడు, కలవివరించాడు. ఆమె ఆనందించింది, తెల్లవారింది, మంత్రి పరివార సహితుడైన దశరథుడు కాంచీపురం వెళ్లాడు. భార్యతో కలిసి కంపా నదిలోస్నానం చేసాడు. మహాదేవిని దర్శించాడు. పంచతీర్థాల్లో మునిగాడు. క్షేత్రవాసులను భక్తితో పూజిం చాడు. దశదానాలు చేసి వారిని సంతోషపెట్టాడు. భక్తితో ఆలయంలో ప్రవేశించాడు. వినయంతో మూడు ప్రదక్షిణలు చేసాడు. కౌసల్యతో కలసి అమ్మ సన్నిధిచేరాడు. త్రిమూర్తులకు తల్లి, శ్రీచక్ర స్వరూపిణి, మహాత్రిపుర సుందరి, కామకోష్ఠావతార అయిన ఆ తల్లికి భార్యతోగూడి, భక్తితో సాష్టాంగం ఆచరించాడు.పూర్వం ఈ దేవీ నివాసాన్ని తమ ఇక్ష్వాకువంశజులే నిర్మించారు. దూర్వాసుని పూజకోసం ఇది శిష్యులు కూడ నివసించడానికి కల్పించబడింది. దాసదాసీలతో నిండి నది. ధ్వజారోహోత్సవం గృహోత్సవం, మొ.వానితో కూడినది. తన గురువు వసిష్ఠుడు చెప్పిన విధంగా దశరథుడు అంబను పూజించాడు. మగతనిద్రలో తాను చూచిన తల్లి యామెయే. నిస్సందేహం, తేజోరూపం ఆ రూపాన్ని అమితంగా ధ్యానం చేసేడాయన, అమ్మకు వస్త్రాలంకారాలు, యజ్ఞశాలలు సమర్పించాడు. స్తోత్రంచేసాడు, ఆనందించాడు.

పాదాలవరకు వేలాడే దివ్యాభరణములతో అమితమైన అందాలు చిందే చిత్సుందరీ! రత్నకాంతులు వెదజల్లుకాలిగజ్జెలతో మనోహరంగా మెరిసే పాదాలు నీవి. పీతాంబరంపై మెరసే సుకుమారమైన బంగారు మొలనూలు ధరించావు. తీగలవంటి బాహువులుపై భుజకీర్తులు కంకణాలు మిలమిల లాడుతున్నవి. మృదువైన ఎడమచేతిలో చెరకువిల్లు ప్రకాశిస్తుండె. రత్నాంగు ళీయకములు పుష్పబాణాలు నీకుడిచేతిలో సొంపులు నింపుతున్నవి, స్తనమండలంపై విశేష ప్రకాశమానాలైన రత్నహారాలు, పాశాంకుశ భుజ భూషణాలతో వెలుగుజిమ్మే భుజాలు గలనీఅందమైన శరీరం, శరత్కాల చంద్రబింబాన్ని ధిక్కరించే నీ ముఖకాంతి, రత్నతాటంక కిరణాలు ప్రసరించే చెక్కిళ్లు, ఎడమచేతిలో పద్మం, కనుకొలకులలో కరుణాప్రవాహం, హారమణుల కాంతులతో ప్రకాశించు శంఖగాత్రం, నుదుటి చంద్రరేఖతో వెలుగు ముంగురులు, చిరునవ్వు మెరపులు, మనోహరనాసిక, పద్మదళా లను తిరస్కరించే నేత్రద్వయం, స్వర్ణ రత్నకిరీటం, సర్వాంగసుందరీ ! నిన్ను వర్ణించలేము. దయార్ద్ర చిత్తా! ఇంద్రవందితా ! యోగిజన హృదయహంసీ ! సింహాసనేశ్వరీ మహాత్రిపుర సుందరీ ! నా హృదయంలో స్థిరంగా వుండు. అనిభక్తితో స్తుతించిన దశరథుడు బయటకువచ్చి ఆతల్లి కుడిభాగంలోవున్న గౌరిని దర్శించాడు. సాష్టాంగ నమస్కారం చేసాడు. స్తుతించాడు, అమూల్య వస్త్రాలంకారాలను అమ్మకు అర్పించాడు. ప్రదక్షిణం చేసాడు. భార్యతో కలసి బయలకు వచ్చాడు. గుర్వాజ్ఞానుసారం మహాపూజ చేసాడు. ఏడురాత్రులు అక్కడవసించాడు. ఎనిమిదవరోజు దేవికి భక్తితో నమస్కరించాడు.

మనస్సులో తల్లీ ! నా కోరికతీర్చు అంటూ వేడుకున్నాడు. కామాక్షి ప్రసన్న అయింది. ఆకాశ వాణి రూపంగా అందిలా రాజా! నా అంశగల నలుగురు కుమారులు నీకు పుడతారు. 'ఆ మాటలు విన్న దశరధుడు పరమానందభరితుడయ్యాడు. సంతోషంతో ఆయన ముఖం విప్పారింది. నీవేశరణు! అంటూ సాష్టాంగం ఆచరించాడు. అమ్మ ఆజ్ఞ గైకొన్నాడు, అందరితో కూడి అయోధ్యకు చేరాడు. ఇది కామాక్షి విలాసం, ఆ తల్లి భక్తుల కోరికలు సంపూర్ణంగా తీరుస్తుంది. అనేకమంది ఆ తల్లిని భక్తితో పూజించి యిష్టకాములయ్యారు. ఇప్పటికీ అది జరుగుతూనే వుండె. భవ్యిత్తులోను ఇది జరుగుతుంది, నేనుగాని, త్రిమూర్తులుగాని మరెవ్వరైనా ఆ తల్లి మహిమలను వర్ణించలేరు. నేను చెప్పింది స్వల్పం, ఇది విన్న వారికి చదివిన వారికి వ్రాసిన వారికి సర్వపాపహరం అవుతుంది. అన్నాడు హయగ్రీవస్వామి.

స్వామి! ఈతల్లి యంత్రం, మంత్రం, ఉపదేశకుడు, శిష్యుడు, మొ విషయాలను తెలపవయ్యా! సర్వజ్ఞా! పరమపురుషా! అని అగస్త్యుడు అనగా విని స్వామి అన్నారు. అగస్త్యా ! శ్రీచక్రమేమంత్రం ఆమె త్రిపురాంబిక. మహాలక్ష్మి, ఆత్మజ్యోతి శ్రీచక్రాన్ని అర్చించిన శ్రీమహావిష్ణువు లోకాన్ని, మన్మథుని కూడమోహింపజేసే రూపం పొందాడు. ఈశానుడు పూజించి సకలవిద్యా నిధి అయినాడు. బ్రహ్మపూజించి బ్రహ్మాండాలను సృష్టించాడు.మన్మధుడు దానిని ఆరాధించి మునులను కూడ మోహంలోముంచాడు. బంగారము, వెండి, మొ. వానిలో శ్రీచక్రం నిర్మించి అమ్మ ఎదుట నుంచవలె. **16** అక్షరాల మంత్రంతో పూజించాలి. గంధము, తులసీ దళములతో అర్చించవలె, తేనె, నెయ్యి, శర్కర, పాయసం, అప్పాలు, మొ. నైవేద్యం చెల్లించాలి. అమ్మను సంతృప్తిపరచాలి అపుడు అమ్మ ప్రత్యక్షం అవుతుంది. కోరినది అనుగ్రహిస్తుంది. తెల్లని పుష్పాలతో పూజిస్తే వాని నాలుకపై సరస్వతి నాట్యం చేస్తుంది. తెలుపు+ఎరుపు ఎర్రనిపువ్వుల పూజ రాజవశ్యం, (పాటలపుష్పం=లేతెరుపు) పసుపురంగు పూలతో పూజించినచో శ్రీదేవి నిత్యము వాని హృదయంలో వసించివుంటుంది. సువాసనలేని పువ్వులు వ్యర్థం. కామాక్షి అనగా లలిత, ఈవిద్య పరావిద్య. శ్రీవిద్య శ్రీచక్రం, మంత్రరాజం అనబడు త్రిమూర్తుల శక్తియిదే. అన్ని మంత్రాలకు విద్యలకు ప్రాణశక్తియిదే. వంశపారంపర్యం లేక గురుపరంపర దీనికి ముఖ్యం. సంసార బంధాలను తెంచే మహావిద్యయిదే. పాపహారిణి, జరామృత్యు నాశిని, అర్చించినవారికి దుఃఖ, వ్యాధి, దరిద్రబాధలను తొలగి స్తుంది. స్తుతించిన వారికి సత్కార్యవిఘ్నాలను పోగొడుతుంది. ధ్యానించిన వారికి సర్వార్థాలను సిద్ధింప జేస్తుంది. ముద్రలతో, మంత్రదీక్షతో శ్రీదేవిని జపించి సేవించినవాడు పాపాలు నశించిఫలితాలు పొందుతాడు. బ్రహ్మ చర్యంతో తెల్లని వస్త్రంధరించి, తెల్లని పీఠంపై నున్న దేవిని తెల్లని పుష్పాలతో పూజించాలి. పెరుగన్నం, పాలన్నం వంటి తెల్లని నైవేద్యాలివ్వాలి.**16** అక్షరాల మంత్రం జపించాలి. జపం తలకిందులుగా కూడ చెయ్యాలి. జ్యోతిగా భావించాలి ఆతల్లిని, మనసులోగాని, పెదవులతోగాని ధ్వని



స్పష్టముగా గాని వుండే విధంగా జపం చెయ్యవచ్చు. న్యాసం చెయ్యాలి. లక్ష జపం చేస్తే మహాపాపవిముక్తి, **2** లక్షలు చేస్తే **7** జన్మలపాపాలు పోతాయి. **3** లక్షలవల్ల వేయిజన్మల పాపాలు నశిస్తాయి, **16** లక్షలు చేస్తే దేవీసాన్నిధ్యం నిత్యము **3** వేళల పూజముఖ్యం. జప,తర్పణ,హోమ,బ్రాహ్మణ సమారాధ నలు కావించాలి. హోమ తర్పణాలకు స్వాహాఅని చెప్పాలి. న్యాసపూజకు నమః చెప్పాలి, (మంత్రంచివర) కాలం కలసి రానప్పుడు హోమతర్పణాలకు రెట్టింపు జపం చెయ్యాలి. (హోమం తర్పణం చెయ్యలేనపుడు)

కామ్యప్రయోగం (కోరికతో చేయుట) కోసం, **3** లక్షలు అధిక జపం చెయ్యాలి. తరువాత నిత్య త్రికాలపూజాసక్తుడు కావలె. ఆ తరువాత వశ్య కర్మలసిద్ధి లభిస్తుంది. శ్రీదేవిని పూజించి, చక్రమధ్యమందుండి, తాను ఎర్రని సాధ్యునిగా తలచి ధ్యానించన వాడు సర్వసౌభాగ్య సుందరుడవుతాడు. సర్వలోకవశం కలిగి, లోకాలకిష్టుడవుతాడు, నిస్సందేహంగా **108**మార్లు జపించి గోరోచనం కుంకుమ సమభాగములుగా నూరి తిలకం ధరించాలి. దానివల్ల తాను చూచినవాణ్ణి, తాకిన వానిని, తలచిన వానిని ధనములతో సహా దాసునిచేసుకుంటాడు. **108** మార్లుజపించి, పుష్పము,ఫలము, గంధము, మధురరసము, వస్త్రము మొ. ఏ స్త్రీకి పంపినా ఆ స్త్రీ తక్షణం మోహంతో ఆకర్షించబడుతుంది. రహస్యంగా భూమిపై గోరోచనంతో ఒక సురూప శృంగార వేషభూషలతో ఒక స్త్రీ మూర్తిని చిత్రించాలి. నుదురు, కంఠం, హృదయం, నాభి, పిక్కలు మొ॥ అవయవములలో మన్మధ బీజాలు వ్రాయాలి. ఆమెవున్న దిక్కున కెదురుగా కూర్చుండి త్రిపురాంబనే తన ఆకారంగా భావించాలి. చంద్ర సూర్య కాంతులు నిండిన అగ్ని గృహంలో 'క్షోభిణీముద్ర' ధరించి **108** మార్లు జపం చెయ్యాలి. తరువాత తాను తలచిన స్త్రీ మన్మధ బాధతో కన్నులు మదనతాపంతో సగంవాలుస్తుంది. మన్మథబాణాలతో పీడించబడుతుంది.దాని పిరుదులు ఎగిసిపడి ఉబ్బెత్తుగా వెలుగు మన్మథవికాసమా అన్నట్లుమారుతాయి. శక్తిచక్రంలో ప్రకాశించే కిరణ చక్రాలతో మింగివేయబడినట్లవుతుంది. తన సుశీల స్వభావం కనుమరుగ వుతుంది. సిగ్గును చిదిమివేస్తుంది. రెచ్చిపోతుంది, మంత్ర, యంత్ర, ఔషధ, మహాముద్రలనే గొలుసులతో బంధించబడినది అవుతుంది. కొంగ్రొత్త ప్రేమను కలపడంలో కంపించే హృదయపద్మం కలది అవుతుంది. (దాని గుండె దడదడ కొట్టుకుంటుంది.) మనస్సునకు మించిన మహామం త్రాన్ని జపిస్తుంది. దాని కొంగు జారిపోతుంది. విశేషమోహిత, అతిక్షోభిత, కామాగ్ని దగ్ధ, ఆశ్చర్యచకిత, చిత్రాకృతి, చైతన్య హీన, మదన మదిత, సువిలీన, నిశ్చేష్టఅవుతుంది. తన్ను తాను మరుస్తుంది. అన్యస్త్రీగా భావిస్తుంది.

మంత్రవాయువు చేత ఎగరగొట్టబడిన వెదురుటాకువలె ఆకాశంలో తిరుగు తున్న నూరుయోజనాల (**800**మై.) స్త్రీని భావించాలి. తరువాత పర్వతాలు, అడవు లతో కూడి, చక్రమధ్యంలో వున్నభూమిని నాలుగు సముద్రాల పర్యంతం మండుతున్న

దానినిగా ధ్యానంలో చూడాలి. అపుడు తాను ఆరుమాసాలు యోగాభ్యాసంచేస్తే మన్మథునితో సమానుడవుతాడు. తన చూపుమాత్రంచేత లోకాన్ని ఆకర్షిస్తాడు. వశపరచుకుంటాడు, తాను చూచిన స్త్రీని క్షోభింపజేస్తాడు. తన చూపు మాత్రంచేతనే విషాన్ని కూడ హరించివేస్తాడు. బ్రహ్మగామారగలడు, సర్వాన్నీ మోహింపజేస్తాడు. పసుపు పచ్చని ద్రవ్యంతో వ్రాసిన చక్రాన్నీ రహస్యంగాధరిస్తే తనతో వాదించే వారిని కదలకుండా చేయగలడు. నిస్సందేహంగా వాక్స్తంభన గావిస్తాడు. మహాదేవీ రసంతో శత్రువుపేరు వ్రాసి దక్షిణంగా తిరిగి దాని అగ్నిలోకాలుస్తే శత్రువు చనిపోతాడు, దున్నపోతుపేడ, గుర్రపులద్దె గోమూత్రంలో కలిపి శత్రువు పేరువ్రాసిన చక్రం అన్నంలోవుంచితే, శత్రువులకు పరస్పర వైరం కలుగుతుంది. కాకిరెక్కతో గోరచనంతో వ్రాసిన చక్రం తాను ధరిస్తే శత్రువు ఆకాశంలో కాకివలె వ్రేలాడతాడు. ఇది గొప్ప ఉచ్చాటన. పాలు, లక్కరసం, గోరోచనం, మహానీలీ రసంకలిపి వ్రాసిన చక్రంధరిస్తే నాలుగు జాతులవారు వశం అవుతారు. ఇదే చక్రం జలమధ్యంలో వుంచితే తనకు సాటిలేని స్నాన పానాలవల్ల సౌభాగ్యం కలుగుతుంది. ఇది నిశ్చయం. దేశం, నగరం, పరస్త్రీలను చక్రమధ్యంలో వున్నట్లు ధ్యానం చేస్తే ఏడురోజులలో వారిని క్షోభింపజేయగలడు. పచ్చవర్ణంతో చక్రం వ్రాసి తూర్పుగా తిరిగి పూజిస్తే ప్రతివాదులందరిని స్తంభింపజేస్తాడు. సింధూరవర్ణంతో చక్రం వ్రాసి ఉత్తర ముఖంగా తిరిగి పూజచేస్తే అనుకొన్నప్పుడల్లా, లోకం వశం అవుతుంది. గైరికధాతువుతో చక్రం వ్రాసి పడమరగా తిరిగి పూజిస్తే, సర్వాంగములను ఆకర్షించి, క్షోభింపచేసిన వశంచేసుకుంటాడు. రహస్యంగా, ఒంటరిగా పర్వతంపై తిరుగుతూ చక్రాన్ని పూజిస్తే ముసలితనం, చావుండదు. నిస్సందేహం.

ఇది రహస్యం శ్రీమంత్రరాజం రహస్యంగా జపించాలి. సర్వసిద్ధులు దానివలన లభిస్తాయి. రహస్యంబయటపెడితే భ్రంశం అవుతుంది. పురశ్చరణ చేయకుండా పురుషుడు ఏపనిచేసినా అమ్మశాపం తగులుతుంది. సిద్ధివుండదు, ప్రయోగం శాంతించాలంటే లక్షజపం చెయ్యాలి. విధివిధా నంగా పూజించాలి. భక్తితో, కోరికలు లేకుండా నిత్యము శ్రీదేవినిపూజిస్తే, యధాశక్తి ఆమెనే ధ్యానిస్తే అట్టివాని ఇహలోక భారం ఆతల్లి వహించి ముక్తిని కూడా యిస్తుంది. వానిదగ్గర వుండి వానికి సమస్తం చెబుతుంది. దూడపై ప్రేమతో ఆవుదూడను వెంబడించినట్లే శరణుకోరిన భక్తుని దేవి వెంబడిస్తూంటుంది ఇహ. పరభావం ఆతల్లి యందేవుంచి, ఆమెయందే మనసు లగ్నం చేసిన వారు అనుకూలమైన ప్రజలుగలవారవుతారు. వారికి వ్యతిరేకు లే వుండరు. నన్నురక్షించేవారులేరు, నీవొక్కతేవే నన్ను రక్షిస్తావు అని గట్టిగా తలచి నన్ను రక్షించు అని కోరినవానిని ఆ తల్లి తప్పక రక్షించగలదు. ఈ విశ్వాసము ముఖ్యప్రయోజనమైనది. ఆమె యందు సేవాతత్పరత, శరణాగతి చాలా అవసరం. ఎవరు నిందించినా, మెచ్చినా అమ్మకే అర్పించి శరణాగతి పొందినచో దుఃఖములేదు. బాధాలేదు. శరణాగతి ఆరు విధాలు. అనుకూలముయొక్క సంకల్పం,



ప్రతికూలంవదలి వేయడం, రక్షింపగలదు అనే విశ్వాసం, రక్షించు శక్తిని ఎన్నుకొనుట, ఆత్మనిక్షేపం, కార్పణ్యం అనేవే అవి. ఆత్మనిక్షేపం అంగీకరిస్తే పంచాంగములను సమర్పించాలి. దీనికి సమానమైన భక్తిముక్తుల సాధనలేదు. గర్వం వుండరాదు. కపటం పనికి రాదు. అహింస, శాంతి, వంకరబుద్ధిలేకుండుట, గురుపూజ, శుచి, స్థిరత్వము, స్వాధీనమైన ఆత్మ,శబ్ద స్పర్శరూపరస గంధములందు వైరాగ్యం, అహంకారం లేకుండుట, పుట్టుక, మరణము, ముసలితనము, రోగముల బాధలను దోషముగా భావించుట, సతీసుత గృహములను అంటిపెట్టు కొనకుండుట, ఇష్ట అనిష్టములందు నిత్యసమభావము, తనదైవము నందు స్థిరభావము, అన్యభావములేని భక్తి, ఏకాంతము, జనసమూహము నందు ఆసక్తిలేకుండుట, నిత్య అధ్యాత్మ జ్ఞానము, అనేవి జ్ఞాన సాధనాలు, ఎల్లపుడు వీటిని అభ్యసించాలి దేవీకర్మలు చేసేవాడు, ఆ తల్లి పరాశక్తి అనిభావించేవాడు, సంగములు లేనివాడు, అన్ని ప్రాణుల యందు ప్రేమగలవాడు, మోక్షం పొందు, బుద్ధిమంతుడగు గురువు రహస్యంగా ఆగమాలు ఉపదేశిస్తాడు. అట్టివాళ్ల మేమని మిద్దరం. అన్నాడు హయగ్రీవస్వామి అగస్త్యునితో.

అగస్త్యుడానందించాడు స్వామినికోరాడు. లలితామంత్రోపాసన చేసే వారికి దేవి అనుగ్రహం కలగడానికి కావలసిన ముద్రలు తెలుపమన్నాడు. ఆవాహనీ, సంక్షోభిణి, విద్రావిణి, ఆకర్షిణి, ఉన్మాదిని, మహాంకుశ, ఖేచరి, బీజయోని అనే 9 ముద్రలు గురుముఖంగా తెలుసుకుని వినియోగించు కోవాలి అంటూ హయగ్రీవ స్వామితెలిపారు. తరువాత సహస్రాక్షరీ విద్య (1000 అక్షరాలుగలది) వివరించారు. అదే శ్రీదేవి ఖడ్గమాల. ఇది అందరికి తెలిసినదే. భక్తులు పారయణ జేస్తున్నదే. లలితా సహస్రనామస్తోత్రం అనే గ్రంథంలో ప్రచురించబడినదే ఇక తెలుసుకొనవల సినది గురుశిష్య సంబంధం ఎటువంటిది అనే విషయం మనం తెలుసు కొనాలి. 1. స్పర్శదీక్ష గురువు శిష్యుని శరీరాన్ని తాకాలి. గురువు కన్నులు మూసుకొని అమ్మవారిని ధ్యానంచేసి, ప్రసన్న బుద్ధితో శిష్యుని వైపు బాగుగా చూడాలి. ఇది రెండవది. దృగ్దీక్ష. 3. గురువు చూచుటవల్ల మాట్లాడుట వల్ల తాకుటవల్ల వెంటనే జ్ఞానంకలుగుతుంది. ఇది శాంభవీదీక్ష. దేవి యొక్క శరీరం, గురువు శరీరం ఈ రెండూ, ఒకటే. ఏమాత్రం తేడాలేదు. గురుని అనుగ్రహంవల్ల శిష్యుడు గురువు రూపంలో ప్రకాశిస్తాడు. 5. చాలాకాలం గురువును చక్కగా సేవిస్తే గురువు సంతోషిస్తాడు. శిష్యుని తన మనస్సులో జ్ఞాపకంచేసుకుంటూ వుంటాడు. దీనిని మానసీ దీక్ష అంటారు. అన్ని దీక్షలలోను ఇది ఉత్తమోత్తమం. ఇక క్రియాదీక్షను తెలుసు కోవాలి. ఈదీక్షావిధానం నవావరణార్చన అనబడుతుంది. ఇందలి మంత్ర తంత్రా లన్నీ గురువుద్వారా నేర్చుకొనవలసినవే. చదివి తెలుసుకోలేరు. తదుపరి అమ్మవారి మంత్రార్థం. ఇదంతా గురువునుండి నేర్చుకొనవలసిందే, చదివినంతా మాత్రం చేత అర్థంకాదు. పూర్ణదీక్షాపరుడైన గురువు దీనికి చాలాఅవసరం. గురుకృపకలిగితే అరక్షణంలో మోక్షంలభిస్తుంది. సంసార తారకుడైన అట్టి గురువు సామాన్యంగా

లభించడు. గు=అంధకారం (అజ్ఞానమనే చీకటి)రు=నాశనం చేసేది. ఇదే గురుశబ్దార్థం.

దేవీమంత్రం జపించేవారికి శుభస్వప్నాలు వస్తే మహాఫలం కలుగు తుంది. చెడ్డకలవస్తే **1008** సార్లు అమ్మజపం చేయాలి. జ్ఞానియైన గురువు లభించడం మన అదృష్టం. గురువు కఠినంగా మాట్లాడినా ఆశీస్సులుగా స్వీకరించాలి. గురువుకు నమస్కరించడం చాలాముఖ్యం, లౌకికం, వైదికం, ఆధ్యాత్మిక జ్ఞానం (చివరగా) పొందవలె. గురుభక్తి సదాచారం అవుతుంది. గురువునకు ద్రోహం చేయడం మహాపాపం అవుతుంది. గురువు అడుగు జాడల్లో మనం నడవాలి. వారి అడుగు జాడలు మనల్ని తరింపజేసి ముక్తినిస్తాయి. శరీరం ఉన్నంతవరకు ఈ ధర్మం ఆచరించాలి. గురువు ఎదుట అబద్ధమాడితే గోబ్రాహ్మణ వధ కంటే మహాపాపం మనకు సంభవిస్తుంది. బ్రహ్మ మొదలు గడ్డిపోచ వరకు అంతా గురుసంతానమే. అట్టి గురువు శిష్యునకు పూజ్యుడు. శీల సంపదగలిగి గురుశాసనం శిరోధార్యంగా భావించి ఆచరించువాడే నిజమైన శిష్యుడు. జపంవల్ల అలసి పోతే ధ్యానం చెయ్యాలి. ధ్యానంవల్ల అలసిపోతే జపం చెయ్యాలి. అపుడు మంత్రం తొందరగా సిద్ధిస్తుంది. కన్నులుమూసుకొని జపం చెయ్యాలి. మనస్సులో ఆలోచనలు రాకూడదు. అదేధ్యానం అనబడుతుంది. కోటి పూజలకంటె ఒక స్తోత్రం గొప్పది. కోటి స్తోత్రాలకంటె జపం గొప్పది. కోటి జపం కంటె ధ్యానం గొప్పది. కోటి ధ్యానాలకంటె మనస్సు పరమాత్మలో కలవడం గొప్పది. ప్రతిరోజు చేసే అర్చన పగలు చెయ్యాలి. ఏదైనా ప్రత్యేక కారణంగా చేసేది రాత్రి చెయ్యాలి కోరికతో చేసే అర్చన పగలు, రాత్రి కూడా చెయ్యాలి. అనేక కోట్ల దానాలు, వ్రతాలు, యజ్ఞాలు చేసిన తరవాతనే అమ్మవారి పాదపద్మాల యందుభక్తి కలుగుతుంది. శరీరం ఉన్నంత వరకు వర్ణాశ్రమ ఆచారాలు విడవకూడదు. గురువునోట ఏమాట వచ్చినా అది శాస్త్రవచనం అవు తుంది. గురువు ఆజ్ఞాపిస్తే ఆపని చేయకూడనిదైనా వెంటనే చేసెయ్యాలి. ఉత్తమజాతి, విద్యా,ధనాలు గలవాడైనా సరే గురువు కనబడగానే సాష్టాంగ నమస్కారంచేసి ఆయనకు ప్రదక్షిణం చెయ్యాలి. కనపబడేదంతా గురువే అని నమస్కరించాలి. ఆయన ప్రతిమ మట్టిదైనా నమస్కరించాలి. గురువును ధిక్కరించకు, నీవు అని పలుకకు, వాదంలో బ్రాహ్మణుని జయించకు, శాస్త్ర రహస్యాలు బయట పెట్టకు అలాచేస్తే నువ్వు బ్రహ్మరాక్షసుడవై పుడతావు. నేను గురువంతటి వాడను అని భావించకు. ఒకే గ్రామంలో వున్న గురువుకు మూడు వేళల నమస్కరించు, **2**మై. దూరంలోవున్న గురువుకు ప్రతిరోజు నమస్కరించు, **4**మై. దూరంలోవున్న గురువుకు పంచపర్వాలలోను నమస్కరించు, **8-9** మై. దూరంలోవున్న గురువుకు అదే సంఖ్యల ప్రకారం నమస్కరించు గురువు చాలా దూరంలో వుంటే తనకు బుద్ధిపుట్టినపుడు గురువు వద్దకు వెళ్లు. ఫలపుష్ప వస్త్రాలతోవెళ్లి అవి ఆయనకు సమర్పించు, శివుడే మనుష్య రూపంలో రహస్యంగా పుట్టి గురువవనబడుతున్నారు.



భక్త రక్షణ చేస్తున్నాడు శిష్యులను అనుగ్రహిస్తున్నాడు. ఆకారంలేనివాడు శివుడు ఆకారం గలవాడు గురువు. ఇద్దరికి ఏమాత్రం భేదంలేదు. గురువు దయానిధి, లోకంలో సంసారివలె ప్రవర్తిస్తున్నాడు. మూడుకన్నులులేని శివుడు, నాలుగు భుజాలు లేని విష్ణువు, నాలుగు ముఖాలులేని బ్రహ్మగా గురువు ప్రకాశిస్తున్నాడు. ఉదయించే సూర్యుని గుడ్డివాడు చూడలేడు. అట్లే కన్నుల ఎదుట నున్న గురువును దురదృష్ట వంతులు చూడలేరు. గురువును, గురుపత్నిని తల్లిదండ్రు లతో సమానంగా భావించాలి. ధ్యానించాలి, అమ్మవారు జ్యోతిస్వరూపం. ఆవిధంగా ఆమెను దర్శించడం నేర్చుకొనవలె. దానికి గురువు చాలా అవసరం. మంత్రంతోగాని, మంత్రంలేకగాని, అమ్మవారిని అర్చించిన స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మొ.వారు మోక్షం పొందుతారు. పూజాద్రవ్యాల కోసం వెంపరలాడకూడదు. శక్తివుండి అర్చించని వారు పాపులు. కలిగినంత వరకే పూజాద్రవ్యాలతో పూజించినవారు పుణ్యాత్ములు. ఇది సంగ్రహంగా వివరించా,అంటూ హయగ్రీవస్వామి ముగించారు. అగస్త్య మహర్షి తన్మయు డయ్యాడు.

## శ్రీ లలితా త్రిపుర సుందరీ మందిరము

– అంబడిపూడి సుబ్రహ్మణ్యశాస్త్రి



అశోక్ మణిపురి కాలనీ హైదరాబాద్‌లోని సైనిక్‌పురికి **1.5** కి.మీ. దూరంలో కాప్రా చెరువునకు తూర్పుదిక్కున ఉంది. ఈ కాలనీకి అశోక్‌మణిపురి అని నామకరణము. మణిపురి అంటే శ్రీమాత నివాసస్థలం. అశోక్ అనేది శోకములేకుండా అనగా ఇచ్చట నివసించే వారికి ఎటువంటి శోకబాధ లేకుండు నట్లుగా చేయబడినది. ఈ కాలనీలో శ్రీలలితాత్రిపుర సుందరీ ఆలయము శ్రీదేవ్యాంబా సమేత రమానందనాథ దీక్షానామధేయులచే సం॥ **2000**న ప్రతిష్ఠింపబడి, భక్తుల కోర్కెల నీడేరుస్తూ వారి పాలిటి కల్పతరువై,నమ్మినవారికి కామధేనువై విలసిల్లుతోంది.

శ్రీమాతృ కృపాభిలాషి పరమహంస పరివ్రాజకాచార్య అనంత శ్రీ విభూషిత భగవాన్ శ్రీశ్రీశ్రీ హరిహరానంద సరస్వతి (శ్రీకరపత్ర స్వామి) దీక్షానామ శ్రీ షోడశానందనాథ శిష్యపరమాణువు శ్రీశ్రీశ్రీ నారాయణానందనాథ పాదాంబుజ రేణువు శ్రీదేవ్యాంబా సమేత శ్రీరమానందనాథ దీక్షానామధేయులచే ఆనాటికే సిద్ధిపొందియున్న తమగురువులందు కృతజ్ఞతాపూర్వక నివేదనముగా నారాయణానందనాథ తపోవన ప్రతిష్ఠ ది॥ **21-10-96** ఆశ్వీయుజ శుద్ధదశమి సోమవారం ఉదయం గం. **11.49** ని.లకు ధనిష్ఠా నక్షత్రయుక్త ధనుర్లగ్నమందు విజయదశమి పర్వదినమున ఏకాదశ వేదపండితులచే వేదపారాయణలతో పదకొండు బిల్వవృక్షాలను నాటించి అంకురార్పణ గావించబడింది. అలా నాటిని బిల్వవృక్షాలు రెండు సంవత్సరాలు గడచినా తగువృద్ధి చెందకుండా ఉండటం వలన పరితాపతప్తులైన శ్రీరమానంద నాథులను అమ్మ ఆలయ నిర్మాణమునకు ఆజ్ఞఇచ్చింది. శ్రీలలితా త్రిపుర సుందరీదేవి శ్రీశ్రీశ్రీ నారాయ ణానంద కంచికామకోటి పరమగురువు శ్రీశ్రీశ్రీ

చంద్రశేఖర సరస్వతీ, మహా వతార్‌బాబాజీ దివ్య ప్రేరణచే ప్రమాధినామ సంవత్సర వైశాఖశుద్ధ సప్తమి గురువారము అనగా 22-04-1999 ఉ॥ గం॥ 8-9 ని॥లకు పునర్వసు నక్షత్రయుక్త పుష్కరాంశమందు శ్రీమాత లలితా త్రిపురసుందరీదేవి ఆలయానికి దైవజ్ఞుల సమక్షంలో వేదఘోషతో యజ్ఞయాగాది క్రతువులతో వైదిక ధర్మాను సారం శంకుస్థాపన జరుపబడి, తే.20-3-2000 ఉ॥10-19 ని॥లకు ఫాల్గుణ శుద్ధపాడ్యమి సరియగు పాడ్యమి సోమవారంనాడు వృషభలగ్నమందు శక్తిపంచాయతనంతో శ్రీలలితామహాత్రిపురసుందరీ మూలవిరాట్ గణపతి, సూర్య, విష్ణు, శివ అంగదేవతలుగా శ్రీసుబ్రహ్మణ్య, వీరాంజనేయ క్షేత్రపాలకు లుగా ప్రతిష్ఠ గావింపబడినది. గుడిగోపురము మీద అష్టదిక్పాలకులు, బ్రహ్మ, హయగ్రీవ, దక్షిణా మూర్తి, మొదటి ఆవరణలో, రెండవ ఆవరణలో బ్రహ్మ, లక్ష్మి, మహేశ్వరీ, మండపముమీద కంచికామకోటి పీఠాధిపతులు పరమా చార్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ, ఆదిశంకరులు శ్రీహరిహరానంద సరస్వతీ, శ్రీ నారాయణా నందనాథ విగ్రహాలు చెక్కబడ్డాయి. ప్రతిష్ఠానంతరం ఆరోజు సాయంత్రం మాతృ సేవలో పాలుపంచుకొనుటకు శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు స్వయంగా అరుదెంచిన రీతిలో ఒక నాగుపాము ప్రదోష కాలంలో ఆలయమందు ప్రవేశించి మాతృమూర్తికి ప్రదక్షిణ గావించి అచ్చట జరుగుతున్న శ్రీలలితాసహస్రనామ పారాయణము ఆలకించి సుమారు మూడుగంటలపాటు అందే ఉండి రాత్రి 10గం॥30 ని॥ల సమయంలో అంతర్ధాన మయ్యింది. నాటినుండి అభిషేక, నవావరణపూజ, సహస్ర నామపారా యణలతో శోభిల్లుతూ అంబ తన కటాక్ష వీక్షణములతో ఎక్కడో హృదయపు అట్టడుగు పొరలలోనున్న భక్తిని పెళ్ళగించి ప్రకాశింపజేయుచున్నది. అశోక్‌మణిపురి కాలనీ నుండియే కాక దూరప్రాంతములందున్న భక్తులను సైతము ఆకర్షిస్తూ దినదిన ప్రవర్ధ మానంగా వెలుగొందుతూ మమ్ములను ఎల్లవేళలా నీడలా కాపాడుతున్న ఆ మాతృమూర్తికి శతసహస్రకోటి వందనాలు.

### లలితాంబికా జ్ఞాన యజ్ఞ తపోవనము

ఎన్.హెచ్.7; గొల్లపల్లిగ్రామము, జడ్చర్లసమీపమున, మహబూబ్‌నగర్‌జిల్లా

ఆంధ్ర ఆధ్యాత్మిక పితామహులు శుష్కవేదాంత, తమో భాస్కరులు శ్రీ వ్యాసా శ్రమసంస్థాపకులు, మహర్షిసద్గురు శ్రీమలయాళ స్వాములవారు ఆంధ్రదేశ నలు మూలలలో సాంఘిక, ఆధ్యాత్మిక, జాగరణ చేసిన కృషి తమంద రికి తెలిసిన విషయమే. ఆ మహనీయుడు చూపిన మార్గమున పయనించడము మనకర్తవ్యం తెలంగాణా మహబూబ్‌నగర్‌జిల్లా, జడచర్ల ప్రముఖ వ్యాపార కేంద్ర సమీపమున 7వ జాతీయ రహదారి ప్రక్కన(జడచర్లకు 5కి.మీ.ఉండగా) శ్రీమలయాళస్వామి లలితాంబికా తపోవనము 5.20 ఎకరాల్లో నిర్మించినారు.

అనేక జన్మల పుణ్యపరిపాకముచే ఈ దివ్యమైన సదవకాశము శ్రీ లలితా పరమేశ్వరీ తపోవనము సేవచేయు భాగ్యము లభించినది. లలిత యనగా తల్లి ఆ



బ్రహ్మ కీటజననీ, బ్రహ్మామొదలు 33కోట్లు దేవతలకు తల్లి మనకున్న దంతా ఆమెదే, అమ్మ ఇచ్చినదే శ్రీజగన్మాత మందిరమునకు తమశక్తి కొలది ధన, వస్తురూపేణ సహకరించిన శ్రీమాత అనుగ్రహమునకు పాత్రులమై సర్వ దుఃఖముల నుండి విముక్తి నొందగలము. పరమహంస పరివ్రాజాకాచార్యుల పూజ్యశ్రీ రామేశ్వరానంద స్వాములవారి ఆధ్వర్యములో జరిగినవి.

తపోవన ముఖ్యమందిరమున శ్రీసద్గురు మలయాళస్వామి శ్రీచక్రసహిత జగన్మాత శ్రీలలితాదేవి, శ్రీచక్రయుక్తముగా శివలింగము ప్రతిష్ఠించ బడినది. క్రిందిభాగమున శ్రీగణపతి శ్రీవేంకటేశ్వరస్వామి శ్రీ శిరిడి సాయిబాబా విగ్రహ ములు ప్రతిష్ఠించబడినవి. శ్రీమురళీకృష్ణ, సుబ్రహ్మణ్య, సీతారామ లక్ష్మణ ఆంజనేయసహిత నవగ్రహ శ్రీనాగదేవతా విగ్రహములు కలవు. మరియు ఈ తపోవనములో 1.ధ్యానయోగకేంద్రము 2. వృద్ధాశ్రమము 3. అనాథ శరణాలయము 4. నేత్రవైద్యశాల 5. బ్రహ్మవిద్యాపాఠశాల 6. అన్నపూర్ణ నిలయము నిత్యాన్నదాన క్షేత్రము 7. రిటైర్డ్ ఆఫీసర్స్ వానప్రస్థాశ్రమము 8. శ్రీ సద్గురు సాధునిలయం శ్రీ గురు కృప కలవు.

ఇట్లు
ఆశ్రమ మేనేజర్

### లలితా దేవి పూజా, తిథివారాలు, నైవేద్యాలు - ఫలాలు

పాడ్యమినాడు ఆజ్యంతో దేవిని అర్చించి బ్రాహ్మణులకు నెయ్యిదానం చేస్తే దాతకు రోగపీడలు తొలగిపోతాయి. విదియరోజున చక్కరతో పూజించాలి. విప్రులకు చక్కెర దానంచెయ్యాలి. దాత దీర్ఘాయుష్మంతుడు అవుతాడు. తదియనాడు పాలతో అభిషేకించి బ్రాహ్మణులకు క్షీరదానం చేస్తే దాతలకు సర్వదుఃఖాలూ తొలగిపోతాయి. చవితినాడు పిండివంటలతో దేవిని ఉపాసించి ద్విజులకు వాటిని దానంచేస్తే దాతల కార్యక్రమాలు నిర్విఘ్నంగా జయప్రదమవుతాయి. పంచమిరోజున అరటిపండ్లు నివేదించి అవే విద్వాంసులకు దానం చెయ్యాలి. దాతకు మేధావికాసం కలుగుతుంది. షష్ఠి తిథినాడు తేనెను అమ్మవారికి నివేదనచేసి వేదవిదులకు దానంచేస్తే దాత అంతటి కాంతిమంతుడు అవుతాడు. సప్తమినాడు బెల్లం నైవేద్యం పెట్టి బ్రాహ్మణులకు దానంచేస్తే దాత శోకవిముక్తుడవుతాడు. అష్టమినాడు కొబ్బరికాయలు కొట్టి నివేదిం చాలి. బ్రాహ్మణులకు దానంచెయ్యాలి. దాతలకు తాపాలు నశిస్తాయి. నవమినాడు పేలాలు నైవేద్యం పెట్టి విప్రులకు ఇస్తే దాతలు ఇహంలోనూ పరంలోనూ సుఖసంపన్ను లవుతారు. దశమినాడు నల్లటినువ్వులను జగదంబికకు నివేదనచేసి బ్రాహ్మణు లకు దానంఇస్తే దాతలు ఇక యమలోకభయమే ఉండదు. ఏకాదశినాడు పెరుగు నివేదించి దానంచేస్తే అతడు అమ్మవారికి అత్యంతాప్తుడు అవుతాడు. ద్వాదశినాడు అటుకులు నివేదించి వాటిని బ్రాహ్మణులకు సమర్పించినవారు కూడా దేవికి ప్రేమపాత్రులు

అవుతారు. త్రయోదశిరోజున సెనగపప్పు నివేదన చేసి దానంగా ఇచ్చినవారికి దుష్టగ్రహపీడలు తొలగిపోతాయి. చతుర్దశినాడు పెరుగులో పేలపిండి కలిపి నివేదన దానాలు చేసినవారు శివుడికి ఆప్తులు అవుతారు. పున్నమినాడు పాయసంవండి అమ్మవారికి నైవేద్యం పెట్టి బ్రాహ్మణు లకు సమర్పించినవారు తమ పితృదేవతలను ఉద్ధరించినవారు అవుతారు ఆదేరోజున దేవీప్రీతికోసం హవనం చెయ్యాలి.

నారదా! వారాలకు కూడా కొన్ని విశేషాలున్నాయి. ఆదివారంనాడు పాయసం, సోమవారంనాడు పాలు, మంగళవారంనాడు అరటిపండ్లు, బుధవారంనాడు వెన్న, గురువారంనాడు కలకండ, శుక్రవారంనాడు చక్కెర, శనివారం నాడు ఆవునెయ్యి అమ్మవారికి నివేదనచేస్తే విశేషంగా ఫలప్రదాలు అవుతాయి. అరిష్టాలు తొలగి పోతాయి. ఇరవైయేడు నక్షత్రాలకు కూడా ఇలాగే విశేషార్చనలున్నాయి. పాలు, పెరుగు, చక్కెర, పటికబెల్లం, నెయ్యి,నూలు మొదలైనవి ఆయా నక్షత్రాలలో అమ్మవారికి నివేదనచేసి విప్రులకు దానం చెయ్యాలి. విష్కంభాది యోగాలకూ ఇలాగే బెల్లం, నెయ్యి, తేనె, పాలు, పెరుగు, చల్లబూరెలు, ఉండ్రాళ్ళు, కజ్జికాయలు, వెన్న, దోస, గుమ్మడి, పనస, అరటి, నేరేడు, మామిడి, నారింజ, దానిమ్మ, రేగు, ఉసిరిక, కొబ్బరి, సెనగలు, అటుకులు, పాయసం, ఇత్యాదులు నివేదన చెయ్యాలి. లడ్డూలు ఉండ్రాళ్ళు నెయ్యి మొదలైనవి కరణాలలో యోగాలలో నైవేద్యం పెట్టాలి.

మధూకపూజ అని మరొక విధానం ఉంది. చైత్రశుద్ధ మొదలుకొని అన్ని నెలల్లోనూ తదియనాడు శుచిగా మధూకవృక్షం క్రింద (ఇప్పచెట్టు) మహాదేవికి షోడశోపచారపూజలు ఆచరించాలి. చైత్రశుద్ధ తృతీయనాడు పంచఖాద్యాలు నివేదన చెయ్యాలి. వైశాఖశుద్ధ తృతీయనాడు గుయుక్తంగా నైవేద్యం పెట్టాలి. తరవాత నెలల్లో వరసగా తేనె, వెన్న, పెరుగు, చక్కెర, పాయసం, పాలు, ఫేణి, దధికూర్చిక, ఆవునెయ్యి, కొబ్బరికాయలతో కూడిన నివేదనలు పెట్టాలి. పన్నెండునెలలకూ అమ్మ వారికి పన్నెండు విశిష్టరూపాలూ నామాలు ఉన్నాయి. మంగళ, వైష్ణవి, మాయ, కాళరాత్రి, దురత్యయ,మహామాయ, మాతంగి, కాళి, కమలవాసిని, శివ, సహస్ర చరణ, సర్వమంగళ అనే పేర్లతో మధూక వృక్షం క్రింద అర్చించాలి. ఇలా చేసినవారికి అన్ని కోరికలూ తీరుతాయి. అమ్మవారు భక్తులపాలిటి కల్పవృక్షం కదా! ఇలా అర్చించి మొక్కినవారికి కొంగుబంగారం అవుతుంది.

## శ్రీ లలితాసహస్రనామ స్తోత్ర పారాయణ వలన ఏయే దైవశక్తులు ఎలాంటి సత్ఫలాన్ని అందిస్తారు ?

శ్రీలలితా సహస్రనామాన్ని భక్తిశ్రద్ధలతో పఠించేవారిపై అభిచార ప్రయోగం చేసినట్లయితే, లలితాదేవి ఆదేశంపై ప్రత్యంగిరా మంత్రము తనంతటతానే ఆ ప్రక్రియను వెనుకకు మరలించి ఆ ప్రయోగించిన వ్యక్తిని సంహరిస్తుంది.

శ్రీ లలితా సహస్రనామాన్ని భక్తి శ్రద్ధలతో పఠించేవారి గుప్తశత్రువులను శరభేశ్వ రుడు నాశనమొనరుస్తాడు. శ్రీలలితా సహస్రనామాన్ని పారాయణచేసినవారితో



ఎంతటి పండితుడైనా వాదిస్తే అతనికి నకులేశ్వరీదేవి వాక్కును స్థంభింపజేస్తుంది. శ్రీ లలితా సహస్రనామాన్ని ఆరునెలలపాటు భక్తి శ్రద్ధలతో పారాయణ చేసినవారింట లక్ష్మీదేవి సుస్థిరనివాసమేర్పరుచుకుంటుంది. శ్రీ లలితాసహస్రనామాన్ని ఒకనెలపాటు రోజూమూడుమార్లు పఠించేవారింట సిరిసంపదలు దినదిన ప్రవర్ధమానంగా ఉంటాయి.

పక్షంరోజులు ఎవరైతే శ్రీలలితాసహస్రనామాన్ని భక్తివిశ్వాసాలతో పఠిస్తారో వారికి సరస్వతీదేవి నాలుకయందే నిత్యతాండవం చేస్తుంటుంది.

## మనలోని శక్తి ఆ పరాశక్తే !

– పగడాల కమల

ఈ పుణ్యభూమిలో భగవంతుని ఏదోఒకరూపంలో ఆరాధించడం జరుగుతుం టుంది. అయితే అన్నివిధాలైన పూజలలో శక్త్యారాధన జరుగుతుం టుంది. ఆశక్తిరూపమే జగన్మాత. చిత్ ప్రధానమైనది బ్రహ్మవిద్య. శక్తి ప్రధాన మైనది శ్రీవిద్య. ఈ రెంటికీ భేదంలేదు. ఈ జగత్తు సృష్టి స్థితిలయలను కలిగించే బ్రహ్మమే శక్తి. ఆమె శ్రీమాత. జగజ్జనని, మూలప్రకృతి. మహామాయ, పిపీలికాది బ్రహ్మపర్యంతం వ్యాపించిన శక్తిఆమె. పరతత్త్వానికి స్త్రీ పురుషభేదం లేదు. అయితే శక్తి అనే శబ్దం స్త్రీలింగం అయినందున పరబ్రహ్మమైన పరాశక్తి త్రిపురసుందరిగా పూజలందు కుంటోంది.

ఆతల్లి ఆవిర్భావాన్ని బ్రహ్మాండపురాణంలోని లలితోపాఖ్యానం ద్వారా తెలుసుకో గలం, అందులో హయగ్రీవుడు శ్రీమాత ప్రాదుర్భావాన్ని, ప్రాభవాన్ని సవివరంగా చెబుతాడు. అనంతరం అగస్త్యుని కోరికపై ఆ తల్లి నామాలను చెబుతాడు. అదే శ్రీలలితా సహస్రం. లోకోత్తర లావణ్యభావంతో, చిన్మయ చైతన్యంతో, అణువు అణువులో ఆడిపాడి ఓలలాడే లీలావతి లలితాపరమేశ్వరీ దేవి. సమస్తలోక కల్యాణమే ఆమె లక్ష్యం. ఆమెహృదయంలో కరుణా సముద్రం పొంగిపొరలుతుంటుంది. చతుష్షష్టి కళలలో ఆమెఆరితేరిన కళానిధి. ఆమె మృదుమధుర పలుకులలో సకల కళలు ఉట్టిపడుతుంటాయి. భూదేవి దాహాన్ని తీర్చే తీయని మధుధారలంటే ఆ తల్లికి అమితమైన ఇష్టం. తనచల్లని చూపులతో ఈ సమస్తలోకాలను అనుగ్రహిస్తోంది. ఈ లోకంలో ఆమెను మించిన మంచితనాన్ని మనం ఎక్కడ చూడలేం. సహస్రారం చేరేందుకు దారిచూపే వారుణీ నాడి ఆమెచేతిలో ఉంది. అందుకే ఆమె అనుగ్రహం లభించిన వారికి తెలుసు కోవలసింది అంతా పూర్తిగా తెలిసిపోతుంది.

ఆమె మానస సరోవరంలో మందగమనంతో సంచరించే రాజహంసలా తన భక్తుల మనోమందిరంలో నెలకొని ఉంటుంది. మంత్రరూపంలో గోచరించే ఆ తల్లిని ఆరుగురు దేవతలు ఆరాధిస్తారు. హృదయం, శిరస్సు, శిఖ, నేత్ర త్రయం, కవచం, అస్త్రం, ఇది ప్రతి మంత్రానికి ఉండే అంగన్యాసం. ఇందులో పరమేశ్వరి అంగికంగా ఉంటుంది. సాంగంగా, పరమేశ్వరిని ఆరాధించిన వాళ్ళకు కీర్తిప్రతిష్టలు,

సంపదలు, సమృద్ధి, ప్రజ్ఞ, వైరాగ్యం, ధర్మం అనే ఆరు గుణాలు అలవడుతాయి.ఆ పరమేశ్వరి తత్త్వాన్ని అర్థం చేసుకునేందుకు చతుర్వింశతి (24) తత్వాలే సోపానాలు, పంచభూతాలు (భూమి,నీరు,అగ్ని,గాలి,ఆకాశం) పంచ తన్మాత్రలు (శబ్దం, స్పర్శ, రూపం, రసం,గంధం) పంచేంద్రియాల జంటలు (కర్మేంద్రియాలు, జ్ఞానేంద్రియాలు) మనస్సు,బుద్ధి,అహంకారం, మహత్తు, వీటిద్వారా ఆ తల్లిని తెలుసుకోవాలి. వీటిలో, వీటికి అతీతంగా ఉండే పరమేశ్వరి తత్త్వాసన, తత్త్వసింహాసనంపై ఆసీనురాలైన తత్త్వాసనిని చూడ గలిగిన తాత్వికుడు, ఆ తల్లికి తన అంతరంగాన్ని చెప్పుకుంటాడు.

ప్రపంచంలో ప్రతిపదార్థంలో ఏదో ఒక శక్తి ఉంది. ఆ శక్తికి మూలం పరాశక్తి. పరమేశ్వరిలోని అపరిమేయమైన పరాశక్తి అన్నిపదార్థాలలో వేర్వేరుగా ప్రతిఫలిస్తుం టుంది. ఆమెను మించిన శక్తిలేదు. శక్తిని ఆమె అనుగ్రహం వల్లనే సాధించుకోవలసి ఉంటుంది.అందుకు అచంచలమైన దీక్షకావాలి. ఉత్కృష్టమైననిష్ఠకావాలి. ఆమెశక్తికే కాదు, జ్ఞానానికి కూడ పరాకాష్ఠ, ఈ సమస్త విశ్వంలోని ప్రజ్ఞావిశేషాలన్నీ అవ్యక్తదశలో పరావాక్కులో ఒదిగి ఉంటాయి. ఆపరావాక్కే పరాశక్తి.

ఘనీభవించిన జ్ఞానమే కరిగి వాగ్రూపంలో ప్రవహిస్తుంది. అనంతమైన జ్ఞానం ఆమెలో ఇమిడి ఉన్నందువల్ల ఆమె జ్ఞానానందంలో తేలిపోతుంటుంది. ఆమె పేరు చెబితేనే మాంగల్యంఫలిస్తుంది. మంగళ ధ్వనులు వినిపిస్తాయి. ఆమెను దర్శించుకున్న ప్రతిబిందువు మహా సింధువులా పొంగిపోతుంది. ఆమె చరిత్రను తెలుసుకున్నవారికి ఆ తల్లి కరుణాకటాక్షాలు పూర్తిగా లభిస్తాయి. ఆమె సాయుజ్యమే అఖండమైన సామ్రాజ్యం. ఆతల్లి కటాక్షవీక్షణం ప్రసరిస్తే చాలు, సమస్త ఐశ్వర్యాలు మన ముందు కొచ్చిపడతాయి. అన్యులను కూడ ధన్యులనుచేసే కరుణామయి, అందరికీ ఆనందాన్ని పంచిపెట్టే కారుణ్యమూర్తి ఆతల్లి. ఆతల్లిని నిత్యం ప్రార్థించుకుంటే సమస్త శుభాలు కలుగుతాయి. అన్నివిధాలైన కష్టాలు తొలగిపోతాయి.

## ప్రతి నామం మంత్రం

– వద్లమూడి వెంకటేశ్వరరావు

భారతీయ సంస్కృతికి వేదశాస్త్ర స్మృతిపురాణ ఇతిహాసతంత్రాగమాలు భగవంతుడిచ్చిన విజ్ఞాన సంపద. వేదాలు కర్మమార్గాన్ని, దాని ద్వారా బ్రహ్మ జ్ఞానాన్ని బోధిస్తాయి. ఈవైదిక బోధను సులభతరంచేసి పురాణాలుగా మనకం దించారు మహర్షులు. వాటన్నింటిలో కర్మ భక్తి జ్ఞాన మార్గాల ప్రవచనముంటు న్నది. అవి ఒకదానికంటే ఒకటి ప్రశస్తమని ఆదిశంకరుల ప్రబోధ. అయితే వారి వారి స్థాయి ననుసరించి తగినమార్గాన్ని ఎన్నుకోదగినదిగా స్మృతులు చెప్పిన అనుభవవాక్యం. దేనికైనా ముఖ్యంగా ఉండవలసింది దృఢసంకల్పం, విశ్వాసం.

ఈ సృష్టిని ఏదో ఊహించుటకు సాధ్యంకాని శక్తినడుపుతోందని జ్ఞానవం తుల ఉపదేశం, దానిని ఉపనిషత్తులు 'బ్రహ్మము' అన్నాయి. పురాణాలు శివుడు, విష్ణువు,శక్తి,గణపతిఅంటూ పలుపలువిధాలుగా చెబుతున్నాయి. ఆయా మార్గాను



యాయులు వారిమార్గమే ప్రశస్తమని చెప్పడంసహజం. తంత్రాగమా లన్నీ బ్రహ్మజ్ఞానానికి సాధన, బ్రహ్మవిద్య అనినిశ్చయించాయి. దానికి శ్రీవిద్య అని పేరు.

యత్రాస్తి భోగో నహి తత్రమోక్షః యత్రాస్తి మోక్షనహి తత్రభోగః।
శ్రీసుందరీ సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥

ఐహిక సుఖశాంతులనిచ్చే వాని వలన మోక్షంలేదు. కేవలం మోక్షాన్నిచ్చేవి ఇహభోగాలకు దూరం చేస్తాయి. ఒక్కశ్రీదేవీ ఉపాసన వలన మాత్రమే ఇహ భోగాలు, చివరకు మోక్షం సిద్ధించగలవు. ఈకారణంగా శ్రీవిద్యకు అత్యంత విశిష్ట ప్రశస్తి వచ్చింది. శ్రీవిద్యాప్రచారం ఉద్దేశించి ఆదిశంకరులు తమ నాల్గు పీఠాలలో శ్రీచక్రా లను ప్రచార సాధనాలుగా ప్రతిష్ఠింపచేశారు.

శ్రీవిద్యాషోడశాక్షరీ మంత్రాన్ని శ్రీవిద్య అంటారు. అనగా మూలశక్తికి నామం షోడశాక్షరీ మంత్రమయితే రూపం శ్రీ చక్రం. భక్తుని భావనా సౌకర్యానికై బ్రహ్మము యొక్క రూపకల్పనయే కరచరణాదులతో వర్ణింపబడు పరదేవతా మూర్తి. ఆమెను రాజరాజేశ్వరి, కామేశ్వరి, త్రిపురసుందరి మొదలైన నామాలలో భావిస్తున్నారు.

వశిన్యాది వాగ్దేవతలు ఎనిమిది మంది పరదేవతానుగ్రహం వలన పొందిన వాగ్వైభవం కలవారు శ్రీదేవి ఆజ్ఞానుసారం వాగ్దేవతలు స్తుతించిన పాఠం లలితానామ సహస్రం. మిగతా దేవతల సహస్రనామాలలాగా శ్రీదేవి నామసహస్రం వ్యాసవిరచితం కాదు. వాగ్దేవతలు పలికిన అమోఘపద సంకలనం శ్రీలలితానామసహస్రం. వీటిని వ్యాసమహర్షి సేకరించి పొందుపరచిన వాడు మాత్రమేనని గమనించాలి.

శ్రీ విద్యాధిదేవత కేవలం పరబ్రహ్మమేగాని వేరుకాదని నిష్కర్షగా నిర్వచిస్తుంది ఈ క్రింది శ్రీలలితానామావళి.

నిరాధార
నిరంజనా
నిర్లేపా
నిర్మలా
నిర్గుణా
నిష్కలా
నిష్కామా
నిరుపప్లవా
నిత్యముక్తా
నిర్వికారా
నిష్ప్రపంచా
నిరాశ్రయా
నిరవద్యా
నిష్కారణా

నిష్కలంకా
నిరుపాధిః
నిరీశ్వరా
నీరాగా
నిర్మదా
నిశ్చింతా
నిరహంకారా
నిర్మోహా
నిర్మమా
నిష్పాపా
నిష్క్రోధా
నిర్లోభా
నిస్సంశయా
నిర్భవా

నిర్వికల్పా
నిరాబాధా
నిర్భేదా
నిర్నాశా
నిష్క్రియా
నిష్పరిగ్రహా
నిస్తులా
నిరపాయా
నిరత్యయా
నిరుపమా
నిర్ద్వైతా
నిరామయా
నిరాలంబా
నిస్త్రైగుణ్యా

ఈ "నేతి,నేతి" అని చెప్పే వేదాంత వాక్యాల ప్రమాణంలో దేవి నిర్వచించుటకు వీలుగాని వస్తువుగా వర్ణింపబడింది. అయితే ఆ పరదేవత ఎటువంటిది అనడానికి, కేవలం బ్రహ్మమే వివరిస్తుంది నామావళి.

| | |
|---|---|
| విజ్ఞాన ఘనరూపిణీ | బ్రహ్మాత్మైక స్వరూపిణీ |
| వేదవేద్యా | సచ్చిదానంద రూపిణీ |
| తత్పదలాక్ష్యార్థా | సత్యజ్ఞానానంద రూపా |
| మనోవాచామగోచరా | సర్వోపనిషదుద్ఘుష్టా |
| ప్రజ్ఞానఘనరూపిణీ | తత్త్వమర్థ స్వరూపిణీ |
| సర్వవేదాంత సంవేద్యా | జ్ఞానజ్ఞేయ స్వరూపిణి |

ఈ చెప్పిన బ్రహ్మమే అయిన పరదేవతను ఉపాసించిన వారు ఋషులు, దేవతలు అంటూ నామావళి వివరించింది.

| | |
|---|---|
| రాజరాజార్చితా | తాపసారాధ్యా |
| క్షేత్రపాల సమర్చితా | ద్విజబృందనిషేవితా |
| శారదారాధ్యా | గుహ్యకారాధ్యా |
| హరిబ్రహ్మేంద్ర సేవితా | బుధార్చితా |
| కామసేవితా | దక్షిణారాధ్యా |
| గంధర్వసేవితా | ధీరసమర్చితా |
| లోపాముద్రార్చితా | |
| మార్తాండభైరవారాధ్యా | |

శ్రీలలితానామస్తోత్ర పఠంవలన ప్రయోజనం ఏదైనా ఉన్నదా? ఎటువంటి ప్రశస్తి కలుగుతుంది? దానికి సమాధానంగా నామావళి వచించే పదాలు –

| | |
|---|---|
| రాగమథనీ | మృత్యుమథనీ |
| మదనాశనీ | మహాపాతకనాశనీ |
| మోహనాశనీ | విఘ్ననాశనీ |
| మమతా హంత్రీ | సర్వవ్యాధి ప్రశమనీ |
| పాపనాశనీ | కలికల్మషనాశనీ |
| క్రోధశమనీ | కాలహంత్రీ |
| లోభనాశనీ | దైత్యశమనీ |
| సంశయఘ్నీ | తమోపహా |
| భవనాశనీ | పరమంత్రవిభేదినీ |
| భేదనాశనీ | భవరోగఘ్నీ |

దేహికి పూర్వజన్మార్జిత పాపకర్మల ఫలితాన్ని, అనుభవాన్ని నిశ్శేషంగా నిర్మూలించ గలుగుతున్నదిగా ఈ నామాల తాత్పర్యము. దీనివలన వైరాగ్య ప్రవృత్తి



కలిగి జ్ఞానసాధన సుగమమవుతుంది. ఐహిక సౌఖ్యం లేదా? అని అనుమానం కలుగవచ్చు. ఈ లలితానామోపాసన ఐహికంలేకుండా ఆముష్మికం మాత్రమే కాదని కూడా వివరిస్తున్నది.

| | |
|---|---|
| సుఖప్రదా | రాజ్యదాయినీ |
| సద్గతిప్రదా | సామ్రాజ్యదాయినీ |
| సౌభాగ్యదాయిని | సర్వార్థదాత్రీ |
| అనుగ్రహదా | శివజ్ఞాన ప్రదాయినీ |
| పుణ్యఫలప్రదా | త్రివర్గదాత్రీ |
| సద్యః ప్రసాదినీ | స్వర్గాపవర్గదా |
| కైవల్య పదదాయినీ | ప్రాణదా |
| వరదా | కామధుక్ |
| నిర్వాణ సుఖదాయినీ | ప్రాణదాత్రీ |
| జ్ఞానదా | క్షిప్ర ప్రసాదినీ |
| యోగదా | వాంఛితార్థ ప్రదాయినీ |

ఇంతటి మహనీయత కల స్తోత్రపాఠం మరే దేవతానామ పాఠంలో కనబడదు. ఒక్కపృథాక్షరం లేకుండా అద్భుతమైన సాహిత్య విశేషాలతో వాగ్దేవత లచే ప్రస్తుతింప బడిన శ్రీదేవినామ వైభవం అనన్య సామాన్యం.

విష్ణునామ సహస్రాచ్చ శివనామైక ముత్తమం<br>
శివనామ సహస్రాచ్చ దేవ్యానామైక ముత్తమం ।

విష్ణు సహస్రనామాల మొత్తంపాఠం కంటే ఒక్క శివనామం శ్రేష్ఠం. శివనామ సహస్రం కంటే ఒక్క లలితానామ ఉచ్చారణ శ్రేష్ఠం. దీనినిబట్టి శ్రీ లలితానామ సహస్రం ఫలితం విజ్ఞులు ఊహించగలరు.

రహస్యనామ సాహస్రం తస్మాత్సంగోపయేదిదం ।

లలితా సహస్రనామాలు కావు, అవి లలితా రహస్యనామాలు, ప్రతినామం లోను రహస్య విశేషాలు పొందుపరచిచెప్పబడినవి.

మామర్చయతువా మా వా విద్యాం జపతు వా న వా<br>
కీర్తయేన్నామ సాహస్రమిదం మత్ప్రీతయే సదా<br>
మత్ప్రీత్యాసకలాన్ కామాన్ లభతే నాత్ర సంశయః॥

నన్ను పూజించినా, లేకున్నా, నా మంత్రం జపించినా, జపించకున్నా, ఈ నా సహస్రనామపఠనం నాకు అత్యంత ప్రీతిప్రదం. అద్దాని కారణంగా సకల పురుషార్థ ములు నావల్ల లభించడం నిశ్చయమని పరదేవత పలికిన పలుకులు. అటువంటి ఈ సహస్రనామాలకు మొదటగా భాసురానందులు అతిచక్కని వ్యాఖ్యానం వ్రాశారు. తరువాతగా తెలుగులో చాలామంది ఈ మధ్యకాలంలో భాసురానందుల ననుసరించే

వ్రాయగలిగారు. జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ స్వామిపాదులు ఈ నామాలను ఉపనిషత్ప్రమాణంతో అద్వైతపరంగా వ్యాఖ్యానించారు.

ఈ లలితానామాల రహస్యం అంతుపట్టని విషయం. ఇవి అత్యంత నిగూఢార్థ ప్రతిపాదకాలు. ఎక్కడా కూడా వృథాక్షరం లేకుండా అద్భుతమైన సాహిత్యంతో పలికిన వాగ్దేవతల పలుకులు, సాహిత్యంతోపాటు వేదాంత యోగ శాస్త్రం, ఉపాసన, జ్యోతిష, మంత్రశాస్త్ర గర్భితమందు కూర్పు ఈ లలితానామ మాలిక.

కేవలం నామబుద్ధిస్తేనకార్యా తేషు కుంభజ ।
మంత్రాత్మకత్వమే తేషాం నామాత్మ తామపిచ ॥

ఈ లలితా నామస్తోత్రంలోని నామాలు మామూలు సాహిత్య పరంగా పరదేవత గుణవిశేషాలు మాత్రమేనని భావించరాదు. ప్రతినామం మంత్రాత్మక మైనదిగా గ్రహించాలి. -హయగ్రీవ వచనం.

అభీష్ట సిద్ధికి అమ్మ నామాలు

మంత్రతుల్యమైన లలితానామాలతో సామాన్య అవసరాలను సాధించే పద్ధతులు చెప్పబడుతున్నాయి. ఇవన్నీ అనుభవంతో సాధించి సరిచూసిన విధానాలు. ఆయా అవసరాలకు ఈచెప్పబోవు నామవాక్యాలను ప్రతి పర్యాయ ఉ పఠిస్తూ లలితానామ స్తోత్రంలోని 365 పంక్తులు నిత్యము పారాయణ చేయాలి. నిస్సంకోచంగా కామ్య సిద్ధి సామాన్యంగా మండలం (40)రోజులలో కలుగుతుంది.

1. భర్తృవశీకరణ : మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశ మానసా అను వాక్యనామాన్ని లలితానామ స్తోత్రంలోని ప్రతి పంక్తిని అనుషంగంచేసి పఠిం చాలి. ఎలాగంటే మందస్మిత మానసా । శ్రీమాతా శ్రీమత్సింహాసనేశ్వరీ 1. మందస్మిత మానసా। చిదగ్నికుండ..సముద్భూతా । 2. ఈవిధంగా ప్రతివాక్యం ముందు కావలసిన కామ్యవాక్య నామాన్ని పఠిస్తూ మొత్తం లలితా నామపాఠం చేయాలి. ప్రతిరోజు ఒకస్తోత్రం పాఠంచేస్తూ 40 రోజులు నియమంగా పారా యణ చేయాలి. దీనివలన ఆయా కామ్య నిస్సంకోచంగా సిద్ధిస్తుంది. ఇదే క్రమాన్ని ఈ చెప్పబోవు కామ్యాలకు వర్తింపజేయాలి.

2. వివాహసిద్ధి : కామేశబద్ధ మాంగల్యసూత్ర శోభిత కంధరా-ఈ వాక్య నామంతో జతచేస్తూ 365 పంక్తులను పారాయణచేయాలి. 40రోజుల దీక్షతో నిత్యంశుచిగా పారాయణచేయాలి. ఇది పెండ్లికావలసిన కన్యకలకు అమోఘసిద్ధిప్రద పద్ధతి.

3. సంతాన సిద్ధి : కామేశ్వర ముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా..ఈ వాక్య నామాన్ని పైన సూచించిన పద్ధతిలో 60 రోజులు పారాయణ చేయాలి. స్త్రీల గర్భదోషాలను పరిహరించి సత్సంతాన ప్రదమైన విశిష్టసాధన.

4. గుండెపోటు నివారణ : అనాహ తాబ్జనిలయా శ్యామాభావదనద్వయా దంష్ట్రోజ్జ్వలా క్షమాలాదిధరా రుధిర సంస్థితా



కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతా స్నిగ్ధౌదన ప్రియా
మహావీరేంద్ర వరదా రాకిన్యంబా స్వరూపిణీ ॥

ఈనాలుగు వాక్యాలను ప్రతిపర్యాయం పఠిస్తూ 365 పంక్తులను పారా యణ చేయాలి. మండల(40రోజులు) కాలంలో ఫలితం కలుగుతుంది. శస్త్ర చికిత్స అవసర మయిన గుండెజబ్బులు కూడా కేవలం మందులతో నెమ్మదించాయి. ఇది అనుభవంతో సాధించిన సిద్ధి.

5. వ్యాధినివారణ : సర్వవ్యాధి ప్రశమనీ సర్వమృత్యునివారిణీ- ఈ వాక్య నామంతో అనుషంగంచేసి లలితానామ పంక్తులు పఠనం వలన వ్యాధి నివారణ తద్వారా అపమృత్యు నివారణ సిద్ధి కలుగగలదు.

6. ఉద్యోగప్రాప్తి : రాజరాజేశ్వరీ రాజ్యదాయినీ రాజ్యవల్లభా
రాజత్కృపా రాజ పీఠనివేశిత నిజాశ్రితాః

ప్రతి పర్యాయము ఈ రెండు వాక్యాలను అనుషంగంచేసి స్తోత్రపారాయణ చేయగా ఉద్యోగప్రాప్తి కలుగుతుంది.

7. ధనప్రాప్తి : రాజ్యలక్ష్మీః కోశనాథా చతురంగ బలేశ్వరీ

ఈ వాక్యనామంతో పూర్వం చెప్పిన విధిలో పారాయణం చేయగా ధన యోగం కలుగుతుంది.

8. కామ్యసిద్ధి : కపర్దినీ కళామాలా కామధుక్కామ రూపిణీ

ఈ వాక్యంతో అనుషంగంచేసి స్తోత్రం పాఠం చేయడం వలన వారి ప్రయత్నములు అనుకూలించగలవు.

9. పరప్రయోగ భేదనము : మూలాధారం గణపతిస్థానం (మూలాధారే స్థితోసి నిత్యం గణపత్యథర్వశీర్షం) అక్కడ నుండి ప్రారంభమౌతుంది యోగం. తొలిపూజ ఇదే. ఆ మూలాధారాన్ని లాలించే యోగశక్తి తల్లి. అక్కడ ఒక సర్పంలా తలెత్తేనాదాన్ని స్వాధిష్ఠానాది ఆరుచక్రాల మీదుగా తీసుకువెళ్లి కైవల్యా నందం (శివశక్తుల సామ రస్యం) కలిగించేది ఆ యోగశక్తే. ఆరుచక్రాలపై ప్రాకే నాదసర్పమే షడాననుడు. గజముఖ షణ్ముఖులతో సాక్షాత్కరించే ఉమామహేశ్వర తత్త్వమే అమృతత్వం.

పాశహస్తా పాశహంత్రీ పరమంత్ర విభేదినీ

పిశాచబాధలుగాని, పరప్రయోగాలలో బాధింపబడువారుగాని ఈ వాక్యంతో అనుషంగంచేసి పారాయణచేస్తే వారి పిశాచాది బాధలు, కృతిమ ప్రతి బంధకాల నుండి శాంతి కలుగుతుంది.

10. మోక్షసిద్ధి : జన్మమృత్యుజరాతప్త జన విశ్రాంతి దాయినీ

నిష్కామ్యంగా నిత్యమూ ఈ నామవాక్య అనుషంగ రీతిలో పారాయణాన్ని పఠించడం వలన మోక్షసిద్ధి కలుగుతుంది.

11. వాంఛాసిద్ధి : అనఘాద్భుత చారిత్రా వాంఛితార్థ ప్రదాయినీ

కావలసిన కోరికను సంకల్పంలోచెప్పి తదనంతరం ఈనామవాక్యంతో అనుషంగ పారాయణచేయాలి. దానివలన కోరిన కోర్కె సిద్ధించగలదు.

## లలితా సహస్రంలో జ్యోతిశ్శాస్త్ర రహస్యాలు

**- పప్పు వరాహ నరసింహమూర్తి**

లలితా సహస్రనామాలలో సాహిత్యపరమైనవి, యోగశాస్త్రపరమైనవి, జ్యోతిశ్శాస్త్రపరమైనవి, ఉపాసనపరమైనవి, శ్రీచక్రనవావరణ రూపమైనవి, మంత్రశాస్త్ర పరమైనవి మొదలుగా (అనేక విషయములకు సంబంధించిన) నామములు కలవు. అందు జ్యోతిశ్శాస్త్ర పరముగానున్న కొన్నింటిని వివరించే యత్నంఇది.

శ్లో॥ ఉన్మేష నిమిషోత్పన్న విపన్నభువనావళిః
సహస్ర శీర్షవదనా సహస్రాక్షీ సహస్రపాత్
ఆబ్రహ్మ కీటజననీ వర్ణాశ్రమ విధాయినీ
నిజాజ్ఞరూప నిగమా పుణ్యాపుణ్యఫలప్రదా

కనులు తెరచినంత మాత్రాన సర్వలోకాలను సృష్టించి కనులను మూసి నంతలో సర్వజగములను లయంచేసే లలితాదేవికి అనేకమైన శీర్షములు, అనేకమైన కన్నులు, పాదములు ఉన్నాయి. ఆమె కీటకము మొదలు బ్రహ్మ పర్యంతము జీవులను సృష్టించి, వర్ణాశ్రమ ధర్మాలను ఏర్పరచిన తన ఆజ్ఞారూప మైన వేదస్వరూపిణి.

రహస్యార్థం : సహస్రశీర్షావదనా అనగా అనేకమైన శిరస్సులను కలిగినది = ఆదిశేషువు. సహస్రాక్షి=అనగా అనేక నేత్రములను కలిగిన ఇంద్రుడు. సహస్రపాత్= అనగా అనేక పాదములు (కిరణములు) కల్గినది ఆదిత్యుడు. అనగా ఆదిశేషువు, ఇంద్రుడు, ఆదిత్యులను సూచించును. ఆదిశేషువు, ఆశ్లేష నక్షత్రమునకు అధిదేవత; ఇంద్రుడు జ్యేష్ఠ నక్షత్రమునకు అధిదేవత; ఆదిత్యుడు రేవతి నక్షత్రమునకు అధిదేవత అనగా ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రములకు బదులుగా తత్తద్దేవతలు ప్రస్తుతింపబడ్డారు. అశ్వని నుంచి ఆశ్లేష, తొమ్మిదవ నక్షత్రము,ఆశ్లేష నుండి జ్యేష్ఠ, తొమ్మిదవ నక్షత్రము. జ్యేష్ఠనుండి రేవతి, తొమ్మిదవ నక్షత్రము.

ఈవిధంగా (9+9+9)=27 ఇరువది ఏడు నక్షత్రములు గల నక్షత్ర మండలము గ్రాహ్యము. 9 నక్షత్రములు అనగా 4 రాశులకు సమానము. (9+9+9)=27 నక్షత్రములు అనగా (4+4+4)=12 రాశులు. ఈవిధంగా 27 నక్షత్రములు, వాటికి అనుగుణమైన ద్వాదశరాశుల గమనములను వాటి కక్ష్యలను నిర్దేశించి; ప్రాణులయొక్క దృష్టా దృష్ట ఫలితములను, వారు జన్మించిన రాశుల ప్రభావముల వలన వారు చేసికొన్న పూర్వజన్మ సుకృతము వలన నిర్ణయించునది లలితా పరమేశ్వరిదేవి. ఇవి జ్యోతిర్విద్యకు సంబంధించిన విషయములు. ఈ విషయములకు అనుగుణంగానేదీని హర్వాపరవాక్యములకు గూడా, జ్యోతిశ్శాస్త్రపరంగా వివరణ ఈ దిగువ నీయబడినది.

పూర్వవాక్యం

'ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః'

భువనావళి అనగా ద్వాదశరాశుల సమూహము.



ఉన్మేష అనగా–ఉత్+మేష. అనగా మేషరాశిలో ప్రారంభమయిన ఈ ద్వాదశ రాశుల సమూహము (లలితాదేవి యొక్క కనులు మూసి తెరిచినంత కాలములో) నిమిషములో ఉత్పన్నమయి కనులు మూసినపుడు లయమగును.

తరువాత వాక్యం

ఆబ్రహ్మ కీటజననీ వర్ణాశ్రమ విధాయినీ

నిజాజ్ఞారూపనిగమా పుణ్యాపుణ్య ఫలప్రదా

"బ్రహ్మము" అనగా అజ. అనగా మేషమునకు సంకేతము. 'కీటము' అనగా ద్వాదశ రాశులలోని వృశ్చికమునకు సంకేతము. ఈవిధంగా "ఆ బ్రహ్మ కీటజనని" అనగా మేషలో నుండి వృశ్చికరాశి వరకు జనని అనగా సృష్టికర్త. ఇందులో భావకార కత్వాలు పరోక్షంగా చెప్పబడ్డాయి. మేషము నుండి వృశ్చికము నకు ఎనిమిదిరాశులు గలవు. ఈ ఎనిమిదిరాశులు, జీవియొక్క ఎనిమిది దశలు (అవస్థలు) ఫలితములను నిర్ణయించును.

జ్యోతిశ్శాస్త్రములో ద్వాదశ రాశులకు సంబంధించిన ద్వాదశస్థానములు, భావములు కారకములు ఉన్నాయి. పుట్టిన సమయమునుబట్టి, జన్మనక్షత్ర ములు, జన్మలగ్నమునుబట్టి ద్వాదశభావములు కారకములు గణించి, ఆప్రాణి యొక్క జ్యోతిశ్చక్రమును నిర్ణయిస్తారు. ప్రతిప్రాణి తన జీవితకాలములో మొదటి ఎనిమిది అవస్థలను అనుభవించును, ఇవి ఐహికావస్థలు, మిగిలిన నాలుగు ఆముష్మికమునకు చెందిన అవస్థలు.

**ద్వాదశరాశులు :** 1.మేషం2.వృషభం 3.మిధునం 4. కర్కాటకం 5. సింహం 6. కన్య 7.తుల 8.వృశ్చికం 9.ధనుస్సు 10.మకరం 11.కుంభం 12. మీనం.

ఇందులో మేషరాశి మొదలు ఎనిమిది రాశులు. అనగా వృశ్చికరాశి వరకు ఇహలోకమునకు సంబంధించిన దశాఫలితములు తెలియజేయును. మిగిలిన 4 అవస్థలు అముష్మికమునకు సంబంధించిన వివరములు తెలియ జేయును.

**ద్వాదశ (భావములు) స్థానములు**

1. తన స్థానము (లగ్నం), 2. ధన స్థానము 3. భ్రాతృస్థానము 4. బంధు స్థానము 5. పుత్రస్థానము 6. శత్రుస్థానము –7. కళత్రస్థానము 8. ఆయుఃస్థానము 9. పితృస్థానము (భాగ్యం) 10. రాజ్య (కర్మ) స్థానము, 11. లాభస్థానము 12. వ్యయస్థానము.

పైన వివరించిన ద్వాదశ రాశులు, స్థానములు, భావములలో మొదటి ఎనిమిది స్థానములు ఇహలోకమునకు సంబంధించినవి. ఆఖరి నాలుగు పరలోకమునకు సంబంధించినవి. ఆఖరి నాలుగు పరలోకమునకు సంబంధించి నవి (ఆముష్మికం) ఆఖరి వాక్యం "నిజాజ్ఞారూపనిగమా పుణ్యా పుణ్యఫలప్రదా" ఇందులో నాలుగు రాశులు, కారకత్వ పరంగా నిజా, ఆజ్ఞా రూప, నిగమా అనగా తన పితృస్థానము. దశమస్థానము (ఆజ్ఞా)–(చేసికొన్న కర్మలచేలభించిన) లాభస్థానం ఆఖరిది వ్యయస్థానం అనగా మోక్షస్థానము.

ఈరాశులు, అందు సంచరించే గ్రహములు, వాటిరీతులు కారకత్వములు మొదలైనవానివలన ఒకప్రాణియొక్క పుణ్యపాపములను నిర్ణయించే శక్తియే పుణ్యా పుణ్య ఫలప్రదా అయిన లలితాదేవి. ఈ క్రింది వాక్యార్థము కూడా ఈ అర్థమునే బలపరచుచున్నది.

**"అష్టమూర్తి రజాజైత్రీ లోకయాత్రా విధాయిని"**

ఒకమనిషి తనచేసిన పుణ్యపాపములను అనుభవించును. క్రిందటి జన్మ నుండి వచ్చిన సంచితకర్మకూడా అనుభవించాలి. దానికి అనుగుణంగా పర దేవత, ఈ జీవియొక్క లోకయాత్రను నిర్దేశిస్తుంది. ఇది ఎనిమిది విధములుగా ఉంటుంది. ఈ ఎనిమిది విధాలనే పైన జెప్పబడిన ఐహికమునకు సంబంధించిన దశలు వీటికి మూలకారణము. కనుక లలితాదేవి లోకయాత్రావిధాయిని. అదియే అజాజైత్ర–అజము అనగా మేషరాశికి సూచికము 'అజాజైత్రి' అనగా మేషాది వృశ్చికరాశి వరకు గల అష్టరాశులు, వాటి గ్రహములు కారకత్వాలను కూడా గ్రాహ్యములు.

ఈ విషయములనే ఈ క్రింది వాక్యాలు గూడా ధృవపరుస్తున్నాయి.

భవదావసుధావృష్టిః పాపారణ్య దావానలా<br>
దౌర్భాగ్యతూలవాతూలా జరాధ్వాంతరని ప్రభా<br>
భాగ్యాబ్ధిచంద్రికాభక్త చిత్తకేకి ఘనాఘనా<br>
రోగపర్వతదంభోళి ర్మృత్యుదారు – కుఠారికా

అర్థం: 1. భవరూపమైన దావానలమునకు అమృతపుజల్లువంటిది. 2. పాపమనే అడవికి దావానలము. 3. భక్తుల దౌర్భాగ్యమనే దూదిపింజెలకి మారుత ములవంటిది. 4. ముసలితనపు చీకట్లకు ఆదిత్యుని వంటిది 5. భాగ్యరూపమైన సముద్రానికి చంద్రునివంటిది 6. భక్తజనుల మనములనే మయూరాలకు మేఘం వంటిది 7. రోగస్వరూప పర్వతములకు వజ్రాయుధము వంటిది 8. మృత్యు రూపకాష్టములకు గండ్రగొడ్డలివంటిది ఆ పరమేశ్వరి దేవి అని భావము.

ఇందులో మనిషి ఐహికముగా లోకయాత్రలో అనుభవించు మొదటి ఎనిమిది అవస్థలకు (పైన చెప్పబడినవి) సమన్వయము గలదు. ఆ ఎనిమిది అవస్థలు వరుసగా 1. తనస్థానము 2. ధనస్థానము 3. భాతృస్థానము 4. బంధుస్థానము 5. పుత్రస్థానము 6. శత్రుస్థానము 7. భార్యస్థానము 8. మోక్ష స్థానము అని లోగడ చెప్పబడింది.

**భవదావసుదావృష్టి :** ఇది జీవయొక్క నాల్గవ స్థానమైన బంధుస్థానమునకు అన్వయించును, బంధువులు అనగా జ్ఞాతులు. జ్ఞాతి హుతాశనుడు అగ్నితో సమా నము. దాయాదులు అనేకమైన కష్టనష్టములు కల్గిస్తారు. అవి దావానల ముతో సమానము. అటువంటి దావానలమునకు పరమేశ్వరి కృప సుధావృష్టి, అమృతవర్షం, ఈ వర్షం దావానలాన్ని నివారించుటేగాక అమృతమయమైన జీవనాన్ని ప్రసాదిస్తుంది.

**పాపారణ్యదావానలా :** ఇది జాతకుని రెండవ దశకు సంబంధించినది. అనగా 'ధనస్థానము' ఈ జాతకుడు కుటుంబ పోషణార్థము ధనమును సంపాదించవలెను.



ధనసంపాదనలో తనకు తెలియకుండగనే ఎన్నోదోషములు చేయు టకు ఆస్కార మున్నది. కుటుంబ పోషణార్థం దన సంపాదనలో తెలిసి తెలియని అన్నిపాపములనే అరణ్యములకు ఆదేవి కృపదావానలము వంటిది. అనగా, అన్నిరకముల పాపములను మాడ్చివేస్తుంది.

**దౌర్భాగ్యతూలవాతులా :** దౌర్భాగ్యమనగా దురదృష్టము. తూలమనగా దూది. జాతకుని దురదృష్టమనే దూదికి పరమేశ్వరి కృప ఝంఝామారుతము వంటిది. ఇది జాతకుని చక్రంలో మూడవ కారకత్వము. అనగా సహోదరులు జ్ఞాతులవలె ఆస్తులు (పిత్రార్జితమును) పంపకములో తగవులను కల్పిస్తారు. అటువంటి దురదృష్ట సమయమందు లలితాదేవి కృప 'తూలవాతూలం.'

**జరాధ్వాంతరవిప్రభా :** ఇది తన "లగ్నస్థానం" (మొదటిది) ముసలితనము అనే చీకటికి సూర్యప్రభ వంటిది ఆదిత్యోపాసన వలన ముసలితనముగాని, ఆ సమయమందు వచ్చే రోగాదుల వలన బాధలుగాని దరికిరావు.

**భాగ్యాబ్ధిచంద్రికా :** చంద్రునిచూసిన సముద్రం పొంగుతుంది. పౌర్ణమినాడు సముద్రానికి ఎక్కువ పోటు ఉంటుంది. భాగ్యము అనే సముద్రానికి జాతకుని పుత్రుడు చంద్రునివలె ఎక్కువ సుఖసంతోషములకు కారణము. ఇది జాతక చక్రములో పంచమస్థానము అనగా పుత్రస్థానము. పుత్రోదయము వలన తండ్రికి పౌర్ణమినాటి చంద్రునికి గల్గిన సంతోషము కల్గును. ఇదియే జాతకునికి సౌభా గ్యము.

**భక్తచిత్తకేకిఘనాఘనా :** ఇది జాతకచక్రమందు భక్తునియొక్క ఏడవస్థానము (కళత్రసాధనము) కళత్రమునకు, భర్తయందు అతీతమైన శ్రద్ధాభక్తులేకాక అను రాగములు ఆనందమైన స్థితి గల్గును. మేఘమునుచూసి పురివిప్పి నృత్యము చేయు నెమలివలె భార్యాభర్తలు అనురాగ సంపన్నులుగా నుంటారు. ఇది పరమేశ్వరి అనుగ్రహమే.

**రోగపర్వతదంభోళి :** ఇది జాతకుని చక్రములో ఆరవస్థానము (శత్రు స్థానము) రోగరూపమైన శత్రువులందరికి పరదేవత కటాక్షము వజ్రాయుధము వంటిది. పర్వతముల రెక్కలను వజ్రాయుధముతో ఇంద్రుడు ఛేదించినట్లు రోగములను భక్తుని నుండి తొలగించును.

**మృత్యుదారుకుఠారికా :** జాతకచక్రములో ఎనిమిదవ స్థానము. కుఠారికా అనగా గండ్రగొడ్డలి. మహావృక్షములకు నిర్మూలించుటకు గొడ్డలి ఏవిధంగా ఉపయుక్తమో అటులనే మృత్యువు అనే మహావృక్షమునకు దేవి కటాక్షము ఒక గండ్రగొడ్డలి వంటిది.

**ఎనిమిదవస్థానం (మరణస్థానం) :** దీనికి పరమేశ్వరిదేవి అనుగ్రహ మున్నచో అకాలమృత్యువు లేకుండా పూర్ణాయువు భక్తునికి అనుగ్రహింపబడు తుంది. ఈవిధంగా లలితోపాసన వలన ఐహికమయిన ఎనిమిదవ స్థానాలలోని కారకత్వ దోషములు నశింపబడి భక్తునియొక్క లోకయాత్ర విధానము నిర్ణయింపబడుతుంది.

290. **సకలాగమసందోహశుక్తిసంపుటమౌక్తికా**=ఆగమసముదాయమనెడు ముత్యపుచిప్పలసంపుటి యందలి అడ్డబాసపైని ముత్యమువంటిది.
291. **పురుషార్థప్రదా**=చతుర్విధ పురుషార్థములను ఇచ్చునది.
292. **పూర్ణా**=దేశ,కాల,వస్తువులచే కొలవశక్యముగాని పూర్ణత్వముగలది.
293. **భోగినీ**=భోగములుగలది.
294. **భువనేశ్వరీ**=భువనేశ్వరీ మంత్రస్వరూపురాలు.
295. **అంబికా**=సకల జగన్మాత.
296. **అనాదినిధనా**=జననమరణములులేనిది.
297. **హరిబ్రహ్మేంద్రసేవితా**=హరిబ్రహ్మేంద్రాదులచే ఉపాసింపబడినది.
298. **నారాయణీ**=విష్ణువు సోదరి
299. **నాదరూపా**=నాదస్వరూపము గలది.
300. **నామరూపవివర్జితా**=నామరూపములులేనిది.
301. **హ్రీంకారీ**=సిగ్గును గలిగించునది.
302. **హ్రీమతీ**=సిగ్గు గలది.
303. **హృద్యా**=హృదయములందుపుట్టినది.
304. **హేయోపాదేయవర్జితా**=ప్రవృత్తి నివృత్తులులేనిది విడువదగినది స్వీకరించదగినది.
305. **రాజరాజార్చితా**=కుబేరునిచే ఉపాసింపబడినది.
306. **రాజ్ఞీ**=రాజరాజేశ్వరుని పట్టమహిషి.
307. **రమ్యా**=సుందరమయినది.
308. **రాజీవలోచనా**=పద్మములవంటి సుకుమారనేత్రములుగలది.
309. **రంజనీ**=భక్తులను రంజింపజేయునది.
310. **రమణీ**=భక్తులతోగూడి క్రీడించునది.
311. **రస్యా**=అనుభవింపదగిన ఆనంద రసస్వరూపురాలు.
312. **రణత్కింకిణిమేఖలా**=ధ్వనించుచున్న చిరుగంటలుగల ఒడ్డాణముకలది.
313. **రమా**=లక్ష్మీస్వరూపురాలు.
314. **రాకేందువదనా**=పూర్ణచంద్రునివంటి ముఖము గలది.
315. **రతిరూపా**=రతీదేవి రూపముగలది.
316. **రతిప్రియా**=రతీదేవి ఇష్టముగా గలది.
317. **రక్షాకరీ**=రక్షాకార్యములను స్థితిని సంహారములనుజేయునది.
318. **రాక్షసఘ్నీ**=రాక్షసులను సంహరించునది.
319. **రామా**=స్త్రీ స్వరూపములన్నియు తానైనది.
320. **రమణలంపటా**=తమ భర్తలయందు ఆసక్తిగలది.
321. **కామ్యా**=ముముక్షువులచే కోరతగినది.
322. **కామకలారూపా**=కామకళాస్వరూపురాలు.



323. **కదంబకుసుమప్రియా**=కడిమిపువ్వులు ఇష్టములుగాగలది.
324. **కల్యాణీ**=మంగళ స్వరూపిణి.
325. **జగతీకన్దా**=జగత్తులయొక్క మూలమగుదుంపగలది.
326. **కరుణారససాగరా**=దయ యనెడు నీరుగల సముద్రములుగలది.
327. **కలావతీ**=64 కళలు కలది.
328. **కలాలాపా**=మధురములుఅగు మాటలుగలది.
329. **కాంతా**=మిగుల అందమైనది, సుందరమైనది.
330. **కాదంబరీప్రియా**=ఉత్తమమగు కల్లు లేక మద్యము ప్రియముగాగలది.
331. **వరదా**=వరములను ఇచ్చునది.
332. **వామనయనా**=సుందరములగు నేత్రములుగలది.
333. **వారుణీమదవిహ్వలా**=ఖర్జూర రసపానముచే కల్లు ఆనందమువలన బాహ్యస్పృహలేనిది.
334. **విశ్వాధికా**=ఈ విశ్వముకంటె అధికురాలు.
335. **వేదవేద్యా**=వేదములన్నిటిచేత తెలియదగినది.
336. **వింధ్యాచలనివాసినీ**=వింధ్యపర్వతమునందు నివసించునది.
337. **విధాత్రీ**=జగత్తులను పోషించునది.
338. **వేదజననీ**=వేదములకు ఉత్పత్తిస్థానమయినది.
339. **విష్ణుమాయా**=సర్వవ్యాపకుడగు భగవంతునకు సంబంధించినమాయ.
340. **విలాసినీ**=విక్షేపశక్తి గలది.
341. **క్షేత్రస్వరూపా**=మనుజులశరీరములే స్వరూపముగా గలది.
342. **క్షేత్రేశీ**=శరీరములకు ప్రభువగు శంకరుని భార్య.
343. **క్షేత్రక్షేత్రజ్ఞపాలినీ**=శరీరమును జీవుని పాలించునది.
344. **క్షయవృద్ధివినిర్ముక్తా**=కర్మలచే గలిగిన క్షయవృద్ధులులేనిది.
345. **క్షేత్రపాలసమర్చితా**=క్షేత్రపాలునిచే పూజింపబడినది.
346. **విజయా**=విశిష్టజయము గలది.
347. **విమలా**=అవిద్యామాలిన్యములేనిది.
348. **వంద్యా**=నమస్కరింపదగినది.
349. **వందారుజనవత్సలా**=నమస్కరించు శీలముగలవారిని అనుగ్రహించునది.
350. **వాగ్వాదినీ**=నాలుకయందు ఉండి వాక్కులను పలికించునది.
351. **వామకేశీ**=సుందరములగు కేశములుగలది.
352. **వహ్నిమండలావాసినీ**=సోమసూర్యాగ్ని మండలములయందువసించునది.
353. **భక్తిమత్కల్పలతికా**=భక్తిగలవారికి కల్పలతవలె కోరికలను ఇచ్చునది.
354. **పశుపాశవిమోచనీ**=అజ్ఞానులకుగల భోగేచ్ఛలను పాశములను పోగొట్టునది.
355. **సంహృతాశేషపాషండా**=పాషండులనందరిని సంహరించునది.

356. **సదాచారప్రవర్తికా**=సన్నులమైన కర్మకాండోక్తమైన ఆచారమును లోక మును ప్రవర్తింపజేయునది.
357. **తాపత్రయాగ్నిసంతప్తసమాహ్లాదనచంద్రికా**=తాపత్రయముగల సంసా రాగ్నిచే సంతప్తులగు వారికి వెన్నెలవలెహాయి ఇచ్చునది.
358. **తరుణీ**=నిత్యయౌవనవంతురాలు.
359. **తాపసారాధ్యా**=తపశ్శాలురచే ఆరాధింపదగినది.
360. **తనుమధ్యా**=సన్నని నడుము కలది.
361. **తమోపహా**=అజ్ఞానమును పోగొట్టునది.
362. **చితిః**=అవిద్యకు పరమశత్రువగు జ్ఞానస్వరూపమైనది.
363. **తత్పదలక్ష్యార్థా**=తత్పదముయొక్క లక్ష్యార్థము పరబ్రహ్మము అయినది.
364. **చిదేకరసరూపిణీ**=చైతన్యముతో అభేదమును పొందిన ఆనందాది లక్షణములు గలది.
365. **స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానందసంతతిః**=బ్రహ్మస్వరూపానంద ములో లేశములయిన బ్రహ్మాద్యానందసముదాయములు గలది.
366. **పరా**=శబ్దబ్రహ్మస్వరూపురాలు.
367. **ప్రత్యక్చితీరూపా**=ప్రత్యక్చైతన్యస్వరూపురాలు.
368. **పశ్యంతీ**=పశ్యన్తీవాక్స్వరూపిణి.
369. **పరదేవతా**=ఉత్కృష్టమగు శ్రేష్ఠమగుదేవతాస్వరూపురాలు.
370. **మధ్యమా**=పశ్యంతీవైఖరులకుమధ్యగా ఉన్న వాగ్రూపురాలు.
371. **వైఖరీరూపా**=మిక్కిలి కఠినరూపముగలది.
372. **భక్తమానసహంసికా**=మానససరస్సునఉండు హంసవలె భక్తుల మానసముల ఉండునది.
373. **కామేశ్వరప్రాణనాడీ**=శివకామేశ్వరునిజీవనాడివలెఅయినది.
374. **కృతజ్ఞా**=పుణ్యపాపములను రెండింటిని తెలిసినది.
375. **కామపూజితా**=మన్మథునిచే ఉపాసింపబడినది.
376. **శృంగారరస సంపూర్ణా**=శృంగారమనెడు రసముతో చక్కగ నిండినది.
377. **జయా**=జయస్వరూపురాలు.
378. **జాలంధరస్థితా**=ఆధ్యాత్మికముగా జాలంధరపీఠమందున్నది.
379. **ఓడ్యాణపీఠనిలయా**=ఆజ్ఞాకమలమే ఓడ్యాణపీఠము.
380. **బిందుమండలవాసినీ**=సర్వానందమయచక్రమందు నివసించునది.
381. **రహోయాగక్రమారాధ్యా**=అంతరపూజావిధానముచే ఆరాధింపదగినది.
382. **రహస్తర్పణతర్పితా**=ధర్మాధర్మాదులన్నిటిని చైతన్యాగ్నియందు హోమము చేయుదునను భావనచే తృప్తి పొందింపబడినది.
383. **సద్యఃప్రసాదినీ**=రహోయాగరహస్తర్పణములను చేసినవారిని వెంటనే అనుగ్రహించునది.



384. **విశ్వసాక్షిణీ**=ప్రపంచమునకు సాక్షిగా ఉన్నది.
385. **సాక్షివర్జితా**=తనకు వేరొక సాక్షిలేనిది.
386. **షడంగదేవతాయుక్తా**=హృదయాద్యంగదేవతల ఆరుగురితో కూడినది.
387. **షాడ్గుణ్యపరిపూరితా**=పురాణములలోని ఐశ్వర్యాది షడ్గుణములతో నిండియున్నది.
388. **నిత్యక్లిన్నా**=నిత్యము దయార్ద్రయైనది.
389. **నిరుపమా**=సాదృశ్యములేనిది.
390. **నిర్వాణసుఖదాయినీ**=మోక్షసుఖమును ఇచ్చునది.
391. **నిత్యాషోడశికారూపా**=పదునారుగురు నిత్యలస్వరూపముగలది.
392. **శ్రీకంఠార్ధశరీరిణీ**=శంకరుని అర్ధశరీరము గలది.
393. **ప్రభావతీ**=తనచుట్టు అణిమాద్యష్ట సిద్ధులు ఆవరణదేవతలుగాగలది.
394. **ప్రభారూపా**=కిరణరూపాలై ఆవరణదేవతలచే స్వరూపముగాగలది.
395. **ప్రసిద్ధా**=సమస్త జీవులకు లోపల చైతన్యరూపములో ఉండి నేను నేను అని తెలియబడుచున్నది.
396. **పరమేశ్వరీ**=సర్వశ్రేష్ఠురాలు.
397. **మూలప్రకృతి**=ఆకాశమునకు ప్రకృతిఅగు పరమాత్మస్వరూపురాలు.
398. **అవ్యక్తా**=మొదటి మాయాస్ఫురణస్వరూపురాలు.
399. **వ్యక్తావ్యక్తస్వరూపిణీ**=మహత్తత్త్వాహంకార స్వరూపురాలు.
400. **వ్యాపినీ**=సర్వజగత్తునందు వ్యాపించినది.
401. **వివిధాకారా**=అనేకవిధములయిన ఆకారములు గలది.
402. **విద్యావిద్యాస్వరూపిణీ**=విద్యావిద్యల రెండింటి స్వరూపముగలది.
403. **మహాకామేశనయనకుముదాహ్లాదకౌముదీ**=మహేశ్వరుని నేత్రములనెడు తెల్లకలువపువ్వులకు ఆనందమును గలిగించుటయందు వెన్నెలవంటిది
404. **భక్తహార్దతమోభేదభానుమద్భానుసంతతిః**=భక్తుల హృదయమందలి అజ్ఞాన మనెడు చీకటిని పోగొట్టుట యందు సూర్యకిరణముల సము దాయమువలె అయినట్టిది.
405. **శివదూతీ**=శివుడు దూతగా గలది.
406. **శివారాధ్యా**=శివునిచే ఆరాధింపదగినది.
407. **శివమూర్తి**=శివుడే స్వరూపముగా గలది.
408. **శివంకరీ**=తన భక్తులను బ్రహ్మరూపులను జేయునది.
409. **శివప్రియా**=శివునికి ఇష్టురాలు.
410. **శివపరా**=శివునికంటె పరురాలు.
411. **శిష్టేష్టా**=సాంగవేదాధ్యయనపరులు బ్రాహ్మణులు ఇష్టముగా గలది.
412. **శిష్టపూజితా**=శిష్టులచే పూజింపబడినది.

413. **అప్రమేయా**=ప్రత్యక్షాదిప్రమాణములచే కొలుచుటకు వీలులేనిది.
414. **స్వప్రకాశా**=ఆత్మకంటె వేఱుగాని ప్రకాశము కలది.
415. **మనోవాచామగోచరా**=మనస్సునకు వాక్కులకు గోచరించునదికాదు.
416. **చిచ్ఛక్తిః**=ఔపమ్యశక్తి స్వరూపురాలు.
417. **చేతనారూపా**=సర్వచైతన్య స్వరూపురాలు.
418. **జడశక్తిః**=సృజించుటకు ఏర్పడిన మాయాపరిణామమే జడశక్తి.
419. **జడాత్మికా**=దృశ్యము కళ్లకు కన్పించునది అంతయు తన స్వరూపముగా కలది.
420. **గాయత్రీ**=గాయత్రి ఛందస్సు స్వరూపముగా కల్గినట్టిది.
421. **వ్యాహృతి**=ఉచ్చారణస్వరూపురాలు ఒకానొకమంత్రవిశేషరూపముకలది.
422. **సంధ్యా**=బ్రహ్మమానసపుత్రియగు సంధ్యాదేవి స్వరూపురాలు.
423. **ద్విజబృందనిషేవితా**=త్రైవర్ణికులచే ఉపాసింపబడినది.
424. **తత్త్వాసనా**=ముప్పదియారు తత్త్వములను యోగపీఠముగాగలది.
425. **తస్మై**=అనగా ఆ భగవత్తత్త్వము
426. **తుభ్యం**=యుష్మచ్ఛబ్దవాచ్యురాలు.
427. **అయీ-అయైనమః**=జనులందరికి తల్లిఅగుటచే అమ్మాపిలువతగినది.
428. **పంచకోశాంతరస్థితా**=అన్నమయాదిపంచకోశములలో ఆనందమయ కోశస్వరూపిణి.
429. **నిస్సీమమహిమా**=హద్దులేని మహిమగలది.
430. **నిత్యయౌవనా**=ఎల్లప్పుడు యౌవనముగలది.
431. **మదశాలినీ**=బ్రహ్మానందవృత్తితో ప్రకాశించునది.
432. **మదఘూర్ణితరాక్తాక్షీ**=మదముతో తిరుగుచున్న ఎఱ్ఱని కన్నులుగలది.
433. **మదపాటలగండభూః**=మద్యపానముచే ఎరుపు తెలుపు రంగులతో గూడిన చెక్కిళ్లు గలది.
434. **చందనద్రవదిగ్ధాంగీ**=మంచిగంధరసముతో పూయబడిన శరీరము కలది.
435. **చాంపేయకుసుమప్రియా**=దేవదారు పుష్పములు ఇష్టముగా కలది.
436. **కుశలా**=సృష్ట్యాదులను చేయుటయందునేర్పుగలది.
437. **కోమలాకారా**=సుకుమారమగు ఆకారముగలది.
438. **కురుకుళ్ళా**=విమర్శమయవాపికయందధికారముగల కురుకుళ్లాదేవీ స్వరూపురాలు.
439. **కులేశ్వరీ**=మాతృమానమేయములసముదాయములకు కులమనిపేరు.
440. **కులకుండాలయా**=మూలాధారకర్ణికమధ్యమందు బిందువునివాసము గలది.
441. **కౌళమార్గతత్పరసేవితా**=కౌలమార్గమందాసక్తి గలవారిచే సేవింపబడినది.
442. **కుమారగణనాథాంబా**=కుమారస్వామికి గణపతికి తల్లి.
443. **తుష్టిః**=సంతోషస్వరూపిణి.
444. **పుష్టి**=దేవదారువనమందు పుష్టిరూపదేవత అయినది.
445. **మతి**=జ్ఞానస్వరూపిణి.
446. **ధృతి**=ధైర్యస్వరూపురాలు.



447. **శాంతి**=జీవునికి ఆణవాదిమలములు దేనితో శాంతించుచున్నవో అది శాంతి అనబడును.
448. **స్వస్తిమతీ**=వినాశములేనిది.
449. **కాంతిః**=శక్తిస్వరూపురాలు.
450. **నందినీ**=ఆనందింపజేయునది.
451. **విఘ్ననాశినీ**=విశేషముగా జ్ఞానమునకు కలుగు విఘ్నములను పోగొట్టునది.
452. **తేజోవతీ**=సోమసూర్యాగ్ని తేజస్సులకు ఆధారమగు తేజస్సు గలది.
453. **త్రినయనా**=సూర్యచంద్రాగ్ని రూపములగు మూడునేత్రములు గలది.
454. **లోలాక్షీకామరూపిణీ**=స్త్రీలకు మన్మథస్వరూపురాలు.
455. **మాలినీ**=మాలలుగలది.
456. **హంసినీ**=యతీశ్వరులలో శ్రేష్ఠులగుహంసలు గలది.
457. **మాతా**=సకలమును సృష్టించునది మాత.
458. **మలయాచలవాసినీ**=మలయ పర్వతమందు నివసించునది.
459. **సుముఖీ**=ప్రకాశించుచున్న ముఖముగలది.
460. **నళినీ**=నళినిరూపములైన కరచరణాదులు గలది.
461. **సుభ్రూః**=శోభనములగు కనుబొమలు గలది.
462. **శోభనా**=శోభగలది.
463. **సురనాయికా**=దేవతలకు అధికమైన ఈశ్వరి.
464. **కాలకంఠీ**=నల్లనికంఠముగల శివునిభార్య.
465. **కాంతిమతీ**=కాంతిగలది.
466. **క్షోభిణీ**=సృష్టికై భగవత్తత్త్వమందు క్షోభను కలిగించునది.
467. **సూక్ష్మరూపిణీ**=తెలియశక్యముగాని స్వరూపముగలది.
468. **వజ్రేశ్వరీ**=షష్ఠీతిథినిత్యాదేవి.
469. **వామదేవీ**=సదాశివవ్యూహములో ఉన్న వామదేవునిభార్య
470. **వయోఽవస్థావివర్జితా**=బాల్యము పౌగండము, కైశోరము, మున్నగు అవస్థలులేనిది.
471. **సిద్ధేశ్వరీ**=గోరక్షకాది సిద్ధులకు ఈశ్వరి.
472. **సిద్ధవిద్యా**=ఎల్లప్పుడు సిద్ధమైన విద్యాస్వరూపిణి.
473. **సిద్ధమాతా**=సిద్ధులను సంరక్షించునది.
474. **యశస్వినీ**=దేవి గొప్పదైన కీర్తికలది.
475. **విశుద్ధిచక్రనిలయా**=కంఠమందున్న విశుద్ధిచక్రకర్ణికయే నివాసముగలది.
476. **ఆరక్తవర్ణా**=కొంచెము పాటల పుష్పపు ఎఱుపురంగు గలది.
477. **త్రిలోచనా**=నేత్ర త్రయము కలది.
478. **ఖట్వాంగాది ప్రహరణా**=ఖట్వాంగము మొదలగు ఆయుధములు గలది. మంచపుకోడు ఒక అర్థము.
479. **వదనైకసమన్వితా**=ఒక్క ముఖముతో గూడినది.

480. **పాయసాన్నప్రియా**=పరమాన్నము ఇష్టముగా గలది.
481. **త్వక్స్థా**=చర్మమునందు ఉండునది.
482. **పశులోకభయంకరీ**=పశువులకు భయమును గలిగించునది.
483. **అమృతాది మహాశక్తిసంవృతా**=అమృత మొదలగు పదునారుగురు శక్తులతో కూడినది.
484. **డాకినీశ్వరీ**=డాకిని అను పేరుగల ఈశ్వరి.
485. **అనాహతాబ్జనిలయా**=అనాహతచక్రపద్మకర్ణిక నివాసముగా కలది.
486. **శ్యామాభా**=శ్యామలవర్ణముగలది. నల్లనికాంతి కలది.
487. **వదనద్వయా**=రెండుముఖములుగలది.
488. **దంష్ట్రోజ్జ్వలా**=పెద్దకోరలతో ప్రకాశించునది.
489. **అక్షమాలాదిధరా**=జపమాలమున్నగువానిని ధరించినది.
490. **రుధిరసంస్థితా**=రక్తమునందున్నది.
491. **కాళరాత్ర్యాదిశక్త్యౌఘవృతా**=కాళరాత్రి మున్నగుశక్తులచే చుట్టుకొనబడినది.
492. **స్నిగ్ధౌదనప్రియా**=ఘృతముతో కలిసిన అన్నమందిష్టము గలది.
493. **మహావీరేంద్రవరదా**=అనేకవిధములుగా స్తుతించువారికి వరములను ఇచ్చునది.
494. **రాకిన్యంబాస్వరూపిణీ**=రాకిని అనుపేరుగల దేవీ స్వరూపముగలది.
495. **మణిపూరాబ్జనిలయా**=మణిపూరపద్మము నివాసముగాగలది.
496. **వదనత్రయసంయుతా**=మూడు ముఖములతో కూడినది.
497. **వజ్రాదికాయుధోపేతా**=వజ్రాద్యాయుధములతో గూడినది.
498. **డామర్యాదిభిరావృతా**=డామరి మున్నగుశక్తులచే ఆవరింపబడినది.
499. **రక్తవర్ణా**=ఎఱ్ఱని రంగుగలది.
500. **మాంసనిష్ఠా**=మాంసమునందు ఎక్కువగా ఉండునది మాంసధాత్వభి మానిని దేవత.
501. **గుడాన్న ప్రీతమానసా**=గుడాన్నముచే సంతోషించు మనస్సుగలది.
502. **సమస్తభక్తసుఖదా**=భక్తులందరికి సుఖములను ఇచ్చునది.
503. **లాకిన్యంబాస్వరూపిణీ**=లాకినీ అనుపేరుగల దేవీస్వరూపముఅయినట్టిది
504. **స్వాధిష్ఠానాంబుజగతా**=స్వాధిష్ఠానమను ఆరుదళములుగల పద్మమును పొంది ఉన్నట్టిది.
505. **చతుర్వక్త్రమనోహరా**= నాలుగుముఖములచే అందముగా ఉన్నది.
506. **శూలాద్యాయుధసంపన్నా**=త్రిశూలము మొదలగు ఆయుధములతో కూడినది.
507. **పీతవర్ణా**=పచ్చని పసుపురంగు గలది.
508. **అతిగర్వితా**=మిక్కిలి సౌందర్యాదిగుణములచే గర్వముకలది.
509. **మేదోనిష్ఠా**=మేదస్సు (కొవ్వు) అనుధాతువునందు ఉండునది.
510. **మధుప్రీతా**=మద్యముచే సంతోషించునది.
511. **బందిన్యాదిసమన్వితా**=బందినిమొదలు లంబోష్ఠివరకు ఆరుగురు యోగినులుగలరు.
512. **దధ్యన్నాసక్తహృదయా**=పెరుగుతో కూడిన అన్నమునకు దధ్యోదనమని పేరు అట్టి దధ్యోదనమందు ఆసక్తమగు హృదయముగలది.



513. **కాకినీరూపధారిణీ**=కాకినీరూపమును ధరించినది.
514. **మూలాధారాంబుజారూఢా**=మూలాధారపద్మమునందు ఉన్నది.
515. **పంచవక్త్రా**=అయిదు ముఖములుగలది.
516. **అస్థిసంస్థితా**=ఎముకలయందున్నది.
517. **అంకుశాది ప్రహరణా**=అంకుశము మొదలయిన ఆయుధములుగలది.
518. **వరదాదినిషేవితా**=వరదాదేవి మొదలయిన శక్తులచే సేవింపబడినది.
519. **ముద్గౌదనాసక్తచిత్తా**=పెసరపప్పు మున్నగు ద్రవ్యములతో వండిన సిద్ధాన్న మందు ఆసక్తమగుచిత్తము గలది.
520. **సాకిన్యంబాస్వరూపిణీ**=సాకినీదేవి స్వరూపముగలది.
521. **ఆజ్ఞాచక్రాబ్జనిలయా**=ఆజ్ఞాచక్రమనెడు పద్మము నివాసముగాగలది.
522. **శుక్లవర్ణా**=తెల్లనిరంగుగలది.
523. **షడాననా**=ఆరుముఖములుగలది.
524. **మజ్జాసంస్థా**=మజ్జయందున్నది.
525. **హంసవతీముఖ్యశక్తిసమన్వితా**=హంసవతీముఖ్యము ప్రధానముగాగల శక్తి క్షమావతి.
526. **హరిద్రాన్నైకరసికా**=పసుపుఅన్నము(పులిహోర)యందు రసవత్తర మయిన బుద్ధిగలది.
527. **హాకినీరూపధారిణీ**=హాకినియను పేరుగల దేవీరూపమును ధరించెడు స్వభావముగలది.
528. **సహస్రదళపద్మస్థా**=వెయ్యదళములుగల పద్మముగలదు.
529. **సర్వవర్ణోపశోభితా**=రక్తము,పీతము,శ్యామలము,పాటలము మొదలగు అనేక వర్ణములతో ప్రకాశించుచున్నది.
530. **సర్వాయుధధరా**=ఆయుధములను అన్నింటిని ధరించినది.
531. **శుక్లసంస్థితా**=వీర్యధాతువునందు ఉన్నది.
532. **సర్వతోముఖీ**=అన్నివైపులకు కన్నులు, శిరస్సులు ముఖములుగలది.
533. **సర్వౌదనప్రీతచిత్తా**=రుచికరమగు అన్నివిధములగు అన్నములచేతను సంతోషించు మనస్సుగలది.
534. **యాకిన్యంబాస్వరూపిణీ**=యాకిని అనుపేరుగల యోగినీదేవి స్వరూపము గలది.
535. **స్వాహా**=స్వర్గముకొరకయిన స్వాహా, స్వధా, శ్రౌషట్, వౌషట్ ఇత్యాద్యర్థా హుతి స్వరూపురాలు.
536. **స్వధా**=ఈశబ్దముచే అగ్నియందు పితృదేవతలకు హోమద్రవ్యము చక్కగ ఉంచబడుచున్నది.
537. **అమతిః**=అబుద్ధిపూర్వకసృష్టి స్వరూపురాలు.
538. **మేధా**=మేధృసంగమే అను ధాతురూపము మేధా అగును.
539. **శ్రుతిః**=వేదస్వరూపురాలు.

540. **స్మృతిః**=మన్వాదిస్మృతి స్వరూపురాలు.
541. **అనుత్తమా**=అన్నిటికంటె ఉత్తమమయినది.
542. **పుణ్యకీర్తి**=పుణ్యమును ఇచ్చునట్టి కీర్తికలది.
543. **పుణ్యలాభ్యా**=అధికమగుపూర్వపుణ్యములచేత పొందదగినది.
544. **పుణ్యశ్రవణకీర్తనా**=పుణ్యస్వరూపమైనచరిత్ర శ్రవణము కీర్తనముగలది.
545. **పులోమజార్చితా**=దేవేంద్రునిభార్య శచీదేవిచే పూజింపబడినది.
546. **బన్ధమోచనీ**=అజ్ఞానబంధమునుండి విడిపించునది.
547. **బన్ధురాలకా**=ఎత్తుపల్లములుగల జుట్టుగలది.
548. **విమర్శరూపిణీ**=పరమాత్మయొక్క స్వాభావికమైన ప్రకాశముగలది.
549. **విద్యా**=జ్ఞానస్వరూపురాలు.
550. **వియదాదిజగత్ప్రసూః**=ఆకాశము మొదలు జగత్తంటిని కలిగించునది.
551. **సర్వవ్యాధిప్రశమనీ**=అన్నిరోగములను పోగొట్టునది.
552. **సర్వమృత్యునివారిణీ**=అన్నిరకములగు మృత్యువులను పోగొట్టునది.
553. **అగ్రగణ్యా**=అన్నిటికంటె ముందుగా లెక్కింపదగినది.
554. **అచిన్త్యరూపా**=జగత్తంతయు త్రిగుణాత్మకము అయినది.
555. **కలికల్మషనాశినీ**=కలియుగములో అధికములగుపాపములుపోగొట్టునది.
556. **కాత్యాయనీ**=కతుడను మహర్షియొక్క స్త్రీసంతానము.
557. **కాలహంత్రీ**=మృత్యువును చంపునది.
558. **కమలాక్షనిషేవితా**=విష్ణుమూర్తిచే మిక్కిలి ఉపాసింపబడినది.
559. **తాంబూలపూరితముఖీ**=నోటినిండా తాంబూలమున్నదని భావము.
560. **దాడిమీకుసుమప్రభా**=దానిమ్మపువ్వువలె ఎఱ్ఱనయిన కాంతిగలది.
561. **మృగాక్షీ**=లేడికన్నులవలెచంచలముగా సొగసుగాను ఉన్న కన్నులుగలది.
562. **మోహినీ**=మోహినీఅవతారస్వరూపమును పొందినది.
563. **ముఖ్యా**=వేదములో సృష్టిలోఅన్నిటికంటె మొదట నేను పుట్టితినిఅని గలదు.
564. **మృడానీ**=శంకరుని భార్య.
565. **మిత్రరూపిణీ**=సూర్యులవంటి రూపము గలది.
566. **నిత్యతృప్తా**=సర్వకాలములందు తృప్తిగలది.
567. **భక్తనిధి**=భక్తులకోరికలనన్నిటిని నెరవేర్చుటవలన భక్తనిధి అని చెప్పబడు చున్నది.
568. **నియంత్రీ**=జగములను అన్నిటిని నియమించునది.
569. **నిఖిలేశ్వరీ**=సమస్త ప్రపంచమునకు స్వామిని.
570. **మైత్ర్యాదివాసనాలభ్యా**=మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షఅని వాసనలు నాలుగు కలవు.



571. **మహాప్రళయసాక్షిణీ**=మహాప్రళయమందు సాక్షిభూతురాలైఉండునది.
572. **పరాశక్తిః**=పరామంత్రము యొక్క శక్తిస్వరూపురాలు.
573. **పరానిష్ఠా**=జ్ఞానస్వరూపము.
574. **ప్రజ్ఞానఘనరూపిణీ**=లేశమైనను అజ్ఞానసంపర్కములేనిది.
575. **మాధ్వీపానాలసా**=ద్రాక్షాసవమును త్రాగుటచే పారవశ్యముతోనున్నది.
576. **మత్తా**=మదించినదివలె యున్నది.
577. **మాతృకావర్ణరూపిణీ**=మాతృకావర్ణములన్నింటికి గల రంగులు స్వరూప ముగా కలది.
578. **మహాకైలాసనిలయా**=కైలాసప్రస్తారమే నివాసముగా గలది.
579. **మృణాళమృదుదోర్లతా**=ఈమె బాహువులు లతలవలె తామరతూడులోని దారములవలె మృదువులైఉన్నవి.
580. **మహనీయా**=గొప్పపూజ్యురాలు.
581. **దయామూర్తి**=దయయే స్వరూపముగా గలది.
582. **మహాసామ్రాజ్యశాలినీ**=మహాకైలాసమే మహాసామ్రాజ్యము.
583. **ఆత్మవిద్యా**=ఆత్మజ్ఞానస్వరూపురాలు.
584. **మహావిద్యా**=అనర్థములను నివారించెడి గొప్పజ్ఞానస్వరూపురాలు.
585. **శ్రీవిద్యా**=పంచదశీవిద్యాస్వరూపురాలు.
586. **కామసేవితా**=మహాకామేశ్వరునిచే సేవింపబడినది.
587. **శ్రీషోడశాక్షరీవిద్యా**=పూజ్యమయిన పదునారక్షరములుగలవిద్యా స్వరూపురాలు.
588. **త్రికూటా**=త్రిత్వసంఖ్యగలవాని సముదాయముగలది.
589. **కామకోటికా**=ఏకదేశమందు గలది.
590. **కటాక్షకింకరీభూతకమలాకోటిసేవితా**=క్రీగంటిచూపులకు సేవకు రాండ్రయిన కోట్లకొలది లక్ష్ములు గలది.
591. **శిరస్థితా**=బ్రహ్మరంధ్రమునందు గురురూపముతో ఉండునది.
592. **చంద్రనిభా**=శ్రీవిద్యామంత్రతృతీయకూటాత్మకచంద్రస్వరూపమైనది.
593. **ఫాలస్థా**=ఫాలమందు బిందురూపముగ ఉన్నది.
594. **ఇంద్రధనుః ప్రభా**=ఇంద్రధనుస్సువలె అనేకవర్ణములు కలది.
595. **హృదయస్థా**=హృదయమందు ధ్యేయస్వరూపముననున్నది.
596. **రవిప్రఖ్యా**=సూర్యునికాంతితో సమానమగుకాంతిగలది.
597. **త్రికోణాంతరదీపికా**=మూలాధార పద్మకర్ణికలోని త్రికోణమందు దీపమువలె నున్నది.
598. **దాక్షాయణీ**=దక్షునికుమార్తె.
599. **దైత్యహంత్రీ**=భండుడు మున్నగురాక్షసులను చంపినది.
600. **దక్షయజ్ఞవినాశినీ**=దక్షుని యజ్ఞమును నశింపజేసినది.

601. **దరాందోళితదీర్ఘాక్షీ**=కొంచెముగా కదలుచున్న విశాలమైనదీర్ఘములైన కన్నులు కలది.
602. **దరహాసోజ్జ్వలన్ముఖీ**=చిరునవ్వుతో శోభించుచున్న ముఖముగలది.
603. **గురుమూర్తిః**=గురువే శరీరముగా గలది.
604. **గుణనిధిః**=గుణములకు గనియైనది.
605. **గోమాతా**=గోవులకు తల్లియగు సురభిస్వరూపురాలు.
606. **గుహజన్మభూః**=గుహునితల్లి.
607. **దేవేశీ**=బ్రహ్మవిష్ణువు మున్నగుదేవులకు ఈశాని అయినది.
608. **దండనీతిస్థా**=నీతిశాస్త్రజ్ఞురాలు.
609. **దహరాకాశరూపిణీ**=దహరము సూక్ష్మము అందలి ఆకాశము పరబ్రహ్మము.
610. **ప్రతిపన్ముఖ్యరాకాంత తిథిమండలపూజితా**=కామేశ్వరి మొదలు చిత్ర వరకుగల తిథినిత్యలచే పూజింపబడినది.
611. **కళాత్మికా**=నిఖిలములగు చతుష్షష్టి కళలే స్వరూపముగా కలది.
612. **కలానాథా**=అన్ని కళలను స్వామిని అయినది.
613. **కావ్యాలాపవినోదినీ**=కావ్యముల ఉక్తులతో విశేషముగా సంతోషించునది.
614. **సచామరరమావాణీసవ్యదక్షిణసేవితా**=లక్ష్మి సరస్వతులు కుడి ఎడమల నుండి దేవికి వీచుచున్నారు.
615. **ఆదిశక్తిః**=అన్నిటికంటె ముందుగనున్న శక్తిస్వరూపురాలు.
616. **అమేయా**=కొలవ నలవిగానిది.
617. **ఆత్మ**=జీవస్వరూపురాలు.
618. **పరమా**=పరబ్రహ్మకుగల నాలుగురూపములకంటె ఉత్కృష్టమయిన రూపుకలది.
619. **పావనాకృతిః**=పవిత్రీకరింపజేయు ఆకారముగలది.
620. **అనేకకోటిబ్రహ్మాండజననీ**=అనేక కోట్లకొలది బ్రహ్మాండములను సృజించిన జనని.
621. **దివ్యవిగ్రహా**=రమణీయమగు శరీరముగలది.
622. **క్లీంకారీ**=కామబీజస్వరూపురాలు.
623. **కేవలా**=అద్వితీయురాలు.
624. **గుహ్యా**=బుద్ధి గుహయందు ప్రవేశించునది.
625. **కైవల్యపదదాయినీ**=కైవల్యపదము నిరతిశయబ్రహ్మత్వముఇచ్చునది.
626. **త్రిపురా**=బ్రహ్మ,విష్ణు,మహేశ్వర మూర్తిత్రయముకంటె ముందున్నది.
627. **త్రిజగద్వంద్యా**=త్రిజగత్తులచే నమస్కరింపదగినది.
628. **త్రిమూర్తిః**=సత్త్వాదిగుణత్రయశక్తిస్వరూపురాలు.
629. **త్రిదశేశ్వరీ**=మూడవస్థలకు ఈశ్వరి.
630. **త్ర్యక్షరీ**=వాక్కామశక్తిబీజములు మూడు అక్షరములు కలది.



631. **దివ్యగంధాఢ్యా**=దివ్యగంధపరిమళాల సంబంధముతోఒప్పారునది.
632. **సిందూరతిలకాంచితా**=ఎర్రనిచూర్ణముతోపెట్టిన తిలకముతో గూడినది.
633. **ఉమా**=శంకరునిభార్య
634. **శైలేంద్రతనయా**=పర్వతరాజగు హిమవంతునిపుత్రిక.
635. **గౌరీ**=తెల్లవర్ణముగలది.
636. **గంధర్వసేవితా**=గంధర్వులచేసేవింపబడినది.
637. **విశ్వగర్భా**=లోకములన్నియు తనగర్భమున గలది.
638. **స్వర్ణగర్భా**=సువర్ణము గర్భమందు గలది.
639. **అవరదా**=అవార్యులగు రాక్షసులను ఖండించునది.
640. **వాగధీశ్వరీ**=వాక్కులన్నిటికిని ఈశ్వరి అయినది.
641. **ధ్యానగమ్యా**=ధ్యానయోగముచే క్రమముగా ఆత్మశక్తిని తనగుణములచేత రహస్యముగానున్నట్టి దేవి.
642. **అపరిచ్ఛేద్యా**=దేశకాలవస్తువులచే పరిచ్ఛిన్నురాలుకానిది.
643. **జ్ఞానదా**=మోక్షమును కలిగించు జ్ఞానమిచ్చునది.
644. **జ్ఞానవిగ్రహా**=జ్ఞానమే శరీరముగాకలది.
645. **సర్వవేదాంతసంవేద్యా**=ఉపనిషత్తులన్నింటిని పొందియున్నది.
646. **సత్యానందస్వరూపిణీ**=సత్యము ఆనందము స్వరూపముగాగలది.
647. **లోపాముద్రార్చితా**=లోపాముద్రచే పూజింపబడినది.
648. **లీలాక్లప్తబ్రహ్మాండమండలా**=అనాయాసముగా అనేక బ్రహ్మాండములను నిర్మించినది.
649. **అదృశ్యా**=చక్షురాదీంద్రియగోచరముకానిది.
650. **దృశ్యరహితా**=పరమార్థదశలోలేనిది.
651. **విజ్ఞాత్రీ**=విశేషముగా తెలిసికొనునది.
652. **వేద్యవర్జితా**=తనకంటె భిన్నమయినది తెలియదగినది ఏమీలేనిది.
653. **యోగినీ**=పరమాత్మతో ఐక్యభావము ఇచ్చునది.
654. **యోగదా**=ఏకత్వభావమును ఇచ్చునది.
655. **యోగ్యా**=విసయభోగయోగములను కలిగించునది.
656. **యోగానందా**=శివశక్తిసామరస్యానందము గలది.
657. **యుగంధరా**=సకలలోకభారమునుమోయునది.
658. **ఇచ్ఛాశక్తిజ్ఞానశక్తి క్రియాశక్తిస్వరూపిణీ**=ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులు మూడు శరీరముగా కలది.
659. **సర్వాధారా**=సర్వజగత్తులు ఆధారముగా కలది.
660. **సుప్రతిష్ఠా**=జగత్తునకు అధిష్ఠానమైనది.
661. **సదసద్రూపధారిణీ**=సత్తు అసత్తు రూపములు రెండును గలది.
662. **అష్టమూర్తి**=లక్ష్మిమొదలగు ఎనిమిది మూర్తులుగలది.

663. **అజాజైత్రీ**=అవిద్యను నశింపజేయునది.
664. **లోకయాత్రావిధాయినీ**=ప్రళయ సంరక్షణములచేయుస్వభావముకలది.
665. **ఏకాకినీ**=అద్వితీయురాలు.
666. **భూమరూపా**=బ్రహ్మస్వరూపురాలు.
667. **నిర్ద్వైతా**=ద్వైతభావములేనిది.
668. **ద్వైతవర్జితా**=ఎల్లప్పుడు భేదములేనిది.
669. **అన్నదా**=ప్రజలకు అన్నము ఇచ్చునది.
670. **వసుదా**=ధనమును ఇచ్చునది.
671. **వృద్ధా**=వృద్ధురాలు.
672. **బ్రహ్మాత్మైక్యస్వరూపిణీ**=చైతన్యముతో జీవులందరు ఐక్యమును పొందు టయే తన నిజస్వరూపముగా కలది.
673. **బృహతీ**=గొప్పవానికి అన్నిటికంటె గొప్పది.
674. **బ్రాహ్మణీ**=బ్రాహ్మణస్త్రీ అయినది.
675. **బ్రాహ్మీ**=బ్రహ్మచైతన్యస్వరూపురాలు.
676. **బ్రహ్మానందా**=బ్రహ్మానందముగలది.
677. **బలిప్రియా**=వామనమూర్తిస్వరూపులు.
678. **భాషారూపా**=సంస్కృత ప్రాకృతాది భాషలు స్వరూపముగాగలది.
679. **బృహత్సేనా**=హద్దులేనంత చతురంగ బలముగలది.
680. **భావాభావవివర్జితా**=దేవి భావాభావ వివర్జితఅగుచున్నది.
681. **సుఖారాధ్యా**=ఉపవాసాదికాయక్లేశములు లేకుండ సుఖముగా పూజింపదగినది.
682. **శుభకరీ**=పుణ్యమును కలిగించునది.
683. **శోభనాసులభాగతిః**=పురుషార్థరూపము సుఖోపాస్యమగు గమ్యస్థానము అయినది.
684. **రాజరాజేశ్వరీ**=రాజరాజుల కుబేరాదులకు ఈశ్వరి.
685. **రాజ్యదాయినీ**=స్వర్గాధిపత్యముమున్నగువానిని ఇచ్చునది.
686. **రాజ్యవల్లభా**=స్వర్గాదిరాజ్యములందు ఇష్టముగలది.
687. **రాజత్కృపా**=ప్రకాశించుచున్నదయగలది.
688. **రాజపీఠనివేశితనిజాశ్రితా**=తనను ఆశ్రయించుకొని ఉన్న భక్తులకు రాజసింహాసనములను కలిగించినది.
689. **రాజ్యలక్ష్మీః**=రాజ్యమందభిమానముగల లక్ష్మి.
690. **కోశనాథా**=దేవతలధనాగారమునకు స్వామిని.
691. **చతురంగబలేశ్వరీ**=చతురంగములతోగూడిన సేనకు ఈశ్వరి.
692. **సామ్రాజ్యదాయినీ**=సామ్రాజ్యమును ఇచ్చునది.



693. **సత్యసంధా**=సత్యమగుప్రతిజ్ఞా మర్యాదలు గలది.
694. **సాగరమేఖలా**=భూస్వరూపురాలు.
695. **దీక్షితా**=జ్ఞానమునుగలిగించు దీక్షగలవాని స్వరూపమైనది.
696. **దైత్యశమనీ**=భండాది రాక్షసులను నశింపజేసినది.
697. **సర్వలోకవశంకరీ**=అన్నిలోకములను తన అధీనమునందు ఉంచుకొనునది.
698. **సర్వార్థదాత్రీ**=ధర్మాది పురుషార్థములను కోరిన కోరికలనుఇచ్చునది.
699. **సావిత్రీ**=లోకములన్నింటిని పుట్టించు పరమశివునిభార్య.
700. **సచ్చిదానందరూపిణీ**=సచ్చిదానందములు స్వరూపములుగలది.
701. **దేశకాలాపరిచ్ఛిన్నా**=దేశకాలములచే కొలచుటకు శక్యముకానిది.
702. **సర్వగా**=సకల స్వరూపములతో అభేదమును పొందియున్నది.
703. **సర్వమోహినీ**=అందరిని మోహపెట్టునది.
704. **సరస్వతీ**=జ్ఞానాధిష్ఠానదేవత.
705. **శాస్త్రమయీ**=శాస్త్రముచే ప్రధానముగా బోధింపబడునది.
706. **గుహాంబా**=హృదయగుహయందున్న తల్లి.
707. **గుహ్యరూపిణీ**=దహరమందలి జ్ఞానస్వరూపురాలు.
708. **సర్వోపాధివినిర్ముక్తా**=ఉపాధి ధర్మశూన్యురాలు.
709. **సదాశివపతివ్రతా**=సదాశివుని పతివ్రతయగు భార్య.
710. **సంప్రదాయేశ్వరీ**=సంప్రదాదయములందు సమర్థురాలు.
711. **సాధు**=సంప్రదాయముచే తెలియదగినది ఇదియే ఉచితము.
712. **ఈ. (యైనమః)**=ఉచితమైనది. (తురీయస్వరూపురాలు)
713. **గురుమండలరూపిణీ**=గురువుల సముదాయమే నిరూపణగా గలది.
714. **కులోత్తీర్ణాః**=ఇంద్రియ సముదాయమునకు గోచరించనది.
715. **భగారాధ్యా**=సూర్యమండలమందు ఉపాసింపదగినది.
716. **మాయా**=విచిత్రకార్యకర్తృత్వము.
717. **మధుమతీ**=పూజాదులలో తేనెపుష్పరసము గలది.
718. **మహీ**=భూమిస్వరూపురాలు.
719. **గణాంబా**=ప్రమథాది గణములకు తల్లి.
720. **గుహ్యకారాధ్యా**=గుహ్యకులచే ఆరాధింపదగినది.
721. **కోమలాంగీ**=సుకుమారావయవములు గలది.
722. **గరుప్రియా**=గురువులందిష్టముగలది.
723. **స్వతంత్రా**=పరాధీనములేనిది.
724. **సర్వతంత్రేశీ**=అరువదినాలుగు తంత్రములకు స్వామిని.
725. **దక్షిణామూర్తిరూపిణీ**=దక్షిణామూర్తి స్వరూపముగా గలది.

726. **సనకాదిసమారాధ్యా**=సనకాది మహాయోగులచే నుపాసింపదగినది.
727. **శివజ్ఞానప్రదాయినీ**=శివునిగూర్చిన జ్ఞానమును అధికముగాఇచ్చునది.
728. **చిత్కలా**=అఖండచైతన్యములోని అంశముగలది.
729. **ఆనందకలికా**=అఖండానందములో అంశమాత్రమే గలది.
730. **ప్రేమరూపా**=ప్రేమయే స్వరూపముగా గలది.
731. **ప్రియంకరీ**=భక్తులకు ఇష్టమును జేయునది.
732. **నామపారాయణప్రీతా**=సహస్రనామపారాయణముచే సంతోషించునది.
733. **నందివిద్యా**=నందికేశ్వరుడు ఉపాసించినవిద్యాస్వరూపురాలు.
734. **నటేశ్వరీ**=చిదంబరనటేశ్వరుని అనుకరించునది.
735. **మిథ్యాజగదధిష్ఠానా**=అసత్యమగు జగత్తుభాసించుటకు ఆధారమైనది.
736. **ముక్తిదా**=మోక్షమును ఇచ్చునది.
737. **ముక్తిరూపిణీ**=మోక్షమే స్వరూపముగా గలది.
738. **లాస్యప్రియా**=నర్తన ఇష్టమైనది.
739. **లయకరీ**=చిత్తమును లయింపజేయునది.
740. **లజ్జా**=లజ్జారూపురాలు.
741. **రంభాదివందితా**=రంభ మున్నగు అప్సర స్త్రీలచే నమస్కరింపబడినది.
742. **భవదావసుధావృష్టిః**=సంసారమనెడు దావాగ్నిని శాంతింజేయు అమృత వర్షస్వరూపురాలు.
743. **పాపారణ్యదవానలా**=పాపములనెడు అరణ్యమునకు దావాగ్నివంటిది.
744. **దౌర్భాగ్యతూలవాతూలా**=దారిద్ర్యమనెడు దూదికి సుడిగాలివంటిది.
745. **జరాధ్వాంతరవిప్రభాః**=సూర్యకాంతి చీకటిని పోగొట్టునట్లు దేవి ముసలి తనమను చీకటిని పోగొట్టును.
746. **భాగ్యాబ్ధిచంద్రికా**=భాగ్యము అనెడి సముద్రమునకు వెన్నెలవంటిది.
747. **భక్తచిత్తకేకిఘనాఘనా**=భక్తులమనస్సులనెడు నెమళ్ళకు వర్షించు మేఘము వంటిది.
748. **రోగపర్వతదంభోళిః**=రోగాలనెడి కొండలకు వజ్రాయుధమువంటిది.
749. **మృత్యుదారుకుఠారికా**=మృత్యువనెడు కట్టెలకు గొడ్డలివంటిది.
750. **మహేశ్వరీ**=చాలాగొప్ప ఈశ్వరి.
751. **మహాకాళీ**=మిక్కిలి నల్లనైనది.
752. **మహాగ్రాసా**=అపరిమితమగు తిండి గలది.
753. **మహాశనా**=చరాచరజగత్తు అంతయు ఆహారముగాగలది.
754. **అపర్ణా**=నాశనములేనిది పతనము లేనిది కాన అపర్ణ.
755. **చండికా**=భక్తిలేనివారియందు కోపముగలది.



756. **చండముండాసురనిషూదినీ**=చండముండులను రాక్షసులను సంహరించినది.
757. **క్షరాక్షరాత్మికా**=సర్వభూతములు కూటస్థుడు స్వరూపముగా గలది.
758. **సర్వలోకేశీ**=అన్నిలోకములకు ఈశ్వరి.
759. **విశ్వధారిణీ**=సమస్తమును ధరించినది.
760. **త్రివర్గదాత్రీ**=ధర్మార్థకామములను ఇచ్చునది.
761. **సుభగా**=లోకత్రయమందలి చరాచరహితసౌభాగ్యాస్వరూపురాలు.
762. **త్ర్యంబకా**=సూర్యచంద్రాగ్నులు ముమ్వురు మూడునేత్రములుగా గలది.
763. **త్రిగుణాత్మికా**=త్రిగుణముల సామ్యస్వరూపురాలు.
764. **స్వర్గాపవర్గదా**=నిత్యానిత్య సుఖములు రెండింటిని ఇచ్చునది.
765. **శుద్ధా**=అవిద్యచే గలిగినమాలిన్యదోషములులేనిది.
766. **జపాపుష్పనిభాకృతిః**=మంకెనపువ్వుతో సమానమగు ఆకారముగలది.
767. **ఓజోవతీ**=ధాతుప్రకాశము, బలము దీప్తిఅనిఅర్థముకలదు.
768. **ద్యుతిధరా**=కాంతిని ధరించునది.
769. **యజ్ఞరూపా**=యజ్ఞములు స్వరూపముగా గలది.
770. **ప్రియవ్రతా**=ప్రియమైన వ్రతములుగలది.
771. **దురారాధ్యా**=ఇంద్రియ నిగ్రహములేనివార్కి దేవిని కష్టముగా ఆరాధింపదగినది.
772. **దురాధర్షా**=ఇంద్రియ నిగ్రహములేనివాక్కి దేవిని తనకనుకూలముగా అనుగ్రహింపచేసికొనుట అసాధ్యము.
773. **పాటలీకుసుమప్రియా**=పాటలీపుష్పము ఇష్టముగాగలది.
774. **మహతీ**=పరిమాణములో అన్నిటికంటె గొప్పది.
775. **మేరునిలయా**=మేరుపర్వతము నివాసముగా గలది.
776. **మందారకుసుమప్రియా**=మందారపుష్పములు ఇష్టముగాకలది.
777. **వీరారాధ్యా**=వీరులచే ఆరాధింపదగినది.
778. **విరాడ్రూపా**=విరాట్పురుష స్వరూపిణి.
779. **విరజా**=పాపరహితురాలు.
780. **విశ్వతోముఖీ**=అంతట నేత్రములు, ముఖములు, హస్తములు గలది.
781. **ప్రత్యగ్రూపా**=ప్రత్యగాత్మస్వరూపురాలు.
782. **పరాకాశా**=ఉత్కృష్టమగు ఆకాశము అయినట్టిది.
783. **ప్రాణదా**=ప్రాణాపానవ్యానోదాన సమానవాయువులను ఇచ్చునది.
784. **ప్రాణరూపిణీ**=ప్రాణాత్మస్వరూపిణి.
785. **మార్తాండభైరవారాధ్యా**=మార్తాండభైరవునిచే ఆరాధింపబడినది.
786. **మంత్రిణీన్యస్తరాజ్యధూః**=మంత్రిణియందుంచిన రాజ్యభారముగలది.

787.**త్రిపురేశీ**=సర్వాశాపరిపూరక చక్రాధీశ్వరికి త్రిపురేశి అనినామముగలదు.
788.**జయత్సేనా**=యుద్ధములలో అంతట జయించునట్టి సేనగలది.
789.**నిస్త్రైగుణ్యా**=సత్త్వరజస్తమోగుణత్రయ ధర్మములు లేనిది.
790.**పరాపరా**=పరాపరశబ్దవాచ్యార్థస్వరూపురాలు.
791.**సత్యజ్ఞానానందరూపా**=సత్యము జ్ఞానము ఆనందము స్వరూపముగా గలది.
792.**సామరస్యపరాయణా**=హెచ్చుతగ్గులులేని శివశక్తిధర్మము నివాసముగా గలది.
793.**కపర్దినీ**=కపర్దిఅను శంకరునిభార్య.
794.**కలామాలా**=64 కళలు మాలగా గలది.
795.**కామధుక్**=కోరికలను నెరవేర్చునది.
796.**కామరూపిణీ**=పరమశివుడే రూపముగాగలది.
797.**కలానిధిః**=కళలకు నిధియైనది.
798.**కావ్యకలా**=కావ్యకళాస్వరూపురాలు.
799.**రసజ్ఞా**=శృంగారాదిరసములు.
800.**రసశేవధిః**=బ్రహ్మానందరసమునకు గనియైనది.
801.**పుష్టా**=ముప్పదియారుతత్త్వములతో కూడిన శరీరముకలది.
802.**పురాతనా**=అన్నిటికంటె ఆదియందున్నది.
803.**పూజ్యా**=అందరికిని పూజింపదగినది.
804.**పుష్కరా**=అందరికిని పుష్టినికలిగించునది.
805.**పుష్కరేక్షణా**=తామరపువ్వులవంటి కన్నులుకలది.
806.**పరంజ్యోతి**=బ్రహ్మాత్మకమైన జ్యోతిస్సు
807.**పరంధామ**=ఉత్కృష్టమగు స్వరూపురాలు.
808.**పరమాణుః**=మిక్కిలిసూక్ష్మముల కంటె సూక్ష్మమైనది.
809.**పరాత్పరా**=బ్రహ్మాదులకంటె ఉత్కృష్టమైనది.
810.**పాశహస్తా**=ఎడమవైపుఉన్న క్రిందిచేతిలో పాశమునుధరించినది.
811.**పాశహంత్రీ**=పాశములను నశింపజేయునది.
812.**పరమంత్రవిభేదినీ**=శత్రువులు ప్రయోగించిన శస్త్రాస్త్రములను ఛేదించునది.
813.**మూర్తా**=రూపముగలవస్తువు
814.**అమూర్తా**=మూర్తద్రవ్యరూపమైనది.
815.**అనిత్యతృప్తా**=భక్తిఉన్నచో ఏవిధముగా పూజించిననుతృప్తిపొందినది.
816.**మునిమానసహంసికా**=మునుల మనస్సుఅనెడు మానసరోవరమందుండునట్టి ఆడుహంస.
817.**సత్యవ్రతా**=సత్యమునుపలుకుట అనువ్రతముచే పొందదగినది.
818.**సత్యరూపా**=సత్యము రూపవంతముగాజేసి రక్షించునది.



819.**సర్వాంతర్యామినీ**=సర్వులయొక్క అంతఃకరణములను నియమించునది.
820.**సతీ**=పాతివ్రత్యము సద్రూపత్వమువలనను సతీదేవి అయినది.
821.**బ్రహ్మాణీ**=బ్రహ్మపుచ్ఛ స్వరూపురాలు.
822.**బ్రహ్మ**=ముక్తులగు వారిచే పొందబడిన స్వాత్మాభిన్నమైన ఆత్మజ్ఞాన స్వరూపమని అర్థము.
823.**జననీ**=ప్రపంచములన్నిటికి మాత.
824.**బహురూపా**=అనేకరూపములు గలది.
825.**బుధార్చితా**=జ్ఞానులచే పూజింపబడినది.
826.**ప్రసవిత్రీ**=పురాణములందు సమస్తమును పుట్టించునది అని కలదు.
827.**ప్రచండా**=మిక్కిలి కోపముగల దూతలు గలది.
828.**ఆజ్ఞా**=భగవదిచ్ఛారూపురాలు వేదమందలి విధినిషేధస్వరూపురాలు.
829.**ప్రతిష్ఠా**=ఈమెయందు విశ్వమంతయు ఉనికి కలిగి వున్నది.
830.**ప్రకటాకృతి**=అందరికి తెలియుచున్న ఆకారముగలది.
831.**ప్రాణేశ్వరీ**=ప్రాణములకు ఆధారమైనది.
832.**ప్రాణదాత్రీ**=ప్రాణములను ఇచ్చునది.
833.**పంచాశత్పీఠరూపిణీ**=ఏబదియొక్క పీఠముల స్వరూపముగలది.
834.**విశృంఖలా**=కర్మబంధములేనిది.
835.**వివిక్తస్థా**=విజనప్రదేశమందుండునది.
836.**వీరమాతా**=గొప్ప ఉపాసకులకుతల్లి.
837.**వియత్ప్రసూః**=ఆకాశమును పుట్టించినది లేక ప్రసవించినది.
838.**ముకుందా**=మోక్షమును ఇచ్చునది.
839.**ముక్తినిలయా**=ముక్తులకు నివాసమయినది.
840.**మూలవిగ్రహరూపిణీ**=రాజరాజేశ్వరీ స్వరూపురాలు.
841.**భావజ్ఞా**=భావములను తెలిసినది.
842.**భవరోగఘ్నీ**=సంసారమనెడురోగమును పోగొట్టునది.
843.**భవచక్రప్రవర్తినీ**=సంసారసముదాయమును ప్రవర్తింపజేయునది.
844.**ఛందస్సారా**=వేదములలో సారభూతమయినది గాయత్రీ గుప్తగాయత్రీ స్వరూపమైనది.
845.**శాస్త్రసారా**=వేదమే బలముగా గలది.
846.**మంత్రసారా**=తాంత్రికమంత్రములతో నిష్కర్షచేయబడిన రూపము గలది.
847.**తలోదరీ**=కృశించిన ఉదరము గలది.
848.**ఉదారకీర్తిః**=దేవతలకీర్తికంటె అధికమగు కీర్తిని ఇచ్చునది.

849. **ఉద్దామవైభవా**=హద్దులేని వైభవముగలది.
850. **వర్ణరూపిణీ**=అక్షరములే స్వరూపముగా గలది.
851. **జన్మమృత్యుజరాతప్తజనవిశ్రాంతిదాయినీ**=జన్మాదిత్రయముచే తపింప బడినవారికి బ్రహ్మసుఖము ఇచ్చునది.
852. **సర్వోపనిషదుద్ఘుష్టా**=సకలోపనిషత్తులందు రహస్యాతి రహస్యముగా బోధింపబడిన శక్తిస్వరూపము.
853. **శాంత్యతీతకలాత్మికా**=పరమాత్మ కళాస్వరూపురాలు.
854. **గంభీరా**=అంతములేనిది.
855. **గగనాంతస్థా**=దహరాకాశమధ్యమునందున్నది.
856. **గర్వితా**=జగన్నిర్మాణ విషయకమగుపరాహంత గలది.
857. **గానలోలుపా**=గొంతెత్తిపాడినపాటయందాసక్తి గలది.
858. **కల్పనారహితా**=విషయవాసనాత్మక కల్పనలులేనిది.
859. **కాష్ఠా**=పదునెనిమిదిమేషముల కాలస్వరూపురాలు.
860. **అకాంతా**=దుఃఖనాశము చేయునది.
861. **కాంతార్ధవిగ్రహా**=పరమశివుడే సగముశరీరముగా గలది.
862. **కార్యకారణనిర్ముక్తా**=కార్యకారణములు ఈ రెండును లేనట్టిది.
863. **కామకేళీతరంగితా**=కామేశ్వరునికి క్రీడావిలాసపరంపరలు గలిగించినది
864. **కనత్కనకతాటంకా**=ప్రకాశించుచున్న బంగారుకర్ణాభరణములు చెవి కమ్మలు గలది.
865. **లీలావిగ్రహధారిణీ**=విలాసముగా అనేకావతారములను ధరించునది.
866. **అజా**=జననములేనిది.
867. **క్షయవినిర్ముక్తా**=మరణములేనిది.
868. **ముగ్ధా**=సౌందర్యముగలది.
869. **క్షిప్రప్రసాదినీ**=శీఘ్రముగా అనుగ్రహమును జూపునది.
870. **అంతర్ముఖసమారాధ్యా**=అంతర్ముఖులచే ఆరాధింపదగినది.
871. **బహిర్ముఖసదుర్లభా**=విషయాసక్తి గలవారికి లభ్యముకానిది.
872. **త్రయీ**=వేదత్రయస్వరూపురాలు.
873. **త్రివర్గనిలయా**=ధర్మార్థకామములకు నివాసమయినది.
874. **త్రిస్థా**=త్రికాలములందు ఉండునది.
875. **త్రిపురమాలినీ**=త్రిపురమాలినీదేవతాస్వరూపురాలు.
876. **నిరామయా**=నశించినవ్యాధులు కల్గినది.
877. **నిరాలంబా**=తనకువేఱొక ఆధారములేనిది.
878. **స్వాత్మారామా**=తన ఆత్మయందే తాను క్రీడించునది.



879. **సుధాస్రుతిః**=అమృతస్రావమునుకలిగించు కుండలినీ స్వరూపురాలు.
880. **సంసారపంకనిర్మగ్నసముద్ధరణపండితా**=సంసారమనెడు బురదయందు మునిగినవారిని చక్కగా పైకి లేవదీయుటయందు నేర్పుగలది.
881. **యజ్ఞప్రియా**=యజ్ఞములు ఇష్టముగా గలది.
882. **యజ్ఞకర్త్రీ**=యజ్ఞమును చేయునది.
883. **యజమానస్వరూపిణీ**=యజమానుడు, ఆత్మ రెండును స్వరూపముగా గలది.
884. **ధర్మాధారా**=ధర్మము నిలబడుటకు ఆధారమయినది.
885. **ధనాధ్యక్షా**=ధనమునకు స్వామిని.
886. **ధనధాన్యవివర్ధినీ**=ధనధాన్యములను అధికముగా వృద్ధిచెందించునది.
887. **విప్రప్రియా**=విప్రులు ఇష్టులుగా గలది.
888. **విప్రరూపా**=విప్రుడు స్వరూపముగా గలది.
889. **విశ్వభ్రమణకారిణీ**=అనేక బ్రహ్మాండములభ్రమణమును చేయించుచున్నట్టిది.
890. **విశ్వగ్రాసా**=సకలప్రపంచము కబలముగా కలది.
891. **విద్రుమాభా**=పగడమువలె ఎఱ్ఱనికాంతి గలది.
892. **వైష్ణవీ**=విష్ణువునకు సంబంధించినది.
893. **విష్ణురూపిణీ**=విష్ణుస్వరూపురాలు.
894. **అయోనిః**=తనకు వేరొక కారణములేనిది.
895. **యోనినిలయా**=ప్రకృతికి నిలయమయినది.
896. **కూటస్థా**=అజ్ఞానమునకు అధ్యక్షురాలై ఉండునది.
897. **కులరూపిణీ**=బాహ్యపూజాస్వరూపురాలు.
898. **వీరగోష్ఠీప్రియా**=వీరుల సభ ఇష్టముగా గలది.
899. **వీరా**=వీర్యవతి.
900. **నైష్కర్మ్యా**=వేదోక్తకర్మలులేని స్థితిగలది.
901. **నాదరూపిణీ**=నాదస్వరూపురాలు.
902. **విజ్ఞానకలనా**=ఆత్మసాక్షాత్కారముయొక్క స్వరూపమైనది.
903. **కల్యా**=కళలయందు నేర్పుగలది.
904. **విదగ్ధా**=చాతుర్యము స్వభావముగా గలది.
905. **బైందవాసనా**=భ్రూమధ్యమునకు పైన వర్తులాకారబిందువేఆసనముగా గలది.
906. **తత్త్వాధికా**=తత్త్వములకంటె అధికురాలు.
907. **తత్త్వమయీ**=తత్త్వప్రచురమైనది.
908. **తత్త్వమర్థస్వరూపిణీ**=జీవేశ్వరస్వరూపురాలు.
909. **సామగానప్రియా**=సామవేదగానమందిష్టము గలది.
910. **సౌమ్యా**=సోమయాగముచే ఆరాధింపదగినది.

911. **సదాశివకుటుంబినీ**=సదాశివునిగృహిణి లేక కుటుంబిని.
912. **సవ్యాపసవ్యమార్గస్థా**=సూర్యునకు కుడియెడమ మధ్యలందలి మార్గములందున్నది.
913. **సర్వాపద్వినివారిణీ**=కష్టములను నివారించునది.
914. **స్వస్థా**=ఒడుదుడుకులులేని సుఖమునందు ఉండునది.
915. **స్వభావమధురా**=స్వతస్సిద్ధముగానే మధురమయినది.
916. **ధీరా**=బుద్ధిప్రదమయిన దశమీతిథి గలది.
917. **ధీరసమర్చితా**=పండితులచే పూజింపబడినది.
918. **చైతన్యార్ఘ్యసమారాధ్యా**=ఆత్మజ్ఞానముచే పూజింపదగినది.
919. **చైతన్యకుసుమప్రియా**=చైతన్యమనెడు పుష్పము ఇష్టముగా గలది.
920. **సదోదితా**=ఎల్లప్పుడు ప్రకాశము గలది.
921. **సదాతుష్టా**=సత్పురుషులందరియందు మిక్కిలి సంతోషముకలది.
922. **తరుణాదిత్యపాటలా**=మధ్యాహ్నకాలసూర్యునివలె శ్వేతరక్తవర్ణముగలది.
923. **దక్షిణాదక్షిణారాధ్యా**=కర్మఠులచేత జ్ఞానులచేతను ఆరాధింపదగినది.
924. **దరస్మేరముఖాంబుజా**=చిరునవ్వుతోగూడిన ముఖముగలది.
925. **కౌలినీకేవలా**=కౌలినుల జ్ఞానముకలది.
926. **అనర్ఘ్యకైవల్యపదదాయినీ**=విలువలేని కైవల్యము మోక్షపదమును ఇచ్చునది.
927. **స్తోత్రప్రియా**=స్తోత్రములు ఇష్టముగా గలది.
928. **స్తుతిమతీ**=స్తుతి ఈమెయందు కర్మతాసంబంధముతో కలదు.
929. **శ్రుతిసంస్తుతవైభవా**=వేదములచే స్తుతింపబడిన వైభవముకలది.
930. **మనస్వినీ**=స్వతంత్రమగు మనస్సుకలది.
931. **మానవతీ**=నేను ఉత్కృష్టురాలను అనెడు చిత్తౌన్నత్యము కలది.
932. **మహేశీ**=మహేశునిభార్య.
933. **మంగళాకృతిః**=శోభనమైన ఆకారముకలది.
934. **విశ్వమాతా**=జగత్తులకు తల్లి.
935. **జగద్ధాత్రీ**=జగత్తులను ధరించినది.
936. **విశాలాక్షీ**=విశాలమైన నేత్రములుగలది.
937. **విరాగిణీ**=వైరాగ్యము గలది.
938. **ప్రగల్భా**=సృష్టిమున్నగు కర్మలయందు మిక్కిలి ప్రౌఢ కలిగినది.
939. **పరమోదారా**=మిక్కిలి గొప్పది.
940. **పరామోదా**=ఉత్కృష్టమగు కీర్తికలది.
941. **మనోమయీ**=మనస్సే ప్రధానముగా గలది.(ఆత్మజ్ఞానముకలిగించుటయందు)
942. **వ్యోమకేశీ**=ఆకాశమే కేశములుగా గలది.
943. **విమానస్థా**=విమానములందుండెడు దేవతా స్వరూపురాలు.



944. **వజ్రిణీ**=వజ్రమును ధరించునది.
945. **వామకేశ్వరీ**=వామకేశ్వర తంత్రస్వరూపురాలు.
946. **పంచయజ్ఞప్రియా**=పంచయజ్ఞములు ప్రియముగా గలది.
947. **పంచప్రేతమంచాధిశాయినీ**=పంచప్రేతలుగల మంచమునందు అధిష్ఠించినది.
948. **పంచమీ**=సదాశివుని స్త్రీరూపిణీ అయినది.
949. **పంచభూతేశీ**=పంచమహాభూతములకు ఈశ్వరిఅయినది.
950. **పంచసంఖ్యోపచారిణీ**=పంచోపచారములుగలది.
951. **శాశ్వతీ**=నిత్యురాలు.
952. **శాశ్వతైశ్వర్యా**=నిత్యమయిన ఐశ్వర్యముగలది.
953. **శర్మదా**=సుఖమును ఇచ్చునది.
954. **శంభుమోహినీ**=శంకరునిమోహపెట్టునది.
955. **ధరా**=లోకములను అన్నింటిని ధరించినది.
956. **ధరసుతా**=హిమవంతుని కూతురు.
957. **ధన్యా**=ధనముకలది.
958. **ధర్మిణీ**=ధర్మస్వభావము కలది.
959. **ధర్మవర్ధినీ**=ధర్మమును వృద్ధిచెందించునది.
960. **లోకాతీతా**=సకలలోకములను అతిక్రమించి పరశివపురమందున్నది.
961. **గుణాతీతా**=సకలగుణములను అతిక్రమించినది.
962. **సర్వాతీతా**=సర్వశబ్దములను మించినది.
963. **శమాత్మికా**=సకలప్రపంచలయస్వరూపురాలు.
964. **బంధూకకుసుమప్రఖ్యా**=మంకెనపువ్వుయొక్క కాంతివంటికాంతిగలది.
965. **బాలా**=కుమారీస్వరూపురాలు.
966. **లీలావినోదినీ**=ఆటలు వినోదముగా గలది.
967. **సుమంగలీ**=సువాసినీ స్వరూపురాలు.
968. **సుఖకరీ**=సుఖమును చేయునది.
969. **సువేషాఢ్యా**=చక్కనివేషముతో ఒప్పుచున్నది.
970. **సువాసినీ**=ఎల్లప్పుడు భర్తగలది.
971. **సువాసిన్యర్చనప్రీతా**=సువాసినులయొక్క అర్చనలచే సంతోషించునది.
972. **ఆశోభనా**=అంతటసౌందర్యము గలది.
973. **శుద్ధమానసా**=నిర్మలమైన మనస్సుగలది.
974. **బిందుతర్పణసంతుష్టా**=సర్వానందమయచక్రమందలి తర్పణచే సంతోషించునది.
975. **పూర్వజా**=అన్నిటికంటె ముందు పుట్టినది.

976. **త్రిపురాంబికా**=అష్టమచక్రాభిమానిదేవతాస్వరూపురాలు.
977. **దశముద్రాసమారాధ్యా**=దశముద్రలచే ఆరాధింపదగినది.
978. **త్రిపురాశ్రీవశంకరీ**=త్రిపురాదేవిని స్వాధీనము చేయునది.
979. **జ్ఞానముద్రా**=జ్ఞానముద్రాస్వరూపురాలు.
980. **జ్ఞానగమ్యా**=జ్ఞానముచే పొందదగినది.
981. **జ్ఞానజ్ఞేయస్వరూపిణీ**=దృక్కు దృశ్యములు రెండునుస్వరూపముగాకలది.
982. **యోనిముద్రా**=యోనిముద్రాస్వరూపురాలు.
983. **త్రిఖండేశీ**=త్రిఖండ యను దశమముద్రకు స్వామినిఅయినది.
984. **త్రిగుణా**=సత్వాదిగుణత్రయముగలది.
985. **అంబా**=సకలజగత్తునకు జనని.
986. **త్రికోణగా**=త్రికోణచక్రమును పొందియున్నది.
987. **అనఘా**=పాపము,దుఃఖము,వ్యసనములేనిది.
988. **అద్భుతచారిత్రా**=ఆశ్చర్యకమగుచరిత్ర గలది.
989. **వాంఛితార్థప్రదాయినీ**=కోరిన కోరికలను ఇచ్చుస్వభావముగలది.
990. **అభ్యాసాతిశయజ్ఞాతా**=చిరకాలాభ్యాసాతిశయముచేత తెలియబడునది.
991. **షడధ్వాతీతరూపిణీ**=శైవాదిషడ్విధోపాసనములకు అతీతమగుస్వరూపముగలది.
992. **అవ్యాజకరుణామూర్తిః**=నిర్హేతుకదయాస్వరూపురాలు.
993. **అజ్ఞానధ్వాంతదీపికా**=అజ్ఞానమనెడు చీకటికి దీపము వంటిది.
994. **ఆబాలగోపవిదితా**=బాలుడు మొదలు భగవంతుడు వరకుగలవారందరి చేతను తెలియబడినది.
995. **సర్వానుల్లంఘ్యశాసనా**=బ్రహ్మవిష్ణ్వాదులకు కూడ తిరస్కరింపశక్యము కాని ఆజ్ఞగలది.
996. **శ్రీచక్రరాజనిలయా**=శ్రీ చక్రమునివాసముగాగలది.
997. **శ్రీమత్త్రిపురసుందరీ**=పరమశివునిభార్య.
998. **శ్రీశివా**=శ్రీతో కూడిన పార్వతి.
999. **శివశక్త్యైక్యరూపిణీ**=శివశక్తులసామరస్యమే స్వరూపముగా గలది.
1000. **లలితాంబికా**=అత్యధికముగా ప్రకాశించు అంబిక.

--(0)--



## శ్రీ లలితా చాలీసా

1. లలితామాతాశంభుప్రియా జగతికిమూలం నీవమ్మా
శ్రీ భువనేశ్వరి అవతారం జగమంతటికీ ఆధారం
2. హేరంబునికి మాతవుగా హరిహరాదులు సేవింప
చండునిముండుని సంహారం చాముండేశ్వరి అవతారం
3. పద్మరేకుల కాంతులలో బాలాత్రిపురసుందరిగా
హంసవాహనారూఢిణిగా వేదమాతవైవచ్చితివి
4. శ్వేత వస్త్రముధరియించి అక్షరమాలను పట్టుకొని
భక్తిమార్గము చూపితివి జ్ఞానజ్యోతిని నింపితివి
5. నిత్య అన్నాదానేశ్వరిగా కాశీపురమున కొలువుండ
ఆదిభిక్షువై వచ్చాడు సాక్షాదాపరమేశ్వరుడు
6. కదంబవన సంచారిణిగా కామేశ్వరుని కళత్రముగా
కామితార్థప్రదాయనిగా కంచికామాక్షివైనావు
7. శ్రీచక్రరాజనిలయనిగా శ్రీమత్ త్రిపురసుందరిగా
సిరిసంపదలు ఇవ్వమ్మా శ్రీమహాలక్ష్మిగ రావమ్మా
8. మణిద్వీపమున కొలువుండి మహాకాళి అవతారములో
మహిషాసురుని చంపితివి ముల్లోకాలను ఏలితివి
9. పసిడి వెన్నెల కాంతులలో పట్టువస్త్రపుధారణలో
పారిజాతపు మాలలో పార్వతిదేవిగ వచ్చితివి
10. రక్తవస్త్రపు ధరయించి రణరంగమున ప్రవేశించి
రక్తబీజుని హతమార్చి రమ్యకపర్దినివైనావు
11. కార్తికేయునికి మాతవుగా కాత్యాయనిగా కరుణించి
కలియుగమంతా కాపాడ కనకదుర్గవై వెలసితివి
12. రామలింగేశ్వరుని రాణివిగా రవికులసోముని రమణివిగా
రమావాణీ సేవితగా రాజరాజేశ్వరివైనావు
13. ఖడ్గం, శూలం ధరియించి పాశుపతాస్త్రము చేబూని
శంభు నిశుంభుల దునిమాడి వచ్చింది శ్రీశ్యామలగా
14. మహామంత్రాధి దేవతగా లలితాత్రిపురసుందరిగా
దారిద్ర్య బాధలు తొలగించి మహదానందము కలిగించె
15. ఆర్తత్రాణపరాయణివే అద్వైతామృతవర్షిణివే
ఆదిశంకరపూజితవే అపర్ణాదేవి రావమ్మా
16. విష్ణుపాదమున జనియించి గంగావతారము ఎత్తితివి
భాగిరథుడు నిను కొలువ భూలోకానికి వచ్చితివి ॥ల॥

17. ఆశుతోషునిమెప్పించి అర్ధశరీరం దాల్చితివి
ఆది ప్రకృతి రూపిణిగా దర్శనమిచ్చెను జగదంబ
18. దక్షుని ఇంట జనియించి సతీదేవిగా చాలించి
అష్టాదశ పీఠేశ్వరిగా దర్శనమిచ్చెను జగదంబ
19. శంఖుచక్రము ధరియించి రాక్షస సంహారముచేసి
లోకరక్షణ చేసావు భక్తులమదిలో నిలిచావు
20. పరాభట్టారిక దేవతగా పరమశాంత స్వరూపిణిగా
చిరునవ్వులను చిందిస్తూ చెరుకుగడను ధరయించితివి
21. పంచదశాక్షరి మంత్రాధితగా పరమేశ్వర పరమేశ్వరితో
ప్రమధగణములు కొలువుండ కైలాసంబే పులకించె
22. సురులు అసురులు అందరును శిరసును వంచి మ్రొక్కంగా
మాణిక్యాలకాంతులతో నీ పాదములు మెరిసినవి
23. మూలాధారచక్రములో యోగినులకు అధీశ్వరియై
అంకుశాయుధధారిణిగా భాసిల్లెను శ్రీ జగదంబ
24. సర్వదేవతల శక్తులచే సత్యస్వరూపిణి రూపొంది
శంఖనాదము చేసితివి సింహవాహినిగ వచ్చితివి ॥లు॥
25. మహామేరువు నిలయనివి మందార కుసుమమాలలతో
మునులందరు నిను కొలవంగ మోక్షమార్గము చూపితివి
26. చిదంబరేశ్వరి నీ లీల చిద్విలాసమే నీ సృష్టి
చిద్రూపి పరదేవతగా చిరునవ్వులను చిందించె
27. అంబా శాంభవి అవతారం అమృతపానం నీ నామం
అద్భుతమైనది నీ మహిమ అతిసుందరము నీ రూపం
28. అమ్మలగన్న అమ్మవుగా ముగ్గురమ్మలకు మూలముగా
జ్ఞానప్రసూనా రావమ్మా జ్ఞానము నందరికివ్వమ్మా
29. నిష్ఠతో నిన్నే కొలచెదము నీ పూజలనే చేసెదము
కష్టములన్నీ కడతేర్చి కనికరముతో మము కాపాడు
30. రాక్షస బాధలు పడలేక దేవతలంతా ప్రార్థింప
అభయహస్తము చూపితివి అవతారములు దాల్చితివి
31. అరుణారుణపు కాంతులలో అగ్నివర్ణపు జ్వాలలలో
అసురులనందరను దునుమాడి అపరాజితవై వచ్చితివి.
32. గిరిరాజునికి పుత్రికగా నందనందుని సోదరిగా
భూలోకానికి వచ్చితివి భక్తులకోర్కెలు తీర్చితివి ॥లు॥
33. పరమేశ్వరునికి ప్రియసతిగా జగమంతటికి మాతవుగా
అందిరి సేవలు అందుకొని అంతట నీవే నిండితివి
34. కరుణించమ్మా లలితమ్మా కాపాడమ్మా దుర్గమ్మా
దరిశనమియ్యగ రావమ్మా భక్తుల కష్టం తీర్చమ్మా



35. ఏ విధముగ నిను కొలిచినను ఏ పేరున నిను పిలచినను
మాతృహృదయవై దయచూపు కరుణామూర్తిగ కాపాడు
36. మల్లెలు మొల్లలు తెచ్చితిమి మనసు నీకే ఇచ్చితిమి
మగువలమంతా చేరితిమి నీ పారాయణ చేసితిమి
37. త్రిమాతృరూపా లలితమ్మా సృష్టి స్థితి లయకారిణివి
నీ నామములు ఎన్నెన్నో లెక్కించుట మా తరమవునా
38. ఆశ్రితులందరురారండి అమ్మరూపము చూడండి
అమ్మకు నీరాజనమిచ్చి అమ్మ దీవెన పొందుదము
39. సదాచార సంపన్నవుగా సామగాన ప్రియలోలినివి
సదాశివ కుటుంబినివి సౌభాగ్యమిచ్చే దేవతవు
40. మంగళగౌరీ రూపమును మనసుల నిండా నింపండి
మహాదేవికి మనమంతా మంగళ హారతులిద్దాము॥లు॥

## మణిద్వీపవాసినికి - మంగళహారతి

శ్రీ త్రిపుర సుందరికి మణిద్వీపవాసినికి ।
మంగళమ్ జయమంగళమ్ నిత్య శుభమంగళమ్ ॥
ఓంకార రూపిణికి హ్రీంకార వాసినికి శ్రీం బీజవాహినికి
మంగళమ్ జయమంగళమ్ నిత్య శుభమంగళమ్ ॥
ఆపదలు బాపేటి సంపదలనొసగేటి శ్రీనగరవాసినికి ।
మంగళమ్ జయమంగళమ్ నిత్య శుభమంగళమ్ ॥
వేదాలు నాదాలు శిరసొంచి మొక్కేటి శ్రీరత్నసింహాసినికి।
మంగళమ్ జయమంగళమ్ నిత్య శుభమంగళమ్ ॥

## శ్రీ లలితా మంగళహారతి

శీతాద్రి శిఖరాన పడగాలు తాపించు
మాతల్లి లత్తుకకు నీరాజనం-కెంపైన నీరాజనం భక్తి పెంపైన నీరాజనం
యోగీంద్ర హృదయాల మ్రోగేటి మా తల్లి
బాగైన అందెలకు నీరాజనం-బంగారు నీరాజనం భక్తి పొంగారు నీరాజనం
నెలతాల్పు డెందాన వలపు వీణలు మీటు
మా తల్లి గాజులకు నీరాజనం-రాగాల నీరాజనం భక్తి తాళాల నీరాజనం
మనుజాళి హృదయాల తిమిరాలు సమయించు
మా తల్లి నవ్వులకు నీరాజనం-ముత్యాల నీరాజనం భక్తి నృత్యాల నీరాజనం
చెక్కిళ్ళ కాంతితో క్రిక్కిరిసి అలరారు
మా తల్లి ముంగరకు నీరాజనం-రతనాల నీరాజనంభక్తి జతనాల నీరాజనం
పసిబిడ్డలనుజేసి ప్రజనెల్ల పాలించు
మా తల్లి చూపులకు నీరాజనం-అనురాగ నీరాజనం భక్తి కనరాగ నీరాజనం
దహరాన కనిపించు ఇనబింబ మనిపించు

మాతల్లి కుంకుమకు నీరాజనం-నిండైన నీరాజనం భక్తి మెండైననీరాజనం
తేటిపిల్లలవోలె గాలి కల్లలనాడు
మా తల్లి కురులకు నీరాజనం-నీలాల నీరాజనం భక్తి భావాల నీరాజనం
జగదేక మోహిని,సర్వేశగేహిని
మా తల్లి రూపునకు నీరాజనం-నిలువెత్తునీరాజనంభక్తి విలువెత్తు నీరాజనం

## మణిద్వీప వర్ణన

1. మహాశక్తి మణిద్వీప నివాసిని ముల్లోకాలకు మూల ప్రకాశిని
మణిద్వీపములో మంత్రరూపిణి మన మనస్సులలో కొలువైయింది
2. సుగంధ పుష్పాలెన్నో వేలు అనంత సుందర సువర్ణపూలు
అచంచలంబగు మనో సుఖాలు మణి ద్వీపానికి మహానిధులు
3. లక్షల లక్షల లావణ్యాలు అక్షర లక్షల వాక్ సంపదలు
లక్షల లక్షల లక్ష్మీపతులు మణి ద్వీపానికి మహానిధులు
4. పారిజాత వన సౌగంధాలు సురాధినాథుల సత్సంగాలౌ
గంధర్వాదుల గాన స్వరాలు మణి ద్వీపానికి మహానిధులు
భువనేశ్వరీ సంకల్పమే జనియించే మణిద్వీపం
దేవదేవుల నివాసము అదియే కైవల్యం
5. పద్మరాగములు సువర్ణమణులు పది ఆమడల పొడవునగలవు
మధురమధురమగు చందనసుధలు మణిద్వీపానికి మహానిధులు
6. అరువది నాలుగు కళామతల్లులు వరాలనొసగే పదారుశక్తులు
పరివారముతో పంచబ్రహ్మలు మణిద్వీపానికి మహానిధులు
7. అష్టసిద్ధులు నవనవ నిధులు అష్టదిక్కులూ దిక్పాలకులు
సృష్టికర్తలు సురలోకాలౌ మణిద్వీపానికి మహానిధులు
8. కోటిసూర్యులుప్రపంచకాంతులు కోటిచంద్రులచల్లనివెలుగులు
కోటితారకల వెలుగుజిలుగులు మణిద్వీపానికి మహానిధులు
9. కంచుగోడల ప్రాకారాలు రాగిగోడల చతురస్రాలు
ఏడామడల రత్నరాసులు మణిద్వీపానికి మహానిధులు
10. పంచామృతమయ సరోవరాలు పంచలోహమయప్రాకారాలు
ప్రపంచమేలే ప్రజాధిపతులు మణిద్వీపానికి మహానిధులు
11. ఇంద్రనీలమణి ఆభరణాలు వజ్రపుకోటలు వైఢూర్యాలు
పుష్యరాగమణిప్రాకారాలు మణిద్వీపానికి మహానిధులు
12. సప్తకోటి ఘన మంత్రవిద్యలుసర్వశుభప్రద ఇచ్ఛాశక్తులు
శ్రీగాయత్రీ జ్ఞానశక్తులు మణిద్వీపానికి మహానిధులు॥భవ॥
13. మిలమిలలాడే ముత్యపురాసులు తళతళలాడే చంద్రకాంతములు
విద్యుల్లతలు మరకతమణులు మణిద్వీపానికి మహానిధులు



14. కుబేర ఇంద్రవరుణదేవులు శుభాలనొసగే అగ్నివాయువులు
భూమిగణపతి పరివారములు మణిద్వీపానికి మహానిధులు
15. భక్తిజ్ఞాన వైరాగ్యసిద్ధులు పంచభూతములు పంచశక్తులు
సప్తఋషులు నవగ్రహాలు మణిద్వీపానికి మహానిధులు
16. కస్తూరి మల్లిక కుందవనాలు సూర్యకాంతి శిలమహాగ్రహాలు
ఆరు ఋతువులు చతుర్వేదాలు మణిద్వీపానికి మహానిధులు
17. మంత్రిణి దండిని శక్తిసేవలు కాళి కరాళి సేనాపతులు
ముప్పది రెండు మహాశక్తులు మణిద్వీపానికి మహానిధులు
18. సువర్ణరజిత సుందరగిరులు అనంతదేవి పరిచారికలు
గోమేధికమణి నిర్మితగుహలు మణిద్వీపానికి మహానిధులు
19. సప్తసముద్రములనంత నిధులు యక్షకిన్నెర కింపురుషాదులు
నానాజగములు నదీనదములు మణిద్వీపానికి మహానిధులు
20. మానవ మాధవ దేవగణములు కామధేనువు కల్పతరువులు
సృష్టిస్థితిలయాకారణమూర్తులు మణిద్వీపానికి మహానిధులు
21. కోటి ప్రకృతుల సౌందర్యాలు సకలవేదములు ఉపనిషత్తులు
పదారు రేకుల పద్మశక్తులు మణిద్వీపానికి మహానిధులు
22. దివ్య ఫలముల దివ్యాస్త్రములు దివ్య పురుషులు ధీరమాతలు
దివ్యజగములు దివ్యశక్తులు మణిద్వీపానికి మహానిధులు
23. శ్రీ విఘ్నేశ్వర కుమారస్వాములు జ్ఞానముక్తి ఏకాంతభవనములు
మణినిర్మితమగు మండపాలు మణిద్వీపానికి మహానిధులు
24. పంచభూతములు యాజమాన్యాలు ప్రవాళసాలం అనేక శక్తులు
సంతాన వృక్షసముదాయాలు మణిద్వీపానికి మహానిధులు
25. చింతామణులు నవరాత్రులు నూరామడల వజ్రరాసులు
వసంతవనములు గరుడపచ్చలు మణిద్వీపానికి మహానిధులు
26. దుఃఖము తెలియని దేవీ సేవలు నటనాట్యాలు సంగీతాలు
ధనకనకాలు పురుషార్థాలు మణిద్వీపానికి మహానిధులు
27. పదనాల్గు లోకాలన్నిటిపైన సర్వలోకమను లోకము గలదు
సర్వలోకమే ఈ మణిద్వీపము సర్వేశ్వరికది శాశ్వతస్థానం
28. చింతామణుల మందిరమందు పంచబ్రహ్మల పంచముపైన
మహాదేవుడు భువనేశ్వరితో నివసిస్తాడు మణిద్వీపములో
29. మణిగణ ఖచిత ఆభరణాలు చింతామణి పరమేశ్వరి దాల్చి
సౌందర్యానికి సౌందర్యముగా అగుపడుతుంది మణిద్వీపములో
30. పరదేవతను నిత్యము కొలిచి మనసర్పించి అర్చించినచో
అపారధనము సంపదలిచ్చి మణిద్వీపేశ్వరి దీవిస్తుంది ॥2॥

31. నూతన గృహములు కట్టినవారు మణిద్వీప వర్ణన తొమ్మిదిసార్లు
చదివిన చాలు అంతా శుభమే అష్టసంపదల తులతూగేరు॥2॥

32. శివకవితేశ్వరి శ్రీ చక్రేశ్వరి మణిద్వీపవర్ణన చదివిన చోట
తిష్టవేసుకొని కూర్చొనునంటా కోటిశుభాలనుసమకూర్చుకొనుటకై
భువనేశ్వరి సంకల్పమే జనియించే మణిద్వీపం
దేవదేవల నివాసము అదియే కైవల్యం ॥భు॥

### ఫలశృతి

పదునాలుగు లోకాలకూ పరంజ్యోతియగు మణిద్వీప నివాసిని, పరమేశ్వరిని, తొమ్మిది విధాలుగా కీర్తించుకొను టకు తొమ్మిది దోహాలతో ఈ స్తోత్రం వ్రాయబడింది. అమ్మకు నవసంఖ్య ఇష్టంగాబట్టి దీనిని తొమ్మిది పర్యాయములు ప్రతిరోజు చదివిన ప్రతిమనిషి తరించవచ్చు.దీనిని శుక్ర వారమునాడు పూజావిధాన ప్రకారము పూజించి తొమ్మిది మార్లు పారాయణ లేదా గానం చేసిన ధన, కనక, వస్తు, వాహనాది సంపదలు కలిగి భక్తి, జ్ఞాన, వైరాగ్య, సిద్ధులతో ఆయురారోగ్య, ఐశ్వర్యాలతో తులతూగి, చివరకు మణిద్వీపం చేరగలరు. ఇది శాస్త్రవాక్యం.



## శ్రీ దేవీ ఖడ్గమాలా స్తోత్రరత్నమ్

### శ్రీదేవీ ప్రార్థన

హ్రీంకారాసనగర్భితానలశిఖాం సౌః క్లీం కళాం భిభ్రతీం
సౌవర్ణాంబరధారిణీం వరసుధా ధౌతాం త్రిణేత్రోజ్జ్వలామ్
వందే పుస్తకపాణి మంకుశధరాం స్రగ్భూషితా ముజ్జ్వలాం
త్వాం గౌరీం త్రిపురాం పరాత్పరకళాం శ్రీచక్రసంచారిణీమ్

### ఋషిచ్ఛందోదేవతాదికమ్

అస్యశ్రీశుద్ధ శక్తిమాలా మహామంత్రస్య ఉపస్థేంద్రియా ధిష్ఠాయీ వరుణాదిత్య ఋషిః దైవీగాయత్రీచ్ఛందః సాత్త్వికకార భట్టారకపీఠస్థిత కామేశ్వరాంకనిలయా మహాకామేశ్వరీ శ్రీ లలితా భట్టారికా దేవతా ఐం బీజం క్లీం శక్తిః సౌః కీలకం మమ ఖడ్గసిద్ధ్యర్థే (సర్వాభీష్ట సిద్ధ్యర్థే) జపే వినియోగః మూలమంత్రేణ షడంగ (కరాంగ) న్యాసం కుర్యాత్. (మూలమంత్రం :బాలా,శ్రీలలితా శ్రీషోడశాక్షరీవా)బాలయా తు-

### కరన్యాసః

ఐం అంగుష్ఠాభ్యాం నమః - క్లీం తర్జనీభ్యాం నమః
సౌః మధ్యమాభ్యాం నమః - ఐం అనామికాభ్యాం నమః
క్లీం కనిష్ఠికాభ్యాం నమః - సౌః కరతలకరపృష్ఠాభ్యాం నమః

### హృదయాద్యంగన్యాసః

ఐం - హృదయాయ నమః - క్లీం శిరసే స్వాహా
సౌః - శిఖాయై వషట్ - ఐం కవచాయ హుం



క్లీం - నేత్రత్రయాయ వౌషట్ - సౌః అస్త్రాయ ఫట్
భూర్భు వ స్సు వ రోమ్ - ఇతి దిగ్బంధః

### ధ్యానమ్

ఆర్తక్తాభాం త్రిణేత్రా మరుణిమవసనాం రత్నతాటఙ్క రమ్యాం
హస్తాంభోజైః సపాశాంకుశమదనధనుః సాయకైర్విస్ఫురంతీం
అపీనోత్తుంగవక్షోరుహకలశలుఠత్తారహారోజ్జ్వలాంగీం
ధ్యాయే దంభోరుహస్థా మరుణిమవసనా మీశ్వరీ మీశ్వరాణామ్

లం- ఇత్యాది పంచపూజాం కుర్యాత్ యథాశక్తిఃమూలమంత్రం జపేత్

లం - పృథివీతత్త్వాత్మికాయై శ్రీలలితాత్రిపురసుందరీ
పరాభట్టారికాయై గంధం పరికల్పయామి-నమః

హం- ఆకాశ తత్త్వాత్మికాయై శ్రీలలితాత్రిపురసుందరీ
పరాభట్టారికాయై పుష్పం పరికల్పయామి - నమః

యం- వాయుతత్త్వాత్మికాయై శ్రీలలితాత్రిపురసుందరీ
పరాభట్టారికాయై ధూపం పరికల్పయామి - నమః

రం - తేజస్తత్త్వాత్మికాయై శ్రీలలితాత్రిపురసుందరీ
పరాభట్టారికాయై దీపం పరికల్పయామి-నమః

వం - అమృతతత్త్వాకాయై శ్రీలలితాత్రిపురసుందరీ
పరాభట్టారికాయై అమృతనైవేద్యం పరికల్పయామి - నమః

సం - సర్వతత్త్వాత్మికాయై శ్రీలలితాత్రిపురసుందరీ
పరాభట్టారికాయై తాబ్బూలాదిసర్వోపచారాన్
పరికల్పయామి - నమః(యథాశక్తి మూలమంత్రం జపేత్.)

### అథ మాలా మంత్రః

శ్రీదేవీ సంబోధనమ్(1) ఓంఐంహ్రీంశ్రీంఐంక్లీంసౌః, ఓం నమస్త్రిపుర సుందరి ।

న్యాసాంగదేవతాః (6) హృదయదేవి! శిరోదేవీ! శిఖాదేవీ! కవచదేవీ! నేత్రదేవి! అస్త్రదేవి!

తిథినిత్యాదేవతాః (16) కామేశ్వరి! భగమాలిని! నిత్యక్లిన్నే! భేరుండే! వహ్నివాసిని! మహావజ్రేశ్వరి! శివదూతి! త్వరితే! కులసుందరి! నిత్యే! నీలపతాకే! విజయే! సర్వమంగళే! జ్వాలామాలిని! చిత్రే! మహానిత్యే!

దివ్యౌఘగురవః (7) పరమేశ్వరపరమేశ్వరి ! మిత్రేశమయి! షష్ఠీశమయి! ఉడ్డీశమయి! చర్యానాథమయి ! లోపాముద్రామయి! అగస్త్యమయి!

సిద్ధౌఘగురవః (4) కాలతాపనమయి ! ధర్మాచార్యమయి ! ముక్తకేశీశ్వర మయి! దీపకళానాథమయి !

మానవౌఘంగురవః(8)విష్ణుదేవమయి!ప్రభాకరదేవమయి!తేజోదేవమయి ! మనోజదేవమయి!కల్యాణదేవమయి!వాసుదేవమయి! రత్నదేవమయి! శ్రీరామానందమయి !

శ్రీ చక్రప్రథమావరణ దేవతాః అణిమాసిద్ధే! లఘిమాసిద్ధే! మహిమాసిద్ధే! ఈశిత్వసిద్ధే! వశిత్వసిద్ధే! ప్రాకామ్యసిద్ధే! భుక్తిసిద్ధే! ఇచ్ఛాసిద్ధే! ప్రాప్తిసిద్ధే! సర్వకామసిద్ధే! బ్రాహ్మి! మహేశ్వరి! కౌమారి! వైష్ణవి! వారాహి! మాహేంద్రి! చాముండే ! మహాలక్ష్మి! సర్వసంక్షోభిణి! సర్వవిద్రావిణి! సర్వాకర్షిణి! సర్వవశంకరి ! సర్వోన్మాదిని! సర్వ మహాంకుశే ! సర్వఖేచరి! సర్వబీజే! సర్వయోనే! సర్వత్రిఖండే ! త్రైలోక్యమోహన చక్రస్వామిని ! ప్రకటయోగిని!

శ్రీ చక్రద్వితీయావరణ దేవతాః కామాకర్షిణి ! బుద్ధ్యాకర్షిణి! అహంకారా కర్షిణి! శబ్దాకర్షిణి! స్పర్శాకర్షిణి ! రూపాకర్షిణి! రసాకర్షిణి! గంధాకర్షిణి! చిత్తాకర్షిణి! ధైర్యాకర్షిణి! స్మృత్యాకర్షిణి! నామాకర్షిణి! బీజాకర్షిణి! ఆత్మాకర్షిణి! అమృతాకర్షిణి! శరీరాకర్షిణి ! సర్వాశాపరిపూరక చక్రసామిని ! గుప్తయోగిని !

శ్రీ చక్రతృతీయావరణదేవతాః అనంగకుసుమే, అనంగమేకలే, అనంగ మదనే, అనంగమదనాతురే, అనంగరేఖే, అనంగవేగిని, అనంగాంకుశే, అనంగ మాలినిసర్వసంక్షోభణ చక్రస్వామిని, గుప్తతరయోగిని

శ్రీ చక్రచతుర్థావరణ దేవతాః సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వాహ్లాదిని, సర్వ సమ్మోహిని,సర్వస్తంభిని, సర్వజృం భిణి, సర్వవశంకరి, సర్వరంజని, సర్వోన్మాదిని, సార్వార్థసాధికే సర్వసంపత్తిపూరణి, సర్వమంత్రమయి, సర్వద్వంద్వ క్షయంకరి, సర్వసౌభాగ్యదాయక చక్రస్వామిని, సంప్రదాయయోగిని

శ్రీ చక్ర పంచమావరణ దేవతాః సర్వసిద్ధిప్రదే, సర్వసంపత్ప్రదే, సర్వప్రియం కరి, సర్వమంగళకారిణి, సర్వకామప్రదే, సర్వదుఃఖ విమోచని, సర్వమృత్యుప్రశమని, సర్వవిఘ్ననివారిణి, సర్వాంగ సుందరి, సర్వ సౌభాగ్యదాయిని, సర్వార్థసాధకచక్ర స్వామిని, కుళోత్తీర్ణయోగిని

శ్రీ చక్ర షష్ఠావరణ దేవతాః సర్వజ్ఞే, సర్వశక్తే, సర్వైశ్వర్య ప్రదాయిని, సర్వజ్ఞానమయి,సర్వవ్యాధివినాశిని, సర్వాధారస్వరూపే, సర్వపాపహరే, సర్వానంద మయి, సర్వరక్షాస్వరూపిణి, సర్వేప్సిత ఫలప్రదే, సర్వరక్షాకర చక్రస్వామిని,నిగర్భ యోగిని

శ్రీ చక్రసప్తమావరణ దేవతాః వశిని, కామేశ్వరి, మోదిని, విమలే, అరుణే, జయిని, సర్వేశ్వరి, కౌళిని, సర్వరోగహర చక్రస్వామిని, రహస్య యోగిని

శ్రీ చక్రాష్టమావరణ దేవతాః బాణిని, చాపిని, పాశిని, అంకుశిని, మహా కామేశ్వరి, మహావజ్రేశ్వరి, మహాభగమాలిని, మహాశ్రీసుందరి సర్వసిద్ధిప్రద చక్రస్వామిని, అతిరహస్య యోగిని

శ్రీ చక్రనవమావరణ దేవతాః శ్రీశ్రీమహా భట్టారికే సర్వానంద మయి చక్రస్వామిని, పరాపర రహస్యయోగిని



నవచక్రేశ్వరీ నామాని త్రిపురే, త్రిపురేశి, త్రిపుర సుందరి, త్రిపురవాసిని, త్రిపురాశ్రీః, త్రిపురమాలిని, త్రిపురాసిద్ధే, త్రిపురాంబ, మహాత్రిపుర సుందరి

శ్రీదేవీ విశేషణాని -నమస్కార నవాక్షరీచ మహామహేశ్వరి, మహా మహా రాజ్ఞి, మహామహాశక్తే, మహామహాగుప్తే, మహామహాజ్ఞప్తే, మహామహానందే, మహా మహాస్కంధే, మహామహా శయే, మహామహా శ్రీచక్రనగర సామ్రాజ్ఞి నమస్తే నమస్తే నమస్తే నమః

ఫలశ్రుతిః

శ్లో॥ ఏషా విద్యామహాసిద్ధిదాయినీ స్మృతిమాత్రతః ।
అగ్నివాత మహాక్షోభే రాజ్ఞోరాష్ట్రస్య విప్లవే ॥
లుంఠనే తస్కరభయే సంగ్రామే సలిలప్లవే ।
సముద్రాయాన విక్షోభే భూతప్రేతాదికే భయే ॥
అపస్మారజ్వర వ్యాధి మృత్యు క్షామాదిజే భయే ।
శాకినీ పూతనా యక్ష రక్షః కూశ్మాండజే భయే ॥
మిత్రేభేదే గ్రహభయే వ్యసనే ష్వాభిచారికే ।
అన్యేష్వపి చ దోషేషు మాలామంత్రం స్మరేన్నరః ॥
తాదృశం ఖడ్గమాప్నోతి - యేన హస్తస్థి తేనవై ।
అష్టాదశమహాద్వీప - సమ్రాడ్ భోక్తా భవిష్యతి ॥
సర్వోపద్రవ నిర్ముక్త స్సాక్షాచ్ఛివమయో భవేత్ ।
ఆపత్కాలే నిత్యపూజాం విస్తారాత్కర్తుమారభేత్ ॥
ఏకవారం జపధ్యానం సర్వపూజాఫలం లభేత్ ।
నవావరణ దేవీనాం లలితాయా మహౌజసః ॥
ఏకత్ర గణనారూపో వేదవేదాంగ గోచరః ।
సర్వాగమ రహస్యార్థః స్మరణాత్పాపనాశినీ ॥
లలితాయా మహేశాన్యా మాలావిద్యా మహీయసీ ।
నరవశ్యం నరేంద్రాణాం వశ్యం నారీవశంకరమ్ ॥
అణిమాది గుణైశ్వర్యం రంజనం పాపభంజనమ్ ।
తత్తదావరణస్థాయి దేవతాబృంద మంత్రకం ॥
మాలామంత్రం పరం గుహ్యం పరంధామ ప్రకీర్తితమ్
శక్తిమాలా పంచధాస్యాచ్ఛివమాలాచతాదృశీ
తస్మాద్గోప్యతరాద్గోప్యం రహస్యం భుక్తి ముక్తిదమ్ ॥

ఇతి శ్రీవామకేశ్వర తంత్రే, ఉమామహేశ్వర సంవాదే, శ్రీదేవీ ఖడ్గమాలా స్తోత్రం సమాప్తమ్.(ఈ స్తోత్రము శ్రీచక్రమునందలి దేవతల సమిష్టి స్వరూపము. ప్రతి దినము దీనిని పఠించి శ్రీచక్రమునకు యథాశక్తి పూజించి నమస్కరించు చుండిన చక్రపూజాఫలము కల్గుటయేగాక, సర్వాభీష్టములు సిద్ధించి ఎందున అపజయము లేక యుండగలరు.)

## శ్రీ దేవీ ఖడ్గమాలా స్తోత్రరత్న నామావళిః

(ప్రతి నామానికి ముందు 'ఓం' చివర 'నమః' చేర్చి చదువుకోవాలి)

అథదేవీ సంభోధననామ
ఓం త్రిపురసుందర్యైనమః
అథన్యాసాంగదేవక నామాని
హృదయదేవ్యై
శిరోదేవ్యై
శిఖాదేవ్యై
కవచదేవ్యై
నేత్రదేవ్యై
అస్త్రదేవ్యై
అథతిథినిత్యానామాని
కామేశ్వర్యై
భగమాలిన్యై
నిత్యక్లిన్నాయై
భేరుండాయై
వహ్నివాసిన్యై
మహావజ్రేశ్వర్యై
శివదూత్యై
త్వరితాయై
కులసుందర్యై
నిత్యాయై
నీలపతాకాయై
విజయాయై
సర్వమంగళాయై
జ్వాలామాలిన్యై
చిత్రాయై
మహానిత్యాయై
అథ దివ్యౌఘగురునామాని
పరమేశ్వరపరమేశ్వర్యై
మిత్రేశమయ్యై
షష్ఠీశమయ్యై
ఉడ్డీశమయ్యై
చర్యానాథమయ్యై
లోపాముద్రామయ్యై
అగస్త్యమయ్యై 30
కాలతాపనమయ్యై
ధర్మాచార్యమయ్యై
ముక్తకేశీశ్వరమయ్యై
అథమానవౌఘగురునామాని
దీపకళానాథమయ్యై
విష్ణుదేవమయ్యై
ప్రభాకరదేవమయ్యై
తేజోదేవమయ్యై
మనోజదేవమయ్యై
కల్యాణదేవమయ్యై
వాసుదేవమయ్యై
రత్న దేవమయ్యై
శ్రీరామానందమయ్యై
అథప్రథమావరణనామాని
అణిమాసిద్ధయే
లఘిమాసిద్ధయే
మహిమాసిద్ధయే
ఈశిత్వసిద్ధయే
వశిత్వసిద్ధయే
ప్రాకామ్యసిద్ధయే
భుక్తిసిద్ధయే
ఇచ్ఛాసిద్ధయే
ప్రాప్తిసిద్ధయే
సర్వకామసిద్ధయే
బ్రాహ్మ్యై
మాహేశ్వర్యై
కౌమార్యై
వైష్ణవ్యై





వారాహ్యై
మాహేంద్ర్యై
చాముండాయై
మహాలక్ష్మ్యై
సర్వసంక్షోభిణ్యై
సర్వవిద్రావిణ్యై
సర్వాకర్షిణ్యై
సర్వవశంకర్యై
సర్వోన్మాదిన్యై
సర్వమహాంకుశాయై
సర్వఖేచర్యై
సర్వబీజాయై
సర్వయోన్యై 70
సర్వత్రిఖండాయై
త్రైలోక్యమోహనచక్రస్వామిన్యై
ప్రకటయోగిన్యై
అథద్వితీయావరణనామాని
కామాకర్షిణ్యై
బుద్ధ్యాకర్షిణ్యై
అహంకారాకర్షిణ్యై
శబ్దాకర్షిణ్యై
స్పర్శాకర్షిణ్యై
రూపాకర్షిణ్యై
రసాకర్షిణ్యై 80
గంధాకర్షిణ్యై
చిత్తాకర్షిణ్యై
ధైర్యాకర్షిణ్యై
స్మృత్యాకర్షిణ్యై
నామాకర్షిణ్యై
బీజాకర్షిణ్యై
ఆత్మాకర్షిణ్యై
అమృతాకర్షిణ్యై
శరీరాకర్షిణ్యై
సర్వాశాపరిపూరకచక్రస్వామిన్యై
గుప్తయోగిన్యై
అథతృతీయావరణనామాని
అనంగకుసుమాయై
అనంగమేఖలాయై
అనంగమదనాయై
అనంగమదనాతురాయై
అనంగరేఖాయై
అనంగవేగిన్యై
అనంగాకుశాయై
అనంగమాలిన్యై
సర్వసంక్షోభణచక్రస్వామిన్యై
గుప్తతరయోగిన్యై
అథచతుర్థావరణనామాని
సర్వసంక్షోభిణ్యై
సర్వవిద్రావిణ్యై
సర్వాకర్షిణ్యై
సర్వాహ్లాదిన్యై
సర్వసమ్మోహిన్యై
సర్వస్తంభిన్యై
సర్వజృంభిణ్యై
సర్వవశంకర్యై
సర్వరంజన్యై
సర్వోన్మాదిన్యై
సర్వార్థసాధిన్యై
సర్వసంపత్తిపూరణ్యై
సర్వమంత్రమయ్యై
సర్వద్వంద్వక్షయంకర్యై
సర్వసౌభాగ్యదాయకచక్రస్వామిన్యై
సంప్రదాయయోగిన్యై
అథపంచమావరణనామాని
సర్వసిద్ధిప్రదాయై
సర్వసంప్రత్పదాయై
సర్వప్రియంకర్యై
సర్వమంగళాకారిణ్యై

సర్వకామప్రదాయై
సర్వదుఃఖ విమోచన్యై
సర్వమృత్యుప్రశమన్యై
సర్వవిఘ్ననివారిణ్యై
సర్వాంగసుందర్యై
సర్వసౌభాగ్య దాయిన్యై
సర్వార్ధసాధకచక్రస్వామిన్యై
కులోత్తీర్ణయోగిన్యై
అథషష్ఠావరణనామాని
సర్వజ్ఞాయై
సర్వశక్త్యై 130
సర్వైశ్వర్యప్రదాయిన్యై
సర్వజ్ఞానమయ్యై
సర్వవ్యాధివినాశిన్యై
సర్వాధారస్వరూపాయై
సర్వపాపహరాయై
సర్వానందమయ్యై
సర్వరక్షస్వరూపిణ్యై
సర్వేప్సితలఫలప్రదాయై
సర్వరక్షాకరచక్రస్వామిన్యై
నిగర్భయోగిన్యై 140
అథసప్తమావరణనామాని
వశిన్యై, కామేశ్వర్యై
మోదిన్యై, విమలాయై
అరుణాయై
జయిన్యై
సర్వేశ్వర్యై
కౌళిన్యై
సర్వరోగహరచక్రస్వామిన్యై
రహస్యయోగిన్యై
అథఅష్టమావరణనామాని
బాణిన్యై
చాపిన్యై
పాశిన్యై
అంకుశిన్యై
మహారాజేశ్వర్యై
మహావ్రజేశ్వర్యై
మహాభగమాలిన్యై
మహాశ్రీసుందర్యై
సర్వసిద్ధిప్రదచక్రస్వామిన్యై
అతిరహస్యయోగిన్యై
అథనవమావరణనామాని
శ్రీశ్రీమహాభట్టారికాయై
సర్వానందమయ
చక్రస్వామిన్యై
పరాపర రహస్యయోగిన్యై
అథ నవచక్రేశ్వరీ నామాని
త్రిపురాయై
త్రిపురేశ్యై
త్రిపురసుందర్యై
త్రిపురవాసిన్యై
త్రిపురాశ్రియై
త్రిపురమాలిన్యై
త్రిపురాసిద్ధై ్య
త్రిపురాంబాయై
మహాత్రిపురసుందర్యై
అథదేవీ విశేషణాని
మహామహేశ్వర్యై
మహామహారాజ్ఞై
మహామహాశక్త్యై
మహామహాగుప్తాయై
మహామహాజ్ఞప్త్యై
మహామహానందాయై
మహామహాస్పందాయై
మహామహాశయాయై
మహామహాశ్రీచక్రనగర సామ్రాజ్ఞై
నమస్తే నమస్తే నమస్తే నమః



## మణిద్వీప వర్ణన

బ్రహ్మలోకానికి పైనసర్వలోకం విరాజిల్లుతూ ఉంటుంది.దానినే మణిద్వీప మంటారు. అక్కడే శ్రీదేవి తేజ రిల్లుతూఉంటుంది. సమస్తలోకాల కన్న అధికమైనది కావడం వల్లనే మణిద్వీపాన్ని సర్వలోకమని అంటారు. పరాంబికాదేవి దానిని తన సంకల్ప మాత్రంచేత సృష్టించింది. ఈసృష్టికి పూర్వం మూల ప్రకృతీదేవి ఈ మణిద్వీపాన్ని తనకు ఆవాసస్థానంగా ఏర్పరచుకుంది. మణిద్వీపం కైలాసంకన్న మిన్నగా, వైకుంఠంకంటే ఉత్తమంగా, గోలోకంకంటే శ్రేష్ఠంగా భాసిల్లుతూ ఉంటుంది. అందుకే దానిని సర్వలోక మంటారు. ఈజగత్రయంలో దానిని అధిగమించిన సుందర తర నగరం వేరొకటిలేదు. అదిభువన త్రయానికి ఛత్రంలా అమరిఉంది. సంసార సంతా పాన్ని నాశనంచేస్తూ అది బ్రహ్మాండాలు అన్నిటికీ చల్లని నీడను ప్రసాదిస్తూ ఉం టుంది. గాంభీర్య, వైశాల్యాలలో సమమైన యోజనాలు కలది. మణిద్వీపానికి నాల్గువైపులా అమృతసాగరం భాసిల్లుతూ ఉంటుంది. ఆసాగరంలో వాయుస్పర్శకు ఉవ్వెత్తుగలేస్తూ శీతల తరంగాలూ, రతనాల సైకత ప్రదేశాలూ, దక్షిణావర్త శంఖాలూ, అనేక వర్ణాలు కలచేపలూ కనుల పండుగ చేస్తూ ఉంటాయి. అక్కడ అసంఖ్యాక తరంగాల సంచలనంవల్ల చల్లటి నీటితుంపరలూ, టెక్కెల టెక్కుతో అటూ ఇటూ సంచరించే పడవలూ ఆ ప్రదేశాన్ని శోభాయమానం చేస్తూంటాయి. సుదీర్ఘమైన ఆతీరాలలో నయనానందకరమైన రత్నవృక్ష పంక్తులు రాజిల్లుతూన్నాయి.

ఆప్రదేశానికి ఆవలిభాగంలో నిర్మించబడిన సప్తయోజనాల విస్తీర్ణం కలదృఢమైన లోహమయ ప్రాకారంఉంది. నానాశస్త్రాస్త్రాలను ధరించి పోరడంలో యుద్ధ విశారదులైన రక్షకభటులు నాలుగు ద్వారాలలో ద్వార పాలకులై కాపలా కాస్తూ ఉంటారు. ప్రతిద్వారంలోనూ వందలాది భటులుంటారు. అక్కడ శ్రీదేవీభక్తులు గణా లుగా నిసిస్తారు. వారు సర్వదా జగదీశ్వరి దివ్య సందర్శనార్థం విచ్చేస్తూంటారు. వారు తమ దివ్య వాహనాలపై వస్తూ పోతూంటారు. వారి అసంఖ్యాక విమానాదుల గంటల చప్పుళ్ళూ వారిగుర్రాల సకిలింపులూ, వాటి డెక్కల టకటక ధ్వనులూ దిక్కులు పిక్కటిల్లేలా మారుమ్రోగుతూంటాయి. అక్కడి దేవీ జనాదులు వేత్ర పాణులై 'గోలచేయకండి' అంటూ దేవ సేవకులను దండిస్తూ ఉంటారు. ఆ మహాకోలాహల మధ్యభాగంలో ఎవరు ఏ చప్పుడు చేసినా తెలియరాదు, ఒకరిమాట వేరొకరికి తెలియరాదు. అక్కడ అడుగడుక్కీ స్వచ్ఛశీతల, మధుర జలసంభరిత సరోవరా లున్నాయి. అచ్చోటనే రత్నమయ వృక్ష సంభరిత మైన ఉద్యానవనాలున్నాయి.

ఆస్థానందాటి పురోగమించగా లోపలిభాగంలో కంచుతో నిర్మించిన మహా ప్రాకారం ఉంది. ఆ కాంస్యప్రాకారం అంబరాన్ని చుంబించునట్టిదిగాఉంది. లోహ మయ ప్రాకారాన్ని అధిగమంచి కాంస్య ప్రాకారం శతాధిక లోహమయ ప్రాకారం కన్నమిన్నయై మహత్తర మైనది. దాని గోపుర ద్వారాలు మహోన్నతమైనవి. సమస్త తరు జాతులూ అక్కడ ఉన్నాయి. ఆ తరుశాఖలకు సర్వదా కొంగ్రొత్త చిగుళ్ళను,

కమ్మటి సువాసలీను నానా వర్ణాలుకల పుష్ప గుచ్ఛాలును, మధుర ఫలాలూ విలసిల్లు తూంటాయి. పనస,వకుళ,లోధ్ర,కర్ణికార,శింశుప,దేవదారు, కాంచనార, చూతనమేరు, లికుచ,హింగులైలా,లవంగ,కట్ఫల,పాటల,ముచుకుంద,ఫలినీ, జఘనేఫల, తాల, తమాల,సాల,కంకోల,నాగభద్ర,పుణ్నాగపీలు, సాల్వక, కర్పూరాశ్వకర్ణ, హస్తికర్ణ, తాలపర్ణ, దాడిమిగణిక, బంధుజీవక, జంబీర,కురండక, చాంపేయ,బంధుజీవన, కనక,ద్రుమ,కాలాగురు, చందన, ఖర్జూర, యూధికా, తాలపర్ణిక్షు, క్షీరవృక్ష, ఖదిర, బింబా, భల్లాతక, రుచక, కుటజ, బిల్వ, తులసి, మల్లికాది తరువులూ గల మనోహర వనాలూ ఉన్నాయి. ఈరీతిగా అక్కడ నానావిధ వృక్షాలూ, వనోపవనాలూ, అనేక శతాల సంఖ్యలో దిగుడు బావులూ మహాసుందరంగా భాసిల్లుతూంటాయి. ఆ తరు శాఖలపై ఆసీనులై కోయిలలు కుహూనాదాలు చేయగా గండుతుమ్మెదలు ఝుంకార నాదాలుచేయ ఆ నాదాలు శ్రవణ మనోహరంగా ఉంటాయి. ఆ తరువులు సాంద్ర శీతల ఛ్ఛాయను ప్రసాదిస్తూంటాయి. వివిధపక్షి సము దాయానికి ఆ తరు సమూహాలు నివాసయోగ్యంగా ఉన్నాయి. అనేకరసాలు ప్రవహించు నదీతీర ప్రదేశాలు అక్కడ నయనానంద కరంగా ఉంటాయి.

చిలుకలూ, గోర్వంకలూ, పావురాలూ, రాజ హంసలూ ఆదిగాగల పక్షిపక్ష సంజాత వాయువుల వల్ల అక్కడి తరుశాఖలు కంపిస్తూంటాయి. అట్టి తరు సమూ హాలు విరజిమ్మే సుగంధ పవనాలవల్ల అక్కడి వనాలలో పరిమళాలు గుబాళిస్తూంటాయి. ఆ వనాలలోని హరిణీ సమూహాలు బిత్తరి గంతులతో ఇటూ అటూ పరిభ్రమి స్తూంటాయి. అచ్చోట నర్తిస్తూ కేకారవాలుచేసే మనోహర మయూరనాదాలు దశదిశలూ వ్యాపిస్తూంటాయి. అట్టి మణిద్వీపంలో మధుర నాదాలు ప్రతిధ్వనించ మధువును స్రవింపజేసే తరుసమూహాలు అలరారుతుంటాయి.

ఆ కాంస్య ప్రాకారం దాటగా లోపలివైపు తామ్ర ప్రాకారం ఉంది. చతురస్రాకారంగా ఉన్న అది చతురస్రా కారంగా సప్తయోజనాల ఔన్నత్యం కలిగి అది భాసిల్లుతూ ఉంటుంది. కాంస్య తామ్ర ప్రాకారాల మధ్యలో కల్ప వనాలున్నాయి. తరువికసితపుష్పాలు సువర్ణ పుష్ప సమంగా భాసిల్లుతూ ఉంటాయి. వాటి పత్రాలు సువర్ణ పత్రాలుగా, బీజఫలాలు రత్నాలవలె, సొంపుకూరుస్తూ ఉంటాయి. ఆ తరుబహిర్గత సుగంధం దశయోజన పర్యం తం వ్యాపిస్తూ ఉంటుంది. ఆ కల్పవనంలో వసంతేశుడు కొలువై అహో రాత్రులు వసంత శోభలను వ్యాపింప జేస్తూంటాడు. అతడు పుష్పచ్ఛత్ర ఛాయలో పుష్పసింహాసనంపై ఆసీనుడై ఉంటాడు. పుష్పా భరణాలను దాల్చిన అతడు పుష్ప మధువును పానంచేసి మత్తెక్కి ఉంటాడు. మధుశ్రీ మాధవశ్రీలు ఇర్వురూ అతని భార్యలు. సదా మందస్మిత వదనార విందాలతో అలరారే భార్యలతోకూడి వసంతుడు పూలబంతులతో క్రీడిస్తూంటాడు. మధుధారలు ప్రవహించునట్టి ఆ కల్పకవనం అపారానందాన్ని అందజేస్తూ ఉంటుంది. అక్కడి సుగంధాలు దశయోజన పర్యంతం వ్యాపించి ఉంటాయి. సుగంధ సంభరితమైన



ఆ వనాలలో గానలాలసలైన గంధర్వ కామినీజన గాఢాలింగనాలలో గంధర్వ యువకులు సయ్యాటలాడుతూ ఉంటారు. మత్తకోయిలల కలకల రావాలతో వసంత శ్రీ శోభలతో ఆ దివ్యవనం కాముకుల కామోద్రేకాన్ని వర్ధిల్లజేస్తూ ఉంటుంది.

తామ్ర ప్రాకారాన్ని అధిగమించగా లోపలివైపు సీసప్రాకారం ఉన్నది. సప్తయోజ నాల ఎత్తులో అది అలరారుతూ ఉంటుంది. తామ్రసీస ప్రాకారాల మధ్యభాగంలో సంతాన వాటిక ఉంది. అచ్చటి పుష్పసుగంధం దశ యోజన పర్యంతం వ్యాపిస్తూ ఉంటుంది. మధురరస సంభరితాలై అక్కడి ఫలాలు ఉంటాయి. సంతాన వాటికకు గ్రీష్మఋతువు నాయకుడు, శుక్రశ్రీ శుచిశ్రీలు అతనిభార్యలు. సంసార తాపభీతలైవారు ఆ తరువుల మొదట శాంతిగ విశ్రమిస్తూంటారు. అక్కడే గణనాతీతంగా అమర, సిద్ధగణాలు ఉంటాయి. శరీరాలకు గంధాలు పూసుకుని సుమమాలలను గళసీమలలో అలంకరించుకుని తాళవృంతాలనుచేబూని నవవిలాసినులు సమూహాలుగా ఒయ్యా రాన్ని ఒలకబోస్తూంటారు. అచ్చటిప్రాణులు శీతలజలాలను పానం చేస్తూంటారు.

సీసపు ప్రాకారాన్నిదాటి పురోగమించగా గోచర మయ్యేది ఇత్తడి ప్రాకారము. అది సప్తయోజనాలు ఔన్నత్యం కలిగి విరాజిల్లుతూ ఉంటుంది. సీసపు-ఇత్తడి ప్రాకా రాలమధ్యప్రదేశంలో హరిచందన తరువనాలున్నాయి. మేఘవాహనుడైన వర్షఋతువు దానికి అధిపతి, తటిల్లతలవలె అతని నయనాలు పింగళ వర్ణంతో భాసిల్లుతూ ఉంటాయి. అతడు మేఘ సమూహాలే కవచంగా కలవాడు. వజ్ర సదృశంగా గర్జిస్తూ ఇంద్రచాపధా రియై కదవపోతగా సర్వే సర్వత్రా వర్షిస్తూ స్వగణపరివేష్టితుడై ఉంటాడు. నభశ్రీ, నభస్యశ్రీ, స్వరస్య,రస్యమాలిని, అంబాదుల నితంతి, భ్రమంతి, మేఘయంతిక, వర్షయంతి,చిపుణిక,వారిధార మదవిహ్వల ఈపన్నెండుగురు వర్షఋతు నాయకునకు మదమత్తలైన ద్వాదశ శక్తులు, ఈ ప్రదేశమంతా నవపల్లవ సంభరిత తరుపంక్తులతో, లేలేత తీగెలతో, పచ్చనిపైరులతో కనులవిందుచేస్తూ ఉంటుంది. నిర్విరామ ప్రవాహ వేగంతో అక్కడి నదీనదాలు హృదయా నందాన్ని వర్ధిల్లజేస్తూంటాయి. సరస్సులలోని కలుష జలాలు సయితంరాగుల అంతరంగాలవలె విశుద్ధంగా ఉంటాయి. శ్రీదేవీ మహోత్సవాలు చేసుకునేసిద్ధులూ, దేవతలూ అక్కడ వసిస్తూంటారు. వారు విలాసినులైన తమ పత్నులతో విహరిస్తూంటారు.

ఆఇత్తడి ప్రాకారందాటగా లోపలగా సప్తయోజనాల ఔన్నత్యం కలిగి పంచ లోహమయ ప్రాకారం తేజరిల్లుతూంటుంది. ఇత్తడి-పంచ లోహమయ ప్రాకారాలకు మధ్య భాగంలో మందారవనం ప్రకాశిస్తూ ఉంటుంది. ఆ మందార తరువులు సుందర పుష్పాలతో పల్లవాలతో నయనా నందకరంగా ఉంటాయి. ఎట్టిరోగమూలేని శరదృతువు దానికి అధిష్ఠాత కాగా ఇష్టలక్ష్మి ఊర్జలక్ష్మి అనేవారు అతని భార్యలు సిద్ధులు అచ్చోట తమపత్నులతో నివసిస్తూంటారు.

ఆ పంచలోహ ప్రాకారం దాటి ముందుకు వెళ్ళగా లోపలవైపు సప్త యోజనాల ఎత్తు కలిగి మహోన్నత శిఖరాలతో రజితప్రాకారం తళతళలాడి పోతూంటుంది.

అక్కడి పారిజాత తరువులు నవ్యపుష్పగుచ్ఛాలతో సుగంధాలను వెదజల్లగా తత్పరి మళం దశయోజన పర్యం తం వ్యాపిస్తూ దేవీ పూజలు చేసేవారి ఆనందాన్నివర్ధిల్ల జేస్తూంటుంది. మహోజ్జ్వలైన హేమంతఋతువు దానికి అధిపతి, అతడు తన గణాలతో, ఆయుధాలతో అనురాగవతుల మనస్సులను పరవశింపజేస్తూంటాడు. సహశ్రీ సహస్యశ్రీలు అతని భార్యలు. దేవీవ్రతాలను ఆచరించునట్టి సిద్ధులు అక్కడ నివసిస్తూ ఉంటారు.

ఆ రజతప్రాకారందాటి పురోగమించగా లోపలి ప్రదేశంలో సప్తయోజ నాల ఔన్నత్యం కల సువర్ణమయ ప్రాకారం తేజరిల్లిపోతూ ఉంటుంది. రజత-సువర్ణమయ ప్రాకారాల మధ్య పుష్పపల్లవ శోభితమైన కదంబవనంఉంది. ఆ తరువుల నుండి కదంబ మధ్యం అసంఖ్యాక ధారలతో స్రవిస్తూ ఉంటుంది. ఆ రసధారలను స్వేచ్ఛగా పానం చేయడం వల్ల ఆత్మానందం కలుగుతుంది. ఆ ప్రాకారానికి శిశిరఋతువు అధిపతికాగా, అతడు తన పత్నులైన తపశ్శ్రీ, తపస్యశ్రీలతోగూడి ఆనందిస్తూంటాడు. ఆ స్థానంలో మహాసిద్ధులైనవారు నానా గణాలతో హావభావ విలాసయుక్తులై దేవీ ప్రీత్యర్థం దానాలు చేయసంసిద్ధంగా ఉంటారు. వారు తమ అర్థాంగులతో కాపురాలు చేస్తూ సుఖభోగాలు అనుభవిస్తూ సంతోషంగా ఉంటారు.

సువర్ణమయ ప్రాకారాన్ని దాటి ముందుకు వెళ్ళగా లోపలివైపు ఏడు యోజనాల ఎత్తులో పుష్పరాగమణి ప్రాకారం కంటపడుతుంది. ఎర్రటి కుంకుమలా అది భాసిల్లుతూ ఉంటుంది. అక్కడి పృథివీ, వనోపవనాలూ అన్నిటి కన్నీపుష్పరాగమణి మయాలే. అక్కడఉండే రత్నవృక్షాలూ పుష్పరాగపుచెట్ల పాదులూ సొంపుగా ఉంటాయి. అచ్చో టనే రత్నప్రాకారం ఉంది. అందలితరు, పక్షి, వనభూమ్యాదులన్నీ రత్నమయాలై మండప, స్తంభ, సరోవర, కమలాదులన్నిటికన్నీ రత్నమయాలే. ఈ రత్న ప్రాకారం ఇతరేతర ప్రాకారాలన్నిటినీమించి లక్షరెట్లు అధికంగా భాసిల్లిపోతూ ఉంటుంది. బ్రహ్మాండంలోని దిక్పతులైన ఇంద్రాదులు, వరాయుధాలు ధరించి దిక్పాల సమష్ట్యాత్మ రూపంలో ప్రకాశిస్తూంటారు.

దానికి తూర్పుగా మహోన్నతశిఖరాలతో అమరావతీనగరం నానావిధ వనాలతో భాసిల్లుతూఉంటుంది. అక్కడమహేంద్రుడు రాజిల్లుతూ ఉంటాడు. స్వర్గసీమలోని శోభ కన్న మిన్నయైన అత్యధిక శోభకానవస్తుంది. అక్కడ వేలాది ఇంద్రుల ప్రకాశంకల మహేంద్రుడు వజ్రహస్తుడై దేవ సైన్య పరివేష్టి తుడై భాసిల్లుతూంటాడు.దేవాంగనలతో కూడి ఇంద్రాణి కూడ అక్కటే విరాజిల్లుతూంటుంది. దానికి ఆగ్నేయభాగంలో అగ్నిమయ పట్టణ మన దగిన అగ్ని పురం తేజరిల్లిపోతూంటుంది. అగ్నిభట్టారకుడు అక్కడే తన భార్యలైన స్వాహా,స్వధాదేవ్యలతో నిజవాహనభూషణ, దేవగణ పరివేష్టితుడై ప్రకాశిస్తూంటాడు. దక్షిణ దిగ్భాగంలో యముని నగరంఉంది. అక్కడ యముడు దండపాణియై చిత్రగుప్తాదులతో, తనశక్తితో నివసిస్తూ ఉంటాడు. నైరృతదిశలో రాక్షసులుంటారు.వారిచే పరివేష్టితుడై నిజశక్తి యుక్తుడై నిరృతి భాసిల్లుతూం



టాడు.పశ్చిమదిశలో పాశధరుడై వరుణదేవుడు ప్రతాప శాలియై గోచరిస్తాడు. వారుణీ మదమత్తయైన తనపత్నితో మహా మత్స్యాన్ని అధిరోహించి జలజంతువులతో విహరిస్తూంటాడు. అతడాలోకంలో తనభార్యతోకూడి రతిక్రీడలతేలి ఆనందిస్తూం టాడు.వాయువ్యదిశలో వాయులోకంలో వాయుదేవుడు నివసిస్తూంటాడు. వాయు సాధనంద్వారా సిద్ధులైన యోగిజనపరివేష్టితుడై ధ్వజహస్తుడై, విశాలాక్షుడై మృగవాహ నుడై మరుద్గణ సేవితుడై తనశక్తితోకూడి ఆ మహాత్ముడు విరాజిల్లుతూంటాడు.

ఉత్తరదిశలో యక్షలోకం ప్రకాశిస్తూంటుంది. అక్కడ వృద్ధి-బుద్ధి అనే పేర్లు గల శక్తులతో యక్షేశుడు భాసిల్లుతూ ఉంటాడు. ధనపతి అయిన అతడు నవనిధులకూ అధిపతి. మణిభద్రుడు, పూర్ణభద్రుడు, మణిమంతుడు, మణికంధరుడు, మణి భూషుడు, మణిమాలాధారి, మణికార్ముకుడు, ఆదిగాగల యక్షసేనానులతో కుబేరుడు తనశక్తితో విశేష సంపన్నుడై తేజరిల్లుతూఉంటాడు. దానికి ఈశాన్య భాగంలో మహారుద్రలోకం తేజరిల్లుతూ ఉంటుంది. అమూల్య రత్ననిర్మితమైన అందులో మహారుద్రుడు స్వయంగా భాసిల్లుతూంటాడు. మహోగ్రుడై, దీప్తనయనుడై మూపున అమ్ములపొదిని దాల్చినవాడై, వామహస్తాన ధనువును ధరించి అనేకమంది రుద్రులతో కూడి ఉంటాడు. వారును వరాయుధ ధనుర్ధారులై ఉంటారు. వారి వికృత భయంకర వదనాలనుండి నిప్పులు కురుస్తూంటాయి. వారిలోకొందరు దశభుజులు, మరికొం దరు శతభుజులు, ఇంకా కొందరు సహస్ర భుజులు, దశపాదాలతో, దశ గ్రీవాలతో నేత్రత్రయంతో కొందరు ఉంటారు. భీకర రూపులైన వారిలో కొందరు పృథ్వీమీద, మరికొందరు అంత రిక్షంలోనూ పరిభ్రమిస్తూంటారు. రుద్రాధ్యాయంలో వర్ణిం చిన రుద్రులచే, మాతలచే, నానాశక్తులచే, డామర్యాది గణాలచే, వీరభద్రాదులచే పరివేష్టితుడై మహారుద్ర భగ వానుడు తేజరిల్లుతూంటాడు. ముండమాలాధరుడు, నాగ కంకణుడు,నాగకంటుడు,వ్యాఘ్రచర్మధారీ, గజచర్మాన్ని ఉత్తరీయంగా ధరించిన వాడూ, చితాభస్మధారీ ప్రమథగణ పరివేష్టితుడూ, డమరుకనాదా లను దశదిశలా ప్రతిధ్వనింపజేయగలవాడూ, మహాట్టహాస, స్ఫోటశబ్దాలతో నభాన్ని భయపెట్టునట్టి వాడూ, భూతసంఘాలతో కూడినవాడూ, భూతావాసుడూ అయిన మహేశ్వరుడు ఈశానాది అధిపతికావడంవల్ల ఈశానుడనబడతాడు. అష్టమూర్తియు, మహ రుద్రుడూ అయి అతడు భాసిల్లుతూంటాడు.

పుష్యరాగమణుల ప్రాకారానికి ఆవలిభాగంలో లోపల కుంకుమ సమ అరుణవర్ణంతో పద్మరాగ మణిప్రాకారం భాసిల్లుతూంటుంది. అక్కడి భూభాగం కూడ ఎర్రగానే ఉంటుంది.ఆ ప్రాకారం దశయోజనాల ఔన్న త్యం కలిగి ఉంటుంది. దానికి గోపుర ద్వారాలున్నాయి. అక్కడ పద్మరాగ మణి సంభరిత ప్రకాశంతో అసంఖ్యాక మండపాలున్నాయి. వాటి నడుమ వివిధాయుధ, రత్న భూషణ ధారులైన వీరులూ, చతుష్షష్టి కళలూ ఉన్నాయి. ఆ మహావీరులకు వేర్వేరుగా నాయకులూ ఉన్నారు. ప్రత్యేక లోకాలూ ఉన్నాయి. ఆ లోకాలన్నీ పద్మరాగమణి నిర్మితాలే.

ఆయా లోకాలలోని వారు ఆయా వస్త్ర వాహ నాదులను ధరిస్తారు. వారి నామాలు పింగళాక్షి, విశాలాక్షి సమృద్ధి, వృద్ధి, శ్రద్ధ, స్వాహా, స్వధా, అభిఖ్య, మాయ, సంజ్ఞ, వసుంధర, లోకధాత్రి, సావిత్రి, గాయత్రి, త్రిదశే శ్వరి, సురూప, బహు రూప, స్కందమాత, అచ్యుతప్రియ, విమల,అమల,అరుణి, ఆరుణి, ప్రకృతి, వికృతి, సృష్టి, స్థితి, సంహృతి,సంధ్య,మాత,సతి,హంసి, మర్దిక, వజ్రిక, దేవమాత, భగవతి, దేవకి, కమలాసన, త్రిముఖి, సప్తముఖి, సురాసుర విమర్దిని, లంబోష్ఠి, ఊర్ధ్వకేశి, బహు, శీర్ష, వృకోదరి, రథరేఖ, శశిరేఖ, గగనవేగ, పవనవేగ, భువనపాల, మదనాతుర, అనంగ, అనంగ మథన, అనంగ మేఖల, అనంగకుసుమ, విశ్వరూప, సురాధిక, క్షయంకరి, శక్తి, అక్షోభ్య, సత్యవాదిని, బహురూప, శుచి, వ్రత, ఉదార, వాగీశి, అనే అరువది నాలుగు కళలూ శక్తుల న బడతాయి.వారందరికీ నిప్పులు కక్కునట్టి మహోజ్జ్వల మైన జిహ్వాలున్నాయి. వారి అనేక ముఖాల నుండి అగ్ని జ్వాలలు బహిర్గతమవుతుంటాయి. "మనం ఈ సమస్త జలాలనూ పానం చేసివేద్దాము. సమస్తాగ్నినీ చల్లార్చి వేద్దాము. వాయువునంతటినీ స్తంభింప జేసివేద్దాము. సర్వ జగాలనూ భక్షించివేద్దాము." అని జేవురించిన నేత్రాలతో వారు అరుస్తూంటారు. ధనుర్బాణ పాణులై వారందరూ కయ్యానికి కాలు దువ్వుతుంటారు. వారి దంత తాడనం వల్ల పుట్టిన కఠోరశబ్దాలకు శ్రవణాలు బధిరీ భూతమవు తూంటాయి. ఆ మహావీరులందరికీ ఊర్ధ్వ కేశాలున్నాయి. ధనుర్బాణ పాణులైననూర్ల అక్షౌహిణీ సైన్యాలున్నాయి. లక్ష బ్రహ్మాండాలను నాశనం చేయగల శక్తి అందులో ప్రతిశక్తికీ ఉంది. అట్టి నూర్ల అక్షౌహిణీ సైన్యాలున్నాయి. ఈ విశ్వంలో వాటికి అసాధ్యమైన దేదీలేదు. ఆ ప్రాకారం లోనే రణసామాగ్రి అంతా భద్రపరచబడి ఉంది. అచ్చోట రథాశ్వ గజ శస్త్రాదులు గణనాతీతంగా ఉన్నాయి.

ఆ పద్మరాగ మణిప్రాకారాన్ని దాటి పురోగమించగా లోపలి ప్రదేశంలో గోమేధిక మణినిర్మిత ప్రాకారం అలరారుతూ ఉంటుంది. అది దశయోజ నాలు ఔన్నత్యం కలిగి రాజిల్లుతూ ఉంటుంది.జపాకుసుమ సన్నిభంగా అది తేజస్సులను విరజిమ్ముతూ ఉంటుంది. దానిమధ్య భాగ మందలి భూమీ, అక్కడ ఉండేవారు ఆ వర్ణంతోనే ఉంటారు. అక్కడి భవనాలూ గోమేధిక మణికాంతులను ప్రసరింప జేస్తూంటాయి. అక్కడ నివసించే పక్షి, వృక్ష, స్తంభ, సరోవరాదులన్నిటికన్నీ కుంకుమ సమ అరుణ వర్ణంతో గోమేధికమణి నిర్మితమై ఉంటాయి. ఆ ప్రాకార మధ్య భాగంలో ముప్పై రెండు శ్రీదేవీ శక్తులుంటాయి. గోమేధికాభరణ ధారులైన ఆ శక్తులు వివిధ శస్త్రాస్త్రాలను ప్రయోగిస్తూంటారు. ఆ ప్రాకారంలో 32లోకాలున్నాయి. ప్రతిలోక శక్తికీ దశసంఖ్యలో అక్షౌహిణీ సైన్యాలున్నాయి. ఆ ప్రాకారంలో నివసించే శక్తులు పిశాచవదనాలతో, నిరంతర చక్రధారిణులై సదా స్వర్గవాసు లచే ఆరాధింపబడు తూంటారు. క్రోధోద్రిక్తలైనవారు "ఛేదించండి, భేదించండి, వండండి, కాల్చండి" అని అంటూ నిరంతర యుద్ధోత్సా హంతో సంసిద్ధంగా ఉంటారు. ప్రతీ మహాశక్తి



సన్నిధి లోనూ దశాక్షౌహిణీ సైన్యాలుంటాయి. అందలి ప్రతీశక్తి అగణిత బ్రహ్మాండాల నైనా నాశనం చేయగలదు. అట్టి మహాసైన్యా లను వర్ణించగలమా? అక్కడ ఉన్న రథ వాహినులకు లెక్కయేలేదు.వారందరికందరూ శ్రీదేవికై యుద్ధం చేయ సన్నద్ధులై ఉంటారు. పాపహారకాలైనా వారి నామాలివి. విద్య, హ్రీ, పుష్టి, ప్రజ్ఞ, సినీవాలి, కుహూ,రుద్ర,వీర్య,ప్రభ,నంద,పోషిణి, బుద్ధిద,శుభ,కాళరాత్రి,మహారాత్రి, భద్రకాళి, కపర్దిని,వికృతి,దండిని, ముండిని, సేందు ఖండ, శిఖండిని, శుంభ, నిశుంభమథిని, మహిషా సురమర్దిని, ఇంద్రాణి, రుద్రాణి, శంకరార్ధ శరీరిణి, నారి, నారాయణి, త్రిశూలిని, పాలిని, అంబిక, హ్లాదిని, మాయాదేవి వీరే క్రుద్ధులయితే సమస్త బ్రహ్మాండాలనూ నాశనంచేయగలరు. ఎట్టిస్థితిలోనూ వీరు అపజయాన్ని అంగీకరిం చరు.

గోమేధిక ప్రాకారాన్ని దాటి ముందుకు వెడితే లోపలి భాగంలో వజ్రాల ప్రాకారం ప్రకాశిస్తూ ఉంటుంది. అదీ దశయోజనాల ఔన్నత్యం కలిగి గోపుర ద్వారాలతో శృంఖలా బద్ధమైన కవాటాలతో శోభిల్లుతూంటుంది. నవతరువులతో అలరారే ఆ ప్రదేశమంతా వజ్రమయమే. అక్కడి వీధులూ, లతలూ, తరువులూ, పక్షులూ, అన్నిటి కన్నీ వజ్రమయాలే. వాపీకూపతటా కాదులన్నిటికన్నీ వజ్రమయాలే. అక్కడే త్రిభువనేశ్వరీదేవి దాసీజనం నివసిస్తూంటారు. ప్రతీదాసీ అసంఖ్యాక దాసీగణం ద్వారా సగర్వంగా సేవలందు కుంటూంటారు. వారిలో కొందరు తాళవృంతా లను ధరించీ, మరికొందరూ పానపాత్రలు చేబూనీ ఇంకా కొందరు తాంబూల పాత్రలను గైకొనీ ఉంటారు. కొందరు ఛత్రచామరాలనూ, నానాంబరాలనూ, సుమా లనూ, నిలువుటద్దాలనూ, కుంకుమానులేపనాలనూ,కాటుక, సింధూర, పానపాత్ర లనూ ధరించి ఉంటారు. చిత్రలేఖ నంలో కొందరూ, ఆభరణ నిర్మాణంలో కొందరూ నిపు ణులు, మరికొందరు శ్రీదేవి పాదసేవనంలో తన్మయులవు తూంటారు, కొందరు సర్వాంగాలలోనూ ఆభరణాలనుధరిస్తారు. కొందరు పుష్ప మాలలనూ, పుష్పాభరణా లనూ ధరింపజేస్తారు. ఈరీతిగా అక్కడ రమణులు విలాసవతులై, చతురులై రాసికెక్కుతారు. వారందరికందరూ శ్రీదేవీ సేవకై నడుములు బిగించి ఉంటారు. శ్రీదేవీ కరుణారసదృష్టి ముందు జగత్రయాన్ని సైతం తుచ్ఛంగా భావిస్తారు. శ్రీదేవీ చరణ సేవాతత్పరలు, శృంగార మదగర్వితలు అయిన వారి నామాలివి. అనంగరూప, అనంగ మదన, సుందరి మదనాతుర, భువనవేగ, భువన పాలిక, సర్వశిశిర, అనంగ వేదన, అనంగమేఖల, వీరందరికందరూ తటిల్ల తలవంటి శరీరాంగాలతో, రవళించే మొలనూలి గంటలతో, మధుర నాదాలుచేసే కాలి అందెలతో అటూ ఇటూ ఒయ్యారాలు ఒలుకబోస్తూ పరిభ్రమిస్తూంటారు. విద్యుల్లతలను బోలు శరీరాంగాలు కల నారీమణులు కొందరు వేత్రపాణులై సర్వకార్యాలనూ సమర్ధవంతంగా చేయగలిగిన చతురులై ఇటూ అటూ పరుగులు తీస్తూంటారు. ఆ ప్రాకారానికి అష్టదిశలలోనూ వారిభవనాలున్నాయి. ఆభవనాలలో వారి అగణితా

యుధ, వాహనాదులు శోభిల్లుతూంటాయి. ఆ వజ్రప్రాకారందాటి పురోగమించగా లోపలి వైపున వైడూర్య ప్రాకారం తేజరిల్లుతూన్నది. అదికూడ దశయోజనాల ఔన్నత్యం కలిగి గోపుర ద్వారాలతో భాసిల్లి పోతూ ఉంటుంది. అక్కడ ఉన్నభూమీ, మార్గాలూ, వాపీకూపతటాకాదులూ, నదీతీరాలూ, సైకత స్థానాలూ అన్నిటి కన్నీ వైడూర్యమయాలే. అక్కడి అష్టదిశలలో బ్రాహ్మీ ఆదిగాగల దేవీమండలాలు ఉన్నాయి. నిజగణాలతో వారందరి కందరూ కొలువుతీరిఉంటారు. ప్రతిబ్రహ్మాండంలోని మాతలందరికీ వీరే సమష్టిగా ప్రతిరూపాలుగా వ్యవహరింపబడతారు. బ్రాహ్మీ, మాహేశ్వరి, కౌమారి, వైష్టవి, వారాహి, ఇంద్రాణి, చాముండ, అనేవారలు సప్త మాతృకలుగా ఖ్యాతిగాం చారు. శ్రీ మహాలక్ష్మీదేవి అష్టమ మాతృకగా పిలువబడుతూ ఉంటుంది. బ్రహ్మరుద్రాది దేవతలకు సమమైన రూపచేష్టలు కలిగి వీరు భాసిల్లుతూ ఉంటారు. సమస్త జగత్తులకూ వీరు శుభాలను చేకూరు స్తూంటారు. స్వసైన్యాలతో తేజరిల్లు తూంటారు. ఈప్రాకారానికి చతుర్ద్వారాలలో నిత్యం మాహేశ్వరీదేవి దివ్య వాహనాలు చక్కగా అలంకరింపబడి జాగరూకలై ఉంటాయి.అచట అసంఖ్యాకంగా గజాశ్వ, సింహ,గరుడ,వృషభ, మయూర, హంస, పల్లకీలు మొదలైనవి వాహనాలుగా సావధానంగా ఉంటాయి. అట్లేరథాలు కూడ అగణితంగాఉన్నాయి. ఆయా వాహనాలకు రెండువైపులా పార్శ్వ రక్షకులున్నారు. అరదాల టెక్కాలు గగనతలాన్ని చుంబిస్తున్నాయి. నానావిధ ధ్వజపతాక శోభితాలై గణనాతీతంగా వాద్య విశేషాలతో విమానాలు అలరారుతూన్నాయి.

ఆవైడూర్య ప్రాకారాన్ని దాటి ముందుకు వెళ్ళగా దశయోజనాల ఎత్తుగల ఇంద్రనీల మణిప్రాకారం తేజరిల్లుతూ ఉంటుంది. అక్కడి వాపీకూప తటాకాదులన్నీ ఇంద్రనీల మణి నిర్మితాలే. అనేక యోజనాల వెడల్పుతో ఓ పద్మం భాసిల్లుతూ ఉంటుంది. అది షోడశ దళాలతో సుదర్శన చక్రసన్నిభంగా ప్రకాశిస్తూంటుంది. అక్కడే పదహారు శక్తులుంటాయి. విశ్వవార్తలను తెలియజేయ గలవారువారే.

ముక్తాలమణి ప్రాకారం దాటి ముందుకు వెళ్ళగా లోపలి భాగంలో మరకతమణి ప్రాకారం అలరారుతూంటుంది. అదికూడ పదియోజనాల ఔన్నత్యం కలిగి ఉంటుంది. అక్కడ భోగభాగ్యాలకు లోటే ఉండదు. అందలి అసంఖ్యాక భవనాలు మరకతమణి నిర్మితాలే. రాశీభూత కాంతులతో విరాజిల్లే అక్కడ గల షట్కోణాలలో గల దేవతల నామాలు, తూర్పుకోణంలో గాయత్రీ యుక్త బ్రహ్మదేవుడు కమండలు, అక్షమాల, దండ, అభయ, ఆయుధాలుదాల్చి విరాజిల్లుతూంటాడు. అట్టి ఆయుధాలనే ధరించి పరదేవత అయిన గాయత్రి ప్రకాశిస్తూంటుంది. సమస్త వేద, వివిధ శాస్త్ర స్మృతి, పురాణాదులు మూర్తిమంతాలై నివసిస్తూంటాయి. బ్రహ్మ స్వరూ పలూ, గాయత్రీ స్వరూపులూ, వ్యాహృతి స్వరూపులూ, అక్కడ నివసిస్తూంటారు. నైరృత కోణంలో శంఖ,చక్ర గదా పద్మధారులై సావిత్రీ, విష్ణు వులూ నివసిస్తారు. మత్స్య కూర్మాదిగాగల విష్ణుమూర్తులూ, సావిత్రీ స్వరూ పులూ అందరూ అక్కడే ఉంటారు.



వాయుకోణంలో పరశువు అక్షమాల అభయవరాలుదాల్చి మహారుద్రుడు భాసిల్లుతూంటాడు. దక్షిణామూర్త్యాది రుద్ర విగ్రహాలు కూడ శ్రీగౌరీ స్వరూపులు అక్కడ విలసిల్లుతూంటారు. అక్కడ అరువది నాలుగు ఆగమాలూ, శేషించిన ఆగమాలూ రూపుదాల్చి తేజరిల్లుతూ ఉంటాయి. అగ్నికోణంలో రత్నకుంభ, మకర కుండలధారియై, ధనపతి కుబేరు ప్రకాశిస్తూంటాడు. అతడు అసంఖ్యాక వీథులలో శ్రీమహాలక్ష్మీదేవితో కలిసి ఉంటాడు. తనపత్నితో అతడు నిజగణ పరివేష్టితుడై నివసిస్తూంటాడు. పశ్చిమ కోణంలో మన్మథుడు రతీసమేతుడై ప్రకాశిస్తూంటాడు. అతడు పాశాంకుశ, ధనుర్బాణ ధరుడై శృంగాదిరసాలు మూర్తి మంతాలై కొలువుతీరి ప్రకాశిస్తూంటాయి. ఈశాన్య కోణంలోపుష్టితో పాశాంకుశాలుదాల్చి విఘ్నహరుడైన విఘ్నేశుడు నిత్యం వీరవేషంతో అలరారుతూంటాడు. గణపతి సంబంధమైన విభూతి సర్వస్యం అక్కడ సంపదలతో తులతూగుతూంటుంది. అక్కడ ప్రతిబ్రహ్మాండమందలి బ్రహ్మాదులసమష్టి రూపులయిన బ్రహ్మాదులు అందరూ ఆ జగదీశ్వరిని నిత్యం సేవిస్తూంటారు.

మరకతమణి ప్రాకారాన్ని అధిగమించి పురోగ మించిగా లోపలివైపున పదియోజనాల ఎత్తులో కుంకుమ సమంగా ఎర్రనైన పగడాల ప్రాకారం భాసిల్లిపోతూంటుంది. అందలి మధ్యభాగంలోని భవనాలన్నీ పగడాల వలె ఎర్రగ మిరుమిట్లు గొలుపుతూంటాయి. అక్కడ పంచ భూతాల స్వామినులు ఐదుగురు హృల్లేఖ, గగన రక్త, కరాళిక, మహోచ్ఛుష్మలనేవారు పంచభూతాలవంటి కాంతి గలవారు వరాభయ పాశాంకుశాలు ధరించి వివిధాభరణ భూషితలై శ్రీదేవి వంటి వేష ఆభరణాలు గలిగి నవ యౌవ్వనంతో గర్వించి ఉంటారు.

ప్రవాళ ప్రాకారాన్ని అధిగమించగా అనేక యోజనాల వైశాల్యం కల నవరత్న ప్రాకారం ఉంది. అందు అమ్నాయ దేవతల భవనాలు అసంఖ్యా కంగా ఉన్నాయి. అక్కడి తటాక సరోవరాదులన్నిటికన్నీ నవరత్న మయాలే. అక్కడ శ్రీదేవి యొక్క మహావతారాలు ప్రకాశిస్తూంటాయి. పాశాం కుశేశ్వరి, భువనేశ్వరి, భైరవి, కపాల భైరవి, భువనేశ్వరి, క్రోధభువనేశ్వరి, త్రిపుట, అశ్వారూఢ, నిత్యక్లిన్న, అన్న పూర్ణ, త్వరిత, వీరేకాక, కాళి, తార, షోడశ, భైరవి, మాతంగి ఆదిగాగల దశమహావిద్యలూ అక్కడ రూపు దాల్చి ప్రకాశిస్తూ ఉంటాయి. తమ తమ ఆవరణ దేవతలతో దేవీ రూపాలన్నీ ఆభరణాలు ధరించి సూర్యకాంతులతో విరాజిల్లుతూ ఉంటారు. ఆ కాంతులు కోటిసూర్యుల కాంతిని అధిగమించి ఉంటుంది. సప్తకోటి మహా మంత్రాలు రూపుదాల్చి అక్కడే శోభిల్లుతూంటాయి. నవరత్న ప్రాకారం దాటి పురోగమించగా శ్రీకరమైన చింతామణి గృహం మహోజ్జ్వల ప్రభలను విరజిమ్ముతూంటుంది. అందలి ప్రతి వస్తువూ చింతామణి నిర్మితమైనదే. సూర్యకాంత చంద్రకాంత మణులతోనూ, ప్రకాశమాన మణులతోనూ నిర్మితమైన అసంఖ్యాక మణిస్తంభాలు వేలకొలదీ అక్కడ ఒప్పారుతూంటాయి. ఆ ప్రభల మధ్యభాగంలో ఏ వస్తువూ కానరాదు.

చింతామణుల మధ్యభాగంలో శ్రీదేవి దివ్యమందిరం విరాజిల్లుతూం టుంది. ఆ దివ్య భవనానికి సహస్రమణి స్తంభాలూ నాలుగు మండపాలూ శోభను చేకూరుస్తు న్నాయి. అందులో క్రమంలో శృంగార, ముక్తి, జ్ఞాన ఏకాంత మండపాలున్నాయి. అక్కడెన్నియో మణివేదిక లున్నాయి. అక్కడి వాతా వరణంవ ధూపసువాసనలను వెదజల్లుతూంటుంది. ఆ నాల్గు మండపాలలోనూ కోటి ప్రభాకర ప్రభలు విరజిమ్ము తూంటాయి. వాటికి నల్దిశలలోనూ కాశ్మీర వనాలు నయనానందకరంగా ఉంటాయి. మల్లెపూదోటలూ, కుంద పుష్పవనాలూ అచ్చటి వాతావరణ సర్వస్వాన్నీ పరిమళ భరితం చేస్తూంటాయి. ఆ వనాలలోని అసంఖ్యాకమృగాలు మదాన్ని స్రవింపజేస్తూం టాయి. రత్నసోపాన పరంపరలుగల మహాపద్మ వనాలు అక్కడ తేజరిల్లు తూంటాయి. ఆ పద్మాలలో అమృత సమంగా మధువులు జాలువారు తూంటాయి. "ఝుం ఝుం" నాదాలతో భ్రమ రాలు తియ్యటి మధువును పానం చేస్తూంటాయి. అక్కడ హంస కారండవాది పక్షిసంతతులు విహరిస్తూంటాయి. ఆ దివ్యవనంలోని సుగంధాలు దశ దిశలలోనూ సువాస నలు వెదజల్లుతూంటాయి. ఆ పరిమళ తరంగ వ్యాప్తమై మణిద్వీపం సువాసితమై ఉంటుంది. శృంగార మంటప మధ్యభాగంలో దేవతలు మధుర మనోహర శ్రవణానందకర సుందర స్వరాలతో దివ్యగీతాలను ఆలపిస్తూం టారు. అక్కడ అమరులందరూ సభాసదులై ఉంటారు. జగజ్జనని వారిమధ్య సింహా సనంపై విరాజిల్లుతూంటుంది. ఆ శ్రీదేవి ముక్తి మండపంలో ఉండి విశ్వంలోని పరభక్తులకు ముక్తి భాగ్యాన్ని ప్రసాదిస్తుంది. జ్ఞాన మండపం నుండి జ్ఞాన ప్రకాశాన్ని వెదజల్లుతూ విధేయాత్ములకు పరమ జ్ఞానదానంచేస్తూ ఉంటుంది. నాల్గవ మంటప మందు దేవి తన మంత్రిణులతో కొలువుండి విశ్వరక్షణ గురించి చర్చిస్తుంది.

చింతామణి గృహంలో శక్తి తత్వాత్మకాలైన దశ సోపానాలతో దివ్యప్రభలను వెదజల్లునట్టి ఓపర్యంకం (మంచం) శోభిల్లుతూంటుంది. బ్రహ్మ,విష్ణు, రుద్ర ఈశ్వ రులు దానికి కోళ్లుగా అమరిఉంటారు. ఆనాలుగు పాదాలపై ఫలకంగా సదా శివ దేవుడు అలరారుతూంటాడు. దానిపై త్రిభువనేశ్వరుడు హిరణ్య బాహువులతో హరిణ, పరశు, వరద, అభయ ముద్రలు దాల్చి తేజరిల్లి పోతూంటాడు. సర్వేశ్వరుడైన ఆ మహాదేవుడు పదహారేళ్ళ సుందరుడు, కోటిసూర్య ప్రభలతో, కోటి చంద్రుల శీతల త్వంతో శుద్ధ స్ఫటిక సమంగా వెలుగుతూ కరుణాసదృష్టు లతో ప్రకాశిస్తూఉంటాడు.

ఆ భువనేశ్వరునకు వామభాగంలో నవరత్న ఖచిత మైన మొలనూలుతో వైడూర్య ఖచితమైన తప్తహాటక నిర్మిత మైన కరకంకణాలు ప్రకాశిస్తుంటాయి. మేలిమి బంగారంతో నిర్మించబడ్డ శ్రీచక్రాకారంగల తాటంక ప్రభలు వదన మండ లంపై విరాజిల్లగా ఆ జగజ్జనని ప్రకాశిస్తూఉంటుంది. ఆమె వదన మండల ప్రభల ముందు చంద్ర బింబకాంతులు వెలవెలబోతున్నాయి. చక్కగాపండిన దొండ పండువంటి కాదుకాదు. దానిని మించిన అధరంతో ఫాలసీమలో కుంకుమ కస్తూరీ తిలకసౌభాగ్యంతో దివ్యప్రభలు వెదజల్లునట్టి ముఖమండలంతో శ్రీదేవి శోభిల్లు



తూన్నది. సూర్యచంద్ర బింబకాంతులను మించిన దివ్య చూడామణి శిరోభూషణంగా కలదీ, ఉదయ శుక్ర సమ స్వచ్ఛకాంతులు విరజిమ్మునాసాభరణ భాసితము, జాతి ముత్యాల గుత్తులతో శోభిల్లునట్టి చింతాకుపతకము వ్రేలాడునట్టి గళసీమ శోభిల్లునట్టిదీ కర్పూర, కుంకుమ, సుగంధాలు అలదిన చనుదోయికలదీ, చిత్రవిచిత్రాభరణాలను ధరించినదీ శంఖసమ కంధరం (మెడ)కలదీ, ఎర్రగా పండిన దానిమ్మ పండ్ల గింజల వంటి దంతపంక్తి కలదీ, అమూల్య రత్నస్థగిత మకుటాన్ని శిరస్సుపై ధరించినదీ మత్తిల్లిన గండుతుమ్మెదలు మూగిన ముంగురులతో శోభిల్లు ముఖ కమలంకలదీ, కళంక, క్షీణత్వాలు లేకుండా దివ్యశోభలాడు శరత్ చంద్ర చంద్రునివంటి ముఖబింబం కలదీ గంగానది సుడిగుండ సమమై భాసిల్లు నాభిదేశం కలదీ మాణిక్యస్థగిత బంగరు టుంగరాలచే అలంకరింప బడిన కమలదళ సమ సుందర దివ్యనేత్ర త్రయంతో తేజ రిల్లునదీ, మెరుగు పెట్టబడిన మహారాగ, పద్మరాగ మణుల బోలునట్టి నిర్మలమై, మహోజ్జ్వలమైన సమస్తమైన కళలూ విరజిమ్ము నైసర్గిక లావణ్య శోభగలదీ నినదించు రతనాల కింకిణీలు, కంకణాదులూ కలదీ, గళసీమలో మణుల ముత్యాల హారాలూ, తళతళలాడే సువర్ణ పతకాలు కలదీ, ధగధగ మెరిసే రతనపుటుంగరాల కాంతులు చిమ్ము కరకమలాలు కలదీ అయిన ఆ దేవి రవికపై పొదుగబడిన వివిధ రతనాల కాంతులు ప్రకాశిస్తున్నాయి. వాడిపోని చక్కటి మల్లెపూల వాసనలు వెదజల్లు కొప్పులో ముడిచిన మల్లెదండలచుట్టూ మూగే తుమ్మెదల బారుకలదీ, శ్రీదేవి తన ఉన్నతమై,నిబిడమై,సువృత్తమైన కుచభారంతో ఈష దలసత్వమంది యున్నది. ఆ శివాని తన హస్తచతుష్టయంలో పాశాంకుశ వరా భయాలుదాల్చి విరాజిల్లిపోతూ న్నది. శుభశ్రీలు నిండారిన శృంగార వేషంతో తేజరిల్లు తూన్నది. సుకుమారాంగాలు కలకోమలి అయిన ఆమె అందాలకందాల రాశి. అవ్యాజ కరుణా వరుణాలయురాలైన ఆమె కరుణా రసదృష్టులు కలది, నవరసాలను ప్రసరించునట్టి కచ్ఛపీవీణా మధురనాదం కలది, అనేకా నేకచోట్ల రవీందుల కాంతుల నధిగమించి సహజప్రకాశంతో ఇచ్ఛ జ్ఞాన,క్రియాశక్తి యుక్తమై తేజరిల్లుతూం టుంది.

అక్కడ లజ్జ, తుష్టి, పుష్టి, కీర్తి, కాంతి, క్షమ, దయ, బుద్ధి, మేత, స్మృతి,లక్ష్మి అనేవారలు రూపుదాల్చి ప్రకాశిస్తూంటారు. జయ,విజయ, అజిత, అపరాజిత, నిత్య, విలాసిని, దోగ్ధ్రి, అఘోర, మంగళ, నవ, అనే పీఠ శక్తులు నిత్యం పరాంబికను సేవిస్తూంటారు. ఆమహా దేవికి ఇరుపార్శ్వాలలోను శంఖ, పద్మ నామక నిధులు సదా నిండి ఉంటాయి. నవరత్నాలూ, కాంచనమూ ప్రవ హించే స్రవంతులు అక్కడ ప్రకాశిస్తూం టాయి. అక్కడి పెన్నిధుల నుండి సప్తధాతుమయ స్రవంతులు సదా ప్రవహిస్తూం టాయి. అవన్నీ చివరకు అమృతసాగరంలో లీనమై పోతాయి. ఈ విధంగా సర్వభువనేశ్వరి అయిన కామేశ్వరి మహాదేవునికి వామభాగంలో ప్రకాశిస్తూ ఉంటుంది. మహాశక్తి సంయుతుడై ఉండడం వల్లనే మహా దేవుడు సర్వశక్తి సంపన్నుడై సర్వకార్యాలనూ నెరవేరుస్తూంటాడు.

చింతామణి గృహప్రమాణాన్ని తెలుసుకోండి. శత యోజన వైశాల్యం కలిగిన చింతామణి మందిరానికి ఉత్తరంగా ఉన్న ప్రాకారం, ప్రాక్దిగ్భా గంలో ఉన్నదానికన్న మిన్నగా రెండింతలు ఎత్తుకలిగి ఉంది. మహాకాశంలో అది నిరాధారంగా భాసిల్లు తూంటుంది. నిరంతరం అది సంకోచ వ్యాకోచాలు పొందుతూంటుంది. సమస్త ప్రాకారా లలోని ప్రకాశంకన్న మిన్నగా చింతామణి సదనం ప్రకాశి స్తూంటుంది. సృష్టారంభంలో కార్యవశాన అదివిప్పిన వస్త్రసమంగా వ్యాకోచించి ప్రళయవేళ సంకోచి స్తూంటుంది. ఆ చింతామణి మందిరంలో మహోజ్జ్వలంగా భాసించునట్టి శ్రీదేవి ధగధగ మెరిసిపోతూ ఉంటుంది. ప్రతిబ్రహ్మాండం లోని దేవదానవ, మానవ, నాగలోకాల లోని ఉపాసకులూ, ఇతరేతర లోకోపాసకులూ కూడ శ్రీదేవీ దివ్య సన్నిధానికి చేరుకుంటారు. శ్రీదేవీ పూజా పరాయణులూ, దేవీ పుణ్యక్షేత్రాలలో తమ ప్రాణాలను వదిలి పెడితే, వారందరి కందరూ శ్రీదేవీ నిత్యపుణ్య మహో త్సవాలు జరుగునట్టి స్థానాలు చేరుకుంటారు. ఆ జనని సన్నిధిలో ఘృతకుల్య, మధుకుల్య, దధికుల్య, దుగ్ధకుల్య నామక, స్రవంతులు ప్రవహిస్తూంటాయి. ఆనదులన్నీ అధికంగా అమృతరస ప్రవాహాలే. జంబూ,ఆమ్ర, ద్రాక్ష, ఇక్షురసాలు ప్రవహించు నట్టి నదులు అగణితంగా ఉన్నాయి. అభీష్టాలను నెరవేర్చునట్టి వృక్షాలూ, అనేక వాపీకూపాలూ ఉన్నాయి. ఆజలాలనుపానం చేసినవారి అభీష్టాలూ నెరవేరు తాయి. ఈ విషయంలో సంశయం ఎంతమాత్రం లేదు. ఆ జాలా లను పానం చేసినవారికి ఏనాటికీ వార్ధక్యం కానీ, వెంట్రుకలు నెరిసిపోవడం కానీ జరగదు. అక్కడ యువకులు సహస్ర సూర్యప్రభలతో భాసిల్లుతూ తమ పత్నులతో స్వేచ్ఛగా సవిలాసంగా విహరి స్తూంటారు. వారందరూ శ్రీభువనేశ్వరీదేవిని సేవిస్తూం టారు. ఆస్థానం చేరినవారికి కామక్రోధ మద మాత్సర్యాలు కానీ మానసిక క్లేశాలు కానీ కలుగవు. వారిలో కొందరు సారూప్య ముక్తినీ, మరికొందరు సాలోక్యముక్తినీ, ఇంకా కొందరూ సామీప్య ముక్తినీ, శేషించినవారు సార్ష్టి ముక్తినీపొంది ఉంటారు. ప్రతి బ్రహ్మాండంలోని ఆయా దేవత లందరూ జగన్మాతనుచేరి సమిష్టిగా సేవలు చేస్తూంటారు. సప్తకోటి మహామంత్రాలూ అక్కడ రూపుదాల్చి అంజలి బద్ధలై మహా దేవిని ఉపాసిస్తూంటారు. అక్కడ మహావిద్యలన్నీ సామ్యావస్తను పొంది దివ్యకారణ బ్రహ్మరూపిణి, మాయాశబలవిగ్రహ అయిన శివా భగవతిని ఉపా సిస్తూం టాయి.

మెరుపు – సూర్యచంద్రాగ్నులూ వీటి కాంతులన్నీ కలిసినా మణిద్వీప కాంతిలో కోటి,కోట్యంశకు కూడ సరికావు. అక్కడ వైడూర్య మణికాంతు లొకచోట మరకత మణి శోభలు వేరొకచోట విద్యుత్ ప్రభలు ఇంకొక చోట మధ్యాహ్న మార్తాండ ప్రభలు వేరొకచోట, విద్యుత్ సూర్య కాంతులు, మరొకప్రదేశంలోనూ ఇంద్రనీల, మాణిక్య సింధూరకాంతి సమూహాలు ఓ ప్రదేశంలోనూ, వజ్రాల రాసుల కాంతులు ఓ ప్రదేశంలోనూ, వేరొకచో దావానలప్రభలూ ఇంకొకచో తప్తకాంచనచ్ఛటలూ, సూర్యకాంత చంద్ర కాంత శిలల ప్రకాశాలూ ఓ స్థానంలో రత్న శిఖరాల రత్నప్రాకార



గోపు రాలూ, రత్నఫల పత్రాలూ గల తరు సంతతులూ ప్రకాశిస్తుంటాయి. కొన్ని స్థానాలలో క్రీడించే మయూర సమూహాలూ కపోతాల మధురనాదాలూ, నవరాగా లొలికించే పికకలరవాలూ శ్రవణానందకరమైన చిలుకల పలుకులూ కలిగి అచ్చటి కొన్ని స్థానాలున్నాయి. స్వచ్ఛమై, మధురమైన జలభరిత సరోవరాలు అగణితంగా ఉన్నాయి. ఆ తటాకాలలో వికసించిన రత్న కమలాలు లెక్కించలేనన్ని కోట్లసంఖ్యలలో నయనానందకరంగా ఉన్నాయి. ఆ తటాకాలకు నల్దిశలలోనూ శతయోజనాల దూరంలో మలయ మారుతం సుగంధ తరంగాలను వీచునట్టి తరు సమూహాలూ అపారంగా ఉన్నాయి. చింతామణుల జ్యోతిఃపుంజాలు అచ్చటి అంబర సర్వస్వాన్నీ ప్రకాశితం చేస్తూంటాయి. మణిద్వీప సర్వస్వం నానావిధ తరు బహిర్గత సుగంధాల తోనూ, వివిధ ధూపవాసనలతోనూ అద్భుతంగా పరిమళిస్తూం టుంది. వివిధ మణుల రంధ్ర వినిర్గత రత్న దీపకాంతులు అక్కడి నిలువుటద్దాలపై అపూర్వ శోభలు దిఙ్మోహకంగా తేజరిల్లుతూంటాయి.

సమస్త సంపదలకూ, సమస్త రస రాజాలకు సంపూర్ణ సర్వజ్ఞత్వానికీ, సకల తేజస్సులకూ, సమస్త పరాక్రమాలకూ, సర్వోత్తమ గుణగణాలకూ దయారస సర్వస్వా నికీ మణిద్వీపం పరమావధి మనుష్యానందం ఆదిగా బ్రహ్మా నంద పర్యంతంగా గల సర్వానందాలూ మణిద్వీపంలో నెలకొని ఉంటాయి.



ఫలశ్రుతి

ఏకపర్యాయం ఈ మణిద్వీపాన్ని స్మరించినంత మాత్రాన గతించిన పాపరాసులన్నీ భస్మమవుతాయి. ప్రాణాలు పోయేటప్పుడు మణిద్వీపాన్ని స్మరించునట్టివాడు దేవీ లోకంలో ప్రవేశిస్తాడు. ఈ ఘట్టాన్ని సంపూర్ణంగా నిత్యం పఠిస్తే భూతప్రేతాది బాధలుండవు. గృహప్రవేశ వేళలో వాస్తుయాగ సమయంలో సప్రయత్నంగా పఠిస్తే శుభ పరంపరలు చేకూరుతాయి.

మంగళం మహత్

మణిద్వీపవాసినికీ జై.



## మణిద్వీపేశ్వరి అష్టోత్తర శతనామావళిః

ముందు "ఓం" అనియు చివర "నమః" అని చదువుకొనవలెను

దివ్యలోకవాసిన్యై
సర్వలోక సంరక్షణాయై
సర్వమృత్యుసర్వాపద్వినివారణ్యై
లలితాబాలా,దుర్గాశ్యామలాకృత్యై
గంగా,భవానీగాయత్రీస్వరూపాయై
లక్ష్మీ, పార్వతీ, సరస్వతీ,స్వరూపవిభవాయై
రాజరాజేశ్వరీదేవ్యై
భక్తాభీష్టదాయిన్యై
భక్తిభుక్తిముక్తిప్రదాయిన్యై
భక్తసంకల్పసిద్ధిదాయై
పృధ్వీశ్వరీదేవ్యై
ఆధివ్యాధినివారిణ్యై
దౌర్భాగ్యనాశిన్యై
సౌభాగ్యదాయిన్యై
సృష్టిస్థితిలయాయై
అష్టసిద్ధి నవనిధిప్రదాయిన్యై
అష్టదికాల్పక వందితాయై
త్రికాల వేదిన్యై
షడ్గుణ సంసేవితాయై
షడ్రుతు పరివేష్టితాయై
నవగ్రహవిధివిధానాధిష్టానాయై
సత్యధర్మశాంతిప్రేమప్రసాదిన్యై
సర్వకాలసర్వావస్థా సమస్థితాయై
అనంతసాగర, నదీనదాకృత్యై
కాంస్య(కంచు) లోహమయప్రాకారిణ్యై
పీత (ఇత్తడి)లోహమయిప్రాకారిణ్యై
తామ్ర(రాగి)లోహమయిప్రాకారిణ్యై
సీసలోహమయ ప్రాకారిణ్యై
పంచలోహమయప్రాకారిణ్యై
రజితసాలప్రాకారిణ్యై
సువర్ణసాల ప్రాకారిణ్యై
పుష్యరాగమయప్రాకారిణ్యై
పద్మరాగమయ ప్రాకారిణ్యై
గోమేధికమణిమయప్రాకారిణ్యై
వజ్రనిర్మిత ప్రాకారిణ్యై
వైడూర్యనిర్మితప్రాకారిణ్యై
ఇంద్రనీలమణిమయప్రాకారిణ్యై
మరకతసాలమయ ప్రాకారిణ్యై
ప్రవాళసాలమయ ప్రాకారిణ్యై
రత్నసాలమయప్రాకారిణ్యై
చింతామణిమయప్రాకారిణ్యై
శృంగారమండప దేవదేవతాయై
జ్ఞానమండప జ్ఞానేశ్వరీదేవ్యై
ఏకాంతమండప ధ్యానేశ్వరీదేవ్యై
ముక్తిమండప ముక్తేశ్వరీదేవ్యై
కాశ్మీరవన కామాక్షీదేవ్యై
మల్లికావన మహారాజ్ఞ్యై
కుందవన కౌమారీదేవ్యై
కస్తూరీవనకామేశ్వరీ దేవ్యై
సాలోక్యముక్తి ప్రసాదిన్యై
సారూప్యముక్తిప్రదాయిన్యై
సామీప్యముక్తిదాయిన్యై
సాయుజ్యముక్తిసుప్రసాదిన్యై
ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తిరూపిణ్యై
వరాంకుశపాశాభయహస్తాయై
సహస్రకోటిసహస్రవదనాయై
మకరందఘృతాంబుధయే
సహస్రకోటిసహస్రచంద్రసమసుధానేత్రాయై
సహస్రకోటి సహస్ర సూర్యసమాభాసాయై
జరామరణరహితాయై
నారదతుంబురు సకల
-మునిగణవందితాయై
పంచభూతయజమానస్వరూపిణ్యై
జన్మజన్మాంతరదుఃఖభంజనాయై



లోకరక్షాకృత్యతత్పరాయై
బ్రహ్మవిష్ణు మహేశ్వరకోటివందితాయై
చతుష్షష్టికళాసంపూర్ణస్వరూపిణ్యై
షోడశకళాశక్తిసేనాసమన్వితాయై
సప్తకోటి ఘనమంత్రవిద్యాలయాయై
మదన విఘ్నేశ్వర
-కుమారమాతృకాయై
కుంకుమశోభితదివ్యవదనాయై
అనంతనక్షత్రగణనాయికాయై
చతుర్ధశభువనకల్పితాయై
సురాధినాథ సత్సంగ
-సమాచారకార్యకలాపాయై
అనంగరూపపరిచారికాసేవితాయై
గంధర్వ యక్షకిన్నర కింపురుషవందితాయై
సంతాన కల్పవృక్షసముదాయభాసిన్యై
అనంతకోటి బ్రహ్మాండ
-సైనికాధ్యక్ష సేవితాయై
పారిజాత, కదంబవనవిహారిణ్యై
సమస్తదేవీ కుటుంబవందితాయై
చతుర్వేదకళాచాతుర్యై
బ్రాహ్మీమహేశ్వరీ వైష్ణవీవారాహీవందితాయై
చాముండీ మహాలక్ష్మీఇంద్రాణీపరిపూజితాయై
షట్కోణయంత్రప్రకాశిన్యై
సహస్రస్తంభ మండపవిహారిణ్యై
సమస్తపతివ్రతాసంసేవితాయై
నాదబిందుకళాతీతశ్రీచక్రవాసిన్యై
పాపతాప దారిద్ర్యనాశిన్యై
శ్రుతి,స్మృతి,పురాణకావ్యసంరక్షణాయై
పంచబ్రహ్మాసన విరాజితాయై
వజ్రవైడూర్యమరకతమాణిక్యచంద్రకాంత,
-రత్నసింహాసన శోభితాయై
దివ్యాంబర ప్రభాదివ్యతేజోవిభాసాయై
పంచముఖ సర్వేశ్వరహృదయాధిష్టానాయై
ఆపాదమస్తక నవరత్నసువర్ణాభరణధారిణ్యై
విలాసినీ అఘోరా మంగళాసనా పీఠశక్తివందితాయై
క్షమా,దయా,జయా,విజయాపీఠశక్తి పరిపాలితాయై
అజితా,అపరాజితా,నిత్యపీఠశక్తి
-పరిపూజితాయై
సిద్ధి,బుద్ధి,మేధా, లక్ష్మీ,శృతి
-పీఠశక్తి సేవితాయై
లజ్జాతుష్టిపుష్టి పీఠశక్తి ప్రభాసితాయై
నవరాత్ర దీక్షాప్రియాయై
నామ,గాన,జ్ఞానయజ్ఞప్రియాయై
జపతపోయోగత్యాగసంతుష్టాయై
పంచదశీమహావిద్యాయై
సదాషోడశప్రాయసర్వేశ్వర వల్లభాయై
ఓంకారాక్షర స్వరూపిణ్యై
సకలయంత్ర సకలతంత్ర సమర్చితాయై
సహస్ర యోజన ప్రమాణ,
-చింతామణిగృహవాసిన్యై
మహాదేవసహితశ్రీపరమేశ్వరీదేవ్యై
మణిద్వీపవిరాజితమహాభువనేశ్వరీదేవ్యై



## లలితాష్టోత్తర-శతనామస్తోత్రరత్నమ్

శివాభవానీకల్యాణీ గౌరీ కాళీశివప్రియా
కాత్యాయనీ మహాదేవీ దుర్గార్యాచండికాభవా. 1
చంద్రచూడాచంద్రముఖీ చంద్రమండలవాసినీ
చంద్రహాసకరా చంద్రహాసినీ చంద్రకోటిభా. 2
చిద్రూపా చిత్కళానిత్యానిర్మలానిష్కళాకళా
భవ్యాభవప్రియా భవ్యరూపిణీ కులభాషిణీ. 3
కవిప్రియా కామకళా కామదా కామరూపిణీ
కారుణ్యసాగరఃకాళీ సంసారార్ణవతారికా. 4
దూర్వాభా దుష్టభయదా దుర్జయా దురితాపహా
లలితారాజ్యదాసిద్ధాసిద్ధేశీ సిద్ధిదాయినీ. 5
శర్మదా శాంతిరవ్యక్తాశంఖకుండలమండితా
శారదా శాంకరీ సాధ్వీశ్యామలాకోమలాకృతిః 6
పుష్టిణీ పుష్పబాణాంబా కమలాకమలాసనా
పంచబాణస్తుతా పంచవర్ణరూపా సరస్వతీ. 7
పంచమీపరమాలక్ష్మీః పావనీ పాపహారిణీ
సర్వజ్ఞా వృషభారూఢా సర్వలోకవశంకరీ 8
సర్వస్వతంత్రాసర్వేశీ సర్వమంగళకారిణీ
నిరవద్యా నీరదాభా నిర్మలానిశ్చయాత్మికా. 9
నిర్మదానియతాచారానిష్కామానిగమాలయా
అనాదిబోధా బ్రహ్మాణీకౌమారీ గురురూపిణీ. 10
వైష్ణవీసమయాచారా కౌళినీ కుళదేవతా
సామగానప్రియా సర్వవేదరూపాసరస్వతీ. 11
అంతర్యాగప్రియానందా బహిర్యాగపరార్చితా
వీణాగానరసానందా అర్ధోన్మీలితలోచనా 12
దివ్యచందనదిగ్ధాంగీ సర్వసామ్రాజ్యరూపిణీ
తరంగీకృతసాపాంగవీక్షారక్షితసజ్జనా. 13
సుధాపానసముద్వేలహేలామోహితధూర్జటీ
మతంగమునిసంపూజ్యా మతంగకులభూషణా. 14
మకుటాంగదమంజీరమేఖలాదామ భూషితా
ఊర్మిలా కింకిణీరత్న కంకణాదిపరిష్కృతా 15
మల్లికామాలతీకుందమందారాంచితమస్తకా
తాంబూలకబళో దంచత్కపోలతలశోభినీ 16
త్రిమూర్తిరూపా త్రైలోక్య సుమోహనతనుప్రభా
శ్రీమచ్చక్రాధినగరీసామ్రాజ్య శ్రీస్వరూపిణీ. 17



## లలితాష్టోత్తర-శతనామావళిః

ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర "నమః"అని కలిపి చదువవలెను.

ఓం శివాయై నమః
భవాన్యై
కళ్యాణ్యై
గౌర్యై
శ్రీకాళ్యై
శివప్రియాయై
కాత్యాయన్యై
మహాదేవ్యై
దుర్గాయై
ఆర్యాయై
చండికాయై
భవాయై
చంద్రచూడాయై
చంద్రముఖీయై
చంద్రమండలవాసిన్యై
చంద్రహాసకరాయై
చంద్రహాసిన్యై
చంద్రకోటిభాస్యై
చిద్రూపాయై
చిత్కళాయై
నిత్యాయై
నిర్మలాయై
నిష్కళాయై
కళాయై
భవ్యాయై
భవప్రియాయై
భవ్యరూపిణ్యై
కులభాషిణ్యై
కవిప్రియాయై
కామకళాయ్యై
కామదాయిన్యై
కామరూపిణ్యై
కారుణ్యసాగరాయై
కాళ్యై
సంసారార్ణవతారికాయై
దూర్వాభాయై
దుష్టబయదాయై
దుర్జయాయై
దురితాపహారిణ్యై
లలితాయై
రాజ్యదాయిన్యై
సిద్ధాయై
సిద్ధేశ్యై
సిద్ధిదాయిన్యై
శర్మదాత్ర్యై
శాంత్యై
అవ్యక్తాయై
శంఖకుండలమండితాయై
శారదాయై
శాంకర్యై
సాధ్వ్యై
శ్యామలాయై
కోమలాకృత్యై
పుష్టిణ్యై
పుష్పబాణాయై
అంబాయై
కమలాయై
కమలాసనాయై
పంచబాణస్తుతాయై
పంచవర్ణరూపాయై
సరస్వత్యై
పంచమ్యై

పరమాయై
లక్ష్మ్యై
పావన్యై
పాపహారిణ్యై
సర్వజ్ఞాయై
వృషభారూఢాయై
సర్వలోకైకశంకర్యై
సర్వస్వతంత్రాయై
సర్వేశ్యై
సర్వమంగళకారిణ్యై
నిరవద్యాయై
నీరదాభాయై
నిర్మలాయై
నిశ్చయాత్మికాయై
నిర్మదాయై
నియతాచారాయై
నిష్కామాయై
నిగమాలయాయై
అనాదిబోధాయై
బ్రహ్మాణీయై
కౌమారీయై
గురురూపిణ్యై
వైష్ణవీయై
సమయాచారాయై
కాళిణ్యై
కులదేవతాయై
సామగానప్రియాయై
సర్వవేదరూపాయై
సరస్వత్యై
అంతర్యాగాప్రియానందాయై
బహిర్యాగవరార్చితాయై
వీణాగానరసానందాయై
అర్ధోన్మీలితలోచనాయై
దివ్యచందనదిగ్ధాంగ్యై
సర్వసామ్రాజ్యరూపిణ్యై
తరంగీకృతాపాంగ
వీక్షారక్షిత సజ్జనాయై
సుధాపానసముద్వేల
హేలామోహిత ధూర్జట్యై
మతంగమునిసంపూజ్యాయై
మతంగకుల భూషణాయై
మకుటాంగదమంజీర
మేఖలాదామభూషితాయై
ఊర్మికాకింకిణీరత్నకంకణాది
పరిష్కృతాయై
మల్లికామాలతీకుందమందా
రాంచిత మస్తకాయై
తాంబూలాకబళోదంచత్కపోల
తలశోభిన్యై
త్రిమూర్తిరూపాయై
త్రైలోక్యసుమోహనతనుప్రభాయై
శ్రీమచ్చక్రాధినగరీ సామ్రాజ్య
శ్రీస్వరూపిణ్యై నమః
ఇతి శ్రీ లలితాష్టోత్తరశతనామావళిః

## శ్రీ శ్రీసూక్త అష్టోత్తర శతనామావళిః

ప్రతి నామమునకు ముందు "ఓం" అని చివర "నమః"అని కలిపి చదువవలెను.

ఓం హిరణ్యవర్ణాయై నమః
హరిణ్యై
సువర్ణరజతస్రజాయై
చంద్రాయై
హిరణ్మయ్యై
లక్ష్మ్యై
అనపగామిన్యై
అశ్వపూర్వాయై



రథమధ్యాయై
హస్తినాదప్రబోధిన్యై
శ్రియై
దేవ్యై
హిరణ్యప్రాకారాయై
ఆర్ద్రాయై
జ్వలంత్యై
తృప్తాయై
తర్పయన్త్యై
పద్మేస్థితాయై
పద్మవర్ణాయై
ప్రభాసాయై
యశసా జ్వలంత్యై
దేవజుష్టాయై
ఉదారాయై
పద్మనేమ్యై
ఆదిత్యవర్ణాయై
బిల్వనీలయాయై
కీర్తిప్రదాయై
బుద్ధిప్రదాయై
గంధద్వారాయై
దురాధర్షాయై
నిత్యపుష్టాయై
కరీషిణ్యై
సర్వభూతానామీశ్వర్యై
మనస ఆకూత్యై
వాచస్పత్యాయై
పశూనాంరూపాయై
అనస్యయశసే
కర్దమ మాత్రే
పద్మమాలిన్యై
చిక్లీత మాత్రే
పుష్కరిణ్యై
పుష్ట్యై
సువర్ణాయై
హేమమాలిన్యై
సూర్యాయై
యశఃకరిణ్యై
యష్ట్యై
పింగళాయై
చంద్రాయై
సర్వసంపత్ప్రదాయై
పద్మప్రియాయై
పద్మిన్యై
పద్మహస్తాయై
పద్మాలయాయై
పద్మదళాయతాక్ష్యై
విశ్వప్రియాయై
విష్ణుమనోనుకూలాయై
మహాదేవ్యై
విష్ణుపత్న్యై
పద్మకరాయై
ప్రసన్నవదనాయై
సౌభాగ్యదాయై
భాగ్యదాయై
అభయప్రదాయై
నానావిధ మణిగణభూషితాయై
భక్తాభీష్టఫలప్రదాయై
హరిహర బ్రహ్మాదిభి స్సేవితాయై
పార్శ్వే పంకజ శంఖ
పద్మనిధిభిర్యుక్తాయై
ధవళతరాంశుక
గంధమాల్యశోభాయై
హరివల్లభాయై
మనోజ్ఞాయై
త్రిభువన భూతికర్యై
క్షీరసముద్రరాజ తనయాయై
శ్రీరంగధామేశ్వర్యై

దాసీభూత సమస్తదేవవనితాయై
లోకైక దీపాంకురాయై
శ్రీమన్మందకటాక్షలబ్ధవిభవత్
బ్రహ్మేంద్ర గంగాధరాయై
త్రైలోక్యకుటుంబిన్యై
సరసిజాయై
ముకుంద ప్రియాయై
కమలాయై
కమలాయతాక్ష్యై
శ్రీ విష్ణుహృత్కమలవాసిన్యై
విశ్వమాత్రే
కమలకోలమగర్భగౌర్యై
నమతాం శరణ్యాయై
గరుడ వాహనాయై
శేషశాయిన్యై
అప్రమేయవైభవాయై
లోకైకేశ్వర్యై
లోకనాథదయితాయై
దాంతాయై
రమాయై
మంగళదేవతాయై
అకారత్రయసంపన్నాయై
అరవింద నివాసిన్యై
అశేష జగదాశ్రిత్యై
వరద వల్లభాయై
భగవత్యై
శ్రీదేవ్యై
నిత్యానపాయిన్యై
అఖిల జగన్మాత్రే
అస్మన్మాత్రే
అశరణ్యశరణాయై
శ్రియైదేవ్యై

## మంత్రమాతృకా వర్ణమాలా స్తోత్రమ్

కల్లోలోల్లసితా మృతాబ్ధిలహరీ మధ్యే విరాజన్మణి
ద్వీపే కల్పకవాటికా పరివృతే కాదంబవాట్యుజ్జ్వలే
రత్నస్తంభ సహస్ర నిర్మిత సభామధ్యే విమానోత్తమే
చింతారత్న వినిర్మితం జనని తే సింహాసనం భావయే ॥ 1

ఏణాంకానల భానుమండల లసచ్ఛ్రీ చక్రమధ్యే స్థితాం
బాలార్కద్యుతి భాసురాం కరతలైః పాశాంకుశౌ బిభ్రతీం
చాపం బాణమపి ప్రసన్నవదనాం కౌసుంభ వస్త్రాన్వితాం
తాం త్వాం చంద్రకళావతంస మకుటాంచారుస్మితాంభావయే ॥ 2

ఈశానాది పదం శివైక ఫలకం రత్నాసనం తే శుభం
పాద్యం కుంకుమ చందనాది భరిత్యై రర్ఘ్యం స రత్నాక్షతైః
శుద్ధై రాచమనీయకం తవ జలై ర్భక్త్యా మయా కల్పితం
కారుణ్యామృత వారిధే తదఖిలం సంతుష్టయే కల్ప్యతామ్ ॥ 3

అక్ష్ణ్యై యోగిజనస్య రక్షిత జగజ్జాలే విశాలేక్షణే
ప్రాలేయాంబు పటీర కుంకుమ లసత్కర్పూర మిశ్రోదకైః
గోక్షీరై రపి నారికేళసలిలై శ్శుద్ధోదకై ర్మంత్రితై
స్నానం దేవి ధియా మయైతదఖిలం సంతుష్టయే కల్ప్యతాం ॥ 4



హ్రీంకారాంకిత మంత్రలక్షతతనో హేమాచలత్సంచితైః
రత్నైరుజ్జ్వల ముత్తరీయ సహితం కౌసుంభ వర్ణాంశుకం
ముక్తాసంతతి యజ్ఞసూత్ర మమలం సౌవర్ణ తంతూద్భవం
దత్తం దేవి ధియా మయై దతఖిలం సంతుష్టయే కల్ప్యతామ్ ॥ 5

హంసై రప్యతి లోభనీయ గమనే హారావలీ ముజ్జ్వలాం
హిందోళద్యుతి హీరపూరితతరే హేమాంగదే కంకణే
మంజీరే మణికుండలే మకుట మప్యర్ధేందు చూడామణిం
నాసామౌక్తిక మంగులీయ కటకే కాంచీమపి స్వీకురు॥ 6

సర్వాంగే ఘనసార కుంకుమ  ఘన శ్రీగంధ పంకాంకితం
కస్తూరీ తిలకంచ ఫాలఫలకే గోరోచనా పత్రకం
గండాదర్శన మండలే నయనయో ర్దివ్యాంజనం తేంచితం
కంఠాబ్జే మృగనాభిపంక మమలం త్వత్ప్రీతయే కల్ప్యతామ్॥ 7

కల్హారోత్పల మల్లికా మరువకైః సౌవర్ణపంకేరుహైః
జాజీ చంపక మాలతీ వకుళకై ర్మందార కుందాదిభిః
కేతక్యా కరవీరకై ర్భహువిధైః క్లుప్తాః స్రజోమాలికాః
సంకల్పేన సమర్పయామి వరదే సంతుష్టయే గృహ్యతామ్ ॥ 8

హంతారం మదనస్య నందయసి యైరంగై రనంగోజ్జ్వలై
ర్యైర్భృంగావళి నీలకుంతలభరై ర్బధ్నాసి తస్యాశయం
తానీమాని తవాంబ కోమలతరా ణ్యామోద లీలాగృహా
ణ్యామోదాయ దశాంగ గుగ్గులు ఘృతై ర్ధూపై రహం ధూపయే ॥ 9

లక్ష్మీముజ్జ్వలయామి రత్ననివహో ద్భాసాన్తరే మన్దిరే
మాలారూప విలంబితై ర్మణిమయ స్తంభేషు సంభావితైః
చిత్రైర్హాటక పుత్రికా కరధృతైర్గవ్యైర్ఘృతై ర్వర్ధితైః
దివ్యై ర్దీపగణై ర్ధియా గిరిసుతే సంతుష్టయే కల్ప్యతాం ॥ 10

హ్రీంకారేశ్వరి తప్తహాటక కృతైః స్థాలీ సహస్రైర్యుతం
దివ్యాన్నం ఘృత సూపశాక భరితం చిత్రాన్నభేదం తథా
దుగ్ధాన్నం మధుశర్కరా దధియుతం మాణిక్యపాత్రే స్థితం
మాషాపూప సహస్రమంబస ఫలం నైవేద్య మావేదయే ॥ 11

సచ్ఛాయైర్వర కేతకీ దళరుచా తాంబూలవల్లీ దళైః
పూగైర్భూరిగుణైః స్సుగంధి మధురైః కర్పూర ఖండోజ్జ్వలైః
ముక్తాచూర్ణ విరాజితై ర్భహువిధై ర్వక్త్రాంబుజా మోదితైః
పూర్ణారత్నకలాచికా తవ ముదే న్యసా&త పురస్తాదుమే॥ 12

కన్యాభిః కమనీయ కాంతిభి రలంకారామలా రార్తికా
పాత్రే మౌక్తిక చిత్రపంక్తి విలస త్కర్పూర దీపాళిభిః

తత్తత్తాళ మృదంగగీత సహితం నృత్య త్పదాంభోరుహం
మంత్రారాధన పూర్వకం సునిహితం నీరాజనం గృహ్యతామ్॥ 13
లక్ష్మీర్మౌక్తి కలక్షకల్పిత సిత చ్ఛత్రం తు ధత్తే రసా
దింద్రాణీ చ రతిశ్చ చామరవరే ధతే&త స్వయంభారతీ
వీణామేణ విలోచనా స్సుమనసా తాన్నృత్యంతి తద్రాగవ
ద్భావై రాంగిక సాత్వికైః స్ఫుటరసం మాత స్త్వమాకర్ణ్యతాం ॥ 14
హ్రీంకార త్రయ సంపుటేన మనునో పాస్యే త్రయీ మౌళీభిః
వాక్యై ర్లక్ష్యతనో ! తవ స్తుతి విధౌ కో వాక్షమేతాంబికే
సల్లాపాస్స్తుతయః ప్రదక్షిణశతం సంచార ఏవాస్తుతే
సంవేశో నమస్సహస్ర మఖిలం సంతుష్టయే కల్పతాం ॥ 15
శ్రీ మంత్రాక్షర మాలయా గిరిసుతాం యః పూజయేచ్చేతసా
సంధ్యాసు ప్రతివాసరం సునియతస్తస్యామల స్యాచిరాత్
చిత్తాంభోరుహ మంటపే గిరిసుతా నృత్తం విధత్తే రసా
ద్వాణీ వక్త్రసరోరుహే జలధిజా గేహే జగన్మంగళా ॥ 16
ఇతి గిరివరపుత్రీ పాదరాజీవ భూషా భువన మమలయంతీ సూక్తిసౌరభ్య సారైః
శివపద మకరన్ద స్యన్దినీ మన్నిబద్ధా
మదయతు కవిభృంగా న్మాతృకా పుష్పమాలా ॥ 17
ఇతి శ్రీ మచ్ఛంకర భగవత్పూజ్య పాదాచార్యులు చెప్పిన మంత్ర మాతృకా పుష్పమాలాత్మకమైన నిత్య మానసపూజా స్తుతి సంపూర్ణము.

## శ్రీ లలితా త్రిపుర సుందరీ దేవి

ఆశ్వయుజశుద్ధ తదియ, దసరాశరన్నవరాత్రి మహోత్సవాల్లో మూడో రోజున అమ్మవారిని శ్రీలలితా త్రిపుర సుందరీదేవిగా అలంకరిస్తారు. త్రిపురాత్రయంలో రెండో శక్తి ఈ లలితాదేవి అమ్మవారు. ఈ లలితాదేవినే త్రిపురసుందరి అని అంటారు. బ్రహ్మ, విష్ణు,మహేశ్వరులకన్నా కూడా పురాతన దేవతగా కొలవబడుతుంది కావున త్రిపురసుందరి అని పిలువబడుతోంది. లలితా త్రిపురసుందరి శ్రీచక్ర అధిష్ఠాన శక్తిగా, పంచదశాక్షరీ మహామంత్రాధిదేవతగా, తనభక్తుల్ని, ఉపాసకుల్ని అనుగ్రహి స్తుంది. శంకరాచార్యులవారు ప్రతిష్ఠించిన శ్రీచక్ర మహాయంత్రానికి అధిష్ఠాన దేవత ఈ త్రిపురసుందరీదేవి. భయంకరమైన దారిద్ర్య బాధలనుంచి విముక్తులనుచేసి మహదైశ్వర్యాన్ని ప్రసాదించే తల్లి శ్రీలలితాదేవి, పూర్వం దుర్గాదేవి ఆలయంలో, అమ్మవారికి వామాచార పద్ధతిలో పూజలు జరుగుతుండేవి. జగద్గురు పరంపరలో పదవ వారైన శ్రీవిద్యాశంకరులవారు, ఆ వామాచార పద్ధతిని తొలగించి దక్షిణాచార పద్ధతిలో అమ్మవారికి నిత్యపూజలు జరిగేలా ఏర్పాటు చేశారు. అలాగే తన దివ్యసంక ల్పంతో శ్రీచక్రయంత్రాన్ని కూడా ప్రతిష్ఠించారు. అప్పటి నుండి ఉగ్రస్వరూపంతో చండీదేవిలా వున్న దుర్గాదేవి, లలితంగా పరమశాంత స్వరూపంతో, తనని దర్శించే



భక్తులందర్నీ ఆదు కుంటోంది. అందువలన ఈ శ్రీచక్రానికి నిత్యం లలితా అష్టోత్తరం, లలితా సహస్రనామాలతో కుంకుమపూజ చేస్తారు. ఇక్కడ మూలవిరాట్టుకీ, శ్రీ చక్రానికీ భేదములేదు. శ్రీచక్రానికి పూజచేస్తే ఈదేవీ మూలవిగ్రహానికి పూజచేసినట్టే అవుతుంది. లలితాసహస్రనామ స్తోత్రంలో వర్ణించిన విధంగా లలితాదేవి అలంకా రంలో, "సచామర రమావాణీ విరాజితా" అన్నట్టు లక్ష్మి దేవి, సరస్వతీదేవి అటు ఇటు నించుని వింజామరతో సేవిస్తూవుండగా, మధ్యలోవున్న లలితాదేవి చిరునవ్వులు చిందిస్తూ చేతిలో ఒక చెరుగడను ధరించి, శివుడి వక్షస్థలంమీద కూర్చుని, అపురూప లావణ్యంతో ప్రకాశిస్తున్న రూపంలో దుర్గమ్మ దర్శనమిస్తుంది. లలితా పరాభట్టారికా దేవిని దర్శించు కొని మనసారా భక్తితో ఇలా ప్రార్థించండి.

"శ్రీ శివా శివశక్త్యైకరూపిణీ లలితాంబికా"

ప్రాతఃస్మరామి లలితా వదనారావిందం - బింబాధరం పృథుల మౌక్తిక శోభినామ్ ఆకర్ణదీర్ఘనయనం మణికుండలాఢ్యాం - మందస్మితం మృగమదో జ్జ్వలఫాలదేశమ్ ।

శ్రీ లలితా త్రిపుర సుందరీ దేవతాయై నమః

## శ్రీ లలితా గాయత్రి

ఓం లలితా రూపాయ విద్మహే మహాదేవ్యై చ ధీ మహి తన్నో దేవీ ప్రచోదయాత్

## శ్రీ లలితా ప్రాతః స్మరణ స్తవం

ప్రాతః స్మరామి లలితా వదనారవిందం బింబాధర వృధుల మౌక్తికశోభివాసం ఆకర్ణ దీర్ఘనయనం మణికుండలాఢ్యం మందస్థితం మృగమదోజ్వలఫాలదేశం ప్రాతర్భజామి
లలితా భుజ కల్పవల్లీం రక్తాంగులీయ లసదంగుళ పల్లవాఢ్యం
మాణిక్య హేమవలయాంగద శోభమానరం పుండ్రేక్షు చాప కుసుమేషుసృణీ దధానామ్
ప్రాతర్నమామి లలితా చరణారవిందం భక్తేష్ట దానవిరతం భవసింధపోతమ్
పద్మాసనాది సురనాయక పూజనీయం పద్మంకుశ ధ్వజ సుదర్శన లాంఛనాఢ్యం
ప్రాతఃస్తువే పరశివాం లలితాం భవానీం త్రయ్యంత వేద్యవిభావరి కరుణానవద్యాం
విశ్వస్యసృష్టి విలయస్థితి హేతుభూతాం విద్యేశ్వరీం నిగమ వాఙ్మనసాతిదూరం
ప్రాతిర్వదామి లలితే తవ పుణ్యానామ కామేశ్వరేతి కమలేతి మహేశ్వరేతి
శ్రీశాంభవీతి జగతాం జననీ పరేతి వాగ్దేవతేతి వచసా త్రిపురేశ్వరేతి.
యః శ్లోకపంచక మిదం లలితాంబికాయాః సౌభాగ్యదం సులలితం పఠతి ప్రభాతే
తస్మై దదాతి లలితా ఝటితి ప్రసన్నావిద్యాం శ్రియం విమలసౌఖ్య మనంత కీర్తిమ్.

## శ్రీ లలితాష్టకమ్

శరణాగత పరిపాలిని కరుణాయిత ధిషణే
కరుణా రసపరిపూరిత నయనాంబుజ చలనే
అరుణాంబుజ సద్యశీకృత మణినూపుర చరణే

